శ్రీరస్తు.

శ్రీకృష్ణ పరబ్రహ్మణే నమః.



లీలాశుకవిరచిత

# శ్రీకృష్ణకర్ణామృతము

ఆంధ్రపద్యటీకాతాత్పర్యసహితము.



చెన్నపురి:

వావిళ్ల. రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్ వారిచే

ప్రకటితము.

1922.



శ్రీ ర స్తు.

శ్రీకృష్ణ పరబ్రహ్మణే నమః.

# శ్రీకృష్ణకర్ణామృతము

ఆంధ్రపద్యటీకాతాత్పర్యసహితము.





## ప్రథమాశ్వాసము.

క. హృద్యానవద్యకిన్నర, విద్యాధరవాద్యమానవీణాదృతికిన్
ఖద్యోతసమద్యుతిచక్రాద్యాయుధతతికి వేంకటాచలపతికిన్.

క. భండనముఖతాండవితా, ఖండితకోదండచండకాండోద్ధతికిన్
మండలితపిచండగతా, జాండావిష్కృతికి వేంకటాచలపతికిన్.

క. శుంభద్దోస్స్తంభగదా, స్తంభితమదజృంభమాణసాంభకధృతికిన్
సంభృతకనకాంబరతట, దంభోదాకృతికి వేంకటాచలపతికిన్.

ఉ. ఈమహనీయమూర్తికిఁ ద్రయీగృహవర్తికి శేషభూధర
స్వామికిఁ దార్క్ష్యగామికి భుజంగమశాయికి నిష్టదాయికిన్
మామకవాఙ్మరందరసమాధురికిన్ మది సొంపు నింపు క
ర్ణామృత మాంధ్రవైఖరి సమర్పణ మే నొనరింతు వేడుకన్.

---

అవ. లీలాశుకుం డనుకవి తనగ్రంథము నిర్విఘ్నముగా ముగియుకొఱకు శిష్ట దేవతాస్తుతిరూపమంగళమును జేయుచున్నాఁడు.—

శ్లో. చిన్తామణి ర్జయతు సోమగిరి ర్గురు ర్మే
శిక్షాగురుశ్చ భగవా ఞ్ఛిఖిపిఞ్ఛమౌళిః,
యత్పాదకల్పతరుపల్లవశేఖరేషు
లీలాస్వయంవరరసం లభతే జయశ్రీః. 1

టీ. చిన్తామణిః—చిన్తామణి యనుయోగియు, ఒకవేశ్య, (ఈయన చింతామణియను సానియుపదేశమున సోమగిరి యనుగురువునుజేరి గోపాలమంత్రసిద్ధి నొందెనని జనశ్రుతి

యొందుగలదు.) జయతు=వెలయుఁగాక, మే=నాకు, గురుః=ఒజ్జయగు, సోమగిరిః= సోమగిరి, జయతు, శిక్షాగురుః=మంచినడవడి నలవడఁజేసిన, భగవాన్=షడ్గుణైశ్వర్యయుక్తుఁడగు, శిఖిపింఛమౌళిః = నెమలిపురి శిరమునఁగల శ్రీకృష్ణమూర్తి, జయతు, యత్పాద...శేఖః=ఎవరికల్పవృక్షపుఁజిగుళ్లవంటిపాదములను తలఁదాల్చువారియందు, జయశ్రీః=జయలక్ష్మి, లీలా...రసమ్ = ఒయారముతోడి స్వయంవరాస్వాదమును, లభతే=పొందుచున్నదో.

శా. శ్రీచింతామణియోగి సోమగిరియున్ శ్రీకృష్ణదేవుండుఁ దా
రాచార్యస్థితిఁ జెంపఁ దచ్చరణకల్పాంకూరముల్ మౌళిపైఁ
దాచం గల్గినవారిఁ జూచి తనయంతం దాన లీలన్ శుభ
శ్రీచాతుర్యముతో వరించు జయలక్ష్మీకన్య ప్రౌఢాకృతిన్. 1

తా. చింతామణియోగి వెలయుఁగాక. అటులనే నాగురువగు సోమగిరియు నా యిష్టదైవమగు శ్రీకృష్ణపరమాత్మయు సన్నిటిలో మిన్నలయి యుందురు గాక.

అవ. వస్తునిర్దేశరూపమంగళముఁ జేయుచున్నాఁడు.—

శ్లో. అస్తి స్వస్తరుణీకరాగ్రవిలసత్కల్పప్రసూనాప్లుతం
వస్తు ప్రస్తుతవేణునాదలహరీనిర్వాణనిర్వ్యాకులమ్,
స్రస్తస్రస్తనిరుద్ధనీవివిలసద్గోపీసహస్రావృతం
హస్తన్యస్తనతాపవర్గమఖిలోదారం కిశోరాకృతీ. 2

టీ. స్వస్తరుణీ...ప్లుతమ్=దేవతాస్త్రీల చేతులయందలి పుష్పములచే ముంచఁబడినదియు, ప్రస్తుత...కులమ్=మెప్పుగనిన పిల్లఁగ్రోవిమ్రోఁతయొక్క ప్రవాహమందలి సుఖముచేఁ గదలనిదియు, స్రస్తస్రస్త...వృతమ్=తేపతేపకు జాఱుచు నడ్డగింపఁబడుచున్న కోకలచే నందమైన వేనవేలుగోపికలచేఁ జుట్టుకోఁబడినదియు, హస్త...వర్గమ్=చేతనుంచుకోఁబడిన మ్రొక్కెడివారి మోక్షము గలదియు, అఖిలోదారమ్=ఎల్లదేవతలలోఁగొప్పదగు. కిశోరాకృతీ=బాలరూపముగల, వస్తు=ఒకవస్తువు, అస్తి=కలదు.

శా. కోకల్ జాఱఁగఁ గేలఁ బూని గుమురై గోపాంగనల్ గొల్వ నా
కీకాన్తల్ దివినుండి కల్పసుమముల్ నిండార వర్షింపఁగా
జోకన్ వేణువినోదనాదలహరిం జొక్కించుచుం జొక్కుచున్
శ్రీకైశోరముఁ బూను దేవుని నతశ్రీముక్తిదుం గొల్చెదన్. 2

తా. అచ్చరలు కురిసిన పుష్పములలో మునిఁగినదియు ఇంపైన వేణుగానమువలననైన సుఖపారవశ్యము గలదియు, జాఱిపోవుచున్న కోకలు చేతఁ బట్టుకొనియున్న గొల్లతలచేఁ జుట్టుకొనఁబడినదియు, తనభక్తుల కలుషేతర వైకుంఠము నొసఁగునదియునగు బాలరూపముఁదాల్చిన యొకవస్తువుగలదు.

శ్లో. చాతుర్యైకనిధానసీమచపలాపాఙ్గచ్ఛటామన్థరం
లావణ్యామృతవీచిలాలితదృశం లక్ష్మీకటాక్షాదృతమ్,
కాళిన్దీపులినాఙ్గణప్రణయినం కామావతారాఙ్కురం
బాలం నీలమమీ వయం మధురిమస్వారాజ్యమారాధ్నుమః. ౨

టీ. అమీ=ఈ, వయమ్=మేము, చాతు... మన్థరమ్=నేరుపునకునికిపట్టులగు కడలుకడకన్నులకాంతులచే నిండినవాఁడును, లావణ్యా...దృశమ్=నిగనిగలాడెడియమృతతరంగములచేఁ బొదలు నేత్రములుగలవాఁడును, లక్ష్మీ...దృతమ్=లక్ష్మీదేవి క్రేగన్నులచే గారవింపఁబడినవాఁడును, కాళిన్దీ...ప్రణయినమ్=యమునయందలి యిసుకతిన్నెలను బ్రేమించువాఁడును, కామావతారాఙ్కురమ్=మన్మథుని పుట్టుకకు మూలమైనవాఁడును, మధురిమస్వారాజ్యమ్=సౌందర్యనిధియైన, నీలమ్=నల్లనివాఁడగు, బాలమ్=బాలగోపాలకృష్ణుని, ఆరాధ్నుమః=పూజింతుము.

శా. బాలున్ మంజులతాలవాలచపలాపాంగోల్లసల్లీలునిం
గాళిందీపులినాంగణప్రణయిశృంగారైకశైలున్ శుభ
శ్రీలోలుం గరుణావలోకనసుధాశీలున్ వినీలప్రభా
జాలుం గొల్చెద రామణీయకరసస్వారాజ్యపాలున్ మదిన్. ౩

తా. ఈ మేము నేర్పునకు నెలవులై చంచలములైన కడగన్నులకాంతులచే నందమైనవాఁడును, లావణ్యరసప్రవాహముచేఁ దేలుచున్న కన్నులుగలవాఁడును, లక్ష్మిచేత సాదరముగాఁ జూడఁబడినవాఁడును, యమునయొడ్డున విహరించువాఁడును, మన్మథుని బుట్టించినవాఁడును, సౌందర్యరాశియైనయానల్లని గోపాలబాలుని సేవించెదము.

శ్లో. బర్హోత్తంసవిలాసికున్తలభరం మాధుర్యమగ్నాననం
ప్రోన్మీలన్నవయౌవనం ప్రవిలసద్వేణుప్రణాదామృతమ్,
ఆపీనస్తనకుడ్మలాభిరభితో గోపీభిరారాధితం
జ్యోతిశ్చేతసి నశ్చకాస్తి జగతామేకాభిరామాద్భుతమ్. 4

టీ. బర్హోత్తంస...భరమ్=నెమలిపురి యను శిరోభూషణముచేత మెఱయుచున్న జుట్టుగలదియు, మాధుర్య...ననమ్=చక్కదనమున మునిఁగిన మోముగలదియు, ప్రోన్మీల...నమ్=ఉదయించుచున్న కౌమారుఁ బ్రాయముగలదియు, ప్రవిల...తమ్=ఒప్పిదమైనపిల్లఁగ్రోవి మ్రోఁత యనునమృతముగలదియు, ఆపీన...లాభిః=అంతట పొంగిన మొగ్గలవంటి కుచములుగల, గోపీభిః=గొల్లభామలచేత, అభితః=నలుపంకలను, ఆరాధితమ్=కొలువఁబడినదియు, జగతామ్=లోకములకు, ఏకాభిరామాద్భుతమ్=ఈడులేక సొంపయి యాశ్చర్యమైనదియు నైన, జ్యోతిః=ఒకదివ్యతేజము, నః=మాయొక్క, చేతసి=చిత్తమందు, చకాస్తి=వెలుఁగుచున్నది.

ఉ. చక్కనిముద్దునెమ్మొగముచందము నందపుమందహాసమున్
జొక్కపుజవ్వనంబు సిగఁ జుట్టినబర్హము వేణుగానమున్
నెక్కొనఁ జొక్కి గోపికలు నిండుతమిం గుచకుట్మలాళిచే
నొక్కుచు గారవించినమనోహరతేజము వొల్చె నామదిన్. 4

తా. నెమలిపురిని దాల్చినదియు, అందమైనమోముగలదియు, అంకురించిన నవయౌవనము గలదియు, చెలరేఁగుచున్న పిల్లఁగ్రోవిధ్వనియను నమృతముగలదియు, ఉబ్బిన స్తనములుగల గోపకాంతలచే నన్నివైపుల సేవింపఁబడునదియు, లోకములకు తులలేనియానందకరమై యాశ్చర్యకరమైన యొకానొకవెలుఁగు మామనములోఁ బొడమూపుచున్నది.

శ్లో. మధురతరస్మితామృతవిముగ్ధముఖామ్బురుహం
మదశిఖిపిఞ్ఛలాఞ్ఛితమనోజ్ఞకచప్రచయమ్,
విషయవిషామిషగ్రసనగృధ్నుని చేతసి మే
విపులవిలోచనం కిమపి ధామ చకాస్తి చిరమ్. 5

టీ. విషయ.. గృధ్నుని=శబ్దాదివిషయములను విషము గలిసినమాంసమును గోరుచున్న, మే=నాయొక్క, చేతసి=చిత్తమందు, మధుర...మ్బురుహామ్=మిక్కిలి మనోహర మగుచిఱునగ వనునమృతముచే నందమైన ముఖకమలముగలదియు, మదశిఖి...ప్రచయమ్=మదించిననెమలిపురిఁ జెరివినయందమైనకురులుగలదియు, విపులవిలోచనమ్=వెడదకన్నులుగల, కిమపి=చెప్పనలవికాని, ధామ=తేజము, చిరమ్=చాలకాలమునుండి, చకాస్తి=ప్రకాశించుచున్నది.

చ. వదల కనయ్య మావిషయవాంఛకు లోనయి సంచరించునా
మది శిఖిపింఛభూషణసమంచితకుంతలభవ్యవేషమున్
మృదుమధురస్మితామృతసమృద్ధముఖాబ్జము లోలదృష్టులిం
పొదవినదివ్యతేజము నమున్నతి నున్నది నిత్యసిద్ధమై. 5

తా. చిఱునగవుచేత నందమైన మొగముగలదియు, నెమలిపురిఁజుట్టిన సొంపైన కురులుగలదియు, విశాలములగునేత్రములు గలదియునగు నొకతేజము విషయలోలమైననాచిత్తమునఁ జాలకాలమునుండి వెలుఁగుచున్నది.

శ్లో. ముకుళాయమానయనామ్బుజం విభో
ర్మురళీనినాదమకరన్దనిర్భరమ్,
ముకురాయమాణమృదుగణ్డమణ్డలమ్
ముఖపఙ్కజం మనసి మే విజృమ్భతామ్. 6

టీ. ముకుళా...మ్బుజమ్=మొగ్గలవలెనున్న కన్నుదామరలు గలదియు, మురళీ...రమ్=పిల్లఁగ్రోవిధ్వనియనుతేనెచేనిండిన, ముకురా...మణ్డలమ్=అద్దములవలెనున్న నునుఁజెక్కులుగల, విభోః=ప్రభువగుశ్రీకృష్ణునియొక్క, ముఖపఙ్కజమ్= కమలమువంటిముఖము, మే = నాయొక్క, మనసి=చిత్తమున, విజృమ్భతామ్=ప్రకాశించుఁగాక.

మ. మురళీనాదమరందబిందులహరీమోదంబుచే లోచనాం
బురుహంబుల్ ముకుళింప నోష్ఠమణి సొంపుల్ మీఱి నాదర్శభా
సురగండస్థలి యొప్ప స్రస్తచికురస్తోమంబు ఫాలంబుపై
ముసురుల్ సూపఁ జెలంగుకృష్ణవదనాంభోజంబు భావించెదన్. 6

తా. సగముగా మూయఁబడిన కన్నులు కలిగి, వేణుగానామృతముతో నిండియున్న అద్దములవంటి చెక్కులుగల శ్రీకృష్ణదేవునిమోముదమ్మి నా మనమునందు నిలుచుఁగాక.

శ్లో. కమనీయకిశోరముగ్ధమూర్తేః కలవేణుక్వణితాదృతాననేన్దోః,
మమ వాచి విజృమ్భతాం మురారే ర్మధురిమ్ణః కణికాఽపి కాపి కాపి.

టీ. కమ...మూర్తేః=కోరఁదగిన బాలసుందరరూపముగలవాఁడును, కలవేణు...నేన్దోః=అవ్యక్తమధురమైనపిల్లఁగ్రోవిధ్వనిచే నాదరింపఁబడిన చంద్రునివంటిముఖముగలవాఁడగు, మురారేః=శ్రీకృష్ణునియొక్క, మధురిమ్ణః=సౌందర్యముయొక్క, కాపి కాపి=ఏదేని, కణికాపి=లేశమైనను, మమ=నాయొక్క, వాచి=వాక్కునందు, విజృమ్భతామ్=విస్తరిల్లుఁగాక.

మ. కలవేణుక్వణితాదృతాననము రాకాచంద్రసాంద్రద్యుతిం
దిలకింపం గమనీయముగ్ధశిశుమూర్తిస్ఫూర్తి వర్తిల్లు ను
త్పలపత్త్రోజ్జ్వలనీలవర్ణ గుణసంధామాధురీసాధురీ
తులలో నించుక యైన నావచనసందోహంబులం జెందెడున్. 7

తా. కోరఁదగిన బాలసుందరరూపముగలిగి మధురమైన వేణుగానరవముచే ముద్దులొలుకుచున్న శ్రీకృష్ణుని మాధుర్యలేశమైనను నానోట నొకింత గలుగుఁగాక.

శ్లో. మదశిఖణ్డిశిఖణ్డవిభూషణం మదనమన్థరముగ్ధముఖామ్బుజమ్,
వ్రజవధూనయనాఞ్చలవఞ్చితం విజయతాం మమ వాఙ్మయజీవితమ్.

టీ. మద...షణమ్=మత్తిల్లిన నెమిలిపింఛమే సొమ్ముగాఁగలదియు, మదన...మ్బుజమ్=మన్మథునిచే నలసమైన సుందరమైన కమలమువంటి ముఖముగలదియు, వ్రజవధూ...ఞ్చితమ్=గోపవనితలనేత్రాంతములచే మోసగింపఁబడినదియు నైన, మమ=

నాయొక్క, వాఙ్మయజీవితమ్=కవనమునకు జీవగఱ్ఱయగువస్తువు, విజయతామ్=సర్వో త్కర్ష గలిగియుండును గాక.

ఉ. చక్కనిముద్దుమోము సుమసాయకుకొక్కెల ధిక్కరింపఁ గొఁ
జొక్కపునెమ్మిబోదెనునుసోగసరంబు శిరంబునందుఁ బెం
పెక్క వ్రజాంగనాజననిరీక్షణవంచిత మైననాడున
మ్మక్కృతవాక్యజీవిత మజాండకటాహము నిండి యుండెడిన్. 8

తా. నెమ్మిపింఛమును తలఁదాల్చినదియు, మన్మథవికారముచే నలసమై యొప్పు నీటు మోముదమ్మి గలదియు, గోపకామినుల క్రీగన్నులచే బొంకింపఁబడినదాయొ క్క కవిత్వమునకు జీవన మైనతేజ మన్నిటికంటె మిన్నయై వెలయుఁగాక.

శ్లో. పల్లవారుణపాణిపఙ్కజసఙ్గివేణురవాకులం
ఫుల్లపాటలపాటలీపరివాదిపాదసరోరుహమ్,
ఉల్లసన్మధురాధరద్యుతిమఞ్జరీసరసాననం
వల్లవీకుచకుమ్భకుఙ్కుమపఙ్కిలం ప్రభుమాశ్రయే. 9

టీ. పల్లవా...కులమ్=చిగురువలె నెఱ్ఱనైన పాణిపద్మమునం దమర్పఁబడినపిల్లఁ గ్రోవిపాటయందుఁ దవిలి యున్నవాఁడును, ఫుల్ల...రుహమ్=పూచిన కలిగొట్టుపూ వులయొఱపును నిరసించుచున్న కమలములవంటి పాదములు గలవాఁడును, ఉల్లస... సానమ్=ప్రకాశించుచున్న సొగసైన యధరోష్ఠముయొక్క కాంతుల గుత్తులచే మె ఱుఁగు గల మొగము గలవాఁడును, వల్లవీ...పఙ్కిలమ్=గొల్లముబ్బెతల కడవలవంటి కుచములయందలికుంకుమబురద గలవాఁడునైన, ప్రభుమ్=నిగ్రహింపను అనుగ్రహిం పను జాలిన శ్రీకృష్ణదేవుని, ఆశ్రయే=ఆశ్రయించుచున్నాను.

ఉ. పల్లవకోమలం బయినపాణితలంబునఁ దేనెమోవి రం
జిల్లెడుమోముదమ్మిపయిఁ జేర్చినవేణువు మ్రోయఁ జొక్కుచు
న్వల్లవకామినీజనఘనస్తనకుంకుమపంకభాసి యౌ
వేల్లితపాటలారుణనవీనపదాబ్జు విభుం దలంచెదన్. 9

తా. చిగురువలె నెఱ్ఱనైనచేతియందున్న పిల్లఁగ్రోవియందలి మంచిధ్వనియం దుఁ దవిలియున్నవాఁడును, పూచిన కలిగొట్టుపూవుల యొఱపును తిరస్కరించు పాద ములుగలవాఁడును, ప్రకాశించునందమైన యధరముయొక్క కాంతిపుంజముచే నొ ప్పిదమైన మొగముగలవాఁడును, గోపాంగనల కుచములయందలి కుంకుమబురదచే నిండినయెడలు గలవాఁడును, నిగ్రహింప ననుగ్రహింపఁజాలు శ్రీకృష్ణమూర్తిని ఆశ్రయించెదను.

శ్లో. అపాఙ్గరేఖాభి రభఙ్గురాభి రనఙ్గలేఖారసరఞ్జితాభిః,
అనుక్షణం వల్లవసున్దరీభి రభ్యర్చ్యమానం విభుమాశ్రయామః. 10

టీ. వల్లవసుందరీభిః=గోపకామినులచేత, అనఙ్గ...తాభిః=మన్మథుని బాణముల వలె సారస్యముచే మనోహరములుగాఁ జేయఁబడినవియు, అభఙ్గురాభిః=తెంపులేని, అపాఙ్గరేఖాభిః=కడగంటిచూపులచేత, అనుక్షణమ్ = ప్రతిక్షణమునను, అభ్యర్చ్య మానమ్=పూజింపఁబడుచున్న, విభుమ్=శ్రీకృష్ణస్వామిని, ఆశ్రయామః=ఆశ్రయిం చెదము.

ఉ. ఇంచుక యైనఁ జాలు నని యెంచక వ్రేతలమించుఁబోండ్లు క్రొ
మ్మించులమించు లీనెడునమేయమనోభవమాధురీరసో
దంచితచారుచంచలదృగంచలధారల సారె పూజ గా
వించఁగఁ జెల్వు మీఱువిభు వేణువినాదవినోదుఁ గొల్చెదన్. 10

తా. మదనలేఖలవలె నుద్దీపనశక్తి గలిగి దీర్ఘము లైనగొల్లపడుచుల కడగంటి చూడ్కులచే నెల్లవేళలఁ జయుండును సేవింపఁబడుదేవుని సేవించెదము.

శ్లో. హృదయే మమ హృద్యవిభ్రమాణాం
హృదయం హర్షవిశాలలోలనేత్రమ్,
తరుణం వ్రజబాలసున్దరీణాం
తరళం కిఞ్చన ధామ సన్నిధత్తామ్. 11

టీ. హృద్యవిభ్రమాణామ్ = ఇంపైనసొబగులకు, హృదయమ్=మేలైనదియు, హర్ష...నేత్రమ్ = ఆనందముచే విరిసిన కదలు కన్నులుగలదియు, తరుణమ్=పడుచు ప్రాయముగలదియు, వ్రజ...రీణామ్ = గొల్లపడుచులయొక్క, తరళమ్=చపలమైన, కించన=ఇట్టిదనరాని, ధామ=తేజము, మమ=నాయొక్క, హృదయే=హృదయమున, సన్నిధత్తామ్=పొడమఁగాక.

ఉ. మంజువిలాసవిభ్రమసమాశ్రయము ర్వ్రజభామినీమనో
రంజకయావనాకరము రాజితహర్షవిలాసదృక్ప్రభా
పుంజము పింఛభూషణవిభూషితధామము నెమ్మి నామనః
కంజనివాస మై మనుచుఁ గావుత సత్కరుణాధురీణ మై. 11

తా. చక్కనిసొబగుల తావును, ఆనందముచే మతింతపెద్ద వైనకన్నులుగలది యు, యౌవనమున నున్నదియు, గోపకాంతల సొమ్మైనదియు, ఇట్టిదని చెప్పరాని చపల మైనయొకతేజస్సు నాహృదయములో నిలుచుఁగాక.

శ్లో. నిఖిలభువనలక్ష్మీనిత్యలీలాస్పదాభ్యాం
కమలవిపినవీథీగర్వసర్వఙ్కషాభ్యామ్,
ప్రణమదభయదానప్రౌఢిగాఢోద్ధతాభ్యాం
కిమపి వహతు చేతః కృష్ణపాదామ్బుజాభ్యామ్. 12

టీ. నిఖిల...దాభ్యామ్=ఎల్లలోకములయందలి లక్ష్మికి నాటపట్టైనవియు, కమల...పాభ్యామ్ = తామరపాదలబారులపొగరడఁచునవియు, ప్రణమ...తాభ్యామ్= మ్రొక్కువారలకు నభయమిచ్చుగౌరవమున మిగుల చెన్నుమీఱినవియు నగు, కృష్ణ పాదామ్బుజాభ్యామ్= శ్రీకృష్ణునిపాదారవిందములచేత, చేతః=నామనస్సు, కిమపి= చెప్పనలవికాని ముదమును, వహతు=కొంచుఁగాక.

మ. లలితాశేషదిశాధినాథనగరీలక్ష్మీవిలాసాస్పదం
బులు నీరేరుహగర్వసర్వవిభవప్రోన్మూలనశ్రీపదం
బులు వందారుమనోరథార్థఘటనాపూర్ణానుకంపాస్పదం
బులు శ్రీకృష్ణదపంబు లూని మన మూమోదంబునం బొందెడిన్. 12

తా. సర్వలోకములయందలి లక్ష్మికి నెలవైనవియు, తామరతోఁటలబారుల యందమును మీఱినవియు, మ్రొక్కెడువారల కభయ మిచ్చుటయందు మిగులఁ బట్టుదలగలవియునైన శ్రీకృష్ణుని యడుగుఁదామరలు నామది కొకవింత యానందమును గలిగించుఁగాక.

శ్లో. ప్రణయపరిణతాభ్యాం ప్రాభవాలమ్బనాభ్యామ్
ప్రతిపదలలితాభ్యాం ప్రత్యహం నూతనాభ్యామ్,
ప్రతిముహు రధికాభ్యాం ప్రస్నువల్లోచనాభ్యామ్
ప్రభవతు హృదయే నః ప్రాణనాథః కిశోరః. 13

టీ. ప్రణయపరిణతాభ్యామ్ = స్నేహముచే నిండినవియు, ప్రాభవాలమ్బనాభ్యామ్=ప్రభుత్వమునకు పట్టైనవియు, ప్రతిపదలలితాభ్యామ్=అడుగడుగున సొబగు మీఱుచున్నవియు, ప్రత్యహమ్=అనుదినము, నూతనాభ్యామ్ = అభినవములైనవియు, ప్రతిముహుః=తేపతేపకు, అధికాభ్యామ్=విశేషించుచున్నవియు నగు, ప్రస్నువల్లోచనాభ్యామ్ = దయారసము గురియుచున్న కనులతోడ, ప్రాణనాథః = మాజీవన రక్షకుఁడైన, కిశోరః=కుఱ్ఱఁడు, నః=మాయొక్క, హృదయే = చిత్తమున, ప్రభవతు=కలుగుఁగాక.

చ. ప్రతిదినముఁ విలాసరసభాసుర మై నిరతంబుఁ జూచిన
మతిహిత మై ప్రభుత్వమహిమంబున కెల్లను బట్టుఁగొమ్మ యై
యతులదయాకళోదితము నై విలసిల్లెడుకన్నుదోయితో
నతతముఁ బ్రాణబంధుఁ డగుచక్కనిబాలుఁడు దోఁచుఁ గావుతన్. 13

తా. కరుణామయములును, దొరతనపుఠీవిని దెలుపుచున్నవియు, ప్రతిపదము అందమైనవియు, దినదినము క్రొత్తవైనవియు, తేపతేపకు పెద్దవగుచున్నదయారసములుకుచూడ్కులతోఁ గూడిన మాజీవితదాతయగుకుఱ్ఱఁడు మాహృదయము నధివసించుఁగాక.

శ్లో. మాధుర్యవారిధిమదాన్ధతరఙ్గభఙ్గీ
శృఙ్గారసఙ్కలితశీతకిశోరవేషమ్,
ఆమన్దహాసలలితాననచన్ద్రబిమ్బ
మానన్దసంప్లవ మనుప్లవతాం మనో మే. 14

టీ. మాధుర్య...వేషమ్ = చక్కదన మనుసముద్రమొక్క మదముచేఁ గన్నుగానని తరంగరూపమయిన శృంగారరసముచే నొప్పిన కనులకింపైనబాలవేషము గలదియు, అనన్ద...బిమ్బమ్=సంతోషమువలనఁ గలిగిన చిన్నినవ్వుచే మధురమైన ముఖచంద్రబింబముగల, ఆనన్దసంప్లవమ్ = ఆనందరసములోఁ దేలియాడుటను, మే = నాయొక్క, మనః=మనస్సు, అనుప్లవతామ్=అనుభవించుఁగాక.

ఉ. కందళితస్మితామృతవికాసముఖాబ్జము మాధురీవిని
ష్యందతరంగభంగి నవయావనవిభ్రమగోపవేష మా
నందరసైకరూప మగునందకుమారసుధాబ్ధిలోన నా
డెందము దేలియాడఁగఁ గడిందియఘం బనుపంక మంటునే. 14

తా. చక్కఁదనము మీఱి శృంగారమును జిలుకుచున్న ముద్దుగులుకు మోహనాకృతి గలదియుఁ, సంతోషమువలన నైననగవుచే నందమైన మొగముగల సంతోషరసపూరము నామనస్సు అనుభవించుఁగాక.

శ్లో. అవ్యాజమఞ్జులముఖామ్బుజముగ్ధభావై
రాస్వాద్యమాననిజవేణువినోదనాదమ్,
ఆక్రీడతా మరుణపాదసరోరుహాభ్యా
మార్ద్రే మదీయహృదయే భువనార్ద్ర మోజః. 15

టీ. అవ్యాజ...భావైః=నైజముచేతనే సొంపైన మోముదమ్మియొక్క ముద్దుతనములచేత, ఆస్వాద్య...నాదమ్=అనుభవింపఁబడుచున్న తనపిల్లఁగ్రోవి మధురధ్వని గలదియు, భువనార్ద్రమ్=లోకములకుఁ జల్లఁజేయు, ఓజః=ప్రకాశము, అరుణపాద సరోరుహాభ్యామ్=ఎఱ్ఱనిపాదకమలములతో, ఆర్ద్రే=భక్తిరసముచేఁ దడిసిన, మదీయ హృదయే=నాచిత్తమున, ఆక్రీడతామ్=అంతటఁ గ్రీడించుఁగాక.

మ. వదనవ్యాజమనోహరాననముతో నాలోలదృక్పాళితో
ననకృల్లీఢనిరూఢవేణులతతో నాతామ్రకమ్రాంఘ్రిసా
రసయుగ్మంబున నింపుసొంపులు దలిర్పం దాండవం బాడుచు
న్వసియించుఁ భువనార్ద్రతేజము మహానందంబునన్ నామదిన్. 15

తా. స్వాభావికమైనమోహమదమ్మియందముగులకువేణువు నూఁదుచున్న జగత్తులకు మేలొనర్చు చల్లనితేజము ఎఱ్ఱనిపాదములతో గంతులువైచుచు నామదిలోఁ గ్రీడించుఁగాక.

శ్లో. మణినూపురవాచాలం వన్దే తచ్చరణం విభోః,
లలితాని యదీయాని లక్ష్మాణి వ్రజవీథిషు. 16

టీ. మణినూపురవాచాలమ్=రతనపుటందియలచే మొరయుచున్న, విభోః=ప్రభువగు శ్రీకృష్ణునియొక్క, తత్=ఆ, చరణమ్=పాదమునుగూర్చి, వన్దే=మ్రొక్కుచున్నాను. యదీయాని=ఏపాదసంబంధములైన, లలితాని=సుందరములైన, లక్ష్మాణి=గుఱుతులు, వ్రజవీథిషు=వ్రేపల్లెవీథులయందు (వెలయుచున్నవో).

చ. హలకులిశాదిలక్షణసమాహితముద్రనచంచలస్థితిన్
వెలసి సిరిం జెలంగువ్రజవీథుల నూపురరత్నకింకిణీ
లలితఝుళంఝుళారవములన్ నలుదిక్కులుఁ బిక్కటిల్లఁగా
దలవరి నాఁ బ్రవర్తిలుపదద్వయి గల్గుహరిన్ భజించెదన్. 16

తా. గొల్లవాడలలో నెల్లెడలఁ గన్పట్టు నాకృష్ణునియందెలచప్పుడుచే మ్రోఁగుపాదములకు మ్రొక్కెదను.

శ్లో. మమ చేతసి స్ఫురతు వల్లవీవిభో
ర్మణినూపురప్రణయి మఞ్జుశిఞ్జితమ్,
కమలావనేచరకలిన్దకన్యకా
కలహంసకణ్ఠకలకూజితాదృతమ్. 17

టీ. కమలా...దృతమ్ = లక్ష్మీనివాసమైనతామరతోఁటలయందు సంచరించు యమునానదియందున్న రాజహంసల గొంతులయందలి మధురధ్వనిచే నాదరింపఁబడినదియు, వల్లవీవిభోః=గొల్లవనితలకుఁ బ్రియుఁడైన శ్రీకృష్ణునియొక్క, మణినూపురప్రణయి=రతనపుటందియలకుఁ జెలియైన, మఞ్జు=మనోహరమైన, శిఞ్జితమ్=మ్రోఁత, మమ=నాయొక్క, చేతసి=చిత్తమున, స్ఫురతు=ప్రకాశించుఁగాక.

మ. దినముల్ నాదుహృదంతరాళమున వర్తిల్లుం గళిందాత్మజా
వనజాళిన్ విహరించునంచకలరావంబుల్ విడంబించున
వ్వనజాతేక్షణుపాదనూపురమణిధ్వానంబు గోపాంగనా
జనరాసోత్సవనృత్తగీతకలనాసాచివ్యధౌరేయమై. 17

తా. యమునానదియందలి తామరతంపరలయందుండు హంసలధ్వనివలె మనోహరమగు శ్రీకృష్ణుని కాలియందెచప్పుడు నామనమునఁ దోఁచుఁగాక.

శ్లో. తరుణారుణకరుణామయవిపులాయతనయనం
కమలాకుచకలశీభరవిపులీకృతపులకమ్,
మురళీరవతరళీకృతమునిమానసనలినం
మమ ఖేలతి మదచేతసి మధురాధర మమృతమ్. 18

టీ. తరుణా...నయనమ్=కొంచెమెఱ్ఱనివై దయగలవై వెడల్పుగలిగి దీర్ఘములైనకన్నులు గలదియు, కమలా...పులకమ్=లక్ష్మీదేవియొక్క కలశములవంటి స్తనముల భారమందు మిక్కుటముగాఁ జేయఁబడిన రోమాంచములుగలదియు, మురళీ...నలినమ్=వేణునాదముచేఁ జపలములుగాఁ జేయఁబడిన మునిమనములనెడికమలములు గలదియు, మధురాధరమ్=కమ్మనిమోవిగల, అమృతమ్=అమృతరూపము (శ్రీకృష్ణపరమాత్మ), మమ = నాయొక్క, మదచేతసి=మత్తచిత్తమందు, ఖేలతి=క్రీడించుచున్నది.

మ. తరుణాబ్జారుణలోచనద్వయిఁ గృపాధారేయ మై యొప్ప సా
గరకన్యాకుచకుంభపాళిఁ బులకల్ గన్పట్ట మౌనీంద్రహృ
త్సరసీజంబులు నంచలింప మురళీసంజాతగీతామృత
స్ఫురణన్ రాల్ గరఁగం జరించుహరికై శోరంబు భావించెదన్. 18

తా. కొంచెమెఱ్ఱనై విశాలములైన దయగలనేత్రములు గలదియు, లక్ష్మీదేవి స్తనభారమందు పులకములఁ గలిగించినదియు, పిల్లఁగ్రోవిమ్రోఁతచేఁ గరఁగింపఁబడిన మునిచిత్తములు గలదియు, కమ్మనిమోవిగలదియు నైనయమృతస్వరూపము శ్రీకృష్ణపరమాత్మ మత్తిల్లిననాచిత్తమునఁ బొడసూపుఁగాక.

శ్లో. ఆముగ్ధ మర్ధనయనామ్బుజచుమ్బ్యమాన
హర్షాక్షులవ్రజవధూమధురాననేన్దోః,
ఆరబ్ధవేణురవ మాదికిశోరమూర్తే
రావిర్భవన్తి మమ చేతసి కేఽపి భావాః. 19

టీ. అర్ధ...నేన్దోః = అఱమోడ్చినకనుదమ్ములచేఁ జుంబింపఁబడిన యాగొల్లకొమ్మల సుందరములగు ముఖములుగల, ఆదికిశోరమూర్తేః=పురాణుఁడగు బాలకృష్ణమూర్తియొక్క, కేఽపి=అనిర్వాచ్యములైన, భావాః = విలాసచేష్టలు, ఆముగ్ధమ్=అంతటసుందరముగా, ఆరబ్ధవేణురవమ్ = మొదలిడఁబడిన వేణునాదము గలుగునట్టుగాను, మమ=నాయొక్క, చేతసి=చిత్తమున, అవిర్భవన్తి=తోఁచుచున్నవి.

మ. మురళీగానసుధాపయోనిధి మదిం బొంగం దరంగావళు
ల్దరికిన్ మీఱె ననం గటీతటదుకూలంబుల్ వదిన్ జాఱ న
బ్బురపుంగొల్లమిటారినీటు లఱమోడ్పుంగన్నులం గాంచుచి
త్తరపున్ముద్దులగోపబాలకువినోదప్రౌఢి భావించెదన్. 19

తా. వేణుగానమందలి మాధుర్యముచే మైమఱచియున్న గోపకామినుల మోము ల నరగన్నుతో విలాసముగాఁ జూచుచు వేణుగానము సేయుచున్న బాలకృష్ణుని యని ర్వాచ్యము లగుశృంగారచేష్టలు సుందరముగా నామదిలో నగపడుచున్నవి.

శ్లో. కలక్వణితకఙ్కణం కరనిరుద్ధపీతామ్బరం
క్రమప్రసృతకున్తలం కలితబర్హభూషం విభోః,
పునఃప్రసృతిచాపలం ప్రణయినీభుజాయన్త్రితం
మమ స్ఫురతు మానసే మదనకేళిశయ్యోత్థితమ్. 20

టీ. కల...ణమ్ = అవ్యక్త మధురధ్వనిగలయురుగులు గలదియు, కర...మ్బ రమ్=చేతఁ బట్టుకోఁబడిన పట్టుబట్ట గలదియు, క్రమ... న్తలమ్ = ఱక్కనొత్తఁబడిన తలవెండ్రుకలు గలదియు, కలితబర్హభూషమ్ = అమర్పఁబడిన నెమలిపురియను నలం కారము గలదియు, పునఃప్రసృతిచాపలమ్ = మరల పైకిలేవ నుంకించుచున్నదియు, ప్రణయినీభుజాయన్త్రితమ్=ప్రియురాలిబాహువులచేఁ బెనఁచఁబడిన, విభోః=శ్రీకృ ష్ణునియొక్క, మదనకేళిశయ్యోత్థితమ్ = ఏకాంతశయ్యనుండి లేచుట, మమ = నా యొక్క, మానసే=చిత్తమున, స్ఫురతు=ప్రకాశించుఁగాక.

చ. అరవిరిజాఱుకుంతలము లట్టిటు పీడినవీలిదండయుం
గరవలయంబు ఘల్లు రనఁ గైకొనుసట్టెసువర్ణచేలముం
బరగఁగ సెజ్జ డిగ్గుతఱిఁ బర్హ్మవిలోచన గౌఁగిలించుచోఁ
దిరుగ రమింపఁగాఁ దివురుదేవుని నామది నాశ్రయించెదన్. 20

తా. చేతిమురుగులు గల్లురనఁగా నిద్రలో జాఱిన పట్టుదోవతిని సవరించుకొని తలవెండ్రుకలను చక్కఁజేసికొని, నెమలిపురి సవరించుకొని, రతిశయ్యనుండి లేవఁ బోఁగాఁ బ్రియురా లడ్డమయి కౌఁగిలింపఁ గొంతదడ పట్లనయుండి మరల మన్మథక్రీడ కుపక్రమించు కృష్ణుఁడు నామదిలోఁ దోఁచుఁగాక.

శ్లో. స్తోకస్తోకనిరుధ్యమానమృదులప్రస్యన్దిమన్దస్మితం
ప్రేమోద్భేదనిరర్గళప్రసృమరప్రవ్యక్తరోమోద్గమమ్,
శ్రోతృశ్రోత్రమనోహరవ్రజవధూలీలామిథోజల్పితం
మిథ్యాస్వాప ముపాస్మహే భగవతః [1] క్రీడానిమీలద్దృశః. 21

టీ. స్తోకస్తోక...స్మితమ్=కొంచెముకొంచెముగా నాపుకొనఁబడినను మెల్లగాఁ బైకుబుకుచున్న చిఱునగవుగలదియు, ప్రేమోద్భేద .. ద్గమమ్ = రాగోదయముచే నడ్డు లేక వ్యాపించిన స్ఫుటమైన గగుర్పాటుగలదియు, శ్రోతృ...జల్పితమ్ = వినువారల వీనుల కింపైన గొల్లగుబ్బెతల వేడుకమాటలుగల, క్రీడానిమీలద్దృశః = వేడుకకై

1 క్రీడానిమీలద్దృశోః.

కనులుమూసికొనియున్న, భగవతః = శ్రీకృష్ణునియొక్క, మిథ్యాస్వాపమ్ = కల్లనిద్దురను, ఉపాస్మహే = ధ్యానించెదము.

చ. వలపులు గుల్కు గోపికలవారణ నొండొరుతోడ నాడుమా
టలఁ జెవి కింపుగా వినఁ దొడంగి తనర్చినమందహాసముం
బలుమఱు నాఁగి మేను గరుపాఱఁగ నూరక కన్నుమోడ్చు న
జ్జలరుహపత్త్రనేత్రునియనత్యపునిద్దుర కేను మ్రొక్కెదన్. 21

తా. గోపకామినుల విలాసభాషితము వినఁగోరి యూరకయే వేడుకగాఁ గనులు మూసికొనియుండి, లోపలనుండివచ్చు నవ్వు సాఁపుకోలేక కొంచెముగా విడుచుచు, వారియందలి ప్రేమవలనఁగలిగిన గగుర్పాటుచే నొడలు నిండిన శ్రీకృష్ణుని కల్లనిద్దురను ధ్యానించెదను.

శ్లో. విచిత్రపత్త్రాఙ్కురశాలి బాలా స్తనా న్తరం మానిమనో న్తరం వా,
అపాస్య బృన్దావనపాదపాస్య ముపాస్య మన్య న్న విలోకయామః.

టీ. విచిత్ర... న్తరంవా = సొగసైన మకరికాదిపత్త్రరచనలు గలలేఁ బ్రాయపు కన్నెల కుచమధ్యమును గాని, మానిమనో న్తరం వా = మునులమనస్సును గాని, బృన్దావన పాదపాస్యమ్ = బృందావనమందలివృక్షముయొక్క యునికిపట్టును (లేక, తులసిచెట్ల పాదును) గాని, అపాస్య = విడిచి, ఉపాస్యమ్ = (కృష్ణునిబట్టుకొనుటకై) సేవింప దగినచోటును, అన్యత్ = మఱియొకదానిని, నవిలోకయామః = చూడము.

చ. లలితవిచిత్రపత్త్రమహిళాకుచపాళిఁ గళిందజావన
స్థలలవలీలతాగృహవితర్దికలన్ మునిమానసాబ్జములన్
జలరుహపత్త్రనేత్రుని విలాసనివాసము లిందుఁ దక్క నే
నెలవుననైనఁ గన్గొనఁగనేర్తుమె ధూర్తశిఖావతంసునిన్. 22

తా. మకరికాది పత్త్రాంకితమైన లేఁబ్రాయపుటంగనలయొక్క స్తనమధ్యమందుఁగాని, యోగిచిత్తములయందుఁ గాని, బృందావనతరువులచేరువను గాని, కృష్ణునిరూపము దొరకును గాని మఱియొకచోటను గానరాదు.

అవ. ఈశ్లోకము మొదలు నాలుగుశ్లోకములచే మనమునఁదోఁచిన శ్రీకృష్ణుని గన్నులఁ జూడఁగోరి ప్రార్థించుచున్నాఁడు.—

శ్లో. సార్థం సమృద్ధై రమృతాయమానై రాధ్మాయమానై ర్మురళీనినాదైః,
మూర్ధాభిషిక్తం మధురాకృతీనాం బాలం కదా నామ విలోకయిష్యే.

టీ. ఆధ్మాయమానైః = ఊఁదఁబడుచున్న, సమృద్ధైః = పరిపూర్ణములైనవియును, అమృతాయమానైః = అమృతమువలె నాచరించు న్నవియునగు, మురళీనినాద

స్సార్ధమ్=పిల్లఁగ్రోవి మ్రోఁతలతోఁగూడ, మధురాకృతీనామ్ = సుందరరూపముగల వారిలోపల, మూర్ధాభిషిక్తమ్=పట్టాభిషిక్తుఁడైన, బాలమ్=శ్రీకృష్ణుని, కదానామ= ఎప్పుడు, విలోకయిష్యే=చూడఁగలను ?

ఉ. చక్కనివారినెల్ల నొకసక్కెము లాడెడుచక్కనయ్య యై
చొక్కుచుఁ దానమానలయశోభితగానరసామృతంబు న
ల్దిక్కులఁ బిక్కటిల్ల మురళిం బలికించెడిబాలు నెన్నఁడో
గ్రక్కునఁ గాంచి యెత్తికొని కన్నుల నొత్తుదుఁ దత్పదాబ్జముల్.

తా. అమృతముఁ జిందుచున్న వేణుగానధ్వనులచే నెల్లర నానందింపఁ జేయుచుఁ జక్కనివారిలోనెల్ల మిక్కిలి చక్కనివాఁడగు బాలకృష్ణు నెప్పుడు చూచెదనో.

శ్లో. శిశిరీకురు తే కదా ను నః శిఖిపిఞ్ఛాభరణ శ్శిశు ర్దృశోః,
యుగళం విగళన్మధుద్రవస్మితముద్రామృదునా ముఖేన్దునా. 24

టీ. శిఖిపిఞ్ఛాభరణః=నెమ్మిపురిరేకే సొమ్ముగాఁగల, శిశుః=బాలుఁడు, విగళన్మధు..మృదునా=తేనెలొలుకు చిఱునగవుచే నందమై, ముఖేన్దునా=ముఖచంద్రునిచేత, నః=మాయొక్క, దృశోః=కనులయొక్క, యుగళమ్=జంటను, కదాను=ఎప్పుడు, శిశిరీకురుతే=చల్లఁబఱచునో.

మ. తళుకుంగన్నులచూపుకోపుసుధఁ జిందఁగ మందహాసంబు వె
న్నెలనిగ్గుల్ వెదఁజల్ల నెమ్మిపురివన్నెల్ చిన్నెలై మీఱ ని
ర్మలవక్త్రేందుకళావిలాసమునఁ జేరఁగ వచ్చి కందోయి శీ
తలముం జేయఁగ నందనందనుని నాత్మం గాంచు టెం కెన్నఁడో. 24

తా. నెమ్మిపింఛమును దాల్చినబాలుఁడు తేనెలొలుకు చిఱునగవుతోఁ గూడిన ముఖముతో నెప్పుడు మాకన్నులు చల్లఁబడునట్లు సాక్షాత్కరించునో !

శ్లో. కారుణ్యకర్బురకటాక్షనిరీక్షణేన
తారుణ్యసంవలితశైశవవైభవేన,
ఆపుష్ణతా భువన మద్భుతవిభ్రమేణ
శ్రీకృష్ణచన్ద్ర! శిశిరీకురు లోచనం మే. 25

టీ. హే శ్రీకృష్ణచంద్ర = చంద్రునిఁబోలునో కృష్ణా, కారుణ్య...ణేన= దయచేఁ జిత్రవర్ణమైన క్రేగంటిచూపుగలదియు, అద్భుత విభ్రమేణ=ఆశ్చర్యములగు విలాసములుగలదియుఁ గనుక నే, భువనమ్=జగత్తును, ఆపుష్ణతా = బాగుగ రక్షించుచున్నదియు, తారుణ్యసంవలితశైశవవైభవేన = యౌవనారంభముతోఁ గూడిన

శాల్యవైభవముచేత, మే=నాయొక్క, లోచనమ్=నేత్రమును, శిశిరీకురు=చల్లఁగాఁ జేయుము.

శా. కూడిం గూడని ప్రాయపుంబ్రొన్ననసుచెక్కుల్ నిక్కి కై పెక్కుఁగా
నీడుం జోడును లేనివీక్షణసుధావృష్టిన్ జగత్సృష్టికిం
దోడ్పడ్ నీ డగుగోకులాంబునిధిచంద్రుం గాంతిసాంద్రుం దమిం
జూడం జూడఁగ దృక్కుఁ గోరికలు గాంచున్ సంతతానందమున్. 25

తా. ఓకృష్ణచంద్రా! దయారసము దొలుకాడు క్రేగంటిచూపులుఁగలదియు, అద్భుతవిలాసములు గలదియు, లోకరక్షకమైన ప్రియాపనోదయముతోఁ గూడిన శాల్యరూపమును నా కగపడఁజేయుము.

శ్లో. కదా వా కాళిన్దీకువలయదళశ్యామలతరాః
కటాక్షా లక్ష్యన్తే కిమపి కరుణావీచినిచితాః,
కదా వా కన్దర్పప్రతిభటజటాచన్ద్రశిశిరాః
కిమప్యన్తస్తోషం దదతి మురళీకేళినినదాః. 26

టీ. కాళిన్దీ...తరాః = యమునయందలి కలువ రేకులవలె మిగుల నల్లనైన, కిమపి=అనిర్వాచ్యముగా, కరుణావీచినిచితాః = దయయొక్క తరంగములచే నిండఁబడిన, కటాక్షాః=కడగంటిచూపులు, కదావా=ఎప్పుడు, లక్ష్యంతే=కనఁబడగలవు? కందర్ప...శిరాః=శివుని జడలయందలి చంద్రునిచేఁ జల్లనైన, మురళీకేళినినదాః=పిల్లఁగ్రోవియాటయందలి మ్రోఁతలు, కదావా=ఎప్పుడు, కిమపి=చెప్పరాని, అన్తస్తోషమ్=హృదయానందమును, దదతి=ఇచ్చునో?

ఉ. ఎన్నఁడొ యామునోత్పలసితేతరలోలదయార్ద్రదృగ్విలా
సోన్నతి నాపయిన్ నిగిడియుండుట శంభుజటాటవీతటా
సన్నసుధాంశుశీతలలసన్మురళీనినదామృతంబుచే
వెన్నఁడు నాదువీనులకు విందొనరింపఁ దలంచు టెన్నఁడో. 26

తా. యమునయందలికలువ రేకులవలె నల్లనైన కృష్ణుని కడగంటిచూపు లెప్పుడు నాపైఁ బ్రసరించునో, శివునియొద్దల నున్న చంద్రునివలెఁ జల్లనైనపిల్లఁగ్రోవి పాటలు నాకెప్పుడు మానసానందమును గలిగించునో?

శ్లో. అధీర మాలోకిత మార్ద్రజల్పితం గతంచ గమ్భీరవిలాసమన్థరమ్,
అమన్ద మాలిఙ్గిత మాకులోన్మదస్మితం చ తే నాథ వద న్తి గోపికాః.

టీ. హేనాథ=ఓదొరా, గోపికాః=గొల్లెతలు, తే=నీయొక్క, అధీరమ్=కాతరమైన, ఆలోకితమ్=చూపును, ఆర్ద్రజల్పితమ్=తేనెలొలుకుచుముద్దుమాటలను, గమ్భీరమ్=గరువంపువిలాసముచే మందమైన, గతంచ=నడకను, అమందమ్=గాఢమైన,

ఆలిఙ్గితమ్=కౌఁగిలింతను, ఆకులోన్మదస్మితంచ=వెల్లివిరియుచు మోహజనక మైన చిఱు నవ్వును, వదన్తి=కీర్తించెదరు.

ఉ. అందము గుల్కు నీయలసయానము మాటలు తేనెసోనలం
జిందు మృదుస్మితంబు సుధఁ జిందుఁ గటాక్షము లౌర మించుకుర్
విందులు కౌఁగిలింత కడువింత యటంచును గోపకాంత లా
నందముతోడఁ బల్కుదురు నాథ! భవన్మహిమానుభావముల్. 27

తా. కృష్ణా! గోపాంగనలు నీ బెదరుఁజూపులను తీయనిపలుకులను గరువంపు టొయారము గలనడలను గాఢమైన కౌఁగిలింతలను వ్యాపకమై మోహజనక మైన చిఱునవ్వును పలుమాఱు వర్ణించి చెప్పుచుందురు.

శ్లో. అస్తోకస్మితభర మాయతాయతాక్షం
నిశ్శేష స్తనమృదితం వ్రజాఙ్గనాభిః,
నిస్సీమ స్తబకితనీలకాన్తిధారం
దృశ్యాసం త్రిభువనసున్దరం మహస్తే. 28

టీ. ఆస్తోకస్మితభరమ్ = పొంగుచున్న చిఱునగవుగలదియు, ఆయతాయతాక్షమ్=మిగుల వెడఁదకన్నులుగలదియు, వ్రజాఙ్గనాభిః=గొల్లకాంతలచేత, నిశ్శేషస్తనమృదితమ్=నిండుఁజనులచే నొక్కఁబడినదియు, నిస్సీమ...ధారమ్=మేరలేక పొగు చేయఁబడిన నల్లని కాంతులుగలదియు, త్రిభువనసున్దరమ్ = త్రిలోకములందు అందమైన, తే=నీయొక్క, మహః=తేజమును, దృశ్యాసమ్=చూడఁగలను.

ఉ. మబ్బుబిగిన్ నగం దగుసమంచితకోమలనీలదేహమున్
గుబ్బమిటారిచన్గవలకొద్దిని వ్రేతలు కౌఁగిలింపఁగా
నుబ్బుచు మందహాసరుచి యొప్పఁగ గొప్పగుకన్నుదోయిచే
నబ్బుర మైనచక్కనియొయారపుఁ దేజముఁ గాంచెదన్ మదిన్. 28

తా. కృష్ణా! చిఱునగవున దొప్పదోఁగుచున్నదియు, వెడఁదకన్నులు గలదియు, గొల్లపడుచులకఠినస్తనములచే మెదపఁబడినదియు, ప్రోగులువడుచున్న నల్లనికాంతులు గలదియునగు త్రిలోకమోహనమైన నీ తేజమును చూడఁగోరెదను.

శ్లో. మయి ప్రసాదం మధురైః కటాక్షై ర్వంశీనినాదానుచరై ర్విధేహి,
త్వయి ప్రసన్నే కి మిహాపరై ర్న స్త్వయ్యప్రసన్నే కి మిహాపరై ర్నః.

టీ. వంశీ...చరైః=పిల్లఁగ్రోవి మ్రోఁతకుఁదోడునీడలైన, మధురైః=ప్రియములైన, కటాక్షైః=క్రేగంటిచూపులచేత, మయి=నాయందు, ప్రసాదమ్=అనుగ్రహమును, విధేహి=చేయుము. త్వయి=నీవు, ప్రసన్నే=దయగలవాఁడవేని, ఇహ=ఇక్కడ,

నః=మాకు, అపరైః = ఒరులతో, కిమ్ = ఏమిపని, త్వయి=నీవు, అప్రసన్నే=దయ లేనివాఁడవేని, నః=మాకు, ఇహ=ఇచ్చట, అపరైః=ఇతరులతో, కిం=ఏమిలాభము?

ఉ. నీవు ప్రసన్నదృష్టిఁ గరుణించిన నాగుణ మెట్టిదేనియుం
భావన మాను నీకృపకుఁ బాత్రము గాక చరించువేళ నా
గావఁగఁజాల రెవ్వరును గావున వేఁడురవానుసారిలీ
లావహ మాకటాక్షమున లాలనఁ జేయుము నందనందనా. 29

తా. కృష్ణా! పిల్లఁగ్రోవిమ్రోఁతతోడి నీకమ్మనిచూడ్కులనాపైఁ బిమ్ముము. నీప్రాపుగలదేని మాకిఁక నితరులతో నేమి పని? నీయండలేనిచో మాకెవరిదయ యుండియు నేమిలాభము?

శ్లో. నిబద్ధముగ్ధాఞ్జలి రేష యాచే నీరన్ధ్రదైన్యోన్నతముక్తకణ్ఠమ్,
దయామ్బుధే దేవ భవత్కటాక్షదాక్షిణ్యలేశేన సకృన్నిషిఞ్చ. 30

టీ. దయామ్బుధే=కరుణకుఁ గడలివంటివాఁడవగు దేవా, ఏషః=ఈనేను, నిబద్ధ...ఞ్జలిః=కూర్పఁబడిన వెఱ్ఱి దోసిలిగలవాఁడనై, నీరన్ధ్ర.. కణ్ఠమ్=బీదతనముచే బిగ్గఱగా నఱచుచు, యాచే=వేఁడెదను. భవ...లేశేన=నీకడగంటి చూపులయందలి కరుణయొక్క కొంచెమువేత, సకృత్=ఒకతూరి, నిషిఞ్చ=తడుపుము.

ఉ. వేమఱుఁ గేలు మోడ్చి నిను వేఁడెద నే నెలుఁగెత్తి యిత్తఱిన్
నామొఱ యాలకింపు కరుణానిధి! దీనశరణ్య! సంతతో
ద్దామభవత్కృపారససుధామధురాబ్ధితరంగపాళిలో
నేమికొలంత నావయి నొకించుక నించిన నందనందనా! 30

తా. దయాసముద్రుఁడగునో శ్రీకృష్ణా! నేను చేతులుజోడించి బీదతనముచేఁ గొంతుపై కెత్తి పెద్దగా నఱచి యడుగుచున్నాను. నీ కనుగొనలయందలి కరుణాలవముచే నొక్కతేప నన్ను దడుపుము.

శ్లో. పిఞ్ఛావతంసరచనోచితకేశపాశే
పీనస్తనీనయనపఙ్కజపూజనీయే,
చన్ద్రారవిన్దవిజయోద్యతవక్త్రబిమ్బే
చాపల్య మేతి నయనం తవ శైశవే నః. 31

టీ. పిఞ్ఛా...పాశే=నెమ్మిపురియును తలసొమ్ము నుంచఁదగిన కురులముడి గలదియు, పీన...నీయే=గబ్బిగుబ్బెతలయొక్క కన్నుదామరలచేఁ బూజింపఁదగినదియు, చన్ద్రా...బిమ్బే=చంద్రుని కలువలను గెలువఁబూనిన ముఖమండలము గలదియునగు, తవ=నీయొక్క, శైశవే=చిన్నతనమందు, నః=మాయొక్క, నయనమ్=నేత్రము, చాపల్యమ్=చాపల్యమును, ఏతి=పొందుచున్నది.

మ. పొగరున్నిబ్బెపుగుబ్బ లుబ్బఁగఁ దమిం బూఁబోండ్లు గందోయిద
మ్మిగమిం బూజ లొనర్ప నెమ్మిపురిక్రొమ్మించుల్ సిగఁ దట్టమై
నిగుడం జందురుఁ జౌక సేయుముఖకాంతిన్ వింతయై యొప్పు నీ
సొగసుంబ్రాయముఁ జూచి నానయనముల్ సొంపొందఁగాఁ గోరెడిన్.

తా. ఓకృష్ణా! నెమ్మిపురిదాల్చుట కనువైన కేశకలాపము గలదియు, యౌవనవతుల కన్నులచే సాదరముగాఁ జూడఁదగినదియు, చంద్రునితామరలను గెల్చుటయందు పూనికగల యందంపునెమ్మోముగలదియు నగు నీ చిఱుతప్రాయము మానేత్రముల నాకర్షించుచున్నది.

శ్లో. త్వచ్ఛైశవం త్రిభువనాద్భుత మిత్యవైమి
యచ్చాపలం చ మమ వాగవివాదగమ్యమ్,
తత్కిం కరోమి విరణన్మురలీవిలాస
ముగ్ధం ముఖామ్బుజ ముదీక్షితు మీక్షణాభ్యామ్. 32

టీ. త్వచ్ఛైశవమ్=నీచిన్నతనము, త్రిభువనాద్భుతమ్=ముల్లోకములలో మిన్నయైనది, ఇతి=అని, అవైమి=ఎఱుఁగుదును. యత్=ఎందువలన, మమ=నాయొక్క, చాపలంచ = చిత్తచలనమును, వాగవివాదగమ్యమ్ = వాగ్వాదమునకు గోచరము కాదో, తత్ = అందువలన, కింకరోమి = ఏమిచేయుదును? విరణ...ముగ్ధమ్=మ్రోయుచున్న పిల్లఁగ్రోవివిలాసములచేనందమగు, ముఖామ్బుజమ్=నీమోముదమ్మిని, ఈక్షణాభ్యామ్=నేత్రములతో, ఉదీక్షితుమ్=చూచుటకొఱకు(ఇచ్ఛామి=కోరుచున్నాను.)

మ. పరమాశ్చర్యము నీదుశైశవము చెప్పన్ రాదు లోకంబునన్
వరుసన్ నాచపలత్వ మట్టిద యనిర్వాచ్యంబు చర్చింపుమా
మురలీనాదసుధామనోహరముఖాంభోజాత మీక్షన్నలం
బరిశీలింపఁగఁ గోరినాఁడ సులభంబా తారతమ్యజ్ఞతల్. 32

తా. నీబాల్యము ముల్లోకములయందును విచిత్రమైనది. నామనస్సు చంచలమైనది. నేనేమిచేయుదును? పిల్లఁగ్రోవి నూఁదుచు మనోహరమైన నీమోమునుజూచుట యెట్లోయని చింతించుచున్నాను.

శ్లో. పర్యాచితామృతరసాని పదార్థభఙ్గీ
వల్గూని వల్గితవిశాలవిలోచనాని,
బాల్యాధికాని మదవల్లవభావితాని
భావే లుఠన్తి సుదృశాం తవ జల్పితాని. 33

టీ. పర్యా...సాని=అంతట తేనెలొలుకుచున్నవియు, పదార్థ...ల్గూని=శబ్దార్థముల సందర్భములచే మనోహరములైనవియు, వల్గిత...నాని=త్రిప్పఁబడిన వెడఁద

కన్నులుగలవియు, బాల్యాధికాని=బాల్యమునకు మీఱినవియు, మదవల్లవభావితాని= మత్తులగుగోపకులచే దలఁపఁబడునవియు నగు, తవ=నీయొక్క, జల్పితాని = పలుకులు, సుదృశామ్ = నీప్రియురాండ్రైన గొల్లకాంతలయొక్క, భావే=చిత్తమున, ఉత్తి=పొరలుచున్నవి.

ఉ. కమ్మని తేనియల్ గులుకఁగా వెల దీఱనిమానికమ్ములం
జిమ్ముచు బెళ్కుఁజూపు నిలసిల్లఁగ వల్లవభావితమ్ములై
యిమ్మగుబాల్యరీతి కెనయింపఁగ రానిసిజోక్తి బాలికల్
నెమ్మది నెంచి యెంచి తమి నెక్కొనఁ జేర్చినశౌరిఁ గాంచెదన్. 33

తా. ఎల్లరొడల నల్లుకొనుచున్న యమృతప్రవాహముగలవియు, శబ్దార్థముల కలయికచే నందములైనవియు, త్రిప్పఁబడిన వెడఁదకన్నులు గలవియు, బాల్యమును దాఁటినవియు (అనఁగా: ప్రౌఢోక్తులనుట) కొమరుఁబ్రాయముగల గొల్లలచే భావింపఁబడుచున్న నీమాటలు గోపకామినుల మనస్సులలో మెలఁగుచున్నవి.

శ్లో. పురః ప్రసన్నేన ముఖేన్దుతేజసా
పురోఽవతీర్ణస్య కృపామహామ్బుధేః,
తదేవ లీలామురలీరవామృతం
సమాధివిఘ్నాయ కదాను మే భవేత్? 34

టీ. ప్రసన్నేన=అనుగ్రహముతోఁగూడిన, ముఖేన్దుతేజసా=చంద్రునివంటి ముఖముయొక్క కాంతిచేత, పురః = ఎదుట, అవతీర్ణస్య = పొడసూపినవాఁడును, కృపామహామ్బుధేః=దయాసముద్రుఁడైన కృష్ణునియొక్క, తదేవ=ఆ, లీలామురలీరవామృతమ్=ఒయారముతోఁగూడిన పిల్లఁగ్రోవి మ్రోఁతయనునమృతము, మే=నా యొక్క, సమాధివిఘ్నాయ=తపోనియమమును భంగపఱుచుటకొఱకు, పునః=మరల, కదాను=ఎప్పుడు, భవేత్=కలఁగునో?

ఉ. అందెలు ఘల్లుఘల్లు రన నాడుచు వేణువునందు గీత మా
నందముతోడఁ బాడుచును నాఁటి తెఱంగునఁ గన్నుదోయికి
న్విందు ఘటిల్లఁ గట్టెదుట నిల్చి ప్రసన్నముఖాంబుజంబుతో
నందకుమారుఁ డెన్నఁటి కొనర్చునొ నాదుసమాధిభంగమున్. 34

తా. మొగమున దయ దలకొత్త నెదుర నిలిచి పిల్లఁగ్రోవి నూదుచు నాసమాధికి భంగము గలిగించుచు వెనుకటివిధముగా మరల నా కెప్పుడు దర్శన మిచ్చునో?

శ్లో. భావేన ముగ్ధచపలేన విలోకనేన
మన్మాననే కిమపి చాపల ముద్వహన్తమ్,

లోలేన లోచనరసాయన మీక్షణేన
లీలాకిశోర ముపగూహితు ముత్సుకోఽస్మి. 35

టీ. భావేన=విలాసచేష్టచేతను, ముగ్ధచపలేన=సుందరమైన కదలుపట్టి, విలోకనేన=చూపుచేతను, మన్మానసే=నాచిత్తమున, కిమపి = చెప్పనలవిగాని, చాపలమ్=విభ్రమమును, ఉద్వహన్తమ్=వహించుచున్నవాఁడును, లోచనరసాయనమ్=నేత్రములకు అమృతగుళికయగు, లీలాకిశోరమ్=వేడుక కుఱ్ఱఁడైన శ్రీకృష్ణుని, లోలేన=ప్రీతిగల, ఈక్షణేన=నాచూపుచేత, ఉపగూహితుమ్=ఆలింగనము చేసికొనుటకొఱకు, ఉత్సుకః= ఆదరాతిశయముగలవాఁడను, అస్మి=అగుచున్నాను.

ఉ. చక్కనిమోముతోఁ జెలిమి నల్పెడుముద్దులకోడిగంబులోఁ
జొక్కపునవ్వుతో బెళుకుఁజూపులతోఁ దమిగొల్పుబాలకుఁ
గ్రిక్కన నక్కుఁ జేర్చుకొని కన్నులపండువుగా మనంబులో
నక్కఱ దీరఁ గాంచెద నహర్నిశముం వసుదేవభాగ్యమున్. 35

తా. ముద్దుచేఁతలచేతను, సుందరము చంచలమునైన చూపుచేతను, నాచిత్తమునకు మేర లేని కలవరమును గలిగించుచుఁ గనులకు అమృతపు కణికయగు వింత పిల్లవానిని నాకన్నులారఁ గౌఁగిలించుకొనఁ గోరుచున్నాను.

శ్లో. అధీరబిమ్బాధరవిభ్రమేణ హర్షార్ద్రవేణుస్వరసమ్పదా చ,
అనేన కేనాపి మనోహరేణ హా హన్త హా హన్త మనో ధినోతి. 36

టీ. అధీర...విభ్రమేణ = చపలమైన క్రిందిపెదవి సొగసుచేతను, హర్షా...దాచ=ఆనందపూర్ణమైన పిల్లఁగ్రోవిమ్రోఁత కలిమిచేతను, మనోహరేణ=హృదయానందకరమైన, కేనాపి=అనిర్వాచ్యమైన, అనేన=ఈకృష్ణవస్తువుచేత, మనః = నా మనసు, ధునోతి=కలఁగుచున్నది. హాహన్త! హాహన్త=ఔరారా !

మ. చలబింబాధరలీల క్రొమ్మెఱుఁగుగా శారీరకాంతిచ్ఛటల్
జలదానీకముగా రణన్మురళి గర్జారీతిగా నెంచి ని
చ్చలు నాట్యంబు మనోమయూర మొనరించన్ మెచ్చుకందోయికిన్
ఫల మీమోహనరూపముం గనెడుసౌభాగ్యంబు చింతింపఁగన్. 36

తా. కదలుచున్న మోవిసొంపుచేతను, ఆనందపూర్ణమైన పిల్లఁగ్రోవి మ్రోఁత కలిమిచేతను, యెంతయు మనోహరమైనయొకవస్తువు నామనమును గలఁచుచున్నది. అహా! యేమిచిత్రము ?

శ్లో. యావన్న మే నిఖిలమర్మదృఢాభిఘాత
నిస్సన్ధిబన్ధన ముదేతి నలోపతాపః,

తావ ద్విభో భవతు తావకవక్త్రచన్ద్ర
చన్ద్రాతపద్విగుణితా మమ చిత్తధారా. 37

టీ. హేవిభో = శ్రీకృష్ణా, మే = నాకు, నవోపతాపః = క్రొత్తదియైన మరణవేదన, నిఖిల...బన్ధనమ్ = ఎల్లసెలుఁకలయందు బలముగ తాఁకుటచేత సంధిబంధములు వీడునట్లుగా, యావత్ = ఎంతవఱకు, నోదేతి = కలుగదో, తావత్ = అలోపనే, మమ = నాయొక్క, చిత్తధారా = మనోధాటి, తావక...గుణితా = నీముఖచంద్రుని వెన్నెలచేత రెట్టింపఁజేయఁబడినది, భవతు = అగుఁగాక

మ. శతవర్షంబులమీఁద నొంకుదురవస్థం జెంది లోఁ గుంది బా
ధిత మై యింద్రియగోళముల్ మిగుల నంధీభూతముల్ గాకముం
దతి సుప్సాంగెడుఁగాత్రోఁ దావకసుధాధారాళ వేణున్వనో
న్నతలావణ్యరమానివాసముఖచంద్రజ్యోత్స్న నాముండటన్. 37

తా. కృష్ణా! నన్ను మర్మస్థానములలో విశేషముగాఁ గొట్టి యమదూతలు కారింపకమున్నే నా చిత్తమునకు నీమోము చూపి యమృతనిక్తముగాఁ జేయుము.

శ్లో. యావ న్న మే నరదశా దశమీ దృశోఽపి
రన్ధ్రా దుదేతి తిమిరీకృతసర్వభావా,
లావణ్యకేళిభవనం తవ తావ దేతు
లక్ష్మ్యాః సముత్క్వణితవేణు ముఖేన్దుబిమ్బమ్. 38

టీ. దశమీ = పదియవ, నరదశా = మానవావస్థ (వార్ధక్యము), తిమిరీకృతసర్వభావా = చీఁకటిగాఁజేయఁబడిన యెల్లపదార్థములుగలదై, మే = నాయొక్క, దృశః = కంటియొక్క, రన్ధ్రాదపి = బెజ్జమువలనఁగూడ, యావత్ = ఎంతదనుక, నోదేతి = కలుగదో, తావత్ = అలోపలనే, లక్ష్మ్యాః = లక్ష్మియొక్క, లావణ్యకేళిభవనమ్ = శృంగారవిహారమందిరమును, సముత్క్వణితవేణు = మ్రోగింపఁబడిన పిల్లఁగ్రోవిగల, తవ = నీయొక్క, ముఖేన్దుబిమ్బమ్ = ముఖచంద్రబింబము, ఏతు = (నాదృష్టిపథమును) పొందుఁగాక.

తా. కృష్ణా! నన్ను ముదిమిఁ జుట్టుకొనుటయే కాక పైఁగా కన్నులు గూడ పోయి ప్రపంచమంతయు అంధకారమయము కాకమునుపే లక్ష్మివిహారస్థానమగు వేణుగానము సేయు నీమోము నొక్కపరిఁ జూపుము.

శ్లో. ఆలోలలోచనవిలోకితకేళిధారా
నీరాజితాగ్రసరణేః కరుణామ్బురాశేః,
ఆర్ద్రాణి వేణునినదైః ప్రతినాదపూర్ణై
రాకర్ణయామి మణినూపురశిఞ్జితాని. 39

టీ. ఆలోల...సరణేః=కదలుచున్న చూపుల విలాసముల వరుసలచే నారతెత్తఁబడిన ముందుదారిగల, కరు...రాశేః=దయకు సముద్రమువంటివాఁడగు కృష్ణుని యొక్క, ప్రతినాదపూరైః=ప్రతిధ్వనుల ప్రవాహములుగల, వేణునినదైః = పిల్లఁగ్రోవిమ్రోఁతలచేత, ఆర్ద్రాణి=తడిసిన, మణి...తాని=రతనపుటందియలమ్రోఁతలను, ఆకర్ణయామి=వినుచున్నాను.

మ. నను రక్షించుకృపాపయోధి యగుకృష్ణస్వామి లోలావలో
కనధారారుచి శ్రోవ కారతు లొనంగం జూచుచుఁ వీకమైఁ
జను దేరం బ్రతినాదపూరమురళీసంగీతతాళానుగం
జనమంజీరరవామృతంబు చెవిసించుఁ విందు నిం పొందఁగన్. 39

తా. చూపులచేత ముందుదారికి కాంతిని గలిగించుచుఁ బోవుచు దిక్కులయందు ప్రతిధ్వనిని గలిగించుచున్న వేణుగానధ్వనులతోఁగూడిన శ్రీకృష్ణుని యందెమ్రోఁతల నెప్పుడును వినుచున్నాను.

శ్లో. హేదేవ హేదయిత హేజగదేకబన్ధో
హేకృష్ణ హేచపల హేకరుణైకసిన్ధో,
హేనాథ హేరమణ హేనయనాభిరామ
హా హా కదా ను భవితాసి పదం దృశోర్మే. 40

టీ. హేదేవ=క్రీడించువాఁడా, హేదయిత=ఓప్రియుఁడా, హేజగదేకబన్ధో=లోకములకు ముఖ్యబంధువైనవాఁడా, హేకృష్ణ=ఓనల్లనివాఁడా, హేచపల=ధ్యానమునకందక కదలిపోవువాఁడా, హేకరుణైకసిన్ధో=దయకు ముఖ్యమైన సముద్రమా, హేనాథ=ఓదొరా, హేరమణ = క్రీడించువాఁడా, హేనయనాభిరామ=ఓకన్నులకింపైనవాఁడా, హాహా=అయ్యయ్యో, కదాను=ఎప్పుడు, మే=నాయొక్క, దృశోః = కనులకు, పదమ్=గుఱియగువాఁడవు, భవితాసి=అగుదువో?

శా. ఓదేవోత్తమ యోరమేశ దయితా యోలోకరక్షామణీ
యోదామోదర కృష్ణ చంచల హరీ యోసత్కృపాంభోనిధీ
యోదీనావన నాథ యోరమణ ని న్నొప్పారురమ్యాకృతిఁ
మోదం బొప్పఁగఁ జూతు నెన్నటికి నామోదంబు సంధిల్లఁగన్.

శ్లో. అమూన్యధన్యాని దినాన్తరాణి
హరే త్వదాలోకన మన్తరేణ,
అనాథబన్ధో కరుణైకసిన్ధో
హా హన్త హా హన్త కథం నయామి. 41

టీ. అనాథబన్ధో=దీనులకు దిక్కైనవాఁడా, కరుణైకసిన్ధో=దయకుసముద్రము వంటివాఁడా, హేహారే=ఓకృష్ణా, త్వదాలోకనమ్=నీదర్శనము, అన్తరేణ=విడిచి, అధన్యాని=సార్థకములుగాని, అమూని=ఈ, దినాన్తరాణి=దినమధ్యములను, హాహాన్త హాహాన్త=అయ్యయ్యో, కథమ్=ఎట్లు, నయామి=గడపుచున్నాను ?

శా. నిన్నుం గానక నీకథల్ వినక నిన్నేవూఁ జిత్తంబులో
నెన్నం జాలక నిన్నుఁ జేర్కొనక ని న్నేవేళఁ బూజింప లే
కన్నా ! యార్తనికేతనాంగణనిధీ! యయ్యో కృపావారిధీ!
ఎన్నేనిఁ దినముల్ గ్రమించితి వృథా యేమందు నాదుర్దశన్. 41

తా. దిక్కుమాలినవారికెల్ల దిక్కైనయోకృష్ణా! నీదర్శనములేమిచే వ్యర్థములైన యీదినములను, హారిహారీ! నేనెట్లు గడపుచుంటిని ?

శ్లో. కిమివ శృణుమః కస్య బ్రూమః కథం కృత మాశయా
కథయత కథం ధన్యా మన్యామహే హృద యేశయమ్,
మధురమధురస్మేరాకారే మనోనయనోత్సవే
కృపణకృపణా కృష్ణే తృష్ణా చిరం బత లమ్బతే. 42

టీ. హేధన్యాః=ఓ కృతకృత్యులారా! కిమివ=దేనిని, శృణుమః=విందుము. కస్య=ఎవనికి, కథం=ఎట్లు, బ్రూమః=చెప్పుదుము, ఆశయా=ఆశచేత, కృతమ్=చాలును. హృదయేశయమ్=హృదయమందున్నశ్రీకృష్ణుని, కథమ్=ఎట్లు, మన్యామహే=తలఁపుదము. కథయత=చెప్పుఁడు. మధుర..కారే=అత్యంతమధురమైనప్రకాశించు రూపముగలవాఁడుగనుక నే, మనోనయనోత్సవే=మనస్సునకు నేత్రములకుఁగూడ ప్రీతినిగొలుపుచున్న, కృష్ణే=కృష్ణునియందు, కృపణకృపణా=అతిదీనమైన, తృష్ణా=ఆశ, చిరమ్=చాలకాలముగా, లమ్బతే=తగులుకొనియున్నది. బత=అయ్యో !

శా. ఏశాస్త్రంబుల విందు నేగురునితో నే మంచు నె ట్లానొకో
యాశన్ ధన్యులు దెల్పలేర కద ప్రత్యక్షంబుగా నద్దయా
రాశిన్ నేత్రమనోభిరాము స్మితవక్త్రప్రాభవుం యాదవా
ధీశుం గోరి మదీయతృష్ణ యకటా దీనత్వముం జెందెడిన్. 42

తా. శ్రీకృష్ణునిదర్శనమందు వీతెతిఁగినయో పెద్దలారా! మనోహరాకారము గలిగి మనమునకు కన్నులకుఁగూడ విందు సేయుచున్న శ్రీకృష్ణపరమాత్మయందు మిగుల దీనమైన నాయాశతగులుకొని మరల కున్నది. ఏయుపదేశముల విందును? ఎవరి నడుగుదును? ఈహృదయగతుఁడైనవానిఁ గనిపెట్టువిధమెట్లు? మీకుఁ దెలిసినచో దయతోఁ జెప్పుఁడు.

శ్లో. ఆభ్యాం విలోచనాభ్యా మమ్బుజదళలలితలోచనం బాలమ్,
ద్వాభ్యా మపి పరిరబ్ధుం దూరే మమ హన్త దైవసామగ్రీ. 43

టీ. అమ్బుజ...చనమ్=తామరరేకులవలె నందమైన కన్నులుగల, బాలమ్=కుఱ్ఱవానిని, ద్వాభ్యామపి=రెండైన, అభ్యామ్=ఈ, విలోచనాభ్యామ్=కనులచేత, పరిరబ్ధుమ్=కౌఁగిలించుటకొఱకు, మమ=నాకు, దైవసామగ్రీ=దేవునిసాహాయ్యము, దూరే=దూరమైయున్నది, హా హన్త=అయ్యో!

ఉ. ముద్దులు గుల్కు బాలుఁ డని ముచ్చటఁ గౌఁగిట గ్రుచ్చి యెత్తఁగా
నొద్దిక యై మెలంగెడుభుజోన్నతి కంబురుహాక్షుఁ డంచు నే
ప్రొద్దును వేడ్కఁ జూడఁ దలపోసినఁ జిక్కఁడు గన్నుదోయికిం
గొద్దికి మీఱి దైవ మనుకూలము గామికి నేమి సేయుదున్. 43

తా. తామరరేకులవలెనందమగు కన్నులు గల శ్రీకృష్ణు నా రెండు కన్నుల కరవుదీర నొక్కమాఱు సేవింతమని తలఁచిన నాకెన్నటికిని అదృష్టము రాలేదుగదా!

శ్లో. అశ్రాన్తస్మిత మరుణారుణాధరోష్ఠం
హర్షార్ద్రద్విగుణమనోజ్ఞవేణుగీతమ్,
విభ్రామ్యద్విపులవిలోచనార్ధముగ్ధం
వీక్షిష్యే తవ వదనామ్బుజం కదా ను. 44

టీ. అశ్రాన్తస్మితమ్=ఎడలేని నవ్వుగలదియు, అరుణారుణాధరోష్ఠమ్=మిగుల నెఱ్ఱనిమోవిగలదియు, హర్షా...గీతమ్=ఆనందపరిప్లుతమగుటచే రెండింతలు మనోహరమైన వేణుగానముగలదియు, విభ్రామ్య...ముగ్ధమ్=తిరుగుచున్న వెడల్పైన యరగన్నులచే ముద్దుగులుకుచున్న, తవ=నీయొక్క, వదనామ్బుజమ్=మోముదమ్మిని, కదా=ఎప్పుడు, వీక్షిష్యే=చూడఁగలనో?

మ. మురళీగానసుధాధునీకలితసమ్మోదంబు నిండారఁగా
నరమోడ్పుంగనుదోయిచెల్కుమరఁగా నాతామ్రబింబాధర
స్ఫురణన్ వెన్నెల తేటలేనగవులన్ సొంపొందునెమ్మోముఁ దా
మర సేవింపఁగఁ గల్గునుత్సవము సంభావించు టిం కెన్నఁడో. 44

తా. కృష్ణా! ఎడతెగని నవ్వుగలదియు, మిగుల నెఱ్ఱనిమోవి గలదియు, అందముచే నినుమడించిన వేణుగానమాధుర్యముగలదియు, అరమోడ్పుచే ద్రిప్పఁబడు కన్నులచే మనోహరమైనదియు నగు నీ మోముఁదమ్మి నెప్పుడు చూడఁగలనో?

శ్లో. లీలాయతాభ్యాం రసశీతలాభ్యాం
నీలారుణాభ్యాం నయనామ్బుజాభ్యామ్,
ఆలోకయేదద్భుతవిభ్రమాభ్యామ్
బాలః కదా కారుణికః కిశోరః. 45

టీ. కారుణికః=దయగల, కిశోరః=బాలుఁడు, లీలాయతాభ్యామ్=విలాసము లందు వెడఁదలైనవియు, రసశీతలాభ్యామ్=అనురాగముచేఁ జల్లనైనవియు, నీలారుణాభ్యామ్=(కనుగ్రుడ్లలో) నల్లనై (కనుగొనల) ఎఱ్ఱనైనవియు,అద్భుతవిభ్రమాభ్యామ్=ఆశ్చర్యమైన సొబగు గలవియునగు, నయనామ్బుజాభ్యామ్ = కన్నుదామరలచేత, మామ్=నన్ను, కదా=ఎప్పుడు, ఆలోకయేత్=చూచునో?

ఉ. తిన్ననికల్వ చెల్వు లోకదిక్కున నొక్కెడఁ గమ్మదమ్మిక్రొ
మ్మిన్నలఁ గుమ్మరించు నవనీచకశోణత మించు మించులీ
ల న్నిరసించుని స్తులవిలాసరసాయతశీతలంబు లౌ
కన్నుల నన్ను నెన్నటికిఁ గాంచునొ బాలకుఁ డాదరంబునన్. 45

తా. సొగసుగాఁ ద్రిప్పునపుడు వెడలుదయారసముచేఁ జల్లనై నల్లనై యెఱ్ఱనై ఆశ్చర్యకర మైనసొంపుగల కన్నులతో నాముద్దుచిన్ని గోపాలుఁ డెప్పుడు ననుఁ జూచునో?

శ్లో. బహుళచికురభారం బద్ధపిఞ్ఛావతంసం
చపలచపలనేత్రం చారుబిమ్బాధరోష్ఠమ్,
మధురమృదులహాసం మన్థరోదారలీలం
మృగయతి నయనం మే ముగ్ధవేషం మురారేః. 46

టీ. మే=నాయొక్క, నయనమ్ = కన్ను, బహుళచికురభారమ్ = విరివియగు కేశసమూహము గలదియు, బద్ధపిఞ్ఛావతంసమ్=కూర్చఁబడిన నెమలిపురి యనుశిరోభూషణముగలదియు, చపలచపలనేత్రమ్=చంచలములైనకన్నులు గలదియు, చారుబిమ్బాధరోష్ఠమ్=సొగసైనక్రిందిపెదవి గలదియు, మధురమృదులహాసమ్ = కమ్మని మందహాసముగలదియు, మన్థరోదారలీలమ్ = అలసమై గంభీరమైన యొయారముగలదియు నగు, మురారేః=కృష్ణునియొక్క, ముగ్ధవేషమ్ = ముద్దురూపును, మృగయతి= వెదకుచున్నది.

చ. లలితపుఁగెంపుసొంపుకళలన్ విలసిల్లెడుమోవినవ్వుఁదే
టలు నునుగొప్పకొప్పున బెడంగగుపింఛము బెళుకుఁజూపులన్
నలలితమందరాద్రిధృతిసంపదయుం జెలువారుశౌరిమం
జులతరవేషమున్ వెదకి చూడఁగ నాకనుదోయి గోరెడిన్. 46

తా. పెద్దజుట్టు గలిగినదియు, నెమ్మిపురిని తలఁదాల్చినదియు, కదలుచున్నకన్నులుగలదియు, సొగసైన మోవి గలదియు, తీయనిచిఱునవ్వు గలదియు, అలసమై గంభీరమైన విలాసము గలదియు నగుకృష్ణుని ముద్దువేసమును నాదృష్టి వెదకుచున్నది.

శ్లో. బహుళజలదచ్ఛాయాచోరం విలాసభరాలసం
మదశిఖిశిఖాలీలోత్తంసం మనోజ్ఞముఖామ్బుజమ్,

కమపి కరుణాపాఙ్గోదగ్రప్రసన్నజగజ్జడం
మధురిమపరీపాకోద్రేకం వయం మృగయామహే. 47

టీ. బహుళ...చోరమ్ = మేఘపటలముయొక్క కాంతిని దొంగిలించునదియు, విలాసభరాలసమ్=సోయగపుబరువుచే మందమైనదియు, మద...త్తంసమ్=మదించిన నెమ్మిపురిని సొగసునకై తలఁదాల్చినదియు, మనోజ్ఞ...జమ్=సొంపైన మోముదామర గలదియు, కరుణా...జడమ్=దయతోడి వాలుఁజూపులచే మిగుల చైతన్యము నొందింపఁబడినలోకముయొక్క మూఢభావముగలదియు, కమపి=అనిర్వాచ్యమైన, మధు...ద్రేకమ్ = చక్కఁదనముయొక్క పరిణామముయొక్క విజృంభణమును, వయమ్=మేము, ఆరాధ్నుమః=సేవించెదము.

మ. తనకారుణ్యకటాక్షవీక్షణముచేఁ ద్రైలోక్యజాడ్యంబు లె
ల్ల నివర్తింప మనోహరాననముతో లావణ్యవేషంబుతో
ఘనధారాధరకాంతితో శిఖిశిఖాకర్ణావతంసంబుతో
నను వై యుఁడెడివాని నారయుచు నుద్యత్ప్రీతి సేవించెదన్. 47

తా. మేఘపటలమును మీఱు నల్లనిరంగుగలదియు, మిక్కిలి యొయ్యారముచే మందమైనదియు, నెమ్మిపురిని తలఁదాల్చినదియు, సొంపైన మోముఁదామరగలదియు, దయతోడి క్రేగంటిచూపులచే లోకములశోకమును బాపుచున్నదియునగు వర్ణింపరాని యొకవిలాసపరమావధిని మేము వెదకుచున్నారము.

శ్లో. పరామృశ్యం దూరే పరిషది మునీనాం వ్రజవధూ
దృశాం దృశ్యం శశ్వత్త్రిభువనమనోహారివపుషమ్,
అనామృశ్యం వాచా మనిదముదయానా మపి కదా
దరీదృశ్యే దేవం దరదళితనీలోత్పలనిభమ్. 48

టీ. మునీనామ్=ఋషులయొక్క, పరిషది=సమూహమునందు, దూరే=దూరమందు, పరామృశ్యమ్ = వెదకఁదగినవాఁడును, వ్రజవధూదృశామ్=గోపాంగనల చూడ్కులకు, దృశ్యమ్=(సుఖముగా) చూడఁదగినవాఁడును, శశ్వత్=ఎప్పుడును, త్రిభువనమనోహారివపుషమ్=ముల్లోకములకు నానందకరమైనదేహముగలవాఁడును, అనిదమ్ముదయానామ్=పుట్టుక తెలియరాని (అపౌరుషేయములయిన), వాచామపి=వేదవేదాంతములకును, అనామృశ్యమ్ = కనఁగొనరాని, దర...నిభమ్=కొంచముగాఁ బూచిన నల్లకలువతో సాటియగు, దేవమ్=కృష్ణస్వామిని, కదా=ఎప్పుడు, దరీదృశ్యే=చూడఁగలనో?

మ. మదిలో నిల్పెద గోపికానయనపద్మశ్రేణి కెల్లప్పుడుఁ
విదితం బై మునినాయకాగ్రసభ కన్వేషింపఁగా దూరమై

యిద మిత్థం బని వేదపాళి కను పై నెంచఁగ బఱించఁగ మొదల్
తుద లేనట్టినవోత్పలాభ మగువస్తుఁగ మోహనాకారమున్. 48

తా. ముని మనస్సులకు దూరమైన గొల్లకాంతలకుమాత్రము కన్నుల యెదుట నుండువాఁడును, ముల్లోకములను మోహింపఁజేయురూపముగలవాఁడును, వేదవేదాంతములకుఁగూడఁ జెప్పనలవిగాని విభవముగలవాఁడును, అఱవీడినకలువవలె నల్లనైన గోపాలకృష్ణు నెప్పుడు చూడఁ గలుగుదునో యని చిత్తము తొందరపడుచున్నది.

శ్లో. లీలాననామ్బుజ మధీర ముదీక్షమాణం
నర్మాణి వేణువివరేషు నివేశయన్తమ్,
డోలాయమాననయనం నయనాభిరామం
దేవం కదాను దయితం వ్యతిలోకయిష్యే. 49

టీ. లీలాననామ్బుజమ్=విలాసయుక్తమైన మోముదమ్మిగలవాఁడును, అధీరమ్=బెదరినట్లు, ఉదీక్షమాణమ్=చూచుచున్నవాఁడును, వేణువివరేషు=పిల్లఁగ్రోవిరంధ్రములయందు, నర్మాణి=(గొల్లచెలువల) పరిహాసములను, లేక, కేళీరహస్యములను, నివేశయన్తమ్=చేయుచున్నవాఁడును, డోలాయమాననయనమ్=ఉయ్యెలవలెఁ గదలునేత్రములుగలవాఁడును, నయనాభిరామమ్=కనులకింపైన, దయితమ్=(అన్నిటికంటె) ప్రియుఁడైన, దేవమ్=శ్రీకృష్ణస్వామిని, కదాను=ఎప్పుడు, వ్యతిలోకయిష్యే=చూడఁగలనో?

ఉ. ఏతఱిఁ జూచి మ్రొక్కఁ గల నేతఱిఁ జూచు నతండు నన్ సరో
జాతమృదుస్మితాననునిఁ జంచలలోచను వేణుగీతసం
కేతముచేత గోపికలఁ గేళికినై జతగూర్చు నేర్పరిన్
నూతనపంచసాయకమనోహరమూర్తినిఁ గంటి కింపుగన్. 49

తా. శృంగారముతోఁగూడిన ముఖముగలిగి చపలముగాఁ జూచుచు, పిల్లఁగ్రోవి నూఁదుటలో గోపికలను బరిహాసముచేయుచు కన్నులను రమణీయముగాఁ ద్రిప్పుచున్నయానందదాయకుఁ డగు శ్రీకృష్ణస్వామిని నే నెప్పుడు చూతునో?

శ్లో. లగ్నం ముహు ర్మనసి లమ్పటసమ్ప్రదాయి
లేఖావిలేఖనరసజ్ఞమనోజ్ఞవేషమ్,
లజ్జన్మృదుస్మితమధుస్నపితాధరాంశు
రాకేన్దులాలితముఖేన్దు ముకున్దబాల్యమ్. 50

టీ. లేఖా... వేషమ్=చిత్తరువు వ్రాయువారలకు మనోహరమైన వేషముగలదియు, లజ్జ...రాంశు=బయలు వెడల జంకుచున్న పిన్ననవ్వనెడి తేనచేఁ దడుపఁబడిన పెదవియొక్క కాంతిగలదియు, రాకేన్దులాలితముఖేన్దు=పూర్ణిమనాఁటి చంద్రునిచే నూడిగము సేయఁబడిన ముఖచంద్రుఁడు గలదియు నగు, ముకున్దబాల్యమ్=కృష్ణునిపసితనము, ము

హుః=మాటికి, అప్పటసమ్ప్రదాయి=తగులమును గలిగించుచున్నదై, మవసి=నాచిత్తము, లగ్నమ్=తగులుకొన్నది.

ఉ. సన్నపునవ్వు నిప్పటిలుచందురకావి మెఱుంగు మోవియుం
బున్నమచందమామ రొయెఱపుగ నగుమోమును ముద్దుగుల్కులీ
లన్నెలవైన మోహనవిలాసముఁ గాంచినగోపవేషనం
పన్నుని చిన్నప్రాయ మెదఁ బాయక వ్రాసినయట్టు లుండెడున్. 50

తా. చిత్రకారుల కనువైనదియు, లజ్జతోఁగూడిన చిఱునగువసెడి యమృతమును స్రవించు చక్కని మోవిగలదియు, పూర్ణచంద్రునిచే సేవింపఁదగిన ముఖముగలదియు నగు శ్రీకృష్ణుని శైశవము మరులు గొలుపుచు నామనస్సును విడువకున్నది.

శ్లో. అహిమకరకరనికరమృదుమృదితలక్ష్మీ
సరసతరసరసిరుహసదృశదృశి దేవే,
వ్రజయువతిరతికలహవిజయినిజలీలా
మదముదితవదనశశిమధురిమణి లీయే. 51

టీ. అహిమ...దృశి=సూర్యకాంతి పుంజములచేఁ బూచిన తామరతో సమానమైన నేత్రములు గలవాఁడును, వ్రజ...మణి=గోపాంగనల సురతమందలి ప్రణయకలహములలో గెలుపు నొందిన తనవిలాసముచే మదించి సంతోషించిన ముఖచంద్రుఁడుగలవాఁడునగు, దేవే=శ్రీకృష్ణదేవునియందు, లీయే=లీనమయ్యెదను.

చ. రతికలహమ్మునఁ సతులరాయిడిఁ జేసి జయించి మించును
ద్ధతి గనిపించులేనగవు నందము గుల్కెడుమోముఁదమ్మిచే
నతులవిభాతభానుకిరణాప్తివికస్వరభాస్వరాంబుజా
యతనయనద్వయిం జెలఁగునామధురద్యుతి లీన మయ్యెదన్. 51

తా. రతికలహమున జయముఁ గాంచిన ఠీవిని దోఁపఁజేయుచిఱునగవుగలవాఁడును, ప్రభాతసూర్యుని కిరణములచే వరవిడిన తామరల సొంపు గలకన్నులు గల, శ్రీకృష్ణస్వామియందు లీనుఁడ నయ్యెదను.

శ్లో. కరకమలదరదళితలలితతరవంశీ, కలనినదగళదమృతఘనసరసి దేవే
సహజరసభరభరితదరహసితవీథీ, సతతవహదధరమణిమధురిమణిలీయే.

టీ. కర...సరసి=కేలుదామరచేఁ గొంచెముగాఁ దెఱవఁబడిన మిగులసుందరమైన వేణువుయొక్క మనోహరధ్వనినుండి కాఱునమృతమునకు గొప్పబావియైనవాఁడును, సహజ...మణి=సాజమైన రుచియొక్క గొప్పతనముచే నిండినమందహాసపంక్తులను విడలేక తాల్చుచున్న కెంపువంటిమోవియొక్క తియ్యఁదనముగల, దేవే=శ్రీకృష్ణదేవునియందు, లీయే=లీనుఁడయ్యెదను.

చ. లలితకరాంగులీదళదళన్మురళీమధురస్వరామృతో
జ్జ్వలసరసీ మనోజ్ఞనవహాజస్మితకందళచంద్రచంద్రికా
వలదరుణాధరోష్ఠమధువాసితచారుముఖాంబుజంబునం
దోలఁగక నాదుమానసమధువ్రత మియ్యెడ లీన మయ్యెడిన్. 52

తా. చేతివ్రేళ్లచేఁ గొంచెముగాఁగదలింపఁబడిన సొగసైనపిల్లఁగ్రోవి మధుర ధ్వనినుండి వచ్చునమృతమునకు బావి యగువాఁడును, స్వాభావికముగానే మిగుల రుచిగలచిఱునవ్వులధారల సెడలేక తాల్చుకెంపుమోవిమాధుర్యము గలశ్రీకృష్ణుని యందు లీనుఁడయ్యెదను.

శ్లో. కుసుమశరశరసమరకుపితమదగోపీ
కుచకలశఘుసృణరసలసదురసి దేవే,
మదలులితమృదుహసితముషితశశిశోభా
ముహురధికముఖకమలమధురిమణి లీయే. 53

టీ. కుసుమ ..రసి=మన్మథయుద్ధములయందు కోపముఁ బూని పైకొనిన గొల్ల తలచనులయందలి కుంకుమపూఁతలచే మెఱయు ఱొమ్ముగలవాఁడును, మద...మణి= ఉద్రేకముచే వెడలు చిఱునగవుచేత జయింపఁబడిన చంద్రకాంతిచే మాటికి నెక్కు డగుచున్న మోముఁదామర కమ్మఁదనముగల, దేవే=కృష్ణునియందు, లీయే = లీనుఁడ నయ్యెదను.

ఉ. పువ్వుల రువ్వఁగా నలుకఁ బూనినవల్లవపల్లవాధరల్
గ్రొవ్వున అవ్వ మీఱఁ జనుగుత్తుల నొత్తినకుంకుమం బెదఱ
నివ్వటిలన్ శశాంకుజిగినీటుల తేటలఁ గొల్లలాడులే
నవ్వులగోముమోమునఁ గనం దగునందకుమారుఁ బొందెదన్. 53

తా. మదనక్రీడలయందు గోపికలు పైఁబడి క్రమ్మఁగా నంటి కుంకుమను ఱొమ్మునఁ దాల్చినవాఁడును, యౌవనోద్రేకముచేఁ బుట్టి చంద్రకాంతి నధఃకరించు చిఱునవ్వుచే మఱింత యెక్కుడైన యానందము గలముఖముచేఁ జూడ నొప్పుకృష్ణుని లోఁ గలయఁగోరెదను.

శ్లో. ఆనమ్రా మసితభ్రువో రుపచితా మక్షీణపక్ష్మాఙ్కురే
ష్వాలోలా మనురాగిణో ర్నయనయో రార్ద్రాం మృదా జల్పితే,
ఆతామ్రా మధరామృతే మదకలా మమ్లానవంశీరవే
ష్వాశాస్తే మమ లోచనం వ్రజశిశో ర్మూర్తిం జగన్మోహినీమ్. 54

టీ. మమ=నాయొక్క, లోచనమ్=నేత్రము, అసితభ్రువోః=నల్లని కనుబొ మలయందు, ఆనమ్రామ్=కొంచెమువంగినదియు, అక్షీ...రేషు=మెండైన మొలకలఁ

బోలు రెప్పవెండ్రుకలయందు, ఉపచితామ్=వృద్ధి నొందినదియు, అనురాగిణోః=ప్రేమగల, నయనయోః=కనులయందు, ఆలోలామ్=అంతట చపలమైనది, మృదౌ=తిన్ననైన, జల్పితే=వాక్కునందు, ఆర్ద్రామ్=సిక్తమైనదియు, అధరామృతే=మోవితేనెయందు, ఆతామ్రామ్=అంతట ఎఱ్ఱనైనదియు, అమ్లానవంశీరవేషు=పుష్కలమైన వేణుగానములయందు, మదకలామ్=మదముచే నవ్యక్తమధురమైనదియు, జగన్మోహినీమ్=ముల్లోకములను మోహపెట్టుచున్న, వ్రజశిశోః=గోపాలబాలునియొక్క, మూర్తిమ్=దివ్యమంగళవిగ్రహమును, ఆశాస్తే=కోరుచున్నది.

ఉ. గాంచుట యెన్నఁ డీక్షణసుఖంబుగఁ దొంగలిఱెప్పలుర్ బనా
యించినవింటివంటిబొమ లిం పగుమాటలు కెంపుమోవిఁ బొం
దించినపిల్లఁగ్రోవిఁ బలికించుహళాహళియుర్ దయోన్నతిర్
మించినవెళ్కుఁజూపుఁ గలమిక్కిలిచక్కనిముద్దుబాలకున్. 54

తా. కనుబొమలయందు కొంచెము వంగినదియు, ఱెప్పలయందు బలిసినదియు, దయారస మొలుకుకన్నులలో చంచలమైనదియు, తిన్ననిమాటలయందు ఆర్ద్రమైనదియు, మోవితేనియయం దెఱ్ఱనైనదియు, పొలివోని వేణుగానమున గరువముతోఁ గూడినదియు, జగన్మోహనమైనయాగొల్లపిల్లనిరూపు నాకనులయెదుట కానఁబడుఁగాక.

శ్లో. తత్కైశోరం తచ్చ వక్త్రారవిన్దం, తత్కారుణ్యం తే చ లీలాకటాక్షాః,
తత్సౌన్దర్యం సా చ మన్దస్మితశ్రీః, సత్యం సత్యం దుర్లభం దైవతేషు.

టీ. తత్=ఆ, కైశోరమ్=పిన్నతనమును, తత్=ఆ, వక్త్రారవిందం చ=మోముదమ్మియు, తత్=ఆ, కారుణ్యం=ప్రేమయు, తే చ=ఆ, లీలాకటాక్షాః=విలాసపుఁజూపులును, తత్=ఆ, సౌన్దర్యమ్=సొగసును, సా=ఆ, మన్దస్మితశ్రీశ్చ=చిఱునగవుసంపదయు, దైవతేషు=ఇతరదైవములయందు, దుర్లభమ్=దొరకునదిగాదు, సత్యమ్ సత్యమ్=నిజము నిజము.

శా. ఆకారుణ్యకటాక్షవీక్షణము లాయందంపులేఁబ్రాయ మా
యాకారద్యుతి యాదరస్మితముతీ రామోముచక్కందనం
బాకెంజాయపదంబు లానడలయొయ్యారంబు లేవేల్పులం
దేకాలంబున లేదు లేదనుచు నే నెందేనిఁ జాటించెదన్. 55

తా. ఆ బాల్యమును, ఆ ముఖవిలాసము, ఆప్రీతియు, ఆ సొగసుఁజూపులును, ఆయందము, ఆనగవుసొబగును, కృష్ణునియందుఁదక్క నన్యదేవతలయం దెందేని దొరకవు. నిజము.

శ్లో. విశ్వోపప్లవశమనైకబద్ధదీక్షం విశ్వాసస్తబకితచేతసాం జనానామ్,
పశ్యామః ప్రతినవకాన్తికన్దళార్ద్రం పశ్యామః పథిపథి శైశవం మురారేః.

టీ. విశ్వాస...తసామ్=(కృష్ణుఁడే మోక్షప్రదుఁడు అను) నమ్మకముచేత గుత్తులుగలదిగాఁ జేయఁబడిన మనస్సుగల, జనానామ్=మనుజులయొక్క, విశ్వో...దక్షమ్=ఎల్లసంకటములఁబాపుటయందు దీక్షఁబూనినదియు, ప్రతి ..శార్ద్రిమ్=క్షణక్షణమునను క్రొత్తదిగా నగపడుచున్న ప్రభాంకురములచేఁ దడుపఁబడునదియు నగు, మురారేః=శ్రీకృష్ణుని, శైశవమ్=బాల్యము, పథిపథి=ప్రతిమార్గమందును,పశ్యామః=చూచెదము, పశ్యామః=చూచెదము.

మ. నుతధారాధరకాంతికందళము కన్నుల్ చల్లఁ జేయఁగ నమ
గ్రతరాతంకపరంపరాళముద్దీర్చఁగ దేహముల్ వజ్రకా
యతఁ గాంచఁగ నెఱనమ్మినట్టిప్రజ కత్యానంద మా దేవకీ
సుతునొయ్యారపుబాలలీలఁ గనవచ్చుఁగ నాదుదృగ్వీథులన్. 56

తా. భక్తి విశ్వాసములు గలవారికి సర్వోపద్రవములను నశింపఁజేసి మంగళము నిచ్చునదియు, ఎప్పటికప్పుడు క్రొత్తదిగా నగపడుకాంతిపూరము గలదియు నగు శ్రీకృష్ణునిబాల్యమును ప్రతివీథియందును నా కగపడుఁగాక.

శ్లో. * మౌళి శ్చన్ద్రకభూషణా మరకతస్తమ్భాభిరామం వపు
ర్వక్త్రం చిత్రవిముగ్ధహాసమధురం బాలే విలోలే దృశౌ,
వాచ శ్శైశవశీతలా మదగజశ్లాఘ్యా విలాసస్థితి
ర్మన్దం మన్ద మయే! క ఏష మధురావీథీ మితో గాహతే. 57

టీ. మౌళిః=సిగ, చంద్రకభూషణా=నెమ్మిపురిసొమ్ముగాఁగలది, వపుః=ఒడలు, మరకతస్తమ్భాభిరామమ్=ఇంద్రనీలపుకంబమువలె సొగసైనది, వక్త్రమ్ = మోము, చిత్ర...మధురమ్=ఆశ్చర్యమై సుందరమైన నవ్వుచేఁ జూడఁదగినది, దృశౌ=చూపులు, విలోలే=చంచలములు, వాచః=మాటలు, శైశవశీతలాః=పసితనముచే ముగ్ధములయినవి, విలాసస్థితిః = శృంగారపురీతి, మదగజశ్లాఘ్యా = మదపుటేనుఁగులచేఁ గొనియాడఁదగినది, మన్దం మన్దమ్= మెల్ల మెల్లఁగా, మధురావీథీమ్=మధురాపట్టణపుఁ దోవను, ఇతః=ఇటనుండి, గాహతే=ప్రవేశించుచున్నాఁడు. అయే బాలే = ఓపడుచా! ఏషః=ఈ సొగసుకాఁడు, కః=ఎవఁడు ?

ఉ. మౌళితటిఁ ఘటించినసమంచితపింఛము మందహాసముఁ
లోలవిశాలలోచనములుం జిఱునవ్వును ముద్దుమాటలుఁ
నీలపుడాలు నేలుమెయిసిగ్గులుఁ గల్గినబాలుఁ డెవ్వఁడో
వ్రాలెడు వీనిఁ జూడను మధురాపురవీథులఁ బాటలాధరా. 57

* ఇట్లు గుఱుతు చేయఁబడినది ప్రక్షిప్తమని తెలియనగును.

తా. పిల్లా! తలయందు నెమ్మిపురి గలదు. ఇంద్రనీల స్తంభమువంటి శరీరము. సొగసుగా నవ్వుచున్నాఁడు. చూపులు చపలములు. మాటలు బాల్యముచే ముగ్ధములు. విలాసపురీతి పదపు టేనుఁగుచే మెచ్చుకోఁదగినది. ఈ పైపున మధురాక్షరిలోఁ దూరుచున్నాఁడు. ఈ యందగాఁ డెవఁడే?

శ్లో. పాదౌ పాదవినిర్జితాంబుజవనౌ పద్మాలయాలంకృతౌ
పాణీ వేణువినోదనప్రణయినౌ పర్యాప్తశిల్పశ్రియౌ,
బాహూ దోహదభాజనం మృగదృశాం మాధుర్యధారా గిరో
వక్త్రం వాగ్విభవాతిలఙ్ఘిత మహో! బాలం కిమేతన్మహః. 58

టీ. పాదౌ=పాదములు, పాద...వనౌ = వాలపపాలుచే నోడింపఁబడిన తామరతోఁటలుగలవి, పద్మా...కృతౌ=లక్ష్మిచే నలంకరింపఁబడినవి, పాణీ=చేతులు, వేణు...యినౌ=పిల్లఁగ్రోవిని మ్రోగించుటయందు మక్కువగలవి, పర్యాప్తశిల్పశ్రియౌ=పూర్ణమైనపనితనముగలవి, బాహూ=భుజములు, మృగదృశామ్ = స్త్రీలకు, దోహదభాజనమ్=అకాలమందె (బాల్యమందు) ప్రౌఢలనుజేయు విద్యకు నెలవైనవి, గిరః=మాటలు, మాధుర్యధారాః=తేనెతేఁగలు, వక్త్రమ్=మోము, వాగ్విభవాతిలఙ్ఘితమ్=మాటలచమత్కారముయొక్క అతిశయము గలది, అహో=ఔరా, బాలమ్=శిశుత్వమును వహించిన, ఏతత్=ఈ, మహః=వెలుఁగు, కిమ్=ఏమగునో?

చ. చెలువల కెల్ల దోహదము నేయుకరంబులు లచ్చి శాకరం
బులు జితపద్మముల్ చరణముల్ మురళీరచనాచమత్క్రియా
కలితము కేలుఁదమ్మి ముఖకాంతులు వింతలు తేనె లూరుమా
టలు గలయట్టి శైశవవిడంబన తేజ మి దేమి చిత్రమో. 58

తా. పాదములా శమయొక్క లేశముచేతనే తామరలను జయించి, లక్ష్మినివాసములైనవి. చేతులు వేణుగానము నేయుచుండును. చేతిపనులలోఁ గడనగలవి. భుజములు కామినీ దోహదప్రదములు. మాటలు తేనెలే. మొగము మాటలనీటుచే మిన్నందినది. అద్దిరా! శిశురూపమైనయీ తేజమే మై యుండునో?

శ్లో. బర్హం నామ విభూషణం బహుమతం వేషాయ శేషైరలం
వక్త్రం ద్విత్రవిశేషకాన్తిలహరీవిన్యాసధన్యాధరమ్,
శీలైరల్పధియామగమ్యవిభవైః శృఙ్గారభఙ్గీమయం
చిత్రం చిత్ర మహో విచిత్ర మహహో చిత్రం విచిత్రం మహః.

టీ. వేషాయ=అలంకరించుకొనుటకు, బర్హం నామ=నెమిలిపురియను, విభూషణమ్=సొమ్ము, బహుమతమ్=మిక్కిలి ప్రియమైనది, శేషైః=ఇతరములైన యొడుపుల చేత, అలమ్=చాలును వక్త్రమ్=మొగము, ద్విత్ర...రమ్=రెండుమూఁడు చుక్క

బొట్టులయొక్క కాంతిప్రవాహముచే నొప్పియున్న మోవిగలది. అల్పధియామ్=మంద బుద్ధులకు, అగమ్యవిభవైః= తెలిసికొనఁ దరముకాని విలాసములుగల, శీలైః=స్వభావముల చేత, శృఙ్గారభఙ్గీమయమ్=శృంగారరీతులచే ప్రచురమైనది, చిత్రంచిత్రమ్=మిగుల నబ్బురము, అహో=ఔరా, విచిత్రమ్=అత్యాశ్చర్యము, అహహో = అయారె, మహః=ఈతేజము, చిత్రమ్=ఆశ్చర్యమయినది, విచిత్రం=మిగులనాశ్చర్యమైనది.

ఉ. సొమ్ములు మేని కందమువి చూడక సింధమె పూని మోముపైఁ
గమ్మనిబొట్లు దొంతరలుగా విలసిల్లఁగఁ గావిమోవిచె
ల్వమ్ము రసోత్తరంగవిభవమ్ము నగమ్యము నై తనర్పఁ జి
త్రమ్ము కపాటివారికిఁ దరంబె నుతింప నోయారి తేజమున్. 59

తా. ఒక కెమ్మిపురిమె చాలు. వేఱు సొమ్ములేల? ముఖము, ఒకటివెంట నొకటి కందుమూఁడు చుక్కబొట్టులుగలిగి యెఱ్ఱనిమోవిచే నందమైనది. మంద బుద్ధుల కందరాని ప్రౌఢవిలాసములు గలయీతేజము మిగులఁ జిత్రమై యున్నది.

శ్లో. అగ్రే సమగ్రయతి కామపి కేళిలక్ష్మీ
మన్యాసు దిక్ష్వపి విలోచన మేవ సాక్షి,
హాహన్త హస్త మథ దూర మహో కిమేత
దాసీ త్కిశోరమయ మమ్బ! జగత్త్రయం మే. 60

టీ. అగ్రే=ముందట, కామపి = చెప్పవలవికాని, కేళిలక్ష్మీమ్=ఆటసొబగును, సమగ్రయతి=నింపుచున్నది. అన్యాసు = ఇతరములైన, దిక్ష్వపి=దిక్కులయందును, విలోచనమేవ=నేత్రమే, సాక్షి=సాక్షి. హాహన్త = అయ్యయ్యో, అథ=చేజాఁపిన వెనుక, హస్తమ్=చేయి, దూరమ్=దూరమందున్నది. అహో=అబ్బో, ఏతత్=ఇది, కిమ్=ఏమో, అమ్బ=అమ్మా, మే=నాకు, జగత్త్రయమ్ = ముల్లోకములు, కిశోరమయమ్=గోపబాలమయములై కనిపించుచున్నవి.

శా. చూడం జూడ మనోహరాకృతి కడుంజోద్యంబుగా బాలకుం
డాడున్ ముందటఁ గౌఁగిలింతు నని డాయం జిక్కఁ డారీతినే
క్రీడించున్ దిశలందు సందులకు నక్షిద్వంద్వమే సాక్షి యీ
జాడన్ ముజ్జగ మంబ! బాలమయ మాశ్చర్యంబు నాకెంతయున్. 60

తా. ముందటఁ గానఁబడును; గాని చేతులు జాఁచిన దొరకఁడు. అట్లే ఎల్ల చోటులయందు నెక్కడఁజూచినను అగపడును. చేతికందఁడు అనుటకు నానేత్రమే సాక్షి. అయ్యయ్యో! యిదియేమివింత! ముల్లోకముల నెక్కడఁజూచినను గోపబాలుఁడే యగపడుచున్నాఁడు గదా!

శ్లో. చికురం బహుళం విరళం భ్రమరం
మృదులం వచనం విపులం నయనమ్,
అధరం మధురం వదనం లలితం
చపలం చరితఞ్చ కదాఽనుభవే. 61

టీ. బహుళమ్=సాంద్రమైన, చికురమ్=జుట్టును, విరళమ్=పలచనైన, భ్రమరమ్=ముంగురులను, మృదులమ్=కోమలమైన, వచనమ్ = మాటను, విపులమ్=గొప్పదైన, నయనమ్=నేత్రమును, మధురమ్ = తీయనైన, అధరమ్ = మోవిని, లలితమ్=సొంపైన, వదనమ్=మోమును, చపలమ్ = (గోపికలయందు) లోలమైన, చరితమ్=నడవడిని, కదాను=ఎప్పుడు, అనుభవే=అనుభవింతునో?

ఉ. వెన్నెల గోపకాంతలను వేడుకఁ గోరెడు చాపలంబుతోఁ
గన్నులబెళ్కుతో నగుమొగంబున వ్రాలుచలాలకాళితోఁ
దిన్ననిపల్కుతో ముడిచి దిద్దినగొప్పశిరోజపాళితో
నెన్నఁడు నాదు మ్రోలఁ జరియించునొ వెన్నుఁడు కావిమోవితోన్.

తా. శ్రీకృష్ణుని దట్టపుజుట్టును పలుచని జులుపాలను, నెమ్మదిమాటలను, పెద్దకన్నులను, తీయనిమోవిని, అందమైన మొగమును, లోలమైన చరిత్రమును ఎప్పుడనుభవింతునోకదా!

శ్లో. పరిపాలయ నః కృపాలయే త్యసకృ జ్జల్పిత మాత్మబాన్ధవః,
మురలీమృదులస్వనాన్తరే విభు రాకర్ణయితా కదాను నః. 62

టీ. ఆత్మబాంధవః=నాచుట్టమగు, విభుః=ఏలికయగు శ్రీకృష్ణస్వామి, హేకృపాలయ=దయకు నెలవైనయోయయ్యా, నః=నన్ను, పరిపాలయ=రక్షింపుము. ఇతి=అని, అసకృత్=పలుమాఱు చేయఁబడిన, జల్పితమ్=మొఱను, మురళీమృదులస్వనాన్తరే=పిల్లఁగ్రోవియొక్క మందధ్వనులనడుమ, కదాను = ఎప్పుడు, ఆకర్ణయితా=వినఁగలఁడో.

చ. నిరుపమవేణుగానమహనీయసుఖానుభవైకమగ్నతం
గరఁగి పరాకుఁ గైకొనినకంజదళాక్షుఁడు తృప్తచిత్తుఁడై
నిరతము నన్నుఁ గావు నవనీతహరా యని మాటిమాటికిన్
మొఱ యిడునట్టి నావచనముల్ దయతో నెపు డాలకించునో. 62

తా. వేణుగానపరవశుఁడైన శ్రీకృష్ణస్వామి, ఆర్తుఁడనై, 'తండ్రీ నన్నుగావు' మను నా మొఱ నెప్పు డాలకించునో!

శ్లో. కదాను కస్యాం నువిపద్దశాయాం
కైశోరగన్ధిః కరుణామ్బుధి ర్నః,

విలోచనాభ్యాం విపులాయతాభ్యాం
వ్యాలోకయిష్య న్విషయీకరోతి. 63

టీ. కదానః=ఎప్పుడు, కస్యామ్=ఏ, విపద్దశాయాంను=ఆపత్సమయమందు, కైశోరగన్ధిః=బాల్యగంధముగల, కరుణామ్బుధిః=దయాసముద్రుఁడు(శ్రీకృష్ణుఁడు), నః=మములను, విపులాయతాభ్యామ్=విస్తారములై దీర్ఘములైన, విలోచనాభ్యామ్=కనులతో, వ్యాలోకయిష్యన్=చూడఁగోరినవాఁడై, విషయీకరోతి=గోచరముగాఁ జేయునో?

చ. ఒకపలనంతఁ జింతిలుచు నుండెడినన్ను శిశుత్వగంధమా
త్రకలితయావనంబు దనరం గరుణావరుణాలయుండు వా
యక శతపత్రపత్రవిపులారుణలోచనలీలఁ జూచుచూ
డ్కికిఁ దగు వీఁ డటంచుఁ బరికించుట లెన్నఁడు గల్గనేర్చునో. 63

తా. దయానుయుఁడగు బాలగోపాలుఁడు మమ్ములను విశాల దీర్ఘ నయనముల తో నెప్పుడు కటాక్షింపఁదలఁచునో?

శ్లో. మధుర మధరబిమ్బే మఞ్జులం మన్దహాసే
శిశిర మమృతవాక్యే శీతలం దృష్టిపాతే,
విపుల మరుణనేత్రే విశ్రుతం వేణునాదే
మరకతమణినీలం బాల మాలోకయే ను. 64

టీ. అధరబిమ్బే=దొండపండును బోలు మోమున, మధురం=తీయనివాఁడును, మన్దహాసే=చిఱునవ్వునందు, మఞ్జులం=మనోజ్ఞమైనవాఁడును, అమృతవాక్యే=తేనె మాటలయందు, శిశిరం=మెల్లనివాఁడును, దృష్టిపాతే=చూపునందు, శీతలమ్=చల్లనివాఁడును, అరుణనేత్రే=ఎఱ్ఱనికంటియందు, విపులమ్=విస్తారమైనవాఁడును, వేణునాదే=పిల్లఁగ్రోవినూఁదుటలో, విశ్రుతమ్=పేరువడసినవాఁడును, మరక...నీలమ్=మరకతమణివలెనల్లనైన, బాలమ్=పిల్లవానిని, ఆలోకయేను=చూతునా?

ఉ. చల్లనివెల్గుఁజూపు సుధఁ జల్లెడుమాటలుఁ దియ్యమోవియున్
నల్లలితారుణద్యుతివిశాలవిలోచనముల్ మృదుస్మితో
త్ఫుల్లముఖాంబుజంబుఁ బరిపూరితవేణువినోదనాదమున్
నల్లనిమేనికాన్తియుఁ గునన్ విలసిల్లినబాలుఁ గాంచెదన్. 64

తా. పెదవియందు తీయనివాఁడును, నగవున సొంపైనవాఁడును, మాటలలో మెల్లనివాఁడును, చూపునఁ జల్లనివాఁడును, కనుల వెడఁదదై, పిల్లఁగ్రోవిపాటలో గడితేరినవాఁడును, మరకతప్రువన్నె గలవాఁడునగు బాలుని నెప్పుడైనఁ జూతునా?

శ్లో. మాధుర్యా దపి మధురం మన్మథతాతస్య కిమపి కైశోరమ్,
చాపల్యా దపి చపలం చేతో మమ హరతి హన్త కిం కుర్మః? 65

టీ. మాధుర్యాదపి=అందముకంటెను, మధురం=తీయనిదగు, మన్మథతాతస్య=మదనుని యబ్బయగుకృష్ణునియొక్క, కిమపి=చెప్పనలవికాని, కైశోరమ్=బాల్యము, చాపల్యాదపి=చంచలత్వముకంటెను, చపలమ్=చంచలమైన, మనః=నాయొక్క, చేతః=చిత్తమును, హరతి=హరించుచున్నది, హన్త=అయ్యో, కింకుర్మః=ఏమిచేయుదును?

ఉ. గబ్బిమెఱుంగుబోండ్లు తటకాపడి లోలతఁ జూచునంతలో
నిబ్బర మైనతత్తరము నెక్కొన నందము కన్న నంద మై
యబ్బుర మైనబాల్యమున నద్దిర యంగజుఁ గన్నతండ్రి యా
గుబ్బున నామదిం గలుగుగుట్టుఁ గలంచె నిఁ కేమి సేయుదున్. 65

తా. సౌందర్యమున కంటె సుందర మైన మన్మథునితండ్రి యగు కృష్ణుని బాల్యము చాపల్యముకంటె నింకను జపలమయిన నామనస్సును లాగికొనిపోవుచున్నది. అయ్యో! నేనేమి చేయుదును ?

శ్లో. వక్షఃస్థలే చ విపులం నయనోత్పలే చ
మన్దస్మితే చ మృదులం మదజల్పితే చ,
బిమ్బాధరే చ మధురం మురలీరవే చ
బాలం విలాసనిధి మాకలయే కదా ను. 66

టీ. వక్షఃస్థలే=ఱొమ్మునను, నయనోత్పలేచ=కన్నుఁదొగలయందును, విపులమ్=వెడలుపైనవాఁడును, మన్దస్మితేచ=చిఱునగవునందును, మదజల్పితేచ=మోహవాక్కులయందును, మృదులమ్=కోమలమయినవాఁడును, బిమ్బాధరేచ=దొండపండువంటి మోవియందును, మురలీరవేచ=పిల్లఁగ్రోవిమ్రోఁతయందును, మధురమ్=కమ్మనివాఁడును, విలాసనిధిమ్=సొబగులతావగు, బాలమ్=కుఱ్ఱని, కదాను=ఎప్పుడు, ఆకలయేను=చూతునో ?

మ. బళిరా కన్నులబెళ్కు ఱొమ్ముబిగి చెప్పన్ రాదు వేణుధ్వనుల్
దరమా యెంచఁగఁ గావిమోవిరుచి వింతల్ దేటలేనవ్వుని
గ్గులు మజ్జారె సుధామనోహరమృదూక్తుల్ హాయురే యిట్టియొ
ప్పాలకుప్పం దిలకించుభాగ్యమహిమంబుల్ మాకు నిం కెన్నఁడో. 66

తా. ఱొమ్మునను కనులయందును వెడఁదయైనవాఁడును, చిఱునగవునందును మదవాక్కులందును సుకుమారుఁడును, మోవియందును పిల్లఁగ్రోవిమ్రోఁతయందును మధురమయినవాఁడును, చక్కఁదనపునిక్క యగుబాలుని నే నెప్పుడు చూతునో?

శ్లో. ఆర్ద్రావలోకితదయాపరిణద్ధనేత్ర
మావిష్కృతస్మితసుధామధురాధరోష్ఠం,

ఆద్యం పుమాంస మవతంసితబర్హిబర్హ
మాలోకయన్తి కృతినః కృతపుణ్యపుఞ్జాః. 67

టీ. ఆర్ద్రా...నేత్రమ్=చల్లనిచూపులుగలిగి కరుణచే విపులమయిన కన్నులు గలవాఁడును, అని...ష్ఠమ్=వెలిపుచ్చఁబడిన చిఱునవ్వుదీనెలచేత మనోహరమయిన మోవిగలవాఁడును, అవతంసితబర్హిబర్హమ్=శిరమున నలంకరింపఁబడిన నెమ్మిపురి గలవాఁడును, ఆద్యమ్=మొదటివాఁడగు, పుమాంసమ్=పురుషుని, కృతపుణ్యపుఞ్జాః=చేయఁబడినపుణ్యరాశిగల, కృతినః=వెరువరులు, ఆలోకయన్తి=చూచుచున్నారు.

ఉ. అంచితు చింపు మోము దరహాససుధామధురాధరోష్ఠ ము
స్పందదయావలోకనవిశాలవిలోచనముల్ శిరంబునం
బొందుగ నెమ్మిపింఛము ను బూనినయాద్యుని దేవదేవునిన్
నందకుమారుఁ గాంతురు సనాతనపుణ్యమునన్ బుధోత్తముల్. 67

తా. దయార్ద్రములగు విశాలమయినకన్నులతోఁ జూచువాఁడును, వెలికుఱుకుచున్న నవ్వుచే నివ్వటిలు నధరము గలవాఁడును, నెమ్మిపురినిఁ దలఁ దాల్చినవాఁడు నగు పరమపురుషుని అనేకజన్మార్జితపుణ్యసంచయము గలధీరులు చూచెదరు.

శ్లో. మారః స్వయం ను మధురద్యుతిమణ్డలం ను
మాధుర్యమేవ ను మనోనయనామృతం ను,
వాణీమృజా ను మమ జీవితవల్లభో ను
బాలోఽయ మభ్యుదయతే మమ లోచనాయ. 68

టీ. స్వయమ్=తానైవచ్చిన, మారో ను=మన్మథుఁడా, మధుర...లం ను=చంద్రబింబమా! మాధుర్యమేవ ను=సౌందర్యమా! మనోనయనామృతం ను = మనస్సునకు కన్నులకు తృప్తిని చేయునమృతమా! వాణీమృజా ను=వాక్కులను శోధనము సేయు వస్తువా! మమ=నాయొక్క, జీవితవల్లభో ను=ప్రాణములకు రక్షకుఁడా! (ఎవఁడో కాని) అయమ్=ఈ, బాలః=పట్టిసు, మమ=నాయొక్క, లోచనాయ=నేత్రములకొఱకు, అభ్యుదయతే=పొడకట్టుచున్నాఁడు.

ఉ. మారుఁడొ కాక యంబునిధికుమారుఁడొ మానసలోచనామృతా
కారమొ మాధురీగుణవికారమొ మంజులవాక్ప్రమృక్క్రియా
సారమొ నాదుజీవమణిసారమొ లేక మ తేమి చిత్రమో
యీతఁడు బాలభావమున మెచ్చులు గుల్కెడు నాదుచూడ్కికిన్. 68

తా. మన్మథుఁడో, చంద్రుఁడో, లేక, సౌందర్యమే రూపముగ ధరించినదో, మనోనేత్రముల యమృతమో, వాక్కును పరిశుద్ధి చేయువస్తువో, నాప్రాణనాథుఁడో ఎవఁడో కాని యీబాలుఁడు అత్యంతమనోహరాకారుఁడై నా కగపడుచున్నాఁడు.

శ్లో. బాలోఽయ మాలోలవిలోచనేన వక్త్రేణ చిత్రీకృతదిఙ్ముఖేన,
వేషేణ ఘోషోచితభూషణేన ముగ్ధేన దుగ్ధే నయనోత్సవం నః. 69

టీ. అయమ్=ఈయగపడు, బాలః=కుఱ్ఱఁడు, ఆలోలవిలోచనేన=తిరుగుచున్న కన్నులు గలదియు, చిత్రీకృతదిఙ్ముఖేన=చిత్రపటములుగాఁ జేయఁబడిన దిగ్భాగములు గల, వక్త్రేణ=ముఖముచేతను, ఘోషోచితభూషణేన=గొల్లపల్లెకుఁ దగినయలంకారముచేత, ముగ్ధేన=సొంపగు, వేషేణ = వేషముచేతను, నః=మాకు, నయనోత్సవం=కనులపండువును, దుగ్ధే=ఇచ్చుచున్నాఁడు.

ఉ. ఎల్లెడఁ జిత్రరూపము వహించిన చక్కని మోముఁదమ్మితో
గొల్లవిలాసవేషమునకుం దగుసొమ్ములతోడఁ బల్పయో
జొల్లసదక్షిశీతలనమున్నతితో విలసిల్లు బాలకుం
డుల్లము పల్లవింప నయనోత్సవ మారఁ బరించు నెన్నఁడో. 69

తా. ఈలీలాగోపబాలుఁడు త్రిప్పఁబడు వెడఁదకన్నులుగలిగి ఎల్లదిశలను జిత్రింపఁబడినటుల పలుఁగుముఖముచేతను, గొల్లపల్లెకుఁ దగినయలంకారముల చేతను మా కనుల విందు చేయుచున్నాఁడు.

శ్లో. ఆన్దోళితాగ్ర భుజ మాకులనేత్రలీల
మార్ద్రస్మితార్ద్రవదనామ్బుజచన్ద్రబిమ్బమ్,
శిఞ్జానభూషణశతం శిఖిపిఞ్ఛమౌళిం
శీతం విలోచనరసాయన మభ్యుపైతి. 70

టీ. ఆన్దో...భుజం=కదలింపఁబడిన భుజాగ్రము గలదియు, ఆకులనేత్రలీలం=తిరుగుచున్న కనులసొంపుగలదియు, ఆర్ద్ర...మ్బమ్=మెఱుఁగునవ్వులచేఁ దడిసిన చంద్రునిబోలుమోముదమ్మి గలదియు, శిఞ్జా..శతం=మొరయుచున్న పలుసొమ్ములు గలదియు, శిఖ...మౌళిమ్=నెమ్మిపురినాదలఁదాల్చినదియు, శీతం=చల్లనగు, విలో...యనం=నేత్రములకు తియ్యనైన శ్రీకృష్ణుఁడను పదార్థము, అభ్యుపైతి=నా కెదురగుచున్నది.

ఉ. అందెలు మువ్వలుఁ మొరయ హస్తము లూఁపఁగఁ గంకణధ్వను
ల్సందడి జేయ నాననవిలాసము చందురుగేలి సేయ నా
నందవిశాలలోలనయనమ్ముబతో శిఖిపింఛమౌళితో
నందసుఁ డెందులోచనరసాయన మల్లదె వచ్చెఁ జల్లఁగన్. 70

తా. భుజశిఖరముల నుదికించుచు, కనులఁ ద్రిప్పుచు, చిఱునవ్వు నవ్వుచు, ఒడలిసొమ్ములను మ్రోయించుచు, నెమ్మిపురిని దాల్చి చల్లనియొకపదార్థము (శ్రీకృష్ణుఁడు) నా కెదురై కనులపండువు సేయుచున్నది.

శ్లో. పశుపాలబాలపరిషద్విభూషణం
శిశురేష శీతలవిలోలలోచనః,
మృదులస్మితార్ద్రవదనేన్దుసంపదా
మదయన్మదీయహృదయం విగాహతే. 71

టీ. పశుపాల...షణం=గోపబాలురగుంపునకలంకారమైనవాఁడును, శీతల... చనః=చల్లనిచపలములైన కన్నులుగల, ఏషః=ఈ, శిశుః=బిడ్డఁడు, మృదులస్మితార్ద్రవదనేన్దుసంపదా = కోమలమగు చిఱునవ్వుచే సరసమైన ముఖచంద్రునిసమృద్ధిచే, మదీయహృదయమ్=నామనమును, మదయన్ = మోహింపఁజేయుచు, విగాహతే= చొచ్చుచున్నాఁడు.

చ. వికవిక నవ్వుచున్ మకుట వ్రేలుకురుల్ మనుపాలబుగ్గలుం
జికిలిమెఱుంగుచూపు రహిఁ జెందఁగ నాననశీతలద్యుతిం
బ్రకటితగోపశాబకసభానవభూషణమై చెలంగుబా
లకుఁడు మదీయమానసతలంబున నిల్చెను సొంపు నించుచున్. 71

తా. గొల్లవారి సభల కలంకారభూతుఁడగు నీచెలువుఁజూపులకుఱ్ఱఁడు చక్కని మందహాసముచేతను, చందురునంటి నెమ్మోముసంపదచేతను నామనస్సును మోహింపఁ జేయుచు నందుఁ బ్రవేశించుచున్నాఁడు.

శ్లో. తదిద ముపనతం తమాలనీలం తరళవిలోచనతారకాభిరామమ్,
ముదితముదితవక్త్రచన్ద్రబిమ్బం ముఖరితవేణువిలాసజీవితమ్. 72

టీ. తమాలనీలం = చీఁకటికానుగుపలెనల్లనిదియు, తరళ...రామం=చపలములైన కనుఁబాపలచేనందమైనదియు, ముదిత...బిమ్బం = మిక్కిలి సంతోషించుచంద్రునివంటిమోముగలదియు, ముఖరిత ..వితం=మ్రోయింపఁబడిన పిల్లఁగ్రోవిసొంపునకుఁ బ్రాణపదమగు, తత్=ఆ, ఇదం=ఈతేజము, ఉపనతం=దొరకినది.

ఉ. నీలఘనాభ మయ్యు నతినిర్మలవేణునినాదజీవమై
లోలతటిల్లతాలలితలోచనతారకమై ప్రసన్నతో
ద్వేలముఖేందుమండలనవీనవిలాసకలాకలాపమై
బాలునిలీల వచ్చి కనుపట్టె మహాద్భుతతేజ మియ్యెడన్. 72

తా. చీఁకటికానుగుపలె నల్లనైనదియు, అందములై కదలు కనుఁబాపలచే రమ్యమైనదియు, నానందపూర్ణమైన చంద్రునివంటిముఖముగలదియు, మ్రోయుచున్న వేణుగానమునకుఁ బ్రాణతుల్యమైనయీ తేజము నాకన్నుల కగపడుచున్నది.

శ్లో. చాపల్యసీమ చపలానుభవైకసీమ
చాతుర్యసీమ చతురాననశిల్పసీమ,

సౌరభ్యసీమ సకలాద్భుత కేళిసీమ
సౌభాగ్యసీమ తదిదం వ్రజభాగ్యసీమ. 72

టీ. చాపల్యసీమ=చాంచల్యమునకుపొలిమేరయైనదియు, చపలా...సీమ=లక్ష్మీదేవి యనుభవమునకు ముఖ్యపునెలవైనదియు, చాతుర్యసీమ=నేరుపునకుఁ జోటైనదియు, చతురా...సీమ=బ్రహ్మయొక్క పనితనమునకు హద్దైనదియు, సౌరభ్యసీమ = పరిమళమునకుస్థానమైనదియు, సకలా..సీమ = ఎల్లచిత్రములకు క్రీడాస్థానమయినదియు, సౌభాగ్యసీమ=సౌందర్యనిధియు, వ్రజభాగ్యసీమ = గొల్లలయదృష్టఫలమునకుఁ బరమావధియగు, తత్=ఆతేజము (కృష్ణుఁడు), ఇదం=ఇదిగో. (అగపడుచున్నదనుట.

చ. కలిమినెలంతవేడుకలకందువవంటవిలోలవృత్తికిన్
నెలవు శుభాళి కాస్పదము నేర్పులపోవ్రజశిల్పికల్పనా
ఫల మతిచిత్రలీలలకుఁ బాళెము తావుల కెల్లఁ దావు గో
కులజనభాగ్యసీమ యిదిగో కనుఁగొంటిని గంటి కింపుగన్. 73

తా. చపలమును, లక్ష్మీనివాసస్థానమును, జాణతనమునకు నెలవైనదియు, బ్రహ్మశిల్పమునకుఁ బరమావధియు, సొబగులపుట్టయు, ఆశ్చర్యముల యిక్కయు, అందములతావును, గొల్లలయదృష్టఫలములకు స్థానము నైనయాతేజ మిదిగో అగపడుచున్నది.

శ్లో. మాధుర్యేణ ద్విగుణశిశిరం వక్త్రచన్ద్రం వహన్తీ
వంశీవీథీవిగళదమృతస్రోతసా సేచయన్తీ,
మద్వాణీనాం విహరణపదం మత్తసౌభాగ్యభాజాం
మత్పుణ్యానాం పరిణతి రహో నేత్రయో స్సన్నిధత్తే. 74

టీ. మద్వాణీనాం=నావాక్కులకు, విహరణపదం=విహారస్థానమును, మాధుర్యేణ=సౌందర్యముచేత, ద్విగుణశిశిరం=మిగులఁజల్లనైన (అనఁగా: మిక్కిలి యాహ్లాదముగలిగించు), వక్త్రచంద్రం=ముఖచంద్రుని, వహన్తీ=తాల్చుచున్నదై, వంశీ...స్రోతసా = పిల్లఁగ్రోవియొక్క (రంధ్ర) మార్గమునుండి జాఱునమృతప్రవాహముచేత, సేచయన్తీ=తడపుచున్నదియు, మత్త...భాజాం = మదించిన సంపదనుపొందిన, మత్పుణ్యానాం=నాపుణ్యములయొక్క, పరిణతిః=పరిపాకము, నేత్రయోః=కన్నులకు, సన్నిధత్తే=సమీపించుచున్నది.

శా. లావణ్యాంబుధిచంద్రబింబముఖలీలం దాల్చి వంశీనినా
దావిర్భూతసుధాప్రవాహమున నోలాడం బ్రవర్తిల్లు నా
దై వాకారము నావచోవిహారణస్థానంబు నాపుణ్యస
ద్భావం బారఁ బ్రసన్న మయ్యెను యశోదాపుత్త్రరూపంబునన్. 74

తా. తాపాపనోదకమైన మధురగుణముచే మతింత చల్లనైన మోముజాబిల్లి గలదియు, పిల్లఁగ్రోవి నాదమువలన వెలువడు నమృతంపుజాలుచే ముల్లోకములను వెల్లిగొలుపుచున్నదియు, నామాటలకుఁ గ్రీడాస్థానమును, మదించిన సంపద్యుక్తమైన నాపుణ్యములకు పరిపాకరూపమగు వస్తువు కనుల కగపడుచున్నది. అద్దిరా!

శ్లో. తేజసేఽస్తు నమో ధేనుపాలినే లోకపాలినే,
రాధాపయోధరోత్సఙ్గశాయినే శేషశాయినే. 75

టీ. ధేనుపాలినే = ఆవులఁ గాచునదియు, లోకపాలినే = లోకములఁ బ్రోచునదియు, రాధా...శాయినే = రాధకుచనులమిట్టునఁ బండినదియు, శేషశాయినే = శేషుని మూఁపునఁ బండునట్టి, తేజసే = వెలుఁగుకొఱకు, నమః = మ్రొక్కు.

ఉ. పాయనిభక్తి మ్రొక్కెద నపారకృపారసధేనుసౌఖ్యసం
ధాయికి లోకరక్షణవిధాయికి భాసురరాధికాకుచ
స్థాయికిఁ బన్నగాధిపవిశాలఫణామణిసౌధవీథికా
శాయికి గోపికానయనసారససారఫలప్రదాయికిన్. 75

తా. ఆవులఁ గాచునదియు, లోకములఁ బ్రోచునదియు, రాధచనులమిట్టునఁ బండునదియు, శేషునిమీఁదఁ బండునదియు నగు దివ్యతేజమునకే మ్రొక్కెదను.

శ్లో. ధేనుపాలదయితాస్తనస్థలీధన్యకుఙ్కుమసనాథకాన్తయే,
వేణుగీతగతిమూలవేధసే తేజసే తదిదమోం నమో నమః. 76

టీ. ధేను...కాన్తయే = ఆలకాపరుల యిల్లాండ్రయొక్క చనుకట్టులయందలి కృతార్థములైన కుంకుమపొడులలోఁ గలసిన రంగుగలదియు, వేణు...ధసే = పిల్లఁగ్రోవి పాటలనడకకు మూలబ్రహ్మమైనదియు నగు, తేజసే = వెలుతురుకొఱకు, తత్ = అ, ఇదం = ఈ, ఓంనమోనమః = ప్రణవపూర్వనమస్కారములు.

మ. పసిగాపుంజిగురాకుఁబోండ్లమెఱుఁగుంబాలిండ్లకాశ్మీరపు
న్రసముల్ జొబ్బిల నుబ్బి నిర్భరపరీరంభస్థితిం దెల్పు ను
ల్లసితం బై మురళీనినాదగతిమూలబ్రహ్మమై కంటె కిం
పొసఁగం జాలెడుమూర్తికిన్ మొగుడుఁగే లోంకారపూర్వంబుగన్.

తా. గొల్లకామినుల చనులపైకుంకుమచేఁ గలిసిన తననల్లనికాంతిగలదియు, వేణుగానరీతులకు ముఖ్యస్థానమును నగు తేజముకొఱకు కివియే ప్రణవపూర్వకములైన యనేకనమస్కారములు.

శ్లో. మృదుక్వణన్నూపురమన్థరేణ బాలేన పాదాంబుజపల్లవేన,
అనుక్వణన్మఞ్జులవేణుగీత మాయాతి మే జీవితమాత్తకేళి. 77

టీ. ఆత్తకేళి = పొందఁబడినవిహారములుగల, మే = నాయొక్క, జీవితం = ప్రాణము (అయిన కృష్ణుఁడు), మృదు...స్వరేణ = మెల్లగా మ్రోఁగునందెలచే మందమైనదియు, బాలేన = బాల్యదశయందున్న, పాదాంబుజపల్లవేన = చిగురుఁ బాదముచేత, అనుక్వణ...గీతం = అనుసరించి మ్రోయుచున్న సొంపైన వేణుగానము గలుగునట్లుగా, ఆయాతి = వచ్చుచున్నది.

ఉ. చల్లని వేణుగీతి కనుసారిగఁ దాళగతుల్ సెలంగ గల్
గల్లు రటంచు నందియలు గజ్జెలు నొక్కటఁ బిక్కటిల్లఁగాఁ
బల్లవకోమలాంఘ్రులను బాలకుఁ డాడుచుఁ బాడుచుండ నా
వేల్లితవృత్తి వచ్చెఁ గనువిందుగ జీవము వచ్చుకైవడిన్. 77

తా. అడుగోనఁబోయి వచ్చుచున్న నా ప్రాణసమమైన కృష్ణతేజము గల్లురని యందెలను మ్రోయించు చిగురుఁబాదములచిందుల కనుకూలముగాఁ బిల్లఁగ్రోవినూఁదుకొనుచు నాదెసకు వచ్చుచున్నది.

శ్లో. సోఽయం విలాసమురళీనినదామృతేన
సిఞ్చన్నుదఞ్చిత మిదం మమ కర్ణయుగ్మమ్,
ఆయాతి మే నయనబన్ధు రనన్యబన్ధు
రానన్దకన్దళితకేళికటాక్షలక్షః. 78

టీ. ఆనన్ద...లక్షః = ఆనందముచే నంకురించిన విలాసపువాలుఁ జూపుల లక్షలు గలవాఁడును, మే = నాకు, నయనబన్ధుః = కనులకుఁ జుట్టమైనవాఁడును, అనన్యబన్ధుః = ఎల్లరకుఁ గూర్చినచుట్టమగు, సః = ఆ, అయం = ఈ కృష్ణుఁడు, విలాస...తేన = క్రీడార్థము ధరించిన పిల్లంగ్రోవి మ్రోఁతలను నమృతముచేత, ఉదఞ్చితమ్ = అనన్యముగా నొగ్గియున్న, ఇదం = ఈ, మమ = నాయొక్క, కర్ణయుగ్మం = చెవులజంటను, సిఞ్చన్ = తడుపుచు, ఆయాతి = వచ్చుచున్నాఁడు.

ఉ. మాలిమిఁ జేసి గోపికలమానముఁ గాచినవాఁడు వీఁడె కాఁ
బోలును నేఁడు వేణురవముం జెవి నింపుచు నాదుకంటికిన్
మే లలరం బ్రమోదరసనిర్భరకేళికటాక్షలక్షుఁ డై
బాలుఁ డనన్యబంధుఁ డెడఁ బాయక యిట్లలయింప వచ్చెఁగా. 78

తా. సంతోషపారవశ్యముచేఁ బుట్టి పెరుఁగుచున్న లక్షలకొలఁది క్రేఁగంటిచూడ్కులు గలవాఁడును, నాకనులకుఁ బ్రియుఁడును, ఎల్లరకు ముఖ్యబంధువు నగు నాయీ కృష్ణుఁడు సొంపైన పిల్లఁగ్రోవిపాటల నొగ్గియున్న యీనాచెవులఁ గ్రుమ్మరించుచు నాదిక్కుమొగమై వచ్చుచున్నాఁడు.

శ్లో. దూరాద్విలోకయతి వారణఖేలగామీ
ధారాకటాక్షభరితేన విలోచనేన,
ఆరాదుపైతి హృదయఙ్గమవేణునాద
వేణీదుఘేన దశనావరణేన దేవః. 79

టీ. వారణఖేలగామీ=ఏనుఁగువలె విలాసముతో నడచుకృష్ణుఁడు, ధారా... తేన=బారులుదీరిన క్రేగంటి చూడ్కులచే నిండిన, విలోచనేన=కన్నుదోయిచేత, దూరాత్=దూరమునుండి, విలోకయతి=చూచుచున్నాఁడు. దేవః=శ్రీకృష్ణుఁడు, హృదయ... దుఘేన=హృదయాహ్లాదకరమైన పిల్లంగ్రోవిమోఁతలప్రవాహములను పిదుకుచున్న, దశనావరణేన=పాతెఱతోఁగూడ, ఆరాత్=దగ్గరగా, ఉపైతి=వచ్చెడిని.

మ. ఘనమత్తేభవిలాసయానము నెలంగన్ దవ్వులం జూచి చ
ల్లనిధారాళకటాక్షవీక్షణసముల్లాసంబుతోఁ జెంగటన్
జనువేళం దశనచ్ఛదంబు వెలయన్ నాస్వామి సమ్మోదమో
హనవంశీనినదప్రవాహసుఖలీలావాప్తిఁ దెల్పుం దయన్. 79

తా. గజరాజగమనము గల శ్రీకృష్ణుఁడు కటాక్షపరంపరలచే దూరమునుండి చూచుచున్నాఁడు. మనోహరమైన వేణుగానప్రవాహములను గురియుచు నాదగ్గరకు వచ్చుచున్నాఁడు.

శ్లో. త్రిభువనసరసాభ్యాం దీప్తభూషాపదాభ్యామ్
దృశి దృశి శిశిరాభ్యాం దివ్యలీలాకులాభ్యామ్,
అశరణశరణాభ్యామద్భుతాభ్యాం పదాభ్యా
మయమయమనుకూజద్వేణు రాయాతి దేవః. 80

టీ. త్రిభు...సాభ్యాం=ముల్లోకములకు నానందమును గూర్చునవియు, దీప్త...దాభ్యాం=ప్రకాశించు నాభరణములకుఁ జోటైనవియు, దృశిదృశి=ప్రతిదృష్టియందును, శిశిరాభ్యాం=చల్లనైనవియు, దివ్యలీలాకులాభ్యాం=అమానుషవిలాసముచే నొప్పియున్నవియు, అశరణశరణాభ్యాం=దిక్కులేనివారల దిక్కైనవియు, అద్భుతాభ్యాం=ఆశ్చర్యకరములైన, పదాభ్యామ్=చరణములచేత, అనుకూజద్వేణుః=అనుగుణముగా నూఁదఁబడిన పిల్లంగ్రోవిగల, దేవః=కృష్ణస్వామి, అయమయం=ఇదుగో ఇదుగో, ఆయాతి=వచ్చుచున్నాఁడు.

శా. క్రీడాభూషణధారులై యశరణశ్రేయశ్శరణ్యంబులై
చూడం జూడఁగఁ జల్లనై సొగసునై చోద్యంబులై దేవతా
చూడారత్నములైన పాదముల రా సొంపొంది వేణుధ్వనుల్
జాడల్ దెల్పఁగ వీఁడె వీఁడె యన నాస్వామిన్ విలోకించెదన్. 80

తా. లోకత్రయానందకరములును, ప్రకాశమానమైనసొమ్ములకు స్థానమైనవియు, ప్రతిదృష్టియందును జల్లనివియు, అమానుషవిలాసము లైనవియు, దిక్కులేనివారికి దిక్కైనవియు, ఆశ్చర్యము లైనవియు నగు పాదములచేత అల్లదిగో కృష్ణుఁడు వేణువు నూఁదుకొంచు నాదిక్కునకు వచ్చుచున్నాఁడు.

శ్లో. సోఽయం మునీన్ద్రజనమానసతాపహారీ
సోఽయం మదవ్రజవధూవసనాపహారీ,
సోఽయం తృతీయభువనేశ్వరదర్పహారీ
సోఽయం మదీయహృదయామ్బురుహాపహారీ. 81

టీ. మునీన్ద్ర...హారీ=యోగుల మనస్సులయందలి తాపత్రయమును బోఁగొట్టువాఁడగు, సః=ఆదేవుఁడు, అయం=వీఁడే, మద...హారీ=మత్తిల్లిన గోపికల కట్టుకోకలను దొంగిలించిన, సః=వాఁడు, అయం = వీఁడే, తృతీయ...హారీ=మూఁడవలోకమైన స్వర్గమునకుఁ బ్రభువగు నింద్రుని గర్వమడంచిన, సః = వాఁడు, అయం=వీఁడే, మదీయ...హారీ=నామనఃపద్మమును దొంగిలించిన, సః=ఆశ్రీకృష్ణుఁడు, అయం=వీఁడే, దొరకినాఁ డనుట.

ఉ. చిక్కెర నాఁడు గోపికలచేలము లెత్తినదొంగ శైలముల్
చెక్కులు సేయువానిమదజృంభము నాఁచినదొంగ భక్తిచే
నెక్కొనుమానికోటిమది నిల్చినతాపముఁ బాపుదొంగ నా
చొక్కపుఁ జిత్తసారసముఁ జూఱలుగాఁ గొనుదొంగ నేఁటికిన్. 81

తా. యోగి మానసముల తాపమును బోఁగొట్టు పరమాత్మరూపుఁడును, మదించిన గొల్లగుబ్బెతలచీరలను దొంగిలించినవాఁడును, ఇంద్రుని గర్వభంగ మొనరించినవాఁడును, నాచిత్తమును వశము చేసికొని యందుఁ జేరియున్న యాకృష్ణుఁడు వీఁడే దొరకెను.

శ్లో. సర్వజ్ఞత్వేచ మౌగ్ధ్యేచ సార్వభౌమ మిదం మమ,
నిర్విశ న్నయనం తేజో నిర్వాణపద మశ్నుతే. 82

టీ. సర్వజ్ఞత్వేచ=అన్నియుఁ దెలియుటయందును, మౌగ్ధ్యేచ=సౌందర్యమందును, సార్వభౌమం=చక్రవర్తియైన, ఇదం=ఈ, తేజః=వెలుఁగును, నిర్విశత్=అనుభవించుచున్న, మమ = నాయొక్క, నయనం=నేత్రము, నిర్వాణపదం=మోక్షమును, అశ్నుతే=పొందుచున్నది.

మ. విను సర్వజ్ఞతయందు మౌగ్ధ్యమున సుర్విన్ సార్వభౌమంబు నాఁ
జనునీతేజముఁ జూచి నానయనముల్ సారూప్యముం జెందె వీఁ
డని యాలోకముఁ జేయఁగా భ్రమరకీటన్యాయముం గాంచెఁ గా
దన జ్ఞానేంద్రియరూఢి కన్నులకు నేలా కల్గు నూహింపఁగన్. 82

తా. సర్వజ్ఞత్వమందును, జగన్మోహనసౌందర్యమందును, సాటిలేనియాకృష్ణ రూపమును జూచి నాకన్నులానందకందమగు మోక్షమును బొందుచున్నవి.

శ్లో. కృష్ణాననేతత్పునరుక్తశోభముష్ణేతరాంశోరుదయం ముఖేన్దోః,
తృష్ణాంబురాశిం ద్విగుణీకరోతి కృష్ణాహ్వయం కిఞ్చన జీవితం మే.

టీ. కృష్ణాహ్వయం=కృష్ణుఁడనుపేరుగల, కించన = చెప్పనలవిగాని, మే=నాయొక్క, జీవితం=ప్రాణమైన, ఏతత్=ఈవస్తువు, ముఖేన్దోః=తనమోముజాబిల్లివలన, ఉష్ణేతరాంశోః=చంద్రునియొక్క, ఉదయం=పుట్టుకను, పునరుక్తశోభం=ఇబ్బడియైన వికాసముగలదానిగా, కృష్ణానం=చేయుచున్నదై, తృష్ణాంబురాశిం = నాయాశాసముద్రమును, ద్విగుణీకరోతి=ఇబ్బడింపఁ జేయుచున్నది.

మ. కమలోల్లాసకమై నిరంతరకళల్ గన్పట్టశీతాంశుబిం
బముకంటెన్ ద్విగుణాభిరూప్యమున రమ్యంబై నవస్మేరముఁ బు
న్నమజాబిల్లి వెలుంగుతో వెలయుకృష్ణాభిఖ్య మానాదుజీ
వము దృష్ణాబ్ధితరంగలన్ ద్విగుణమై వర్ధిల్లఁ జేసెన్ మదిన్. 83

తా. నాకు జీవితమై చెప్పనలవిగానిరీతి యీముందుఁగనఁబడు శ్రీకృష్ణుఁడను వస్తువు తనముఖచంద్రునిచేఁ బూర్ణిమయం దుదయించు చంద్రునకు వన్నె పెట్టుచున్నదై నాయంతఃకాశాసముద్రమును మతింత పొంగిపొరలఁజేయుచున్నది. (అనఁగా చంద్రోదయముచే సముద్రము పొంగుట సహజమనుట.)

శ్లో. త దేత దాతామ్రవిలోచనశ్రీసచ్భావితాశేషవినమ్రవర్గమ్,
మునమారాచ్మరారేర్మధురాధరోష్ఠం ముఖాంబుజంచుమ్బతిమానసం మే.

టీ. ఆతామ్ర...వర్గం=కొంచెమెఱ్ఱనైన కంటిసొంపుచేత నను గ్రహింపఁబడిన సమస్తభక్తలోకముగలిగినదియు, మధురాధరోష్ఠం=తీయనివాతెఱగలదియు, తదేతత్= అయ్యా, మురారేః=కృష్ణునియొక్క, మధురాధరోష్ఠమ్=తీయనిమోవిగల, ముఖాంబుజం=మోముఁదామరను, మే=నాయొక్క, మానసమ్=చిత్తము, చుమ్బతి=ముద్దాడుచున్నది.

చ. కలశపయోధిశీకరనికాయముచే నునుఁగెంపుమీఱుక
న్నులనతపాళికిం బ్రియము నూల్కొనఁ జేయుచుఁ దత్ప్రధానకం
బులు మధురాధరోష్ఠమునఁ బూనినయాదిమదేవుమోముగా
వలె నది గాక యున్నయెడఁ బల్మరు నామది యాసఁ గోరునే. 84

తా. కొంచెమెఱ్ఱనివై యందములగు కన్నులచే భక్తులను సానుగ్రహముగాఁ జూచుచు కమ్మనిమోవిగల శ్రీకృష్ణునిముఖకమలమును తనివారఁ జూచుచున్నది.

శ్లో. కరాశరదుదఞ్చితాంబుజవిలాసశిక్షాగురూ
పదా విబుధపాదపప్రథమపల్లవోల్లఙ్ఘినౌ,

దృశౌ దళితదుర్మదత్రిభువనోపమానశ్రియా
విలోకయ విలోచనామృత మహో మహాచ్ఛైశవమ్. 85

టీ. కరౌ=చేతులు, శర...గురూ=శరదృతువునందుఁబూచినకమలములయొక్క విలాసములను గఱపుటయందు నొజ్జలైనవి, పదౌ = పాదములు, విబుధ...ల్లక్షినౌ= కల్పవృక్షముయొక్క మొదటిచిగురును మీఱుచున్నవి, దృశౌ=చూడ్కులు, దళిత...శ్రియా=పోఁగొట్టఁబడిన పొగరుగోసవ ముల్లోకములయందలి యుపమానవస్తువుల కాంతిగలవి. అహో=ఔరా, విలోచనామృతమ్=కనులపండువు సేయుచున్న, మహత్ శైశవం=గొప్పబాల్యమును, విలోకయ=చూడుము. (లేక, హేవిలోచన=ఓనేత్రమా! అమృతమహః=అమృతముయొక్క తేజమువంటి తేజముగల, మహచ్ఛైశవం, విలోకయ, అని కొంద అన్వయింతురు.)

ఉ. పాదము లంటిమా విబుధపాదపనూతనపల్లవావళిం
గా దనుఁ గన్నుదోయి సరికాంతివిశేషము ముజ్జగంబులం
లే దను శారదాబ్జనవలీలలఁ గేల్గవ గేరు లోచనా
హ్లాద మయారె శైశవవిలాసము గంటిమి నందనూతికిన్. 85

తా. హస్తములా శరత్కాలమందలి కమలములకుఁ బాఠము నేర్పఁగలవి. పాదములో కల్పవృక్షమునకు మొందుఁ బుట్టినచిగుళ్లను మీఱుచున్నవి. చూపులు ముల్లోకములయందలి యుపమానవస్తువులను రూపుమాపినవి. అద్దిరా! కన్నుల కమృతమువంటి దగు నీ తుల లేనిబాల్యమును గనుఁగొంటినిగదా!

శ్లో. ఆచిన్వాన మహన్యహన్యహని సాకారాన్ విహారక్రమా
నారున్ధాన మరున్ధతీహృదయ మప్యార్ద్రస్మితాస్యశ్రియా,
ఆతన్వాన మనన్యజన్మనయనశ్లాఘ్యా మనర్ఘ్యాం దశా
మామన్దం వ్రజసున్దరీస్తనతటీసామ్రాజ్య ముజ్జృమ్భతే. 86

టీ. అహన్యహన్యహని = ప్రతిదినమందును, సాకారాన్ = (కొత్తక్రొత్త) రూపములతోఁగూడిన, విహారక్రమాన్=ఆటలరీతులను, ఆచిన్వానం=సంపాదించుచున్నదియు, ఆర్ద్రస్మితాస్యశ్రియా= మెఱుఁగు నవ్వులుగల మోముతళుకుచేత, అరున్ధతీహృదయమపి=అరుంధతిచిత్తమునుగూడ, ఆరున్ధానం=అరికట్టుచున్నదియు, అనన్య...శ్లాఘ్యాం=మన్మథుని కనులకుసైతము వేడుకనుగలిగించుచున్న, అనర్ఘ్యాం = వెలలేని, దశాం=అవస్థను, ఆతన్వానం=వెలయించుచున్నదియునగు, వ్రజ...సామ్రాజ్యం=గోపాంగనలకుచతటముల సర్వాధిపత్యము, ఆమన్దం = మిక్కిలి, ఉజ్జృమ్భతే=వెల్లివిరియుచున్నది.

మ. నలినాస్త్రుండును జొక్కి కన్గొనుచు నానందించ నెమ్మోముఁ గ్రొం
దళుకున్నవ్వు లరుంధతీహృదయము న్మైనం బోవ నీ కాఁగ విం

తలుగాఁ బ్రొద్దొకరూపమై మెఱుఁగువిన్నాణంబులం దేలి ని
శ్చలనందవ్రజసుందరీస్తనతటీసామ్రాజ్య ముప్పొంగెడిన్. 86

తా. ఒక్కొకదిన మొక్కొకతీరై రూపసంపదలను బొందుచు మోమానందము చేత నరుంధతినిసైత మాకర్షింపఁజాలి మన్మథునికంటికి నింపైనదశను బొందుచున్న గోపాంగనల స్తనముల సామ్రాజ్యము సరసర పెరిగిపోవుచున్నది.

శ్లో. సముచ్ఛ్వసితయౌవనం తరళశైశవాలఙ్కృతం
మదచ్ఛురితలోచనం మదనముగ్ధహాసామృతమ్,
ప్రతిక్షణవిలోభనం ప్రణయపీతవంశీముఖం
జగత్త్రియవిమోహనం జయతి మామకం జీవితమ్. 87

టీ. సము...యౌవనం=బాగుగనుప్పొంగుచున్న యౌవనముగలదియు, తరళ...కృతం=చపలమైనబాల్యముచేనలంకరింపఁబడినదియు, మద...చనమ్=కామమదముచేఁ బొదలుచున్న కన్నులుగలదియు, మదన...తమ్=మన్మథునిచేత సుందరమైనయమృతముఁబోలు చిఱునగవుగలదియు, ప్రతి...భనమ్ = అడుగడుగునను ఆశగలుగఁజేయునదియు, ప్రణయ...ముఖమ్=ఆదరముతోఁ బట్టఁబడినపిల్లఁగ్రోవికొనగలదియు, జగత్త్రియవిమోహనమ్=ముల్లోకములను మోహపెట్టునట్టి, మామకం=నాదగు, జీవితమ్=ప్రాణము, జయతి=వెలయుచున్నది.

మ. తలఁ పంతంతకు నీటు దేరెఁ దళుకొందన్ జాఱె బాల్యంబు వె
న్నెల నేలెం దలినవ్వు క్రొందళుకు లీనెన్ నేత్రముల్ మోహికిం
గలవంశీముఖచుంబనం బసురె లోకంబుల్ విలోకించి యు
వ్విళు లూరెన్ మది నాదుజీవితము తీపిం బర్వెఁ గృష్ణాకృతిన్. 87

తా. స్త్రీయౌవనము విజృంభించుచున్నది. బాల్య మింకను గొంచెముగా వీడకున్నది. నేత్రములు మన్మథవికారములచే నెంతయు నందము నొందియున్నవి. చిఱునవ్వమృతము వోలె బయలు వెడలుచున్నది. ఇట్టిరూపముచేఁ జూచువారలకుఁ బ్రతిక్షణమును మోహము గలుగఁజేయుచుఁ బిల్లఁగ్రోవి నూఁదుచు నాకు ప్రాణపదమైనశ్రీకృష్ణుఁడు సర్వోత్కృష్టుఁడై యున్నాఁడు.

శ్లో. చిత్రం తదేత చ్చరణారవిన్దం చిత్రం తదేత న్నయనారవిన్దమ్,
చిత్రం తదేత ద్వదనారవిన్దం చిత్రం తదేత త్త్వపు రమ్బ! చిత్రమ్. 88

టీ. తత్=ఆ, ఏతత్=ఈ, చరణారవిన్దమ్=అడుగుఁదామర, చిత్రమ్=అబ్బురమైనది, తదేతత్=అయియా, నయనారవిన్దమ్=కన్నుదామర, చిత్రం=వింతయైనది, తదేతత్=అయియా, వదనారవిన్దమ్=మోముదమ్మి, చిత్రమ్ = ఆశ్చర్యము. అమ్బ=అమ్మా!

తదేతత్=ఆపాదాద్యవయవవిశిష్టమైనయీవస్తువు, చిత్రం=వింతయైనది, పునః=మఱి యు, చిత్రమ్=ఆశ్చర్యము.

ఉ. లోకములోనమోములు విలోచనముల్ పదముల్ సహస్రసం
ఖ్యాకము లంచు నెంచు శ్రుతు లాపురుషోత్తము నివ్విధంబుగా
నీకనుఁదమ్మిదోయిచెలు వీముఖసారస మీపదాబ్జముల్
చేకొనఁ జిత్ర మంచు నుతి సేయఁగఁ బల్మఱు నంబ ! శక్యమే. 88

తా. ఆపాదములొకవింత. ఆకన్నులొకవింత. ఆమొగమొకవింత. ఆరూపమే యొక యాశ్చర్యకరమైనది. అమ్మా ! అది మఱియుఁ జిత్రము.

శ్లో.అఖిలభువనైకభూషణ మధిభూషితజలధిదుహితృకుచకుమ్భమ్,
వ్రజయువతీహారావలిమరకతనాయకమహామణిం వన్దే. 89

టీ. అఖిల...షణమ్=ఎల్లలోకములకు నద్వితీయమైన యలంకారమైనదియు, అధి...కుమ్భమ్ = అలంకరింపఁబడిన లక్ష్మీదేవి స్తనకలశములుగలదియునగు, వ్రజ... మణిమ్=గొల్లతలచారులనెడి హారముల గుంపుయొక్క నడిమిమరకతపుఁ బూసరైన గోవిందునిగూర్చి, వన్దే=నమస్కరించెదను.

చ. జలనిధికన్యకాఘనకుచస్థలి వచ్చులతాళి గోపికా
విలసితహారనీలమణి విశ్వజగద్వలయప్రకాశకో
జ్జ్వలమహనీయరత్న మనివారితకాళియభోగభోగిమం
డలగిరివజ్రమై వెలయునందతనూజు భజింతు నామదిన్. 89

తా. ఎల్లలోకములకుభూషణమై లక్ష్మీదేవిచనుఁగుండల కలంకారమై గొల్లవనితల చారులనెడి హారములకు మధ్యమణివంటివాఁడగు శ్రీకృష్ణుని నమస్కరించుచున్నాను.

శ్లో.కాన్తాకచగ్రహణవిగ్రహబద్ధలక్ష్మీఖణ్డాఙ్గరాగరసరఞ్జితమఞ్జులశ్రీ,
గణ్డస్థలీముకురమణ్డలఖేలమాన ఘర్మాఙ్కురం కిమపి ఖేలతి కృష్ణ తేజః.

టీ. కాన్తా...లశ్రీ=అలుమగలజుట్టుపట్లతోఁగూడిన జగడమందుఁ బట్టుకోఁ బడిన రుక్మిణియొక్క మైపూఁత చిదుగపలరసముచే నలంకరింపఁబడిన మనోహరమగు సొబగుగలదియు, గణ్డ...ర్మాఙ్కురమ్=అద్దపుబిళ్లలఁబోలు చెక్కిళులయందు చిందులు ద్రొక్కు చెమటచుక్కలుగల, కిమపి=అనిర్వాచ్యమైన, కృష్ణతేజః=శ్రీకృష్ణాఖ్యతేజము, ఖేలతి=క్రీడించుచున్నది.

మ.కళుకున్నిద్దపుఁజెక్కుటద్దములపై ఘర్మాంకురం బూరఁగాఁ
గలికాభోగపయోధరాంశరలసత్కాశ్మీరసంబంధగం
ధిలవక్షస్థలుఁడై గృహీతఘనవేణీబంధుఁడై నెయ్యపుం
జెలియం జుంబనకేళిఁ దేల్చుహరి నాచిత్తంబునం జెందెడున్. 90

తా. జుట్టుపట్లతోఁగూడిన యాలుమగలవేడుక తగవులయందు నొడిసి యుక్కిరి బిక్కిరిగాఁ బట్టినందున నంటిన లక్ష్మీదేవి మైపూఁతచిగురుపలచే నొప్పినదియు, అద్దములఁబోలు చెక్కిళులయందుఁ బొడమచెమటచుక్కలుగలదియు నగు నబ్బురమైన కృష్ణతేజము వెలయుచున్నది.

శ్లో. మధురం మధురం వపు రస్య విభో
ర్మధురం మధురం వదనం మధురమ్,
మధుగన్ధి మృదుస్మిత మేత దహో
మధురం మధురం మధురం మధురమ్. 91

టీ. అస్య=ఈ, విభోః=ప్రభువగు కృష్ణునియొక్క, వపుః=శరీరము, మధురం మధురం=మిక్కిలిమధురము, మధుగన్ధి = మకరన్దపువాసనగలదియు, మృదుస్మితం=సుకుమారమైన నవ్వుగలదియు గనుక నే, మధురం=సుందరమైన, ఏతత్=ఈ, వదనమ్=ముఖము, మధురం మధురం మధురం మధురం=అతిమధురమైనది, అహో=చిత్రము!

శా. చూడం జూడఁగ మేనఁ దా నినుమడించు న్మాధురీసంపదల్
చూడం జూడఁగ మోముగోము పది మెచ్చుల్ గుల్కు ముమ్మాటికిం
జూడం జూడ మరందబిందువుల మించున్ మందహాసంబు నీ
జాడం బల్మఱు మాధురిం జెలఁగునాస్వామిన్ విలోకించెదన్. 91

తా. ఈ శ్రీకృష్ణదేవుని దేహము మిగుల మధురము. పూఁదేనె వాసనతోఁగూడి చక్కని మందహాసము గలమొగ మంతకన్న మధురము. చిఱునవ్వు అంతకంటె నతిమధురము. ఆహా అంతయు మధురమే.

శ్లో. శృఙ్గారరససర్వస్వం శిఖిపిఞ్ఛవిభూషణమ్,
అఙ్గీకృతనరాకార మాశ్రయే భువనాశ్రయమ్. 92

టీ. శృంగార...సర్వస్వమ్=శృంగారరసముయొక్క సారాంశమైనవాఁడును, శిఖి...షణమ్=నెమ్మిపురి సొమ్ముగాఁగలవాఁడును, అఙ్గీకృతనరాకారమ్=స్వీకరించిన లీలామనుష్యరూపముగలవాఁడును, భువనాశ్రయమ్=లోకములకు నెలవైనకృష్ణదేవుని, ఆశ్రయే=ఆశ్రయించెదను.

ఉ. చక్కనివాని ముద్దు వెదఁజల్లెడువాని దయారసంబుచే
నెక్కొనువాని మౌళితటి నించినపింఛమువాని లోకముల్
మ్రొక్కఁగ నేలువాని నతిమోహనమానుషవేషధారి యై
యక్కఱ లేనివాని జగదాశ్రయు నెప్పుడు నాశ్రయించెదన్. 92

తా. శృంగారముయొక్క స్థిరాంశమైనవాఁడును, నెమలిపురిని దాల్చినవాఁడును, లీలకొఱకు మనుజరూపమును దాల్చినవాఁడును, ఎల్లలోకములకు నాధారమగు కృష్ణుని ఆశ్రయించెదను.

శ్లో. నాద్యాపి పశ్యతి కదాచన దర్శనేన
చిత్తేన చోపనిషదా సుదృశాం సహస్రమ్,
స త్వం చిరం నయనయో రనయోః పదవ్యాం
స్వామిన్! కదా ను కృపయా మమ సన్నిధత్సే. 93

టీ. సుదృశామ్=పండితులయొక్క, సహస్రం=వేయి, అద్యాపి=ఇప్పటికిని, కదాచన=ఎప్పుడైనను, దర్శనేన=ప్రత్యక్షముచేతఁగాని, చిత్తేన=మనస్సుచేఁగాని, ఉపనిషదా=ఉపనిషత్తుచేతఁగాని, (ఎవనిని) నపశ్యతి=చూడదో, సః=అట్టి అదృశ్యుఁడగు, త్వం=నీవు, హే స్వామిన్=ఓకృష్ణా! మమ=నాయొక్క, అనయోః=ఈ ప్రకృతిసంబంధములగు, నయనయోః=కనులయొక్క, పదవ్యాం=త్రోవయందు, కృపయా=దయతోడ, కదాను=ఎప్పుడు, చిరం=చిరకాలము, సన్నిధత్సే=సన్నిధానము చేయుదువు.

ఉ. కొందఱు యోగదృష్టి నొకకొందఱు వేదవిచారవాసనం
గందురు నిన్ను నెప్పుడొ యొకానొకవేళ నభిజ్ఞులైనవా
రందఱు నిట్టినీవు కరుణాంబుధి! ప్రాకృతదృష్టిఁ జెందుసా
ముందట నిల్చి యెన్నఁడు ప్రమోద మొనర్తువు నందనందనా! 93

తా. కృష్ణా! యోగు లనేకులు నినుఁజూచుటకయి చిర ప్రయత్నములుచేసి, ప్రత్యక్షముగాఁగాని, ధ్యానములచేఁగాని, ఉపనిషద్విచారముచేఁగాని ఇప్పటికిఁ జూడకున్నారు. అట్టి వాఙ్మనస్సులకు గోచరింపనిరూపముతో నీప్రాకృతమానవుఁడనగు నాకన్నుల కపారదయతో నెప్పుడు పొడసూపెదవో కదా!

శ్లో. కేయం కాన్తిః కేశవ! త్వన్ముఖేన్దోః
కోఽయం వేషః కోఽపి వాచా మభూమిః,
సేయం సోఽయం స్వాదుతా మఞ్జులశ్రీః
భూయో భూయో భూయశ స్త్వాం నమామి. 94

టీ. హే కేశవ=ఓకృష్ణా, త్వన్ముఖేన్దోః=నీమోముఁ జందురునియొక్క, ఇయం=ఈ, కాన్తిః=మెఱుఁగు, కా=ఏది, కోఽపి=ఇట్టిదనరాని, వాచాం=నుడువులకు, అభూమిః=విషయముగాని, అయం=ఈయగపడుచున్న, వేషః=రూపము, కః=ఏది, సేయం=అయికాంతియు, సోఽయం=అయివేషమును, స్వాదుతా=చక్కఁదనమును, మఞ్జులశ్రీః=మనోహర లక్ష్మియుఁనగును. త్వాం=ఇట్టినిన్ను, భూయోభూయః=మాటిమాటికి, భూయశః=విశేషముగా, నమామి=మ్రొక్కుచున్నాను.

ఉ. ఎక్కడిగోపరూప మిది యెక్కడిముద్దుమొగంబు సోయగం
బెక్కడ నీకళావిభవ మెక్కడ నే మని యెన్నవచ్చు న

మ్మక్క యగోచరంబు భవదాకృతి పద్మభవాదినూ_క్తికిఁ
బ్రెమ్రొక్కెద సారెసారెకు నమో హరయే యని నందనందనా. 94

తా. కృష్ణా! ఈనీముఖకాంతి యెక్కడ? నీరూపమెక్కడ? నీసోయగ మెక్కడ? నీమనోహర కాంతిసంపదయెక్కడ? అహాహా! నీయాకార మెవ్వారికి నగోచరముగదా! అట్టినిన్ను మాటిమాటికిఁ బలుమాఱులు మ్రొక్కుచున్నాఁడను.

శ్లో. వదనేన్దువినిర్జిత శ్శశీ దశధా దేవ! పదం ప్రపద్యతే,
అధికాం శ్రియ మశ్నుతేతరాం తవ కారుణ్యవిజృమ్భితం కియత్. 95

టీ. హే దేవ=ఓకృష్ణా, శశీ=చంద్రుఁడు, వదనేన్దువినిర్జితః=నీమోముచందురునిచే జయింపఁబడినవాఁడై, దశధా=పదిగానయి, తే=నీయొక్క, పదమ్=అడుగును, ప్రపద్య=పొంది, అధికాం=గొప్ప, శ్రియం=శోభను, అశ్నుతేతరాం=పొందుచున్నాఁడు, తవ=నీయొక్క, కారుణ్యవిజృమ్భితం=దయయొక్కపొంగు, కియత్=ఎంతదో?

ఉ. ఆననకాంతితోడ నెదురాని శశాంకుఁడు నిల్వ లేక నీ
మానితపాదపద్మములమాటునఁ జేరి నఖాంకురాకృతిం
బూని భజించినంతనె సమున్నతి శ్రీ లొనఁగూర్చె తౌర నీ
దీనదయాపరత్వము నుతింపఁగ శక్యమె నందనందనా. 95

తా. కృష్ణా! చంద్రుఁడు నీముఖచంద్రున కోడి, పదివక్కలై (గోరులరూపము నొంది) నీచరణముల నాశ్రయించి నిరుపమానసౌభాగ్యమును బొందుచున్నాఁడు. అహా! దీనులయెడ నీదయావిశేష మెంతని చెప్పవచ్చును?

శ్లో. తత్త్వన్ముఖం కథ మివాబ్జసమానకక్ష్యం
వాఙ్మాధురీబహుళపర్వకళాసమృద్ధమ్,
తత్కిం బ్రువే కి మపరం భువనైకకాన్తం
యస్య త్వదాననసమా సుషమా సదా స్యాత్. 96

టీ. వాఙ్మా...మృద్ధమ్=మాటలతీయఁదనముచే మించినయానందముగల కళలచేనిండిన (వాఙ్మాధుర్యముచేఁ గలిగినకళలచే కృష్ణపక్షమందుఁగూడ పూర్ణిమయందువలె కళాపూర్ణమయిన), తత్=అప్రసిద్ధమైన, త్వన్ముఖమ్=నీమొగము, అబ్జసమానకక్ష్యం=(చంద్ర) కమలములతో సమానకోటిగలది, కథమివ=ఎట్లగును? భువనైకకాన్తం=లోకములనొక్కటియై రమ్యమైన, అపరం=మఱియొకవస్తువును, బ్రువే కిం=చెప్పఁగలనా? యస్య=ఏవస్తువునకు, త్వదాననసమా=నీమొగముతో సాటిగల, సుషమా=అందము, సదా=ఎప్పుడును, స్యాత్=ఉండును.

చ. సరసిజ మంటిమా తగదు సాటికి శారదపూర్ణిమాసుధా
కరరుచి యంటిమా సమము గాదిఁక వేతె జగంబునఁ మనో

హార మగువస్తు వొండొకటి యారసి చూడ నొకానొకప్పుడుం
బొరుడు ఘటిల్లునే భువనమోహన ? నీముఖకాంత కాంతికిన్. 96

తా. కృష్ణా ! సర్వదా కళాపూర్ణమైన నీమోమునకును, కృష్ణపక్షమున స్రుక్కిపోవు చంద్రునకును ఈడు సేయనగునా ? ఇంక నెప్పుడు కృష్ణ మనక శుక్లమనక రాత్రి యనక పగ లనక సర్వదా వెలుంగుచుండు నేవస్తువును తెచ్చి నీమోమున కీడగు నని చెప్పుదును ? ఎద్దియుం గానరాదుగదా !

శ్లో. శుశ్రూషసే యది వచః శ్రుణు మామకీనం
పూర్వై ర పూర్వకవిభి ర్న కటాక్షితం యత్,
నీరాజనక్రమధురం భవదాననేన్దోః
నిర్వ్యాజ మర్హతి చిరాయ శశిప్రదీపః. 97

టీ. మామకీనం=నాదగు, వచః=మాటను, శుశ్రూషసే యది=వినఁగోరెదవేని, శ్రుణు=వినుము. యత్=ఏనామాట, పూర్వైః=వెనుకటివారగు, అపూర్వకవిభిః=అద్భుతకవితారసముగలకవులచేత, నకటాక్షితం=కనిపట్టఁబడలేదో, శశిప్రదీపః=చంద్రుఁడనుదీపము, భవదాననేన్దోః=నీముఖచంద్రునియొక్క, నీరాజనక్రమధురం=ఆరతెత్తుటను గూర్చి, నిర్వ్యాజం=టక్కులేక, చిరాయ=బహుకాలము, అర్హతి=తగుచున్నది.

చ. తొలుతటివ్యాసముఖ్యకవిధుర్యులు వల్కనిసాహసంబు నేఁ
బలికెద వింటివేని విను పంకజలోచన ! నీదుమోముతోఁ
గలువలతేని సాటి యనఁ గాఁ దగ దారతిపళ్లెరంబులోఁ
వల నిడి దివ్వెగా నతనిఁ బట్టి నివాళి యొనర్పఁగాఁ దగున్. 97

తా. కృష్ణా ! విన వేడుక గలదేని అత్యద్భుతకవితావిశేషశోభితు లైనను, ఇంతకుఁ బూర్వులగుకవులు చెప్పనిదానిని నావలన నొక్కటి వినుము. ఏమనఁగా, ఈచంద్రుఁడను దీపము నీమొగముచుట్టును దృష్టిదోషపరిహారార్థము త్రిప్పుటకుమాత్రము తగియున్నది. ఇంతేదియును బూటకము లేదు.

శ్లో. అఖణ్డనిర్వాణరసప్రవాహై ర్విఖణ్డితాశేషరసాన్తరాణి,
అయన్త్రితోద్వాన్తసుధార్ణవాని జయన్తి శీతాని తవ స్మితాని. 98

టీ. అఖణ్డ ..వాహైః=పరిపూర్ణసుఖరసప్రవాహములచేత, విఖణ్డి...రాణి=జయింపఁబడినయితరసమస్తరసములు గలవియు, అయన్త్రి...వాని=అడ్డులేక వెడలించుచున్న యమృతసముద్రములుగలవియు, శీతాని=చల్లనివగు, తవ=నీయొక్క, స్మితాని=చిఱునగవులు, జయన్తి=వెలయుచున్నవి.

మ. కలితానందమహానుభావమున వేడ్కం జెంది యంతంతకుం
దెలియం బొంగుసుధాతరంగితపయోర్ధిన్ లీలఁ గన్పించుచున్

దళితాశేషరసాంతరంబు లగులేనవ్వుల్ మిటారింప గో
కులకాంతాజనభోగభాగ్యమహిమాంకూరంబు సెల్వొందెడిన్. 98

తా. కృష్ణా! ఎడలేని యానందరసప్రవాహములచే నితరరసములనన్నిటిని ధిక్కరించి, లెక్కకెక్కుడుగా నిరాటంకముగా నమృతసముద్రములను గ్రుమ్మరించు నీచల్లని చిఱునగవులు సర్వోత్కర్షముగలవై మెఱయుచున్నవి.

శ్లో. కామం సన్తు సహస్రశః కతిపయే సారస్యధౌరేయకాః
కామం వా కమనీయతాపరిణతిస్వారాజ్యబద్ధవ్రతాః,
తైర్నైవం వివదామహే నచ వయం దేవ! ప్రియం బ్రూమహే
యత్సత్యం రమణీయతాపరిణతి స్త్వయ్యేవ పారం గతా. 99

టీ. కతిపయే=కొందఱు, సారస్యధౌరేయకాః=రసజ్ఞతకు భారవాహకులు, సహస్రశః=వేలకొలఁది, కామం=మిక్కిలి, సన్తు = ఉందురుగాక. కమనీయ... వ్రతాః=లావణ్యపరిపాకమను స్వర్గాధిపత్యమందుఁ బట్టుపట్టినవారును, కామం = మిగుల, సంతు=ఉందురుగాక, హేదేవ=ఓకృష్ణా, యత్=ఏమువలన, ఏవం=ఇట్లు, రమణీయతాపరిణతిః=చక్కఁదనపుసీటు, త్వయ్యేవ=నీయందే, పారంగతా=పరిపూర్తిం జెందెనో, తత్=అందువలన, ఏతైః = అరసికులతోఁ గాని సొగసుకాండ్రతోఁ గాని, వయం=మేము, నవివదామహే=కలహింపము. ప్రియం=ఇచ్చకమును, నచ బ్రూమహే=చెప్పము.

ఉ. లోకములోపలన్ రసికలోక మనేకము గల్గుఁ గాక యు
ల్లోకమనోహరాపయశశోభితు లుందురు గాక వారితో
నే కలహింపనేల మొగమిచ్చక మేటికి సత్య మాడెదన్
నీ కమనీయతామహిమ నీక తగున్ మఱి కాన మెయ్యెడన్. 99

తా. కృష్ణా! లోకములో ననేకులు రసికులుందురుగాక. సుందరులును మిక్కిలి గలుగుదురుగాక. మాకు వారితో వాదమాడఁబనిలేదు. వారియెడ నిచ్చకపుమాటలాడుటకును మేమొల్లము. నే నిజముగాఁ జెప్పెద వినుము. ఈయందము నీయందే కాని వేఱెచ్చటను లేదు.

శ్లో. మన్దారమూలే మదనాభిరామం బిమ్బాధరాపూరితవేణునాదమ్,
గోగోపగోపీజనమధ్యసంస్థం గోపం భజే గోకులపూర్ణచన్ద్రమ్. 100

టీ. మన్దారమూలే=కల్పవృక్షము పాదునందు, మదనాభిరామం=మన్మథునివలె నందమైనవాఁడును, బిమ్బా...నాదమ్ = దొండపండువంటి మోవిచే నొత్తఁబడిన వేణువు మ్రోఁతగలవాఁడును, గోగోప .. సంస్థమ్=గోవులయు గోపాలకులయు గోపికలయు నడుమ నుండువాఁడును, గోకులపూర్ణచంద్రం=గోవులకు లేక (వ్రేపల్లెకు) చంద్రునివంటివాఁడగు, గోపం=గోపరూపుఁడైన కృష్ణునిగూర్చి, వన్దే=నమస్కరించుచున్నాను.

ఉ. గోపిక లోపికల్ సడలి కొల్వఁగ గోవులు గోవు లాడఁగాఁ
గోవులు మేవు లాని పరికింపఁగఁ గెంజిగురాకుమోవిపై
మోపినవేణు వగ్గలము మ్రోయఁగఁ గల్పవనిన్ వసించునా
గోపకుమారమన్మథుని గోకులవార్ధిశశిన్ భజించెదన్. 100

తా. సొబగున మన్మథునిబోలువాఁడును, పిల్లఁగ్రోవిని పెదవినిజేర్చుకొని యావులమందలలో గోపకులతోడను గోపకామినులతోడను. గూడితిరుగువాఁడును, గోవులకు (శేష, వ్రేపల్లెవారికిఁ) జంద్రునిపగిది నానందప్రదుఁడైన శ్రీకృష్ణుని సేవించెదను.

శ్లో. గళద్వ్రీడా లోలా మదనవనితా గోపవనితా
మధుస్ఫీతం గీతం కిమపి మధురా చాపలధురా,
సముజ్జృమ్భా గుమ్భా మధురిమగిరాం మాదృశగిరాం
త్వయి స్థానే జాతే ధరతి చపలం జన్మ చ ఫలమ్. 101

టీ. త్వయి=నీవు, జాతేసతి = అవతరింపఁగా, గళద్వ్రీడాః = సిగ్గులేని, లోలాః=చపలలైన, గోపవనితాః=గొల్లపడుచులు, మదనవనితాః=రతీదేవులు (మన్మథవశలు), జాతాః=అయిరి. గీతం = వేణుగానము, మధుస్ఫీతం = తేనెలచేనిండినదై కిమపి=చెప్పరానిదైనది. చాపలధురా=నిశ్చపలత, మధురా=మనోజ్ఞమైనది, మాదృశగిరాం=మాబోఁటి వారి వాక్కులయొక్క, గుమ్భా=కూర్పులు, మధురిమగిరాం=కమ్మదనమును వెదఁజల్లుమహాకవి వాక్యములయొక్క, సముజ్జృమ్భాః=అతిశయము లైనవి. చపలం=చంచలమైన, జన్మచ = నాజన్మము, ఫలం = ముక్తిరూపపరమలాభమును, ధరతి=పొందుచున్నది.

ఉ. నాన దొఱంగి తత్తరమునన్ మరు లెత్తినగోపకామినుల్
దేనియ గుల్కుపాటలును దియ్యనిమాటలు నీకతంబునం
బూని ఫలంబుఁ జెందు క్రియ మోదముతోడను సన్నుతింపఁగా
నానుడువుల్ ఫలించె జననంబుఁ గృతార్థతఁ జెందె నెంతయున్. 101

తా. కృష్ణా! మోటుఁదనము గల గొల్లపడుచులు నీయొండఁ జేరి రతీదేవులవలె సౌభాగ్యవతులైరి. గానము నిన్ను జేరి మాధుర్యముగల దయ్యెను. చాంచల్యము స్థైర్యముగా మారెను. మాబోఁటి యనామధేయులవాక్కులుగూడ నిన్ను స్తుతించుటచే మహాకవి వాక్కులవలె మనోహరములై శోభిల్లుచున్నవి. నిన్ను సేవించుటచే నాబోఁటి దీనుని జన్మము సఫలమైనది.

శ్లో. భవనం భువనం విలాసినీ శ్రీ స్తనయ స్తామరసాసనః స్మరశ్చ,
పరిచారపరమ్పరా సురేన్ద్రా స్తదపి త్వచ్చరితం విభో విచిత్రమ్.

టీ. హే ప్రభో=ఓదొరా, భువనమ్ = ఎల్ల చరాచరరూపమైన ప్రపంచము, భువనమ్=నీయిల్లు, విలాసినీ=భార్య, శ్రీః=సంపదలనిచ్చుజవరాలు, తనయః=కొడుకు, తామరసాసనః=ఎల్లలోకములను సృజించు బ్రహ్మయు, స్మరశ్చ=త్రిలోకవిజయి యగు మన్మథుఁడును, పరిచారపరమ్పరాః=సేవకసంఘములు, సురేన్ద్రాః = దేవతలు, తదపి=అటులైనను, త్వచ్చరితం=నీకథ, విచిత్రం=ఆశ్చర్యమైనది

మ. లలనారత్నము శ్రీవధూటి జగమెల్లం గేళికాసౌధ మా
జలజాతాననశంబరారులు సుతుల్ శక్రాదిదిక్పాలవ
ర్యులు భృత్యుల్ వివరింప నీమహిమ లోపలో యిట్టి వై యుండ
గోకులవాటంబున జారచోరకృతి లోకుల్ నవ్వఁ గాంక్షింతురే. 102

తా. కృష్ణా! ఎల్లలోకములకు నిల్లైన బ్రహ్మాండము నీయిల్లు. సంపదలనిచ్చులక్ష్మి నీభార్య. త్రిలోకకర్తయు,లోకజేతయు నగు బ్రహ్మయు మన్మథుఁడును నీకొడుకులు. ముప్పదిమూఁడుకోట్ల దేవతలు నీ సేవకులు. ఇట్లయ్యును గొల్లయిండ్లలో జారచోర వ్యాపారములఁ జేయునీకథలు వింతగొలుపుచున్నవి.

శ్లో. దేవ స్త్రిలోకసౌభాగ్యకస్తూరీతిలకాఙ్కురః,
జీయాద్వ్రజాఙ్గనానఙ్గకేళీలలితవిభ్రమః. 103

టీ. త్రిలోక...కురః=ముల్లోకములకు మంగళప్రదమైన కస్తురిబొట్టుగలవాఁడును, వ్రజా...భ్రమః=గొల్లపడుచుల మన్మథక్రీడలయందు సొంపైన విలాసముగల, దేవః=శ్రీకృష్ణుఁడు, జీయాత్=వెలయుఁగాక.

మ. కులుకుం జెక్కులఁ బిక్కటిల్లుపులకాంకూరంబు తోరంబుగాఁ
దళుకుంగస్తురిబొట్టు నెన్నొసలిపైఁ దైత్రిలోక్యభాగ్యాకృతిం
జెలఁగన్ గోపనితంబినీరతికళాశృంగారభావోన్నతుల్
దొలఁకం గన్నులవండు వైనవిభుఁ గాంతుం భాగ్యసంసిద్ధికిన్. 103

తా. ముల్లోకములకు నలంకారమైన కస్తురిబొట్టుగలవాఁడై గోపాంగనల మదనక్రీడలయందు విలాసముగ సంచరించు కృష్ణునకు జోహారు.

శ్లో. ప్రేమదం చ మే కామదం చ మే వేదనం చ మే వైభవం చ మే,
జీవనం చ మే జీవితం చ మే దైవతం చ మే దేవ నాపరమ్. 104

టీ. హే దేవ=ఓకృష్ణా, మే=నాకు, ప్రేమదంచ=సంతోషము నిచ్చునదియు, మే=నాకు, కామదంచ=కోరికలనిచ్చునదియు, మే=నాకు, వేదనంచ=జ్ఞానప్రదమును, మే=నాకు, వైభవంచ=ఐశ్వర్యమును, మే=నాకు, జీవనంచ=ప్రాణమును, మే=నాకు, జీవితంచ=బ్రతుకును, మే=నాకు, దైవతంచ=ఇష్టదైవమును, అపరమ్=నీవుగాక మఱియొకటి, న=లేదు.

ఉ. కోరిక లిచ్చినన్ నెనరు గూర్చిన జీవనజీవితమ్ము లే
దారి నొనర్చినం దెలివిఁ దార్చినఁ దల్లియుఁ దండ్రియుంబలెన్
నేరము లోర్చినం దిరుగ నేర్పుగఁ దీర్చినఁ గల్మిఁ జేర్చినన్
భారము నీవె కాని మఱిపంకజనాభ! యెఱుంగ నన్యులన్. 104

తా. ఓస్వామీ! నాకోరికలిచ్చినను క్రియంబుచేసినను జ్ఞానంబునొసంగినను నీవే. నావైభవము, నాప్రాణాధారమగుపదార్థము, నాజీవితము, నాదైవతము, నాపరదేవతయన్నియు. నీవుదప్ప వేరేమియు లేదు.

శ్లో. మాధుర్యేణ విజృమ్భన్తాం వాచో నఽస్తవ వైభవే,
చాపల్యేన వివర్ధన్తాం చిన్తా న స్తవ శైశవే. 105

టీ. నః=మాయొక్క, వాచః=వాక్కులు, తవ = నీయొక్క, వైభవే=కీర్తిని వర్ణించుటయందు, మాధుర్యేణ=తీయఁదనముచే, విజృమ్భన్తామ్=మీఱుఁగాక. నః=మాయొక్క, చిన్తాః=కల్పనలు, తవ=నీయొక్క, శైశవే=బాల్యమందు, చాపల్యేన=లోలతచేత, వివర్ధన్తామ్=పెరుగుఁగాక.

ఉ. ఏను భవత్కథామణుల నెన్నెడుపట్ల మదీయసూక్తినం
తానము మాధురీగుణవితానముఁ జెంది ఘనంగుఁగాత నా
మానసవృత్తి నీదుసుకుమారకిశోరవయోవిహారము
లూని నుతించుపట్ల నతిలోలతఁ గాంచి మెలంగుఁగావుతన్. 105

తా. కృష్ణా! నావాక్కులు నీవైభవమునువర్ణించుటలో మధురములై నిరాటంకముగా సాగుఁగాక. నాధ్యానములు నీబాల్యరూపమందు మిగులఁ జేరిమగంలై ప్రబలుఁగాక.

శ్లో. యాని త్వచ్చరితామృతాని రసనాలేహ్యాని ధన్యాత్మనాం
యే వా చాపలశైశవవ్యతికరా రాధావరాధోన్ముఖాః,
యా వా భావితవేణుగీతగతయో లీలాముఖామ్భోరుహే
ధారావాహికయా వహన్తు హృదయే తాన్యేవ తాన్యేవ మే. 106

టీ. యాని=ఏ, త్వచ్చరితామృతాని=నీకథామృతములు, ధన్యాత్మనామ్=కృతకృత్యులగు మహాత్ములకు,రసనాలేహ్యాని=నాలుకలకుఁ జప్పరింపఁదగినభోగ్యవస్తువులో, యేవా=ఏ, చాపలశైశవవ్యతికరాః=చాపల్యములోఁగూడినచిన్నతనపుఁజేష్టలు, రాధావరాధోన్ముఖాః = రాధనుజగడమునకుఁ జీరుచున్నవియో, లీలాముఖామ్భోరుహే=సొగసుగులుకుచున్న మోముదమ్మియందు, భావిత...తయః = సంభవించు వేణుగానప్రకారములుగలవో, తాన్యేవ తాన్యేవ = అయ్యవియే, హృదయే=నామనస్సున, ధారావాహికయా=ధారలుగట్టిపాఱురీతిచేత, వహన్తు = (ఎడతెరిపిలేకుండుటచేత) ప్రవహించుఁగాక.

మ. అలరున్ ధన్యుల కేకథామృతము జిహ్వాలేహ్య మే బాల్యచా
వలముల్ రాధకు నెయ్యపుంగినుక నాపాదించు నేయందముల్
వెలయున్ మోహమున వేణుగానకలనన్ వేమోము నాదివ్యచ
ర్యలె నామానసవీథి వేడెదను ధారాళంబుగా నిల్వఁగన్. 106

తా. కృష్ణా! ఏనీచరితములు మహానుభావులగుభక్తుల నాలుకలకు లేహ్యములో, యేచిన్నతనపుఁజేష్టలు రాధకు ప్రణయకోపమును గలిగించుచున్నవో, యేనీ వేణుగానములు నీమొగమందు నెలయుచున్నవో, ఇవి యన్నియు నాచిత్తసీమయందు సర్వకాలములయందు మెలంగుచుండుగాక.

శ్లో. భక్తిస్త్వయి స్థిరతరా భగవన్ యది స్యా
ద్దైవేన నః ఫలితదివ్యకిశోరవేషే,
ముక్తిః స్వయం ముకుళితాఞ్జలి సేవతేఽస్మాన్
ధర్మార్థకామగతయః సమయప్రతీక్షాః. 107

టీ. హేభగవన్=షడ్గుణైశ్వర్యయుక్తుఁడవగుకృష్ణా, దైవేన=అదృష్టము చేత, ఫలిత... వేషే=ఫలించిన యమానుష బాలరూపముగల, త్వయి=నీయందు, నః=మాకు, స్థిరతరా=కుదురైన, భక్తిః=అనురాగము, స్యాద్యది=కలిగెనేని, ముక్తిః=మోక్షము, ముకుళితాఞ్జలియథా తథా=మోడ్పుఁజేతులుగలఁగునట్లుగా, అస్మాన్=మమ్మును, స్వయం=తానై, సేవతే=కొలుచుచున్నాఁడు. ధర్మా...తయః=ధర్మ అర్థ కామములపోకలు, సమయప్రతీక్షాః=మాయను గ్రాసమయమునకు వేచియుండును.

ఉ. గోపకుమారవేషమునఁ గూడిననీయెడ భక్తిదైవసం
ప్రాపిత మై మదిన్ దృఢతరంబుగ నిల్చిన ముక్తికన్య నా
దాపునఁ గేలు మోడ్చి సతతంబును గొల్వఁగ వేళఁ జూచు మ
మ్మేపునఁ బిల్చి వీడ్కొలుప నేచినధర్మము నర్థకామముల్. 107

తా. కృష్ణా! దైవవశమున నెటులైన మాకు నీయందు కుదురైన భక్తిగుదిరెనా ముక్తికాంత తనకుఁ దానే మాయండఁజేరి, చేతులుఁగట్టుకొని పరిచర్య సలుపును. ఇఁక ధర్మార్థకామములా మాపంచలఁబడి యెప్పుడు దమ్ము కటాక్షింతుమా యని వేచియుండును.

శ్లో. జయజయజయ దేవ దేవదేవ త్రిభువనమఙ్గళదివ్యనామధేయ,
జయజయజయ బాలకృష్ణ దేవ శ్రవణమనోనయనామృతావతార. 108

టీ. త్రిభు...ధేయ=ముల్లోకములకు మేలుఁగూర్చు దివ్యనామము గలవాఁడా, దేవదేవ=ఎల్లదైవతములకు దైవమా, హేదేవ=లీలారతి గలయోస్వామీ, జయజయ

ఉ. కోరిక లిచ్చినన్ నెనరు గూర్చిన జీవనజీవితమ్ము లే
దారి నొనర్చినం దెలివిఁ దార్చినఁ దల్లియుఁ దండ్రియుంబలెన్
నేరము లోర్చినం దిరుగ నేర్పఁగఁ దీర్చినఁ గల్మిఁ జేర్చినన్
భారము నీవె కాని మఱిపంకజనాభ! యెఱుంగ నన్యులన్. 104

తా. ఓస్వామీ! నాకోరికలిచ్చినను క్రియంబుచేసినను జ్ఞానంబునొసంగినను నీవే. నావైభవము, నాప్రాణాధారమగుపదార్థము, నాజీవితము, నాదైవతము, నాపరదేవతయున్నియు. నీవుదప్ప వేరేమియు లేదు.

శ్లో. మాధుర్యేణ విజృమ్భన్తాం వాచో నస్తవ వైభవే,
చాపల్యేన వివర్ధన్తాం చిన్తా న స్తవ శైశవే. 105

టీ. నః=మాయొక్క, వాచః=వాక్కులు, తవ = నీయొక్క, వైభవే=కీర్తిని వర్ణించుటయందు, మాధుర్యేణ=తీయఁదనముచే, విజృమ్భన్తామ్=మీఱుఁగాక. నః=మాయొక్క, చిన్తాః=కల్పనలు, తవ=నీయొక్క, శైశవే=బాల్యమందు, చాపల్యేన=లోలతచేత, వివర్ధన్తామ్=పెరుగుఁగాక.

ఉ. ఏను భవత్కథామణుల నెన్నెడుపట్ల మదీయసూక్తినం
తానము మాధురీగుణవితానముఁ జెంది పొనంగుఁగాత నా
మానసవృత్తి నీదుసుకుమారకిశోరవయోవిహారము
ల్పూని నుతించుపట్ల నతిలోలతఁ గాంచి మెలంగుఁగావుతన్. 105

తా. కృష్ణా! నావాక్కులు నీవైభవమునువర్ణించుటలో మధురములై నిరాటంకముగా సాగుఁగాక. నాధ్యానములు నీబాల్యరూపమందు మిగులఁ జేరిమగలవై ప్రబలుఁగాక.

శ్లో. యాని త్వచ్చరితామృతాని రసనాలేహ్యాని ధన్యాత్మనాం
యే వా చాపలశైశవవ్యతికరా రాధావరాధోన్ముఖాః,
యా వా భావితవేణుగీతగతయో లీలాముఖామ్భోరుహే
ధారావాహికయా వహన్తు హృదయే తాన్యేవ తాన్యేవ మే. 106

టీ. యాని=ఏ, త్వచ్చరితామృతాని=నీకథామృతములు, ధన్యాత్మనామ్=కృతకృత్యులగు మహాత్ములకు, రసనాలేహ్యాని=నాలుకలకుఁ జప్పరింపఁదగినభోగ్యవస్తువులో, యేవా=ఏ, చాపలశైశవవ్యతికరాః=చాపల్యముతోఁగూడినచిన్నతనపుఁజేష్టలు, రాధావరాధోన్ముఖాః = రాధనుజగడమునకుఁ జీరుచున్నవియో, లీలాముఖామ్భోరుహే=సొగసుగులుకుచున్న మోముదమ్మియందు, భావిత...తయః = సంభవించు వేణుగానప్రకారములుగలవో, తాన్యేవ తాన్యేవ = అయ్యవియే, హృదయే=నామనస్సున, ధారావాహికయా=ధారలుగట్టిపాఱురీతిచేత, వహన్తు = (ఎడతెరిపిలేకుండుటచేత) ప్రవహించుఁగాక.

మ. అలరుఁ ధన్యుల కేకథామృతము జిహ్వాఁ లేహ్యమే బాల్యచా
పలముల్ రాధకు నెయ్యవుంగినుక నాపాదించు నేయందముల్
వెలయుఁ మోహమున వేణుగానకలనఁ వేమూలు నాదివ్యచ
ర్యలె నామానసవీథి వేడెదను ధారాళంబుగా నిల్వఁగన్. 106

తా. కృష్ణా! ఏనీచరితములు మహానుభావులగుభక్తుల నాలుకలకు లేహ్యములో, యే చిన్నతనపుఁజేష్టలు రాధకు ప్రణయకోపమును గలిగించుచున్నవో, యేనీ వేణుగానములు నీమొంగమందు వెలయుచున్నవో, ఇవి యన్నియు నాచిత్తసీమయందు సర్వకాలములయందు మెలంగునుగాక.

శ్లో. భక్తి స్త్వయి స్థిరతరా భగవన్ యది స్యా
ద్దైవేన నః ఫలితదివ్యకిశోరవేషే,
ముక్తిః స్వయంముకుళితాఞ్జలి సేవతేఽస్మాఁ
ధర్మార్థకామగతయః సమయప్రతీక్షాః. 107

టీ. హేభగవన్=షడ్గుణైశ్వర్యయుక్తుఁడవగుకృష్ణా, దైవేన=అదృష్టముచేత, ఫలిత... వేషే=ఫలించిన యమానుషబాలరూపముగల, త్వయి=నీయందు, నః=మాకు, స్థిరతరా=కుదురైన, భక్తిః=అనురాగము, స్యాద్యది=కలిగెనేని, ముక్తిః=మోక్షము, ముకుళితాఞ్జలియథాతథా=మోడ్పుఁజేతులుగలఁగునట్లుగా, అస్మాఁ=మమ్మును, స్వయం=తానై, సేవతే=కొలుచుచున్నాఁడు. ధర్మా...తయః=ధర్మ అర్థ కామములపోకలు, సమయప్రతీక్షాః=మాయనుగ్రహసమయమునకు వేచియుండును.

ఉ. గోపకుమారవేషమునఁ గూడిననీయెడ భక్తిదైవసం
ప్రాపితమై మదిఁ ద్రుఢతరంబుగ నిల్చిన ముక్తికన్య నా
దాపునఁ గేలు మోడ్చి సతతంబును గొల్వఁగ వేళఁ జూచు మ
మ్మేపునఁ బిల్చి వీడ్కొలుప నేచినధర్మము నర్థకామముల్. 107

తా. కృష్ణా! దైవవశమున నెటులైన మాకు నీయందు కుదురైన భక్తిగుదిరెనా ముక్తికాంత తనకుఁ దానే మాయొండఁజేరి, చేతులుఁకట్టుకొని పరిచర్య సలుపును. ఇఁక ధర్మార్థకామములా మాపంచలఁబడి యెప్పుడు దమ్ము కటాక్షింతుమా యని వేచియుండును.

శ్లో. జయజయజయ దేవ దేవదేవ త్రిభువనమఙ్గళదివ్యనామధేయ,
జయజయజయ బాలకృష్ణ దేవశ్రవణమనోనయనామృతావతార. 108

టీ. త్రిభు...ధేయ=ముల్లోకములకు మేలుఁగూర్చు దివ్యనామము గలవాఁడా, దేవదేవ=ఎల్లదైవతములకు దైవమా, హేదేవ=లీలారతి గలయోస్వామీ, జయజయ

జయ=సర్వోత్కృష్టుఁడవుగమ్ము. శ్రవణ... కార=చెవులకు మనసునకు కనులకు అమృత ప్రాయమైన యావిర్భావము గలవాఁడా, బాలకృష్ణదేవ=గోపాలబాలకృష్ణస్వామీ, జయజయజయ=సర్వోత్కర్ష కలిగి యుండుము.

చ. జయజయ దేవ కృష్ణ రిపునైన్యసుహాోద్ధతిఖేదకృద్ధనం
జయజయ కారణా భువనసన్నుతశోభనసామధేయ సం
జయజయబోధసాధక వచశ్శ్రితినేత్రమనోమనోహరా
జయజయ విశ్వజన్మలయశాసన గాఢతమోనిరాసనా. 108

తా. ముల్లోకములకు మంగళప్రద మైనదివ్యనామములుగల దేవదేవుఁడ వైన యోకృష్ణా! జయించుము. కనుటకు వినుటకు తలఁచుటకుఁగూడ మధురమైన దివ్య మంగళవిగ్రహము గల గోపాలకృష్ణా.

శ్లో. తుభ్యం నిర్భరహర్షవర్షవివశావేశస్ఫుటా[1]విర్భవ
ద్భూయశ్చాపలభూషితేషు సుకృతాం భావేషు నిర్భానతే,
శ్రీమద్గోకులమణ్డనాయ మహతే వాచాం విదూరస్ఫుర
న్మాధుర్యైకరసార్ణవాయ మహసే కస్మైచిదస్మై నమః. 109

టీ. నిర్భర... తేషు=పూర్ణానందవర్షముచే మైమఱచిన యావేశముచే జక్కఁగాఁ బయలుపడుచున్న విస్తారమైనతృష్ణచే నొప్పుచున్న, సుకృతాం = పుణ్యవంతుల యొక్క, భావేషు=హృదయములయందు, నిర్భాసతే=స్ఫురించుచున్నదియు, శ్రీమ... నాయ=భాగ్యవంతమైనవ్రేపల్లెకు నలంకారమైనదియు, మహతే=గొప్పదియు, వాచామ్=మాటలకు, విదూరస్ఫురత్=మిక్కిలిదూరమునందు ప్రకాశించు, మాధు...వాయ=సౌభాగ్యమనెడి ప్రధానరసమునకు సముద్రమైన, కస్మైచిత్=అనిర్వాచ్యమైన, అస్మై=ఈ, మహసే=తేజోరూపమయిన, తుభ్యమ్=నీకొఱకు, నమః=నమస్కారము.

శా. ఆనందంబున బాహ్యముల్ మఱచి యాత్మారామలీలారతిక్
ధ్యానుల్ గొల్వఁగ ముంగలన్ సిలిచి వాచాగోచరంబై యశో
దానందాంగణరత్నమై మధురిమాధారార్ణవంబైనయే
దే సత్యుజ్జ్వల పట్టితేజమున కెంతే మ్రొక్కెదన్. 109

తా. పూర్ణానందరసావేశముచే నొడలు మఱచియున్న యోగుల చిత్తసీమల నంటించునదియు, గోకులాలంకారమైనదియు, వాక్కులకు గోచరింపని సౌందర్యమున కునికిపట్టయిన వచింప నలవిగాని యీ తేజోరూపమైన నీకొఱకు నమస్కారము.

---

1 నిర్భరచ్చాపల్యేన విభూషితేషు.

శ్లో.* అనుగ్రహద్విగుణవిశాలలోచనై
రనుస్వనద్విగుణగళద్రవామృతైః,
యతో యతః ప్రసరతి మే విలోచనం
తత స్తతః స్ఫురతు తవైవ వైభవమ్. 110

టీ. మే=నాయొక్క, విలోచనమ్=నేత్రము, యతఃయతః = ఏయేవైపునకు, ప్రసరతి=పోవుచున్నదో, తతః తతః=ఆయావైపులనంతట, తవ=నీయొక్క, వైభవమేవ=శోభయే, అనుగ్రహ...లోచనైః=కరుణచే నినుమడించిన వెడఁదకన్నులతోడను, అను...మృతైః=అనుసరించి పలికించుశబ్దములచేత నిబ్బడిగ స్రవించు పలుకుఁదేనియల సోనలతోడను, స్ఫురతు=మెఱయుఁగాక.

తా. కృష్ణా! నే నేయేసంకలఁజూపుల నిడించెదనో, యాయాచోట్ల దయారసముచే విపులములైన కన్నులతోడను, శ్రవణమధురము లైనగానములతోడను నీరూపమే గోచరించుఁగాక.

శ్లో.* ధన్యానాం సరసానులాపసరణీసౌభాగ్య మభ్యస్యతాం
కర్ణానాం వివరేషు కామపి సుధావృష్టిం దుహానం ముహుః,
వశ్యానాం సుదృశాం మనోనయనయో ర్మగ్నస్య దేవస్య నః
కర్ణానాం వచసాం విజృమ్భిత మహో శ్రీకృష్ణకర్ణామృతమ్. 111

టీ. సరసా...భాగ్యం=తియ్యనిపలుకుల జాడల సొబగును, అభ్యస్యతామ్ = నేర్చువారైన, ధన్యానామ్=కృతకృత్యులయొక్క, కర్ణానామ్=చెవులయొక్క, వివరేషు=రంధ్రములయందు, ముహుః=మాటిమాటికి, కామపి=చెప్పనలవికాని, సుధావృష్టిమ్=అమృతప్రవాహను, దుహానమ్ = కురియుచున్నదగు, శ్రీకృష్ణకర్ణామృతమ్= శ్రీకృష్ణకర్ణామృతమను నీగ్రంథము, వశ్యానామ్=భక్తివశులైన, సుదృశామ్=పండితులయొక్క, (స్త్రీలయొక్క) మనోనయనయోః=మనస్సునందును గన్నులయందును, మగ్నస్య=మునిఁగిన, నః=మాయొక్క, దేవస్య=శ్రీకృష్ణస్వామియొక్కయు, కర్ణానామ్=చెవులయొక్కయు, వచసాం=మాటలయొక్కయు, విజృమ్భితం=పొరలిక, అహో=ఔరా.

తా. సొగసైనమాటలనీటును నేరువఁదలఁచువారికిఁ గర్ణమధురముగనుక నే కర్ణామృత మనఁబడు నీగ్రంథము యోగి మనోనివాసి యైన శ్రీకృష్ణుని తన్మయము లైన మాకర్ణములయొక్కయు వాక్కులయొక్కయు విజృంభణమే.

శ్లో. ఈశానదేవచరణాభరణేవ నీవీ
దామోదరస్థిరయశః స్తబకోద్గమేన,

* ఈశ్లోకములు కొన్ని ప్రతులలోఁ గానరావు. తెనిఁగింపఁబడను గూడలేదు. కాఁబట్టి ప్రక్షిప్తములని తోఁచెడిని.

లీలాశుకేన రచితం తవ దేవ కృష్ణ
కర్ణామృతం వహతు కల్పశతాన్తరేఽపి. 112

టీ. హేదేవ=ఓదేవా, కృష్ణ=కృష్ణా, ఈశాన.. శేవ=శ్రీశివుని పాదములె సొమ్ముగాఁగలవాఁడును, నిధి...మేన = మూలధనమగు శ్రీకృష్ణుని స్థిరమగు కీర్తియనెడి పూగుత్తి కున్ముఖుఁడైయున్న, లీలాశుకేన=లీలాశుకుఁడనుకవి (విలాసపుఁజిలుక) చేత, రచితమ్=నిర్మింపఁబడిన, తవ=నీయొక్క, కర్ణామృతమ్=శ్రోత్రమధుర మగు కర్ణామృతమను నీగ్రంథము, కల్పశతాన్తరేఽపి=నూఱులకొలఁది కల్పములయందుఁ గూడ, వహతు=వెలయుఁగాక.

మ. ఫలవాంఛన్ హరికీర్తిగుచ్ఛరతియున్ ఫాలాక్షునంసేవయున్
గలలీలాశుకవాక్యముల్ దెనుఁగునం గర్ణామృతఖ్యాతిగా
నలరం జెప్పితి వెల్లపూడిమణిపెద్దామాత్యవెంగన్న నే
నలరుందోయిలిమాడ్కిఁ గైకొనుము కృష్ణా కల్పసంస్థాయిగాన్. 112

తా. కృష్ణా! శివపాదభక్తుఁడును, పండునుదినగోరి పూగుత్తినాశ్రయించు చిలుకమాడ్కి మోక్షార్థియై నీకీర్తియందు మిగులనాసగల లీలాశుకుఁ డనుకవిచే రచియింపఁబడి శ్రోత్రపేయ మైనయీకర్ణామృత మనుగ్రంథము కల్పశతములైనను చలనము లేక నీయందనుండుఁగాక.

మాలిని. తనుజితజలవాహా దారితశ్వేతవాహా
జననకృతతమోహా శాంతదుర్గాంతమోహా
యనఘగుణసమూహా యార్తరక్షన్సమూహా
వినతవినయగేహా వేంకటాహార్యగేహా.

మ. ఇది కృష్ణాశ్రయయోగిపుంగవకృతావీక్షాత్తసారస్వతా
భ్యుదయశ్రీవిభవప్రసిద్ధచిదచిద్బోధక్షమాశాంతిస
త్త్వదయాభూషణ వెల్లపూడిమణిపెద్దామాత్యవెంగాగ్రణీ
గదితాశ్వాసము పొల్చుఁ బ్రాథమికమై కర్ణామృతశ్రీకృతిన్.

శ్రీ కృ ష్ణ క ర్ణా మృ త ము
ప్ర థ మా శ్వా స ము.

———

# ద్వితీయాశ్వాసము.



శ్లో. అభినవనవనీతస్నిగ్ధ మాపీతదుగ్ధం
దధికణపరిదిగ్ధం ముగ్ధ మఙ్గం మురారేః,
దిశతు భువనకృచ్ఛ్రచ్ఛేది తాపిఞ్ఛగుచ్ఛ
చ్ఛవి నవశిఖిపిఞ్ఛాలాఞ్ఛితం వాఞ్ఛితం నః. 1

టీ. అభినవ...స్నిగ్ధమ్=అపుడు చిలికి యెత్తినవెన్నవలె (చేత) మిసమిసలాడునదియు, ఆపీతదుగ్ధమ్=దప్పిదీఱునట్లు త్రాగఁబడిన పాలుగలదియు, దధి...దగ్ధమ్=పెరుఁగుచిరుదుపలచేఁ బూయఁబడినదియు, భువన...ఛేది=లోకములయాపదలను బాపునదియు, తాపింఛగుచ్ఛచ్ఛవి=కానుగుగుత్తికాంతివంటికాంతిగలదియు, నవ...లాఞ్ఛితమ్ = క్రొత్తనెమ్మిపురిచే నలంకరింపఁబడిన, ముగ్ధమ్ = సుందరమైన, మురారేః= కృష్ణునియొక్క, అఙ్గమ్=ఒడలు, నః=మాయొక్క, వాఞ్ఛితం = కోరికను, దిశతు= ఇచ్చుఁగాక.

శా. తాపింఛచ్ఛవియై వినీలనవనీతస్నిగ్ధమై ముగ్ధమై
యాపీతామితదుగ్ధమై దధికణాకాదిగ్ధమై లోకకృ
చ్ఛ్రాపచ్ఛేదకమై సునీలశిఖిపింఛాలాంఛితంబై నశ్రీ
గోపాలప్రభుమూర్తి వాంఛిత మొసంగున్ మాకు నశ్రాంతమున్. 1

తా. క్రొత్తవెన్నెలవలె(చేత) నునుపైనదియు, పూర్ణముగాఁ బాలుద్రావినదియు, పెరుఁగుచిరుదుపలచే నిండినదియు, లోకముల యమంగళము శాంతింపఁజేయునదియు, కానుగుగుబురువలె నల్లనైనదియు, క్రొత్తనెమ్మిపురిని దాల్చినదియు, సుందరమునైన శ్రీకృష్ణునితనువు నాకోరికల నీడేరుచుఁ గాక.

శ్లో. యాం దృష్ట్వా యమునాం పిపాసు రనిశం వ్యూహో గవాం గాహతే
విద్యుత్వా నితి నీలకణ్ఠనివహో యాం ద్రష్టు ముత్కణ్ఠతే,
ఉత్తంసాయ తమాలపల్లవ మితి ఛిన్దన్తి యాం గోపికాః
కాన్తిః కాళియశాసనస్య వపుషః సా పావనీ పాతు నః. 2

టీ. పిపాసుః=దప్పిగొనియున్న, గవామ్=గోవులయొక్క, వ్యూహః=మంద, యాం=ఏకాంతిని, యమునాం=యమునానదిగా, దృష్ట్వా=చూచి(తలఁచి), అనిశమ్=

ఎల్లవేళలయందును (పలుమారు), గాహతే=ప్రవేశించుచున్నదో, యాం=ఏకాంతిని, కలకణ్ఠనివహాః=నెమిళ్లగుంపు, విద్యుత్వానితి=మొయిలని, ద్రష్టుం=చూచుటకొఱకు, ఉత్కణ్ఠతే=వేడుకపడుచున్నదో, గోపికాః=గొల్లకలు (గోపికలు), యాం=ఏకాంతిని, తమాలపల్లవమితి=నల్లకానుగుచిగురని తలఁచి, ఉత్తంసాయ = శిరోభూషణముకొఱకు, ఛిన్దన్తి=త్రుంచుచున్నారో, పావనీ=పవిత్రమైన, సా=అట్టి, కాళియశాసనస్య=కాళియుని మర్దించిన శ్రీకృష్ణునియొక్క, వపుషః=మేనియొక్క, కాన్తిః=రంగు, నః=మమ్ముల, పాతు=బ్రోచుఁగాక.

చ. అనిశము యామునాంబు విది యానెద మంచును గోగణంబు లె
ల్లను జొర బర్హిపంక్తులు నలాహక మంచును వేడ్కతోడఁ గ
న్గొనఁగఁ దమాలపల్లవము గొప్పున కౌ నని గోపకామినుల్
చిదుమఁగ నొప్పుకృష్ణునివిశేషతనుద్యుతి నన్నుఁ బ్రోచుతన్. 2

తా. నల్లగానుంటచే యమునాజల మని భ్రమసి క్రేపులు ఏరుద్రావఁబోఁగా, మొగిలని తలఁచి నెమ్మిగుంపులు కిచ్చనడి మాడఁగా, కానుఁగుచిగుళ్లని తలఁచి గొల్లపడఁతులు తుంపి తల దాల్పబోఁజూడఁగా మెఱయుచున్న జగన్మంగళకరమైన యీకృష్ణుని మేనికాంతి మమ్ముఁ బ్రోచుఁగాక.

*శ్లో. దేవః పాయా త్పయసి విమలే యామునే మజ్జతీనాం
యాచన్తీనా మనునయపదై ర్వఞ్చితా న్యంశుకాని,
లజ్జాలోలై రలసవిలసై రున్మిషత్పఞ్చబాణై
ర్గోపస్త్రీణాం నయనకుసుమై రర్చితః కేశవో నః. 3

టీ. విమలే=స్వచ్ఛమైన, యామునే=యమునానదిసంబంధమగు, పయసి=ఉదకమందు, మజ్జతీనాం=స్నానముచేయుచున్నవారును, వఞ్చితాని=మోసపుచ్చికొనిపోఁబడిన, అంశుకాని=చీరలను, అనునయపదైః=బుజ్జగింపుమాటలచేత, యాచన్తీనాం=అడుగుచున్నవారునునగు, గోపస్త్రీణాం=గొల్లకాంతలయొక్క, లజ్జాలోలైః=సిగ్గుచేఁ జెదరుచున్నవియు, అలసవిలసైః = సౌమ్యములగుటచే ప్రకాశించుచున్న, ఉన్మిషత్పంచబాణైః=ఉన్మిషత్ = ప్రకాశించుచున్నటువంటి, పంచబాణైః = ఉదయించుచున్న మన్మథుఁడు గలవియును అగు, నయనకుసుమైః=పూవులవంటికనులచేత, అర్చితః = పూజింపఁబడిన, కేశవః దేవః = శ్రీకృష్ణదేవుఁడు, నః=మమ్ము, పాయాత్=రక్షించుఁగాక.

---

* ఈశ్లోకము గోపాలకృష్ణమంత్రరాజమందలి వస్త్రాపహరణప్రయోగధ్యానమని సనత్కుమారసంహితయందుఁ జెప్పఁబడినది.

మ. యమునావేణికఁ గ్రుంకుచుండు గోపికలు నీరార్ద్ర స్వకీయాంశుకా
ఘములన్ దాఁచఁగ సిగ్గుచే మృదులవాక్యప్రార్థితో వేడుకన్
సముదంచన్మదవాలసోల్లననిరీక్షానీలనీరేజమా
ల్యములన్ వారలు పూజసేయఁ దగునయ్యబ్జాక్షు సేవించెదన్. 3

తా. యమునలోఁ గ్రుంకులిడుచుండఁగాఁ గన్మొఱఁగి దొంగిలించిన చీరలను వేఁడుచున్న గోపకామినుల సిగ్గుతోడివిలాసముగల మదనోద్దీపకములైన నేత్రపుష్పములచేఁ బూజింపఁబడినకృష్ణుఁడు మమ్ముఁ గాచుఁగాక.

శ్లో. మాత ర్నాతః పర మనుచితం యత్ఖలానాం పురస్తా
దస్తాశఙ్కం జఠరపిఠరీపూర్తయే నర్తితాఽసి,
తత్క్షన్తవ్యం సహజసరళే వత్సలే వాణి! కుర్యాం
ప్రాయశ్చిత్తం గుణగణనయా గోపవేషస్య విష్ణోః. 4

టీ. సహజసరళే=సహజముగానే సౌమ్యురాలగుదానా, వత్సలే=పుత్రప్రేమ గలదానా, మాతః=ఓయమ్మా, వాణి=సరస్వతీ, జఠరపిఠరీపూర్తయే=బానవంటి కడుపును నించుకొనుటకొఱకు, ఖలానాం=దుష్టులయొక్క, పురస్తాత్=ఎదుట, అస్తాశంకం యథాతథా=సిగ్గులేనట్లుగా, త్వం=నీవు, మయా=నాచేత, నర్తితాసీతి యత్=ఆడింపఁబడితివనుట యేదిగలదో, అతః పరం=ఇంతకంటెవేఱైన, అనుచితమ్=కూడనిపని, న=లేదు. తత్=ఆనాతప్పిదము, క్షన్తవ్యం=సైఁపఁదగినది. గోపవేషస్య=గోపాలరూపుఁడైన, విష్ణోః=వెన్నునియొక్క, గుణగణనయా=కల్యాణగుణములయెన్నికచేత, ప్రాయశ్చిత్తమ్=పవిత్రీకరణకర్మను, కుర్యామ్=చేయుచును.

చ. ఉదరము నించఁ గోరి ఖలు లుండెడుతావులు సేరి వారిక
ట్టెదుట నశంక నిన్ను నటియింపఁగఁ జేసినపాతకంబులన్
సదయత నోర్వఁగా వలెఁ బ్రసన్నమతిన్ ననుఁ గన్నతల్లి శా
రద యదువంశనాయకుని ప్రస్తుతి నిష్కృతి నే నొనర్చెదన్. 4

తా. స్వభావసిద్ధంబగు ఋజుత్వంబు గలిగిననిమిత్తంబున మదీయప్రార్థనంబు విఫలంబు సేయనోపకయుండి జగంబులకెల్లఁ దల్లియైనకతంబున నాకుం దల్లివై యత్యంతదయావతివై మదీయవాగ్రూపంబునఁ బరిణమించిన ఓఅమ్మా! సరస్వతీ! నాయపరాధము సైపుము. నిన్ను పొట్టకొఱకై పలువురునీచులయొద్ద వినియోగించితిని. ఇంతకంటె నీకు వేఱైనయవమానము లేదు. అయినను ఇప్పుడు శ్రీకృష్ణుని కల్యాణగుణవర్ణనముచేసి యాదోషముఁ బాపుకొందును. నన్ను కరుణింపుము.

శ్లో. అఙ్గుళ్యగ్రైరరుణకిరణై ర్ముక్తసంరుద్ధరన్ధ్రం
వారంవారం వదనమరుతా వేణుమాపూరయన్తమ్,
వ్యత్యస్తాఙ్ఘ్రిం వికచకమలచ్ఛాయవిస్తారినేత్రం
వన్దే బృన్దావనసుచరితం నన్దగోపాలసూనుమ్. 5

విహారితమ్,

టీ. అరుణకిరణైః=ఎఱ్ఱనికాంతులుగల, అఙ్గుళ్యగ్రైః=కొనవ్రేళ్లచేత, ముక్త... రన్ధ్రమ్=తెఱచి మూయఁబడిన సుషిరములు గలిగిన, వేణుమ్=పిల్లనగ్రోవిని, వదనమరుతా=ముఖమారుతముచేత, వారంవారం=తేపతేపకు, అపూరయన్తం=నిండించుచున్నవాఁడును, వ్యత్యస్తాఙ్ఘ్రిం=ఎచ్చుతక్కుగా నిడఁబడిన పాదములుగలవాఁడును, వికచ...నేత్రం=పూచినవెల్లదామరలకాంతివంటి కాంతిని విరియఁజేయుకన్నులుగలవాఁడును, బృన్దావనసుచరితమ్=తులసితోఁటయందు మక్కువమీఱఁ జరించువాఁడును నగు, నన్దగోపాలసూనుం=నందుఁడను గొల్లనికొడుకైన కృష్ణునిగూర్చి, వందే=నమస్కరించుచున్నాను.

మ. అరుణశ్రీ దళుకొత్తు నంగుళుల నొయ్యం గప్పుచుం విప్పుచుం
మురళీరంధ్రము లాస్యమారుతమునం బూరించు చొయ్యారమై
చరణద్వంద్వము మార్చుచుం నిలుచుకంజాతాయతాలోకభా
సురబృందావనమందిరాంతరచరిష్ణుం గృష్ణుఁ గీర్తించెదన్ సేవించెదన్ 5

తా. ఒకయడుగుముందునకు నొకయడుగు వెనుకకుఁ బెట్టి నిలిచి ఎఱ్ఱనివ్రేళ్లకొనలతోఁ బిల్లఁగ్రోవిరంధ్రములను మూయుచుఁ దెఱచుచుఁ దేపతేపకు ముఖవాయువుచేఁ బిల్లఁగ్రోవి నూఁదుచు విరియఁబూచినతామరలవంటి కందోయిని ద్రిప్పుకొంచు తులసితోఁటలయందుఁ దిరుగుచున్న గోపాలకృష్ణమూర్తికి నమస్కారము.

శ్లో. మన్దం మన్దం మధురనినదైర్వేణుమాపూరయన్తం
బృన్దం బృన్దావనభువి గవాం చారయన్తం చరన్తమ్,
ఛన్దోభాగే శతముఖముఖధ్వంసినాం దానవానాం
హన్తారం తం కథయ రసనే! గోపకన్యాభుజఙ్గమ్. 6

టీ. హేరసనే=ఓనాలుకా, మధురనినదైః=తీయనిమ్రోఁతలచే, మన్దంమన్దమ్=తిన్నతిన్నగా, వేణుం=పిల్లఁగ్రోవిని, అపూరయన్తం=నిండించుచున్నవాఁడును, బృన్దావనభువి=తులసితోఁటయందు, గవాం=గ్రేపులయొక్క, బృన్దం=మందను, చారయన్తం=త్రిప్పుచున్నవాఁడును, ఛన్దోభాగే=వేదవాక్యమందు, చరన్తం=మెలఁగుచున్నవాఁడును, శత...సినాం=దేవేంద్రుని యాగమును పాడుచేసిన, దానవానాం=రాక్షసులకు, హన్తారం=సంహారకుఁడును, గోపకన్యాభుజఙ్గమ్=గోపికాజారుఁడైన, తమ్=ఆకృష్ణుని, కథయ=పొగడుము.

శా. బృందారణ్యతరుప్రదేశముల గోబృందంబులం మేపుచుం
మందం బౌమధురధ్వనిం మురళీ బల్మాటుం వినోదించుచుం
ఛందోవీథిం జరించుచుం విమతరక్షఃస్తోమవిధ్వంసనా
నందుం డైన వ్రజాంగనావిభు రసజ్ఞా ! ప్రజ్ఞం గీర్తింపుమా. 6

తా. ఓనాలుకా! మెల్లగాఁ బిల్లనగ్రోవి నూదుకొనుచుఁ దులసితోఁటలో గోవులమేఁపుచు విలాసముగాఁ జూచుచున్నవాఁడును, వేదములయందు వర్ణింపఁబడినవాఁడును, దేవేంద్రునియాగవిఘ్నకారులైన రాక్షసులఁ బరిమార్చిన గోపికాజారుఁడగు కృష్ణుని గీర్తింపుము.

శ్లో. *వేణీమూలే విరచితఘనశ్యామపిఞ్ఛావచూడో
విద్యుల్లేఖావలయిత ఇవ స్నిగ్ధపీతామ్బరేణ,
మా మాలిఙ్గ న్మరకతమణి స్తమ్భగమ్భీరబాహుః
స్వప్నే దృష్ట స్తరుణతులసీభూషణో నీలమేఘః. 7

టీ. వేణీమూలే=జుట్టుమొదట, విరచిత,..చూడః = చెరువఁబడిన మెయిలునలుపు గలనెమిలిపురియునెడు శిరోభూషణముగలవాఁడును, స్నిగ్ధపీతామ్బరేణ= మెఱుఁగుపట్టుదోవతిచేత, విద్యుల్లేఖావలయితఇవ = మెఱుఁగుఁదీఁగచేఁ జుట్టఁబడినవానివలె నున్నవాఁడును, మర...బాహుః=ఇంద్రనీలపుఁ గంబములవలె గురువులైన భుజములుగలవాఁడును, తరు...షణః = లేఁతతులసియే యలంకారముగాఁ గలవాఁడును, అగు, నీలమేఘః = కృష్ణమేఘము, మాం=లక్ష్మీదేవిని, ఆలిఙ్గన్ = కౌఁగిలించుకొనినవాఁడై, స్వప్నే=కలలో, దృష్టః=చూడఁబడెను.

చ. అలరుమెఱుంగురంగు గలహాటకశాటికమౌళిపాళి భా
సిలునవపింఛకంబు తులసీదళదామముఁ గల్గినట్టిమే
ఘలలితమూర్తి మానికపుఁగంబముఁబోనిభుజద్వయంబుచే
నలమి రమావధూటిఁ జెలువందఁ గలం గనుపించె నింపుగన్. 7

తా. కేశకలాపమున నెమలిపురిం జెరువుకొని, మెఱుపువన్నె పట్టుదోవతిగట్టి, తులసిపేరులఁదాల్చి, ఇంద్రనీలమణిస్తంభములవంటి బాహువులు గలకృష్ణమేఘము లక్ష్మీసనాథుఁడై నాస్వప్నమునఁ బొడసూపెను.

---

* ఈశ్లోకార్థంబు గోపాలకృష్ణషోడశాక్షరమంత్రధ్యానంబని సనత్కుమారసంహితయందు జెప్పఁబడినది.

శ్లో.*కృష్ణే హృత్వా నిచయనిచయం కూలకుఞ్జాధిరూఢే
ముగ్ధా కాచి న్ముహురనునయైః కిన్త్వితి వ్యాహరన్తీ,
సభ్రూభఙ్గం సదరహసితం సత్రపం సానురాగం
ఛాయా శౌరేః కరతలగతా న్యమ్బరా ణ్యాచకర్ష. ౮

టీ. నిచయనిచయం=కోకలమోపును, హృత్వా=దొంగిలించి, కృష్ణే=శ్రీకృష్ణుఁడు, కూలకుఞ్జాధిరూఢే=(యమున) యొడ్డుననున్న పొదదూఱినవాఁడగుచుండఁగా, కాచిత్=ఒకానొక, ముగ్ధా=యౌవనారంభమందున్న ముద్దరాలు, ముహుః=తేపతేపకు, అనునయైః=బుజ్జగింపుమాటలచే, కింసు ఇతి=ఏమిరా యని, వ్యాహరన్తీ=పలుకుచున్నదై, సభ్రూభఙ్గం = బొమముడితోఁ గూడునట్లు, సదరహసితం=చిరునగవుతోఁగూడునట్లు, సత్రపం=సిగ్గుతోఁగూడినట్లు, సానురాగం=స్నేహముతోఁ గూడునట్లు, ఛాయాశౌరేః=ప్రతిబింబకృష్ణునియొక్క, కరతలగతాని=చేతనున్న, అమ్బరాణి=పటములను, ఆచకర్ష=లాగెను.

ఉ. కోకలు ముచ్చిలించి తటకుంజగృహంబున నిల్వ సిగ్గునున్
భ్రూకుటియున్ దరస్మితనిరూఢియుఁ బ్రేమముఁ దోఁప గట్టుకున్
రాక యి దేమిరా తగదురా యని ముగ్ధవధూటి నీటిలోఁ
జేకొనఁ బూని నీడ యగుచిన్నిముకుందునిచేలిచేలముల్. ౮

తా. యమునలో గోపికలు జలకమాడుచుండ గట్టుననున్నకోకలను గృష్ణుఁడు దొంగిలించి, గట్టుననున్న పొదలోఁ జొరఁబడఁగా నొకముగుద ఏమిరాయిది యని బుజ్జగించుచు, బొమలు చిట్లించుచు, చిఱునగవునగుచు, లజ్జతోడను, స్నేహముతోడను గూడి నీటఁ బ్రతిఫలిత మైనకృష్ణునినీడయొక్క చేలిబట్టలను బట్టి లాగుచున్నది.

శ్లో.అపి జనుషి పరస్మి, న్నాత్తపుణ్యోభవేయం
తటభువి యమునాయా స్తాదృశో వంశనాళః,
అనుభవతి య ఏష శ్రీమదాభీరసూనో
రధరమణినమీపన్యాసధన్యా మవస్థామ్. ౯

టీ.యః=ఏ,ఏషః=ఈవంశనాళము,శ్రీమదాభీరసూనోః=సంపన్నుఁడైన నందగోపకుమారునియొక్క, అధర...ధన్యామ్ = మోవిరతనము చెంతనునికిచేఁ గృతార్థము, అవస్థానమ్=ఉనికిని, అనుభవతి = కాంచుచున్నదో, పరస్మిన్=మఱియొక, జనుష్యపి=జన్మమందైనను, ఆత్తపుణ్యః=పుణ్యములఁ బ్రోవు చేసికొనినవాఁడనై, యమునా

* ఈశ్లోకార్థము గోపాలకృష్ణమంత్రరాజవస్త్రాపకర్షణప్రయోగధ్యానమని గోపాలకల్పమందుఁ జెప్పఁబడినది.

యాః=యమునానదియొక్క, తటభువి=ఒడ్డున, తాదృశః=అట్టివంశనాళః=వెదురు కోడగా, భవేయం=అగుదునా?

ఉ. వంశతనూజుమోవిరతిసంబునమీపముఁ జేరి ధన్యతం
బొందెఁ గళిందజాతటముపొంత వసించినవంశనాళ మా
యుందముఁ గాంతునొక్కొ జననాంతర మంది యశేషసత్క్రియా
బృందము వెంటనంటి ఫలమియ్యఁగఁ గోర్కులపంట పండఁగన్. 9

తా. ఈబొంగు వెదురుపిల్లఁగ్రోవి యై శ్రీకృష్ణునిమోవిచెంత నునికిఁ గని కృతకృత్య మయినట్లు నేను మఱుజన్మమునకైన బహుపుణ్యములనార్జించి, యమున యొడ్డున నానంశనాళముగ బుట్టఁగలనా అని యొకవ్రేత దలఁచెను.

శ్లో. అయి పరిచిను చేతః ప్రాతరమ్భోజనేత్రం
కబరకలితచఞ్చత్పిఞ్ఛదామాభిరామమ్,
వలభిదుపలనీలం వల్లవీభాగధేయం
నిఖిలనిగమవల్లీమూలకన్దం ముకున్దమ్. 10

టీ. అయిచేతః=ఓమనసా, ప్రాత...నేత్రం=ప్రొద్దుపొడుపునందలి కమలమువంటి కన్నులుగలవాఁడును, కబర...రామం=సిగయందుఁ జుట్టఁబడిన యందమైన నెమ్మిపురిచే సుందరమైనవాఁడును, వల...నీలం=ఇంద్రనీలమువలె నల్లనైనవాఁడును, వల్లవీభాగధేయం = గోపికలభాగ్యమయినవాఁడును, నిఖిల...కన్దం=ఎల్ల శ్రుతిలతలకు మొదలిదుంపయయినగు, ముకున్దం=కృష్ణుని, పరిచిను=పరిచయముచేయుము.(వెదకుము).

మ. లలితాంభోరుహనేత్రు గోపరమణీలావణ్యపాత్రుఁ దను
జ్జ్వలపౌరందరనీలగాత్రుఁ గచకాంచత్పింఛలీలుఁ డని
ర్మలవేదాంతలతాలవాలు మురళీసంగీతలోలుఁ దయా
నిలయుఁ సమ్మతిమీఱఁ గోరి మనమా నిత్యంబు సేవింపుమా. 10

తా. ఓమనమా! రేపటి తామరలవంటికన్నులుగలవాఁడును, నెమిలిపురిఁ జెరివిన సిగచే నొప్పినవాఁడును, ఇంద్రనీలముభాతి నల్లనైనవాఁడును, గోపికల నిక్షేపమును, వేదప్రఁదిఁగెలకెల్ల మొదటిదుంపయగువాఁడును నగుకృష్ణుని వెదకుము (పరిచయము చేయుము).

శ్లో. అయి మురళి ముకున్దస్మేరవక్త్రారవిన్ద
శ్వసనమధురసజ్ఞే త్వాం ప్రణమ్యాద్య యాచే,
అధరమణినమీపం ప్రాప్తవత్యాం భవత్యాం
కథయ రహసి కర్ణే మద్దశాం నన్దసూనోః. 11

టీ. ముకున్ద...రసజ్ఞే = వెన్ననిచిఱునగవు దొలుకు మోముఁదామరయందలి యూరుపుదేనె సారస్యము నెఱిఁగిన,అయి మురళి=ఓపిల్లఁగ్రోవీ, త్వాం=నిన్నుగూర్చి, ప్రణమ్య=మ్రొక్కి, అద్య=ఇపుడు, యాచే=(ఒకదాని) వేఁడుచున్నాను.భవత్యాం= నీవు; అధరమణిసమీపం=మోవిరతనముచేరువను, ప్రాప్తవత్యాం=పొందిన దానవగు చుండఁగా, నన్దసూనోః=శ్రీకృష్ణునియొక్క, కర్ణే=చెవిలో, రహసి=ఏకాంతమందు, మద్వార్తాం=నాపాటును, కథయ=చెప్పుము.

చ. హరియధరాంతికస్థలవిహారముననా స్మితపూర్ణపక్త్రితా
మరసనమీరసీధురసమాధురిఁ జెందిననిన్ను వేఁడెద
న్మురళిరో నందసూను మది నూల్కొనఁ గాఁ జెవిదండ నుండి యె
వ్వరు వినకుండ నాదువలవంత సమస్తముఁ దెల్పు మ్రొక్కెదన్. 11

తా. కృష్ణుని నగుమోము దామరయందలి తేనె వాసనరుచి యెఱిఁగిన యో వేణుఖండమా! నిన్ను మోడ్పుగేలుతో నొకదాని వేఁడుచున్నాను. నీవు కృష్ణుని పెదవి దగ్గరఁ జేరినప్పుడు స్వామిచెవిలో రహస్యముగ నాదీనదశను గట్టిగా నచ్చఁజెప్పుము.

శ్లో.సజలజలదనీలం వల్లవీకేళిలోలం
శ్రితసురతరుమూలం విద్యుదుల్లాసిచేలమ్,
సురరిపుకులకాలం సన్మనోబిమ్బలీలం
నతసురమునిజాలం నౌమి గోపాలబాలమ్. 12

టీ. సజలజలదనీలమ్=నీరునిండినమబ్బువలె నల్లనైనవాఁడును, వల్లవీకేళిలోలమ్= గోపికలతో నాడవేడుకగలవాఁడును, శ్రితసురతరుమూలం=ఆశ్రయించినకల్పవృక్ష మూలుగలవాఁడును, విద్యు...చేలం=మెఱుపువలెమెఱయుధోవతి గలవాఁడును, సుర ...కాలం=రాక్షసులకు యమునివంటివాఁడును, సన్మనోబిమ్బలీలమ్=సజ్జనులచిత్తము లయందు బింబరూపముగాఁ గ్రీడించువాఁడును, నత...జాలం=మ్రొక్కఁబడిన దేవ మునిసంఘము గలవాఁడునునగు, గోపాలబాలం = గోపాలకృష్ణునిఁగూర్చి, నౌమి= మ్రొక్కుచున్నాను.

మ. సజలాంభోధరజాలనీలవిలసత్సౌదామినీచేలునిన్
వ్రజభామానవకేళిలోలుని సుపర్వద్వేషకృత్కాలునిన్
ద్విజరాణ్ణాసనబింబలీలుని శ్రితాదిత్యద్రుమావాలుని
న్భజియింతున్ మది గోపబాలు నతనానాదేవతాజాలునిన్. 12

తా. నీరుమబ్బువలె నల్లనివాఁడును, గోపకాంతలతోఁ గ్రీడించువాఁడును కల్పవృక్షమూలమునఁజేరినవాఁడును, మెఱుపువలె మెఱయుపట్టుధోవతి గలవాఁడును,

రాక్షసులపాలిటి యముఁడును, పండితుల చిత్తములయందుండువాఁడును, మ్రొక్కఁబడిన దేవమునులు గలవాఁడు నగు గోపాలబాలకృష్ణునికి నమస్కారము.

శ్లో. *అధరబిమ్బవిడమ్బితవిద్రుమం మధురవేణునినాదవినోదినమ్,
కమలకోమలకమ్రముఖామ్బుజం కమపి గోపకుమార ముపాస్మహే.

టీ. అధర...విద్రుమం=దొండపండువంటి పెదవిచేత నవమానింపఁబడిన పవడముగలవాఁడును, మధుర..దినం = తీయని పిల్లఁగ్రోవి మ్రోఁతయందు దవిలినవాఁడును, కమల...మ్బుజం=కమలమువలె నందమైన మోమందమ్మి గలవాఁడును, కమపి=అనిర్వాచ్యస్వరూపముగల, గోపకుమారమ్ = గొల్లకుఱ్ఱని, ఉపాస్మహే = ఉపాసించెదను.

మ. మురళీనాదమధూళికాకలితసమ్మోదుఁ సుధాసారమే
దురబింబాధరధూతవిద్రుమవినోదుఁ రాధికాంఘ్రిద్వయీ
వరలాక్షాలసమానఫాలతలు శ్రీవత్సాంకవక్షఃస్థలుఁ
సరసీజాతమనోహరాననుఁ మదిం జక్రాయుధుం గొల్చెదన్. 13

తా. దొండపండుపగడముల మించు మోవిసొబఁగుగలవాఁడును, శ్రోత్రపేయమగువేణుగానముచే వేడుకమీఱి యున్నవాఁడును, తామర సొంపుగలమోము గలవాఁడును, ఆనిర్వాచ్యరూపుఁడైన గోపాలకృష్ణు నుపాసించెదను.

శ్లో. అధరే వినివేశ్య వంశనాళం వివరా ణ్యస్య సలీల మఙ్గులీభిః,
ముహురన్తరయన్ముహుర్వివృణ్వ న్మధురం గాయతి మాధవో వనాన్తే.

టీ. మాధవః=కృష్ణుఁడు, అధరే=పెదవియందు, వంశనాళం=పిల్లఁగ్రోవిని, వినివేశ్య=పెట్టుకొని, అస్య=ఈ వేణువుయొక్క, వివరాణి=రంధ్రములను, సలీలం=అందముగా, అఙ్గులీభిః=వ్రేళ్లచేత, ముహుః = తేపకు, అన్తరయన్=మూయుచున్నవాఁడై, ముహుః=మాటిమాటికి, వివృణ్వన్=తెఱచుచున్నవాఁడై, వనాన్తే=బృందావనదేశమందు, మధురం=ఇంపుగా, గాయతి=పాడుచున్నాఁడు.

ఉ. నెమ్మది యామునాంతరవనిఁ బసియించుచుఁ గావిమోవి నం
దమ్ముగ వంశిఁ గీల్కొలిపి తద్వివరమ్ముల నంగుళీతతిం
గ్రమ్ముచుఁ జిమ్ముచుఁ శ్రుతిసుఖమ్ముగ గానముఁ దానమానముల్
గ్రుమ్మని మ్రోయఁజేయురసికుం గనుఁగొంటిరె కంటి కింపుగన్. 14

తా. శ్రీకృష్ణుఁడు బృందావనమందు నోటఁ బిల్లఁగ్రోవిని గఱచుకొని వ్రేళ్లతో దానిరంధ్రములను సొగసుగామూసి తెఱచుచు వినోదముగాఁ బాడుచున్నాఁడు.

---

*ఈశ్లోకార్థము గోపాలకృష్ణద్వాదశాక్షరీమంత్రధ్యాన మని సనత్కుమారసంహితయందుఁ జెప్పఁబడినది.

శ్లో. వదనే నవనీతగన్ధవాహం వచనే తస్కరచాతురీధురీణమ్,
నయనే కుహనాశ్రు మాశ్రయేథా శ్చరణే కోమలతాణ్డవం కుమారమ్.

టీ. వదనే=ముఖమందు, నవనీతగన్ధవాహమ్ = వెన్నవాసనను బొందినవాఁడును, వచనే=మాటయందు, తస్కర...రీణం=దొంగనేరుపులను ధరించినవాఁడును, నయనే = కంటియందు, కుహనాశ్రు = కల్లకొందుపువలన నైనకన్నీరు గలవాఁడును, చరణే=పాదమందు, కోమలతాణ్డవం = మృదువైనలాస్యముగల, కుమారం=బాలకృష్ణుని, ఆశ్రయేథాః=ఆశ్రయించుము.

ఉ. కమ్మని వెన్నవాసన ముఖమ్మున ఘుమ్మని సోడుముట్ట వా
క్యమ్ములఁ జౌర్యనై పుణులు గన్పడఁ గన్నుఁగవఁ మృషాశ్రువు
ల్గ్రిమ్మఁగఁ గోమలాంఘ్రియుగళమ్మునఁ దాండవకేళి యొప్పఁగాఁ
గ్రుమ్మరుగోపబాలకు ముకుందుని నామది నాశ్రయించెదన్. 15

తా. నోటియందు వెన్నవాసనతోఁ గూడినవాఁడును, మాటబొంకుటలో మిగుల తెలివిగలవాఁడును, కంటియందు కల్లకన్నీరుగలవాఁడును, అడుగులయందు మనోహర నాట్యము గలవాఁడు నగు శ్రీకృష్ణునియందఁ జేరుము.

శ్లో. అమునాఽఖిలగోపగోపనార్థం యమునారోధసి నన్దనన్దనేన,
దమునా వనసమ్భవః పపే నః కిము నాసౌ శరణార్థినాం శరణ్యః. 16

టీ. అమునా=ఈ, నందనందనేన=కృష్ణునిచేత, అఖిలగోపగోపనార్థం=ఎల్లగోపాలురఁగాపాడుకొఱకు, యమునారోధసి=యమునానదియొడ్డున, వనసమ్భవః=అడవియందుఁ బుట్టిన, దమునాః=అగ్ని, పపే = మ్రింగఁబడినది. అసౌ=ఈకృష్ణుఁడు, శరణార్థినాం=సంరక్షణము గోరుచున్న, నః = మాకు, శరణ్యః = సంరక్షకుఁడు, కిము=ఎందులకు, న=కాఁడు? (అగు ననుట.)

త్రిప్రాసము త్తేభము.

యమునాతీరవనాంతసంజనితదావాగ్నిస్ఫుటార్చిర్నికా
యము నానాజనభీకరం బగుచు డాయఁగ వేఁడిల వే కాచుని
య్యము నాయంబని దాని నానె నఁట నిత్యంబుగ హరిఁగ గుప్తసం
యము నారాధన సేయు నా కిపు డభీష్టావాప్తి గా కుండునే? 16

తా. గోవులను గోపాలురను గూడ ముట్టినకార్చిచ్చును మ్రింగి వానిని గాపాడినస్వామి శరణాగతుల నైనమమ్ము మాత్ర మేల రక్షింపఁడు? రక్షించును.

శ్లో. జగదాదరణీయజారభావం జలజాపత్యవచోవిచారగమ్యామ్,
తనుతాం తనుతాం శివేతరాణాం సురనాథోపలసున్దరం మహోనః.

టీ. జగ .. భావం = లోకముచే మెచ్చఁదగినఅంకుఁదనముగలది యు, జల... గమ్యమ్=నలువవాక్కుల (వేదవేదాంతముల) తర్కమునకు గోచరమైనది యు, సుర .. సున్దరమ్=ఇంద్రనీలమణివలె నందమగు, మహః=వెలుఁగు, నః=మాయొక్క, శివేతరాణాం =అమఙ్గళములయొక్క, తనుతామ్=నాశము, తనుతాం=చేయుఁగాక.

చ. సరసిజసంభవప్రముఖసర్వసుపర్వవచోవిచారగో
చరమగు దివ్యతేజ మఖిలంబు జగంబులు మెచ్చ జాయఁ డై
మరకతనూత్నరత్నసుషముం జెలు వందఁ గుమారమూర్తి యై
వరఁగి దయార్ద్రదృష్టి నశుభంబు లడంచి శుభంబు లీవుతన్. 17

తా. వేదవేదాంతగోచరమై ఋషిదైవతము లైనయెల్లశ్రుతు లనేకుపరదారల నాకర్షణము సేయువిద్దెలో దండియై ఇంద్రనీలమువలె మెఱయు తేజము మామాయాపదలఁ బాపుగాక.

శ్లో. యా శేఖరే శ్రుతిగిరాం హృది యోగభాజాం
పాదామ్బుజే చ సులభా వ్రజసున్దరీణామ్,
సా కాఽపి సర్వజగతా మభిరామసీమా
కామాయ నో భవతు గోపకిశోరమూర్తిః. 18

టీ. యా=ఏది, శ్రుతిగిరాం=వేదవాక్కులయొక్క, శేఖరే=శిరమునందును, యోగభాజాం=యోగమును బొందినవారియొక్క, హృది = చిత్తమందును, వ్రజసున్దరీణాం=గొల్లపడంతులయొక్క, పాదామ్బుజే చ=పదపద్మమందును, సులభా=కష్టము లేక దొరకునదియో, సా=అప్రసిద్ధమైనదియు, కాఽపి=చెప్పనలవి గానిదియు, సర్వజగతాం=ఎల్లలోకములయొక్క, అభిరామసీమా=చక్కఁదనపు మేరయగు, గోపకిశోరమూర్తిః=గోపబాలుని యాకృతి, నః=మాయొక్క, కామాయ=కోరికకొఱకు, భవతు=అగుఁగాక.

ఉ. ఎల్లజగంబులున్ రహి వహించుశుభాస్పదసీమ యోగిహృ
త్ఫుల్లసరోజపాళిఁ బదముల్ దులకింపఁ ద్రయీనధూటికా
హల్లకసీమలం బొలుచునద్భుతగోపకిశోరమూర్తి యీ
వల్లవకామినీచరణవారిజసేవకు లెస్సఁ జిక్కెఁగా. 18

తా. ఏరూపము వేదాంతములయందును, యోగిచిత్తములయందును, బ్రకాశించునదియయ్యును గొల్లయిల్లాండ్ర కాళ్లచెంత సులభముగాఁ జిక్కెనో, యట్టి లోకైకసుందరమైనయాగోపాలమూర్తి నామనోరథమును బూరించుఁగాక.

శ్లో. అత్యన్తబాల మతసీకుసుమప్రకాశం
దిగ్వాససం కనకభూషణభూషితాఙ్గమ్,

విస్రస్తకేశ మరుణాధర మాయతాక్షం
కృష్ణం నమామి మనసా వసుదేవసూనుమ్. 19

టీ. అత్యన్తబాలం=మిగుల లేఁబ్రాయముగలవాఁడును, అతసీ .. కాళం=అగిసెపూవువలె నల్లనైనవాఁడును, దిగ్వాససం=దిక్కులే కట్టు పుట్టములుగాఁ గలవాఁడును, కనక .. తాఢ్యం=బంగరుసొమ్ములచే నలంకరింపఁబడినవాఁడును, విస్రస్తకేశం=వీడిన కేశములు గలవాఁడును, అరుణాధరం=ఎఱ్ఱనిమోవిగలవాఁడును, ఆయతాక్షం=వెడఁదకన్నులు గలవాఁడును, వసుదేవసూనుం=వసుదేవుని కొడుకగు, కృష్ణం=శ్రీకృష్ణుని, మనసా=చిత్తముతో, నమామి=మ్రొక్కెదను.

ఉ. కోమలసుందరాకృతియు గొప్పకనుంగవ కెంపుమోవియు
న్దోమున వ్రేలుముంగురులు నూత్నవిభూషణభూషితాంగము
న్దామదిగంబరాకృతియుఁ దాల్చినవెన్నునిఁ జిన్నిబాలునిన్
శ్రీమెఱయన్ భజింతు నతసీసుమభానుని నందసూనునిన్. 19

తా. మిగులచిన్నవాఁడును, అగిసెపూవువోలె నల్లనైనవన్నెవాఁడును, దిగంబరుఁడును, బంగారుసొమ్ములఁ దాల్చినవాఁడును, విరియఁబోసికొన్నతల గలవాఁడును, ఎఱ్ఱనిమోవిగలవాఁడును, పెద్దకన్నులుగలవాఁడును, వసుదేవునిముద్దుపట్టి యగుకృష్ణునకు మనఃపూర్వకముగా మ్రొక్కు లిడుదును.

శ్లో. హస్తాఙ్ఘ్రినిక్వణితకఙ్కణకిఙ్కిణీకం
మధ్యేనితమ్బ మవలమ్బితహేమసూత్రమ్,
ముక్తాకలాపముకులీకృతకాకపక్షం
వన్దామహే వ్రజచరం వసుదేవభాగ్యమ్. 20

టీ. హస్తా...ణీకమ్=కాలుసేతులయందు మ్రోయింపఁబడిన మురుగులందెల చిఱుగజ్జలుగలదియు, మధ్యేనితమ్బమ్=పిఱుఁదులనడుమ, అవలమ్బిత హేమసూత్రం=కట్టఁబడిన బంగరుమొలత్రాడుగలదియు, ముక్తా...పక్షమ్=ముత్తెపురావిరేకచే ముడిచికట్టఁబడిన జులపాలుగలదియు, వ్రజచరం=గోకులమందుఁ దిరుగుచున్న, వసుదేవభాగ్యం=వసుదేవునిభాగ్యమును (శ్రీకృష్ణునిగూర్చి), వందామహే=మ్రొక్కుచున్నాము.

చ. సరసనితంబమధ్యమున జాఱెడుపెన్మొలనూలు చిన్నముం
గురులు దళంబుగాఁ గమిచి కూర్చినముత్తెపురావిరేకయుం
గరచరణాగ్రనిక్వణితకంకణకింకిణులొప్ప నందమం
దిరమున సంచరించువసుదేవతపఃఫలమున్ భజించెదన్. 20

తా. కాలుసేతులయందలి మురుగులు అందెలు మొదలగువానిని మ్రోయించుచు పిఱుఁదులపై బంగరుమొలత్రాడుగట్టుకొనిముద్దులరావిరేకను శిగయందలంకరించుకొని

మఱియుఁ జూపుచు గోకులమందుఁ దిరుగుచున్న వసుదేవుని భాగ్యమును గూర్చి చెప్పుచున్నారము.

శ్లో. బృన్దావనద్రుమతలేషు గవాం గణేషు
వేదావసానసమయేషు చ దృశ్యతే యత్,
తద్వేణునాదనపరం శిఖిపిఞ్ఛచూడం
బ్రహ్మ స్మరామి కమలేక్షణ మభ్రనీలమ్. 21

టీ. యత్=ఏది, బృందా...తలేషు=బృందావనమందలి చెట్టుపట్టులయందును, గవాం=ఆవులయొక్క, గణేషు=మందలయందును, వేదా...యేషు చ=ఉపనిషత్సిద్ధాంతములయందును, దృశ్యతే=కనఁబడుచున్నదో, వేణునాదనపరం=పిల్లఁగ్రోవినూఁదుటయందుఁ దవిలియున్నదియు, శిఖిపిఞ్ఛచూడం=నెమిలిపురి కిరీటముగాఁగలదియు, కమలేక్షణం=తామరపూవులవంటికన్నులు గలదియు, అభ్రనీలం=మేఘమువలె నల్లనైనదియునగు, బ్రహ్మ=బ్రహ్మమును, స్మరామి=తలఁచెదను.

శా. బృందారణ్యతరుప్రదేశముల గోబృందాగణశ్రేణులన్
ఛందోవీథులఁ గానిపించుపరమస్వచ్ఛంద మౌ తేజ మా
నందబ్రహ్మము వందనీయమురళీనాదానుమోదంబు నా
యందుర్ నిల్పెదఁ బింఛచూడము పయోజాతాంబు మేఘాభమున్.

తా. బృందావనము తరువుల నీడలను, ఆవుల మందలయందును, వేదాంతములయందును జూడఁబడుచు విడువకుండఁ బిల్లఁగ్రోవి నూఁదుచు, బర్హిబర్హావతంసమై నల్లనై కమలములవంటి కన్నులు గలయాబ్రహ్మమును దలఁచెదను.

శ్లో. వ్యత్యస్తపాద మవతంసితబర్హిబర్హం
సాచీకృతాననని వేశితవేణురన్ధ్రమ్,
తేజః పరం పరమకారుణికం పురస్తాత్
ప్రాణప్రయాణసమయే మమ సన్నిధత్తామ్. 22

టీ. వ్యత్యస్తపాదం = ముందువెనుకలుగాఁ బెట్టఁబడిన పాదములుగలదియు, అవ...బర్హం=శిరోభూషణముగాఁ జేయఁబడిన నెమ్మిపురిగలదియు, సాచీ...రన్ధ్రం=అడ్డముగాఁ ద్రిప్పఁబడినోటియందుంచఁబడిన పిల్లఁగ్రోవి రంధ్రముగలిగినదియు, పరమకారుణికం=అత్యంతదయామయమైన, పరం తేజః=పరతేజము, ప్రాణప్రయాణసమయే=ప్రాణములు దరలువేళ, మమ=నాయొక్క, పురస్తాత్=ఎదుట, సన్నిధత్తాం=ఆవిర్భవించుఁగాక.

చ. మొగ మొకరొరఁ జేసికొని మోవిని వేణువుఁ జేర్చి తిర్యగం
ఘ్రిగ విలసిల్ల మౌళితటిఁ గేకికలాపకలాప ముంచి తీ

విగఁ గనుపట్టుసౌఖ్యపదవిం గను వేళ మదీయసన్నిధిఁ
నిగమనివాస తేజము వినిర్మలసత్కరుణాధురీణమై. 22

తా. అత్యంతదయాకర మైనకృష్ణతేజము నెమిలిపురి దాల్చి, కాళ్లు ముందు వెనుకలుగాఁ బెట్టి నిలచి మొగమునడ్డముగాఁ ద్రిప్పికొని వేణువు నూఁదుచు ప్రాణావసానకాలమందు నా యెదుట నగపడుఁగాక.

శ్లో. ఘోషప్రఘోషశమనాయ మథోగుణేన
మధ్యే బబన్ధ జననీ నవనీతచోరమ్,
తద్బన్ధనం త్రిజగతా ముదరాశ్రయాణా
మాక్రోశకారణ మహో నితరాం బభూవ. 23

టీ. ఘోష...నాయ=గొల్లవాడయందలి అల్లరిని మాన్పుటకై, జననీ=తల్లియగు యశోద, నవనీతచోరం=వెన్నదొంగ యగుకృష్ణుని, మథోగుణేన=కవ్వపుత్రాటిచేత, మధ్యే=నడుమునందు, బబన్ధ=కట్టెను. తత్=అ, బన్ధనం=కట్టు, ఉదరాశ్రయాణాం=వానికడుపునాశ్రయించియున్న, త్రిజగతామ్=మూల్లోకములకు, నితరాం=మిక్కిలి, ఆక్రోశకారణం=పరివేదనహేతువు, బభూవ=అయెను. అహో=చిత్రము.

శా. పాలున్ వెన్నయు ముచ్చిలించె నని గోపాలాంగనల్ గుయ్యిడన్
జాలిం జెందుచుఁ దల్లి మట్టుపఱుపం జర్చించి యాబాలకున్
ఱోలం గవ్వపుఁ ద్రాటఁ గట్టె నట యాక్రోశించెఁ దత్కుక్షిలోఁ
త్రైలోక్యంబును దన్మహామహిమ ముగ్ధల్ గాంచఁగా నేర్తురే. 23

తా. గొల్లవాడయందు యశోద అనేక బ్రహ్మాండములు కుక్షిలోఁదాల్చిన వాఁడని యెఱుఁగక తనబాలుని ఊరివారియల్లరి సాఁపుటకై కవ్వపుఁద్రాడుతోఁ గట్టివేసెను. అకట్టు వానికడుపులోనున్న లోకములకెల్ల బాధను గలుగఁజేయఁగా నవి ఘోషిల్లసాఁగెను.

శ్లో. శైవా వయం న ఖలు తత్ర విచారణీయం
పఞ్చాక్షరీజపపరా నితరాం తథాపి,
చేతో మదీయ మతసీకుసుమావభాసం
స్మేరాననం స్మరతి గోపవధూకిశోరమ్. 24

టీ. వయమ్=మేము, శైవాః=శివభక్తులము. తత్ర=ఆవిషయమై, నవిచారణీయం=విచారింపఁజనదు. నితరాం=మిక్కిలి, పంచాక్షరీజపపరాః=శివపంచాక్షరీమహామంత్రమును జపించువారము. తథాపి=అటులైనను, మదీయం=నాదగు, చేతః=చిత్తము, అతసీకుసుమావభాసం=అగిసెపూవులకాంతివంటికాంతిగలవాఁడును, స్మేరాననం=చిఱునవ్వుమోముగల, గోపవధూకిశోరం=గొల్లయిల్లాలగుయశోదబిడ్డని, స్మరతి=ధ్యానించుచున్నది.

మ. అనుమానింపఁగ నేమి శైవులము మే మత్యంతపంచాక్షరీ
మనుపారీణుల మౌదు మైన నెపుడుఁ మందస్మితభ్రాజితా
ననచంద్రుం గపిలాతసీసుమసమానద్యోతని స్తంద్రుఁ గృ
ష్ణుని గోపాలకబాలు నెంచనె తలంచుం జిత్త మానసక్తితోన్. 24

తా. మేము శివభక్తులము. అందులోను శివపంచాక్షరీజపము సేయు మహాశైవులము. దీనిలో నేసందియము లేదు. అయినను, నాచిత్త మెప్పుడును నల్లనివాఁడగు గోపకుమారుని దలఁచుచుండును.

శ్లో. రాధా పునాతు జగ దచ్యుతదత్తచిత్తా
మన్థాన మాకలయతీ దధిరిక్తపాత్రే,
తస్యాః స్తనస్తబకచఞ్చలలోలదృష్టి
ర్దేవోఽపి దోహనధియా వృషభం నిరున్ధన్. 25

టీ. అచ్యుతదత్తచిత్తా=కృష్ణునియెడఁజేర్చినమదిగలదై, దధి...పాత్రే=పెరుగులేని బానయందు, మన్థానం=కవ్వమును, ఆకలయతీ=ఉంచుచున్న, రాధా=రాధ, జగత్=లోకమును, పునాతు=పావనము సేయుఁగాక. తస్యాః=ఆరాధయొక్క, స్తన...దృష్టిః=పూగుత్తులవంటి పాలిండ్లయందు మాటిమాటికిఁ బ్రవర్తించునదియై యాసతోఁ గూడికొనిన చూపుగలవాఁడై, వృషభం=ఎద్దును, దోహనధియా=పాలుపిండుతలఁపుతో, నిరున్ధన్=దామఁగట్టుచున్న, దేవోఽపి=కృష్ణుఁడును, జగత్ = లోకమును, పునాతు=పవిత్రము సేయుఁగాక.

చ. భ్రమసి హరిం దలంచి దధిభాండముదండ పసించురిక్తభాం
డము మథియించురాధయు పసంబునఁ దత్కుచకుంభితుంభవి
భ్రమముఁ దలంచి యొక్కవృషభంబును దోహనబుద్ధిఁ గట్టున
క్కమలదళాక్షుఁడుం గరుణఁ గాతురు గాత జగద్వితానమున్. 25

తా. కృష్ణునియందలిమోహముచేఁ జిత్తము తదేకాయత్తముచేసి వేఱొదియు నెఱుఁగక వట్టిబానలోఁ బెరుఁగుఁ జిలుకుటకుఁ గవ్వము ద్రిప్పుచున్న రాధయు, ఆమె చనుబంతులమీఁద దృష్టి పెట్టి పరధ్యానముతో నెద్దును పాలుపితుకుటకై దామఁ గట్టుచున్న కృష్ణుఁడును జగములఁ బావనముఁ జేయుదురుగాక.

శ్లో. గోధూళిధూసరితకోమలకున్తలాగ్రం
గోవర్ధనోద్ధరణకేళికృతప్రయాసమ్,
గోపీజనస్యకుచకుఙ్కుమముద్రితాఙ్గం
గోవిన్ద మిన్దువదనం శరణం భజామః. 26

టీ. గోధూళి...లాగ్రం=ఆవులకాలిదువ్వలచే బూడిదరంగు గలిగిన సున్నని శిరోజములు గలవాఁడును, గోవర్ధ...యాసమ్ = గోవర్ధనపుఁగొండ నెత్తుటయందుఁ బొందఁబడినయాయాసముగలవాఁడును, గోపీజనస్య=గొల్లపడఁతులయొక్క, కుచ... తాఙ్గం = చనులయందలికుంకుమలచే గురుతుగలిగింపఁబడిన యొడలుగలవాఁడును, ఇన్దువదనం = చందురువంటిమోముగల, గోవిన్దం=కృష్ణుని, శరణం = రక్షకునిగా, భజామః=పొందుచున్నాము.

ఉ. గోపదధూళిధూసరితరోమలకుంతలు గోపికాకుచ
స్థాపితకుంకుమాంకితవిశాలభుజాంతరుఁ బాణిపంకజా
రోపితభూమిభృద్వరనిరూఢసుఖాస్పదనందగోకులుఁ
గోపకుమారు నిందువదనుఁ మదనుగ్రహవాంఛఁ గొల్చెదన్. 26

తా. గోధూళి ధూసరితములగు మెత్తనిముంగురులు గలవాఁడును, గోవర్ధనపర్వతమెత్తుటచే బడలినవాఁడును, గోపాంగనలచనులయందలికుంకుమలచే నొప్పుమేను గలవాఁడును, చంద్రునివంటిమోము గల గోపాలబాలుని శరణముఁ బొందెదము.

శ్లో. యద్రోమరన్ధ్రపరిపూర్తిపిధావదక్షా
వారాహజన్మని బభూవు రమీ సముద్రాః,
తం నామ నాథ మరవిన్దదృశం యశోదా
పాణిద్వయాన్తరజలైః స్నపయాం బభూవ. 27

టీ. అమీ=ఈ, సముద్రాః=సముద్రములు, వారాహజన్మని = వరాహావతారమందు, యద్రోమ...విధౌ=ఏదేవునిరోమకూపముల నిండించుపనిలో, అదక్షాః=సమర్థములుకానివి, బభూవుః=అయినవో; యశోదా=యశోదమ్మ, అరవిన్దదృశం=తామరలవంటి కన్నులుగల, తం=ఆ, నాథం=దేవుని, పాణి.. జలైః=దోసిలియందలినీళ్లతో, స్నపయాంబభూవనామ=స్నానముచేయించెనో.

ఉ. ఏయధికుండు క్రోడతవహించిన నాతనిరోమరంధ్రము
ల్దోయధు లెల్ల నించుమహిమల్ గన నేరక యుండె నట్టినా
రాయణుఁ డర్భకాకృతిని రాగిలి నందవధూటిరోయిటం
దోయము చల్లఁగాఁ దనిసి తోఁగుచు నుండె ని దేమిచిత్రమో. 27

తా. ఏస్వామి వరహావతార మెత్తినప్పుడు సముద్రములన్నియు నాతునరోమరంధ్రములకే చాలలేదో అట్టి చిన్నికృష్ణుని యశోదమ్మ తనదోసెడునీళ్లతో స్నానము చేయించెను. ఈచిత్రముం జూడుఁడు.

శ్లో. వర మిమ ముపదేశ మాద్రియధ్వం
నిగమవనేషు నితాన్తచారఖిన్నాః,

విచినుత భవనేషు వల్లవీనా
ముపనిషదర్థ ములూఖలే నిబద్ధమ్. 28

టీ. నిగమవనేషు=వేదము లను కానలయందు, నితాన్తచారఖిన్నాః=ఎడతెగక తిరుగుటచేత బడలిన యోయనుజులారా, పరమ్ = మేలైన, ఇమం=ఈ, ఉపదేశం = బోధను, అద్రియధ్వం=ఆదరింపుఁడు. వల్లవీనాం=గొల్లపడఁతులయొక్క, భవనేషు= ఇండ్లయందు, ఉలూఖలే=ఱోటియందు, నిబద్ధమ్=కట్టఁబడిన, ఉపనిషదర్థం=ఉపని షత్ప్రతిపాద్య మైనవస్తువును, విచినుత=వెదకుఁడు.

చ. నిగమమహావనాంతములనే వెదకేవలె నంచు ఖిన్నులై
వగవఁగ నేల యే నొకయుపాయముఁ జెప్పెదఁ బోయి చూడుఁడీ
యగణితవల్లవీమణిగృహాంగణభూమి నులూఖలంబుతో
డ గుణనిబద్ధ మై శ్రుతులడాఁగినభావము గాన నయ్యెడున్. 28

తా. ఓద్విజులారా! వ్యర్థముగా వేదము లనువడవుల యందుఁ దిరిగి తిరిగి రేల శ్రమపడియెదరు? మీరు వెదకువస్తువు గొల్లభామల యిండ్లలో ఱోలఁ గట్టఁబడియు న్నది. అచ్చటి కేఁగి ఉపనిషత్సార మైన యా బ్రహ్మమును గనుఁగొనుఁడు.

శ్లో. దేవకీతనయపూజనపూతః పూతనారిచరణోదకధౌతః,
యద్యహం స్మృతధనఞ్జయసూతః కింకరిష్యతి స మే యమదూతః.

టీ. అహం=నేను, దేవకీ...పూతః యది=శ్రీకృష్ణుని బూజించుటచే పవిత్రుఁ డనేని, పూతనా...ధౌతః=శ్రీహరి పాదతీర్థముచేఁ గడుగఁబడినవాఁడనేని, స్మృత... సూతః=ధ్యానింపఁబడిన పార్థసారథి (కృష్ణుఁడు) గలవాఁడనేని, సః=ఆ, యమదూ తః=యమకింకరుఁడు, మే=నాకు, కిం=ఏమి, కరిష్యతి = చేయఁగలఁడు ? ఏమియుఁ జేయఁజాలఁడనుట.

మ. సకలప్రార్థిత దేవకీతనయ పూజాపూజితుం బూతనాం
తకపాదాంబుజవారిధౌతుని మనోనాళీకహేళీభవ
త్ప్రకటాటోపకిరీటిసూతుని వచోరాజీవరాజన్ముకుం
దకథాన్వితుని నన్ను నాశమనదూతల్ నేరఁగాఁ జూతు రే. 29

తా. నేను దేవకీకొడుకు సేవఁజేయుచు నా దేవుని పాదతీర్థముచేఁ బవిత్రుఁడనై ఎల్లవేళలయందు నాస్వామినే తలంచుచుందునేని యమదూతలు నన్నేమిచేయఁగలరు?

శ్లో. భాసతాం భవభయైకభేషజం మానసే మమ ముహుర్ముహుర్ముహుః,
గోపవేష ముపసేదుష స్స్వయం యాపి కాపి రమణీయతా విభోః,

టీ. భవభయైకభేషజం = సంసారమువలని భయమునకు నొక్కటి యగువుం దైన, గోపవేషం=గొల్లనిరూపును, స్వయమ్=తానై, ఉపసేదుషః = అవలంబించిన,

విభోః=ప్రభువగుకృష్ణునియొక్క, యాపి కాపి=ఏవో అనిర్వాచ్యమైన, రమణీయ తా=సౌందర్యము, మానసే=నాచిత్తమున, ముహుః ముహుః ముహుః=మాటిమాటికి మాటిమాటికి, భాసతాం = మెఱయుఁగాక.

చ. భవభయభేషజంబు శ్రుతిభావ్యము నై తగుగోపవేష ము
త్సవమునఁ బూనినట్టిహరి సర్వసునోహరదివ్యరూప మై
భవము మదీయభావమున భాసిలుఁగాత నిరంతరంబు మా
ఘనసుమణీశృణీకరణకౌశలపేశల తేజ మొప్పఁగన్. 30

తా. సంసార మనురోగమునకు నమోఘ మగునౌషధ మైన గోపరూపమును దాల్చిన కృష్ణుని యనిర్వాచ్యలావణ్యము నామానసమునఁ బొడకట్టుఁగాక.

శ్లో. కర్ణలమ్బితకదమ్బమఞ్జరీకేసరారుణకపోలమణ్డలమ్,
నిర్మలం నిగమవాగగోచరం నీలిమాన మవలోకయామహే. 31

టీ. కర్ణ...మణ్డలమ్ = చెవుల వ్రేలుకడిమపూగుత్తులయందలి అకరువులచేత నెఱ్ఱనైనచెక్కిళులుగలదియు, నిర్మలం = శుద్ధమైనదియు, నిగమవాగగోచరం = వేదవాక్కులకు దొరకని, నీలిమానం=నలుపును, అవలోకయామహే=చూచెదము.

మ. చెవులఁ వ్రేలుకదంబమంజరులచేఁ జిన్నారిచెక్కుల్ జ్వల
న్నవసంధ్యారుణితాభ్రకాంతి చెలు వందఁ మందహాసప్రభా
లవముల వెన్నెలతళ్కుఁ జూప మృదులాలంకారుఁ డై వేదసం
స్తవనాగోచరుఁ డైనశౌరి యసితచ్ఛాయల విలోకించెదన్. 31

తా. చెవులయందు వ్రేలాడుకడిమపూగుత్తులపరాగముచే నెఱ్ఱవాఱినచెక్కిళ్లు గలదియు నిర్మలమైనదియు వేదవాక్కులకు నైతము దురవగాహ మైనవల్లనిరూపమును జూడఁగోరుచున్నాము.

శ్లో. సాచివఞ్చితవిలోచనోత్పలం సామికుట్మలితకోమలాధరమ్,
వేగవల్గితకరాఙ్గులీముఖం వేణునాదరసికం భజామహే. 32

టీ. సాచి...త్పలం=అడ్డముగాఁ ద్రిప్పఁబడిన కలువలఁబోలు కన్నులుగలవాఁడును, సామి...ధరం=సగము మోడ్చఁబడిన లేఁత పెదవిగలవాఁడును, వేగ...ముఖం=త్వరగా నడపఁబడిన వ్రేళుల కొనలుగలవాఁడును, వేణునాదరసికం=వేణుగానమందుఁ దవిలియున్న శ్రీకృష్ణుని, భజామహే=సేవించెదము.

చ. నిరతము సంఘిరి మార్పడఁగ నిల్పి యొయారవుటోరచూపుతోఁ
దరళవిలోచనంబును ముదం బలరఁ దరహాసచంద్రికల్
మురు వగుముద్దుమోవి సరమోడ్పఁ జెలంగఁ గరాంగులీతతిఁ
మురళి నటింపఁ జేయు నతిమోహనగానధురీణుఁ గొల్చెదన్. 32

తా. కన్నుల నడ్డముగాఁ ద్రిప్పి యాడించుచు, అరమోడ్పు గలచెవవులతో బిల్లనగ్రోవిని గఱచికొని, తొందరగా వ్రేళ్లను ద్రిప్పుచుఁ బిల్లఁగ్రోవి నూఁదుచున్న గోపాలరూపుని సేవించెదను.

శ్లో. స్యన్దనే గరుడమణ్డితే ఽన్వ జే కుణ్డినేశతనయాధిరోపితా,
కేనచిన్న నతమాలపల్లవ శ్యామలేన పురుషేణ నీయతే. 33

టీ. కుణ్డినేశతనయా=కుండిన పట్టణపురాజగు భీష్మకుని కూఁతురగు రుక్మిణీదేవి, నవ... లేన=లేఁత కానుఁగు చిగురువలె నల్లనైన, కేనచిత్=ఒకానొకఁడగు, పురుషేణ=పురుషునిచేత, గరుడధ్వజమణ్డితే = గరుడకేతనముచే నలంకరింపఁబడిన, స్యన్దనే=రథమందు, అధిరోపితా=ఎక్కింపఁబడినదై, నీయతే=కొనిపోఁబడుచున్నది.

మ. కదనోర్వీ శిశుపాలమాగధవిపక్షక్ష్మాతలాధీశదో
ర్మదనిర్భేదవినోద మొప్పఁగ గరుత్మత్కేతుభాస్వద్రథా
న్నదపీఠంబున రుక్మిణీరమణి నిశ్శంకస్థితిం దెచ్చెనే
విదితుం డట్టితమాలనీలపురుషుఁ డ విశ్వంభరుం గొల్చెదన్. 33

తా. కుండిననగరపురాజగుభీష్మకునికూఁతురగు రుక్మిణి కానుగచిగుళ్లవలె నల్లని మైచాయగల యొకతరుణునిచే గరుడధ్వజలాంచిత మైనరథముమీఁద నెక్కించి తీసికొని పోఁబడుచున్నది.

శ్లో. మాయాత పాన్థాః పథి భీమరథ్యా దిగమ్బరః కోఽపి తమాలనీలః,
విన్యస్తహస్తోఽపినితమ్బబిమ్బే ధూర్తస్సమాకర్షతి చిత్తవిత్తమ్. 34

టీ. హే పాన్థాః=ఓ బాటసారులారా, భీమరథ్యాః=భీమరథియనునదియొక్క, పథి = త్రోవయందు, మాయాత = వెళ్లకుఁడు. అచట, తమాలనీలః = కానుగువలె నల్లనివాఁడగు, కోఽపి=ఎవఁడో, దిగమ్బరః=దిస్సమొలతోనున్న, ధూర్తః=టక్కరి, నితమ్బబిమ్బే=మొలయందు, విన్యస్తహస్తోఽపి = ఉంచుకోఁబడిన చేతులుగలవాఁడైనను, చిత్తవిత్తం=మానస మనుధనమును, సమాకర్షతి=అపహరించుచున్నాఁడు.

చ. పథికులు పోకుఁ డచ్చటికిఁ బల్మఱు భీమరథీపథంబునం
బృథులతమాలమేచకశరీరుఁ డొకండు దిగంబరాకృతిం
బ్రథితకటీతటీఘటితపాణితలుం డయి పోవనీ కన్మనో
రథుఁ డయి చిత్తవిత్తము నిరంతరముం హరియించు ధూర్తుఁడై. 34

తా. ఓ తెరువరులారా! భీమరథిమార్గమునఁ బోకుఁడు. అచ్చట నొకదొంగ యున్నాఁడు. వాఁడు దిస్సమొలతో నుండును. చేయి రొండినే పెట్టుకొని యుండును. ఐనను మనోధనములను బలుచమత్కారముతో దొంగిలించును.

## రాసక్రీడాష్టకము.

శ్లో. అజ్గనా మజ్గనా మ న్తరే మాధవో
మాధవం మాధవం చా న్తరే ణాజ్గనా,
ఇత్థ మాకల్పి తే మణ్డలే మధ్యగః
సఞ్జగౌ వేణునా దేవకీనన్దనః. 35

టీ. అజ్గనాం అజ్గనాం అ న్తరే = ఇద్దఱు గోపికాస్త్రీలనడుమ, మాధవః = కృష్ణుఁడు, మాధవం మాధవం అ న్తరేణచ = ప్రతియిద్దఱు కృష్ణులనడుమ, అజ్గనా = గోపికయు, ఇత్థం = ఇట్లుః అకల్పితే = రచియింపఁబడిన, మణ్డలే = గోపికాకృష్ణుల వలయమందు, మధ్యగః = నడుమనునుఁ జేరినవాఁడై, దేవకీనందనః = కృష్ణుఁడు, వేణునా = పిల్లఁగ్రోవితోడ, సఞ్జగౌ = సొగసుగాఁ బాడెను.

చ. ఇరుదెసఁ దాను నిల్చి తన కింతులు పార్శ్వములం వసింపఁగాఁ
గరములు గంతపాళిఁ జెలఁగం బలభిన్మణివిద్రుమంబులం
నర మొనరించినట్లు నరసస్థితి మండలమధ్యవ ర్తియై
మురళిరవంబునం జెలఁగు మోహనమూ ర్తి మురారిఁ గొల్చెదన్. 35

తా. ఒకగోపిక ఒకకృష్ణుఁడు మరల నొకగోపిక ఒకకృష్ణుఁడు ఇట్లు గుండ్రముగా బారు దీరియుండి నడుమ తా నిలిచి కృష్ణుఁడు సొగసుగా వేణువు నూఁదెను.

శ్లో. కేకికేకాదృతానేకపఙ్కేరుహాలీనహంసావలీహృద్యతాహృద్యతా,
కంసవంశాటవీదాహదావానలః సఞ్జగౌ వేణునా దేవకీనన్దనః. 36

టీ. కేకి...హృద్యతా = నెమిలికూఁతలచే నాదరింపఁబడినదియై కమలముల నణఁగియున్న యంచపిండుల కుల్లాసమును సంపాదించుచున్న, వేణునా = పిల్లఁగ్రోవిచేత, కంస ..నలః = కంసుఁడను వెదురుటడవిఁ గాల్చుటకు కార్చిచ్చగు, దేవకీనందనః = శ్రీకృష్ణుఁడు, సఞ్జగౌ = ఊఁదెను.

మ. తనుకాంతుల్ జలదం బటంచు శిఖిసంతానంబుఁ గేకాస్వనం
బును మీఱం విని యంచపిండు లలితాంభోజాళిలోనుండి చ
య్యన లేవం భ్రమ మూన్చి సంతసము నేయం జాలువంశీమృదు
స్వనముం గాంచినకంసవంశదహనజ్వాలిం హరిం గొల్చెదన్. 36

తా. మేఘధ్వని యనుతలఁపుచే నెమిలికూఁతలచేఁ బ్రేమింపఁబడినదియు, తామరలయం దణఁగియున్నహంసలను సైత ముల్లాసపఱుచుచున్న పిల్లఁగ్రోవిని బట్టుకొని కంసధ్వంసి యగుగోపాలకృష్ణుఁ డూఁదుచున్నాఁడు.

శ్లో. క్వాపి వీణాభి రారావిణా కమ్పితః క్వాపి వీణాభిరాకిఙ్కిణీ న ర్తితః,
క్వాపి వీణాభిరామా న్తరం గాపితః సఙ్జగౌ వేణునా దేవకీనన్దనః. 37

టీ. దేవకీనందనః=శ్రీకృష్ణుఁడు, క్వాపి=ఒకచోట, వీణాభిః=వీణలచేత, ఆరావిణా=ధ్వనిగలవానిచేత, కమ్పితః=అడింపఁబడినవాఁడై, క్వాపి=ఒక్కచోట, వీణా...న ర్తితః=వీణలకుఁదగినట్లుమ్రోయింపఁబడిన చిఱుగజ్జలచే నాడింపఁబడినవాఁడైనను, క్వాపి=ఒక్కచోట, వీణా... న్తరం=వీణలయొక్క మనోజ్ఞములగు మూర్ఛనలు గలుగునట్లు, గాపితః=పాడింపఁబడినవాఁడై, వేణునా=పిల్లఁగ్రోవిచే, సఙ్జగౌ=పాడెను.

మ. ఒకచో గానాలు మీటువీణియలకున్ యుక్తంబుగా నాడు వే
ఱొకచో వీణకు నియ్యమై యొనరఁ జేయుం గింకిణీనాద మొం
డొకచో వీణియతోడఁ బాడు జతగా సుత్సాహి యై యట్టిసం
దకుమారాగ్రణి వేణునాద మొనర న్వర్తిల్లె నుల్లాసి యై. 37

తా. శ్రీహరి యొకచోట వీణపాటలకుఁదగినట్లాడును. ఒక్కచో వీణాగానము ననుసరించి గజ్జెలతోఁ దాళముఁబట్టును. ఒక్కచోట వీణతోఁ గలిసి పాడును. ఇట్లుపలు తెఱఁగుల వేణువు నూఁదెను.

శ్లో. చారుచన్ద్రావలీలోచనై శ్చుమ్బితో గోపగోబృన్దగోపాలికావల్లభః,
వల్లవీబృన్దబృన్దారకః కాముకః సఙ్జగౌ వేణునా దేవకీనన్దనః. 38

టీ. చారు...చుమ్బితః=అందములగు నెమ్మిపురికన్నులవంటి కన్నులచేత, చుమ్బితః=ముద్దాడఁ (చూడఁబడినవాఁడనుట) బడినవాఁడును, గోప...వల్లభః=అలకాపరులకు ఆలకు ఆలకాపరిచేడియలకును నాథుఁడును, వల్ల...రకః=గొల్లపడుచులగుంపునకు దైవమైనవాఁడును నగు, దేవకీనందనః=కృష్ణుఁడు, వేణునా=పిల్లఁగ్రోవిచే, సఙ్జగౌ=పాడెను.

ఉ. క్రేవులు గోపదంపతులుఁ గేవలభక్తి భజింప నప్సరో
రూపముఁ గల్గువ్రేతలు మరుల్కొని క్రీడ యొనర్ప సంభృతా
టోపదభూష లౌ పెలులు సౌధములం దిలకించి చూడఁగా
గోపకుమారుఁ డొప్పె రసగుంభితవేణునినాదలోలుఁ డై. 38

తా. కాముకుఁడగు శ్రీకృష్ణుఁడు, నెమిలికన్నులవలె నందమగు కన్నులతో యువతులు ఆదరముతోఁజూడఁగా, గోవులు గోపాలురు వారిభార్యలుఁ వినిర్మలవిద్యాంతరముగాఁ జెవులొగ్గి వినఁగా వేణు వతిమనోహరముగా నూఁదెను.

శ్లో. మౌళిమాలామిళన్మత్తభృఙ్గీలతా భీతభీతప్రియావిభ్రమాలిఙ్గితః,
స్రస్తగోపీకుచాభోగసమ్మేళితః సఙ్జగౌ వేణునా దేవకీనన్దనః. 39

టీ. దేవకీనందనః=శ్రీకృష్ణుఁడు, మౌళి...లిఙ్గితః = తలఁదాల్చినపూలదండల యందుఁ దిరిగెడు తుమ్మెదబారులచే మిక్కిలి బెదరిన ప్రియురాండ్రచే విలాసముతోఁ గౌఁగిలింపఁబడినవాఁడై, స్రస్త...సమ్మేళితః=వస్త్రహీన మైనగోపికల చనుబంతుల్లచే నదుమఁబడినవాఁడై, వేణునా=పిల్లఁగ్రోవిచేత, నఙ్గా=ఊఁదెను.

ఉ. మౌళితటిఁ ఘటించినసుమమ్ముల వెంబడి వచ్చుభృంగరా
జీలలితధ్వనిం గలఁగి చేలము లూడఁగఁ గౌఁగిలించుగో
పాలకభీరుకోటికుచభార ముఁరమ్మున నానురాసలీ
లాలసమానమానసవిలాసుని వేణువినోదుఁ గాంచెదన్. 39

తా. తలయందుఁ దాల్చినపూదండలలోని తుమ్మెదలకు జడిసి వలువలు జాఱఁ బైఁబడి కౌఁగిలించికొనిన ప్రియురాండ్ర చనుఁగొండలచేఁ గ్రమ్మఁబడినవాఁడై కృష్ణుఁడు మనోహరముగా వేణువు నూఁదెను.

శ్లో. చారుచామీకరాభాసభామావిభు
ర్వైజయన్తీలతావాసితోరఃస్థలః,
నన్దబృన్దావనే వాసితామధ్యగః
నఙ్గా వేణునా దేవకీనన్దనః. 40

టీ. దేవకీనందనః = శ్రీకృష్ణుఁడు, చారు...విభుః=మేలిమి బంగారువన్నెగల స్త్రీసహస్రములకు నాథుఁడై, వైజయంతి యనుమాలికచేఁ బరిమళింపఁజేయఁబడిన ఱొమ్ముగలవాఁడై, నన్దబృన్దావనే=నందునిబృందావనమందు, వాసితామధ్యగః=ఆఁడువారలనడుమనున్నవాఁడై, వేణునా=పిల్లఁగ్రోవితోడ, నఙ్గా=ఊఁదెను.

మ. జత లై బంగరుతీఁగెగుంపు నదలించం జాలుబృందావనాం
చితబింబోష్ఠవతుల్ విలాసగతులన్ సేవించ రానక్రియా
చతురత్వంబున వైజయంతి నటియించన్ వేణుగానస్వనా
మృతధారాపటిమం జెలంగుహరి నెమ్మిం బ్రోచు మమ్మెప్పుడున్. 40

తా. శ్రీకృష్ణుఁడు, వైజయంతి ఱొమ్మున వ్రేల బంగరువన్నెగలప్రియురాండ్రతోఁగూడి, నందుని బృందావనమందు వేనవేలు గోపికలనడుమ విలాసముతో వేణువు నూఁదెను.

శ్లో. బాలికాతాళికాతాళలీలాలయాసఙ్గసన్దర్శితభ్రూలతావిభ్రమః,
గోపికాగీతదత్తావధానస్స్వయం నఙ్గా వేణునా దేవకీనన్దనః. 41

టీ. బాలికా.. విభ్రమః = గోపాంగనలను తాళకత్తియలతాళములయొక్క సొంపైన లయలపొందికయందుఁ జూపింపఁబడిన తీవకనుబొమలయొక్క సొబగు గల

వాఁడై, స్వయం=తానై, గోపికా...ధానః=గోపికల పాటలయందు మోజుపెట్టిన వాఁడై, దేవకీనందనః=కృష్ణుఁడు, వేణునా=పిల్లఁగ్రోవితో, సజ్జగా=ఊఁదెను.

ఉ. తాళము లుగ్గడించుపనితాకరతాళలయానుభావిత
భూరిలతసొంపు పల్లవసరోజముఖీమృదుగానవైఖరిం
బాలిని నెచ్చరించునవధానము మీఱఁగ వేణుపాణి యై
లాలితగానసన్నుతభవత్కళానిపుణుం డగుశౌరిఁ గొల్చెదన్. 41

తా. ఒకవంక గొల్లపడుచులను కనుబొమలచే సైగచేసి లయతప్పకుండఁ దాళములు వేయించుచు, మఱియొక పజ్జ గొల్లతల పాటల తన వేణువు ననుసరించి పాడించుచు, నమందానందము గలిగి శ్రీహరి జగన్మోహనముగా సావధానుఁడై వేణువు నూఁదుచున్నాఁడు.

శ్లో. పారిజాతం సముద్ధృత్య రాధావరో
రోపయామాస భామాగృహస్యాఙ్గణే,
శీతశీతే వటే యామునీయే తటే
సజ్జగా వేణునా దేవకీనన్దనః. 42

టీ. రాధావరః=రాధకు వల్లభుఁడైన, దేవకీనందనః=శ్రీకృష్ణుఁడు, పారిజాతం=కల్పవృక్షమును, సముద్ధృత్య=పెల్లగించి, భామాగృహస్య = సత్యభామయింటి యొక్క, అఙ్గణే=ముంగిలియందు, రోపయామాస=నాటెను. యామునీయే=యమునసంబంధమైన, తటే=ఒడ్డున, శీతశీతే=మిగులచల్లనైన, వటే=భాండీర మను మఱ్ఱిచెంతను, వేణునా=పిల్లఁగ్రోవిచే, సజ్జగా=ఎచ్చుగా పాడెను.

మ. రమతో డగ్గ సమమైనకాంతిగుణముల్ రాధావయోరూపవి
భ్రమముల్ గల్గినభామముంగిటను గల్పక్ష్మాజమున్ నిల్పి య
య్యమునాసైకతమధ్యశీతలశుభన్యగ్రోధవీథిన్ ముదం
బమరన్ వేణువినోదనాదరతుఁ డౌనబ్జాక్షు నీక్షించెదన్. 42

తా. రాధయందే ప్రీతియున్నట్లు నటించియు స్వర్గమునుండి కల్పవృక్షమును దెచ్చి సత్యభామముంగిట నాఁటిన యాటకాఁడై మెనగాఁడు యమునానదియొడ్డున మిగులఁ జల్లనిదగు భాండీరమనుమఱ్ఱిక్రింద మిగులమనోహరముగ వేణువు నూఁదెను.

శ్లో. అగ్రే దీర్ఘతరోఽయ మర్జునతరు స్తస్యాగ్రతో వర్తనీ
సా ఘోషం సముపైతి తత్పరిసరే దేశే కళిన్దాత్మజా,
తస్యా స్తీరతమాలకాననతలే చక్రం గవాం చారయన్
గోపః క్రీడతి దర్శయిష్యతి సఖే పన్థాన మవ్యాహతమ్. 43

టీ. సఖే=ఓమిత్రమా, అగ్రే=ముందర, దీర్ఘతరః=మిగులపొడవగు, అయం=ఇదె, అర్జునతరుః=మద్దిచెట్టు (గలదు). తస్య=దానికి, అగ్రతః=ముందర, వర్తనీ=

కాలిత్రోవ (యున్నది). తత్పరిసరేదేశే=ఆవెంబడి, సా=అ, కళిన్దాత్మజా=యమునా నది, ఘోషం=వ్రేపల్లెను, సముపైతి=చేరుచున్నది. తస్యాః=ఆయమునయొక్క, తీర... తలే=ఒడ్డుయందలి చీఁకటికానుగుచెట్ల యడవిమాటున, గవాం=ఆవులయొక్క, చక్రం=మందను, చారయన్=త్రిప్పుచు, గోపః=గోపాలకృష్ణుఁడు, క్రీడతి=ఆడుకొనుచున్నాఁడు. సః=ఆగోపాలుఁడు, అవ్యాహతం=చెఱుపులేని, పన్థానం=త్రోవను, దర్శయిష్యతి=చూపఁగలఁడు.

ఈశ్లోకమునకు మఱియొక యర్థము:—

హేసఖే=ఓమిత్రుఁడా! అగ్రే=రథాగ్రమందు, దీర్ఘతరః=మహోన్నతుఁడైనవాఁడును, అయం=ఈప్రసిద్ధుఁడైన, అర్జునతరుః=వృక్షమువంటి యర్జునుఁడు, తస్య=ఆయర్జునునియొక్క, అగ్రతః=ముందర, వర్త్మ=ఉపదేశమార్గము, ఘోషం=ఉపనిషత్తును, సముపైతి=పొందుచున్నది. తత్పరిసరే=ఆయుపనిషత్తుయొక్క సమీపమందు, కలిందాత్మజా=యమునానది, తస్యాః=ఆయమునానదియొక్క, తీర...తలే=తీర=గట్టునందుండు, తమాలకానన=చీఁకటికానుఁగుచెట్లవఁడలియొక్క, తలే=ప్రదేశమందు, గవాం=ఉపనిషద్వాక్యములయొక్క, చక్రం=సమూహమును, చారయన్=అధ్యయనముచేయించుచు, గోపః=శ్రీకృష్ణుఁడు, క్రీడతి=విహరించుచున్నాఁడు. సః=ఆకృష్ణుఁడు, త్వాం=నిన్నుగూర్చి, అవ్యాహతం=అతులితమైన, పన్థానం=మార్గమును, దర్శయిష్యతి=చూపఁగలఁడు.

మ. అదిగో ముంగల పెద్దమద్ది యటపో నాచెంత వ్రేపల్లె యు
న్నది యాదండఁ గళిందజాతటమునం దాపింఛభూజాళిలోఁ
గదుపుల్ మేపుచు గోపబాలకుఁడు నిక్కం బొప్పఁగాఁ జెల్వు న
త్పదవిం బొమ్ము సఖా! సుఖాస్పదముగా భావంబు రంజిల్లెడున్. 43

తా. చెలికాఁడా! అదిగో చూచితివా పొడవు మద్దిమ్రానొకటి గనఁబడుచున్నది. దానివెంబడినే కాలిత్రోవయున్నది. అచ్చటనే యమునవచ్చి వ్రేపల్లెలోఁ జేరిపాఱుచున్నది. ఆయమునయొడ్డున నావులమందను మేఁపుచు నొకగోపాలబాలుఁడున్నాఁడు. అక్కడకు వెళ్ళి వాని నాశ్రయించితివా చిక్కులేనిదారిఁ జూపఁగలఁడు.

శ్లో. గోధూళిధూసరితకోమలగోపవేషం
గోపాలబాలకశతై రనుగమ్యమానమ్,
సాయన్తనే ప్రతిగృహం పశుబన్ధనార్థం
గచ్ఛన్త మచ్యుతశిశుం ప్రణతోఽస్మి నిత్యమ్. 44

టీ. గోధూళి.. వేషం=ఆవులకాలిదుమ్ములచేబూదిరంగుపడియున్న సొంపైన పసులకాపరివేసముగలవాఁడును, గోపా.. శతైః=నెక్కుడుగల గొల్లపిల్లకాయలచేత,

అనుగమ్యమానం=అనుసరింపఁబడినవాఁడును, సాయంతనే=సంజవేళ, పశుబన్ధనార్థం=(మేపినోలి తెచ్చిన) పశువులఁగట్టుటకొఱకు, ప్రతిగృహం=ఇంటింటికిని, గచ్ఛంతం=వెళ్లుచున్న, అద్భుతశిశుం = బాలుఁడైయున్న విష్ణునిగూర్చి, నిత్యం=ఎల్లప్పుడు, ప్రణతః=మ్రొక్కినవాఁడను. అస్మి=అయితిని.

ఉ. గోపదధూళిధూసరితకోమలవేషముతోడ నందెలం
గోపకశాబకాళి తనకుం గయిదోడుగ నింటనింటనుం
గోపులఁ గట్టఁగాఁ దిరుగుకృష్ణుని దామకరాభిశోభితుఁ
గోపకుమారు నింపుసదనుఁ బసనుఁ సురునయ్యెఁ గొల్చెదన్. 44

తా. పసుల కాలిదుమ్ములచే నొడలెల్ల బూడిదరంగుగలిగి నందలకొలఁది గొల్ల పిల్లకాయలను వెంటవేసికొని ఇంటింటికి పసులఁగట్టుటకై తిరుగుచున్న కపటగోప బాలుఁ డగువిష్ణునకు మ్రొక్కెదను.

శ్లో. నిధిం లావణ్యానాం నిఖిలజగదాశ్చర్యనిలయం
నిజావాసం భాసాం నిరవధికనిశ్శ్రేయసరసమ్,
సుధాధారాసారం సుకృతపరిపాకం మృగదృశాం
ప్రపద్యే మాఙ్గల్యం ప్రథమ మధిదైవం కృతధియామ్. 45

టీ. లావణ్యానాం=సొబగులకు, నిధిం=గనియైనవాఁడును, నిఖిల...నిలయం=ఎల్లలోకముల నబ్బురము గొలుపువాఁడును, భాసాం=వెలుఁగులకు, నిజాభాసం=పుట్టుచోటును, నిరవధి...రసం=హద్దులేని యానందముగలవాఁడును, సుధాధారాసారం=అమృతపుజడివానయును, మృగదృశాం=కామినులయొక్క, సుకృతపరిపాకం=పున్నెముల పంటయైనవాఁడును, కృతధియాం=శిక్షితబుద్ధులైనవారియొక్క, మాఙ్గల్యం=మంగళమైన, ప్రథమం అధిదైవం=తొలివేల్పగు కృష్ణుని, ప్రపద్యే=ఆశ్రయింతును.

ఉ. చక్కఁదనంబుప్రోవు రుచిసంతతి పొల్చినతావు లోకము
మ్మెక్కఁగ నుండుదంట వికచాంబుజనేత్రలనోముపంట పెం
పెక్కెడుముక్తిధామము మునీశుల కాదిమధామ మూర్జన
మ్మక్కృతసౌధవర్ష మజహర్షము నైనమురారిఁ గొల్చెదన్. 45

తా. సొబగులగనియు, అబ్బురము పుట్టినిల్లును, సింగారముల యిక్కయును, మేరలేని యానందము గలవాఁడును, అమృతపుఁజడివానయును, స్త్రీలనోముల పంటయును, పరిణతబుద్ధుల శుభమును, ఎల్లదేవతలకు మొదటిదైవ మగుకృష్ణునియందుఁ జేరదను.

శ్లో. ఆతామ్రపాణితలమల్పరణత్ప్రలోద
మాలోలహారమణికుణ్డలహేమసూత్రమ్,

ఆవిశ్శ్రమామ్బుకణ మమ్బుదనీల మవ్యా
దాద్యం ధనఞ్జయరథాభరణం మహో నః. 46

టీ. అతామ్ర...ప్రతోదం=అంతట నెఱ్ఱని కేలుదామరయం దండమైనపగ్గములు గలదియు, ఆలోల .. సూత్రం=అంతటఁ గలియఁబడుచున్న సరములు రత్నములయం టుజోడు బంగరుమొలత్రాడుగలదియు, అవి...కణం=పుట్టుచున్న స్వేదోదక బిందువులుగలదియు, అమ్బుదనీలం=మబ్బునుబోలి నల్లనైనదియు, ధనఞ్జయరథాభరణం=అర్జునుని రథమునకు నలంకారమైన, ఆద్యమ్=ఎల్లలోకములకు మొదటిదగు, మహః=తేజము, నః=మమ్ముల, అవ్యాత్=కాపాడుఁగాక.

ఉ. కెంజిగురాకుఁగేలఁ దాలకించుప్రతోదముచేత నాజి ధా
నంజయవాజిరాజిగమనక్రియ యేర్పఱుపఁగ మొగంబునం
గ్రొంజెమటూఱ హారమణికుండలముల్ చలియింప నొప్పున
య్యంబుదనీల తేజము రథాభరణం బనయంబుఁ బ్రోచుఁతన్. 46

తా. గుఱ్ఱములపగ్గములఁ జేతఁ బుచ్చుకొని, హారములు కుండలములు గదుల, మొలనూలు మెఱయ నొడలు చెమర్ప, నర్జునుని రథము గుఱ్ఱములఁదోలుచున్నదియు, లోకముల కాదియైనదియు, నర్జునునిరథము నలంకరించియున్న మేఘమువలె నల్లనైన వెలుఁగు మమ్ముఁ గాచుఁగాత.

శ్లో. నఖనియమితకణ్డూన్ పాణ్డవస్యన్దనాశ్వా
ననుదిన మభిషిఞ్చ న్నఞ్జలిస్థైః పయోభిః,
అవతు వితతగాత్రస్తోత్రనిష్యూతమౌళి
ర్దశనవిధృతరశ్మి ర్దేవకీపుణ్యరాశిః. 47

టీ. నఖ...కణ్డూన్=గోళ్లచేఁ దీర్పఁబడిన దురదగల, పాణ్డవస్యన్దనాశ్వాన్=అర్జునుని తేరిగుఱ్ఱములను, అఞ్జలిస్థైః=దోలిసి ముందుఁ బట్టఁబడిన, పయోభిః=నీళ్లచేత, అనుదినం=ప్రతిదినము, అభిషిఞ్చన్=కడుగుచున్నవాఁడును, వితతగాత్రః=చాఁచఁబడినమేనుగలవాఁడును, తోత్రనిష్యూతమౌళిః=మునికోలచే జుట్టఁబడిన తలగలవాఁడును, దశన విధృతరశ్మిః=పండ్లతోఁ గఱచికొఁబడినపగ్గములుగల, దేవకీపుణ్యరాశిః=దేవకీపుణ్యముల ప్రోవగు శ్రీకృష్ణుఁడు, అవతు=మమ్ముఁ గాపాడుఁగాక.

మ. తలఁ దోత్త్రంబు ధరించి పగ్గములు దంతశ్రేణిఁ గీలించి య
గ్గలికన్ మే నిగిడించి పార్థరథకంఖాణంబులన్ దోయిటన్
జలముల్ సల్లి నఖాళిమై నివురుచున్ రక్షించునా దేవకీ
లలనాపుణ్యఫలంబు నన్నుఁ గరుణాలంకారుఁగాఁ జేయుఁతన్. 47

తా. కొరడా తలకుఁ జుట్టుకొని, పగ్గములు నోటఁ గఱచుకొని యొడలు గిని డించి, గోళ్ళతోఁ గోఁకుచు, నర్జునుని తేరిగుఱ్ఱములను దోసిలితో నీళ్లు కొట్టి తడుపుచున్న దేవకీపుణ్యసమూహ మగుకృష్ణుఁడు మమ్ము రక్షించుఁగాక.

శ్లో. వ్రజయువతిసహాయే యౌవనోల్లాసికాయే
సకలశుభవిలాసే కున్దమన్దారహాసే,
నివసతు మమ చిత్తం తత్పదాయత్తవృత్తం
మునిసరసిజభానౌ నన్దగోపాలసూనౌ. 48

టీ. వ్రజయువతి సహాయే=గొల్ల కాంతలే తోడుగాఁ గలవాఁడును, యౌవనోల్లాసి కాయే=తారుణ్యముచే మెఱయు నొడలుగలవాఁడును, సకలశుభవిలాసే=అన్ని మంగళముల విలాసముగల, కున్దమన్దారహాసే=ముల్లెలుకల్పప్రసూనములవంటి నవ్వుగల వాఁడును, ముని...భానౌ=మునులనుకమలములకు సూర్యుఁడగు, నన్దగోపాలసూనౌ=నందుఁడను గొల్లనికొడుకునందు, తత్ప...వృత్తం= వానిపాదముల యధీనమైన చరిత్రముగల, మమ=నాయొక్క, చిత్తం=మనసు, నివసతు=నిలుచుఁగాక.

చ. వ్రజయువతీసహాయు నతిరాజితయౌవనకాయు మౌనిచి
త్తజలజమిత్రు విశ్వజనతానుతిపాత్రు వినీలగాత్రుఁ దో
యజదళనేత్రుఁ గుందనిభహాసు శుభైకదయావిలాసునిర్
సుజనహితుం దదంఘ్రిరతిఁ జొప్పడునామది నామతించెదన్. 48

తా. గోపవనితలతోఁ గూడినవాఁడును, నిత్యతారుణ్యముచే వెలయువాఁడును, ఎల్లశుభములకు నిల్లైనవాఁడును, మల్లెలు పారిజాతములవంటి నగవుగలవాఁడును, మునిమానసహంసుఁడగు నందునికొడుకు పాదముల యధీనమై నాచిత్త ముండుఁగాక.

శ్లో. అరణ్యానీ మార్ద్రస్మితమధురబిమ్బాధరసుధా
సరణ్యా సంక్రాన్తై స్సపది మదయ న్వేణునినదైః,
ధరణ్యా సానన్దోత్పులక ముపగూఢాఙ్ఘ్రికమలః
శరణ్యానా మాద్య స్స జయతు శరీరీ మధురిమా. 49

టీ. ఆర్ద్ర...సరణ్యా = ప్రేమార్ద్రమైన చిఱునగవుచే ముద్దుగులుకు మోవి దొండపండలి అమృతప్రవాహముతోడ, సజ్క్రాన్తైః=కలిసిన, వేణునినదైః=పిల్లఁగ్రోవిధ్వనులచేత, సపది=అప్పుడే, అరణ్యానీం=అరణ్యసంతతిని, మదయన్=కారుకొనఁజేయుచున్నదియు, ధరణ్యా=భూమిచేత, సాన్ద్రోత్పులకం=ఆనందపుగగుర్పాటులు గలుగునట్లుగా, ఉప...కమలః=కౌఁగిలింపఁ (స్పృశింపఁ) బడిన యడుగుఁదామరలు గలదియు, శరణ్యానాం=ఎల్లప్రాపులలో, ఆద్యః=మొదటిదగు, సః=ఆ, శరీరీ=తను వును దాల్చిన, మధురిమా=సౌందర్యము, జయతు=అన్నిటికి మిన్నయగుఁగాక.

మ. స్మితబింబాధరమాధురీకలితవంశీనాదమోదంబుచే
నతివిస్ఫూర్తిని గానసం బలరఁ బాదాంభోజసంసక్తిచే
క్షితి రోమాంచము గాంచెనో యని వితర్కింపం బ్రవర్తించున
చ్యుతుఁ డుద్యన్మధురాభిరూప్యమున సర్వోత్కృష్టుఁడై వర్తిలున్.

తా. నగవు దొలకుమోవిచేఁ బిల్లఁగ్రోవిని నొక్కి యూఁదుచు నడవిని దట్ట మాగాఁ జేయునదియు, భూమిచే దట్టపుగగుర్పాటుతోఁ గూడునట్లు అలింగనముచేయఁబడిన పాదములుగలదియు, ఎల్లప్రాపులకు మొదలైన ఆశరీరము దాల్చిన లావణ్యము అన్నిటికంటె నెచ్చై యున్నది.

*శ్లో. ముగ్ధం స్నిగ్ధం మధురమురలీమాధురీధీరనాదైః
కారంకారం కరణవివశం గోకులవ్యాకులత్వమ్,
శ్యామం కామం యువజనమనోమోహనం మోహనాఙ్గం
చిత్తే నిత్యం నివసతు మహో వల్లవీవల్లభం నః. 50

టీ. ముగ్ధం=సొగసైనదియు, స్నిగ్ధం=మెఱుఁగుగలదియు, మధుర...నాదైః=శ్రావ్యములైనపిల్లఁగ్రోవియొక్క తీయనిమ్రోఁతలచేత, కరణవివశం = ఇంద్రియజ్ఞానమూఢమైన, గోకులవ్యాకులత్వం=వ్రేపల్లెయొక్క కలవరపాటును, కారంకారం=మాటిమాటికిని గలిగించుచున్నదియు, శ్యామం = నల్లనిదియు, కామం = మిక్కిలి, యువ...హనం = తరుణుల చిత్తముల మోహింపఁజేయు శరీరముగలదియు, వల్లవీవల్లభం=గోపికలకుఁ బ్రాపైన, మహః = కృష్ణతేజము, నః=మాయొక్క, చిత్తే=మనమునందు, నిత్యం=ఎల్లప్పుడు, నివసతు=ఉండుఁగాక.

తా. సుందరమైనదియు, మెఱుఁగైనదియు తీయని వేణుగానములచే, గోవులను గోపాలురను పరవశ మొందించుచున్నదియు, నల్లనిదియు, యౌవనవంతులైనపురుషుల నైతము మరులుకొలుపుచున్నదియు, జగన్మోహనమైన యాకారముగలదియు గోపాంగనలకుఁ బ్రియమైన తేజము మాచిత్తముల నిత్యము వెలయుఁ గాక.

శ్లో. విదగ్ధగోపాలవిలాసినీనాం సంభోగచిహ్నాఙ్కితసర్వగాత్రమ్,
పవిత్రమామ్నాయగిరా మగమ్యం బ్రహ్మ ప్రపద్యే నవనీతచోరమ్.

టీ. విదగ్ధ...నీనాం = జాణలగు గొల్లసొగసుకత్తెలయొక్క, సమ్భోగ...గాత్రం=కూటమియందలి గుఱుతులుగలిగిన సర్వావయవములు గలదియు, పవిత్రం=పావనమైనదియు, అమ్నాయగిరాం=వేదవాక్కులకు, అగమ్యం=పొందరానిదియు, నవనీతచోరం=వెన్న మ్రుచ్చగు, బ్రహ్మ=కృష్ణపరమాత్మను, ప్రపద్యే=ఆశ్రయింతును.

*ఈశ్లోకము కొన్నిప్రతులయం దిచ్చటఁ గానరాదు. దీనికిఁ దెలుఁగుపద్యము గూడలేదు. ప్రక్షిప్తమనితోఁచెడి.

మ. నవలావణ్యవిలాసినీనికరనానాబంధనంబంధసం
భవదర్ధాంకశరీరు విశ్వపరమామ్నాయాంతవాచోవిధే
యవిహారుఁ నవనీతచోరుని బవిత్రాచారసంచారునిఁ
భువనాధారుని శాంతిసారుని నిసుం బూజింతు నెల్లప్పుడున్. 51

తా. ఒడలెల్ల జాణలగు గోపకాంతల సంభోగచిహ్నములు గలదియు, సర్వజగత్పావనమైనదియు, వేదములకు నైతము గోచరింపనిదియు, వెన్నదొంగయగు శ్రీకృష్ణపరమాత్మను సేవించెదను.

శ్లో. అన్తర్గృహే కృష్ణ మవేక్ష్య చోరం బద్ధ్వా కవాటం జననీం గతైకా,
ఉలూఖలే దామనిబద్ధ మేనం తత్రాపి దృష్ట్వా స్తిమితా బభూవ. 52

టీ. ఏకా=ఒకగొల్లది, అన్తర్గృహే=గర్భగృహమున, చోరం=వెన్నదొంగయగు, కృష్ణం=కృష్ణుని, అవేక్ష్య=కాంచి, కవాటం=తలుపును, బద్ధ్వా=మూసిపెట్టి, జననీం=వాని తల్లినిగూర్చి, గతా = వెళ్లినదై, ఉలూఖలే — ఱోటియందు, దామనిబద్ధం=త్రాటఁగట్టఁబడిన, ఏనం=ఈకృష్ణుని, తత్రాపి=అచ్చటను, దృష్ట్వా=చూచి, స్తిమితా=ప్రాన్పడినది, బభూవ=ఆయెను.

చ. నిలయములో నొకర్తు నవనీతహరుఁ హరిఁ గాంచి గట్టిగాఁ
తలుపు బిగించి యక్కొడుకుఁ దల్లికిఁ దెల్పఁగఁ బోయి యం దులూ
ఖలగుణబద్ధుఁ డౌనతనిఁ గన్గొని యూఱడి వచ్చి రిత్తబా
వలు గని సారె కేక లిడ వర్తిలునాబలుదంటఁ గొల్చెదన్. 52

తా. ఒకగొల్లది తనయింటిలో దొంగిలఁచున్న వెన్నునిజూచి యట్లే తలుపు మూసి వానితల్లితోఁ జెప్పఁబోయి, అచ్చటను, యశోదచే ఱోటఁగట్టి దండింపఁబడువానిని జూచి యాశ్చర్యముచే నోడలెఱుంగక నిలుచుండెను.

శ్లో. రత్నస్థలే జానుచరః కుమారః సఙ్క్రాన్త మాత్మీయముఖారవిన్దమ్,
ఆదాతుకామ స్తదలాభఖేదా ద్విలోక్య ధాత్రీవదనం రురోద. 53

టీ. జానుచరః=దోఁగాడుచున్న, కుమారః=బాలుఁడైనకృష్ణుఁడు, రత్నస్థలే=రత్నములకట్టడపునేలయందు, సంక్రాంతం=ప్రతిఫలించిన, ఆత్మీయముఖారవిన్దం=తనమోముఁదమ్మిని, ఆదాతుకామః = కైకొనఁదలఁచినవాఁడై, తదలాభఖేదాత్=అదిచిక్కలేదనుకినుకతో, ధాత్రీవదనం=దాదిమొగమును, విలోక్య=చూచి, రురోద=ఏడ్చెను.

మ. ఘనరత్నస్థగితావనిఁ నిజముఖాకారంబు పద్మాకృతిం
గనుపట్టం గని నవ్వి తద్గ్రహణకాంక్షం జిన్ని కేల్ సాఁచి చే
రనిఖేదంబున జానుయానము దలిర్పఁ దాని నీక్షించి కా
వనుచుం బో రిడునందనందనుని మాయాడింభకుం గొల్చెదన్. 53

తా. ఒక్కనాఁడు, కృష్ణుఁడు రత్నములకట్టడపు నేలమీఁద దోఁగాడుచు, అర త్నములలోఁ బ్రతిబింబిత మైనతన మోముఁ జూచి, యదియొకవిచిత్రవస్తువని లాగికొనఁ బోయి, యదిరాకపోయినందున దాదిమొఁగము సూచి యేడువసాగెను.

శ్లో. ఆనన్దేన యశోదయా సమదనం గోపాఙ్గనాభిశ్చిరం
సాశఙ్కం బలవిద్విషా సకుసుమైః సిద్ధైః పృథివ్యాకులమ్,
సేర్ష్యం గోపకుమారకైః సకరుణం పౌరైః ర్జనైః సస్మితం
యో దృష్టః స పునాతు నో మురరిపుః ప్రోత్క్షిప్తగోవర్ధనః. 54

టీ. యశోదయా = యశోదమ్మ చేత, అనందేన = సంతోషముతోడను, గోపాఙ్గనాభిః = గొల్లపడఁతుకలచేత, సమదనం = మన్మథోద్రేకముతోఁ గూడునట్లును, బలవిద్విషా = ఇంద్రునిచే, చిరం = తడవుగా, సాశఙ్కం = విన్నఁబాటుతోను, సిద్ధైః = దేవతా విశేషులచేత, సకుసుమం = పువ్వులవానతోడను, పృథివ్యా = భూమిచేత, ఆకులం = కలవరముతోఁగూడునట్లును, గోపకుమారకైః = గొల్లపిల్లకాయలచేత, సేర్ష్యం = పరోత్కర్షాసహిష్ణుత్వముతోడను, పౌరైః = ఊరివారలచే, సకరుణం = దయతోడను, జనైః = మిగిలిన చూపరులచేత, సస్మితం = చిఱునగవుతోఁ గూడునట్లును, యః = ఏదేవుఁడు, దృష్టః = చూడఁబడెనో, ప్రోత్క్షిప్తగోవర్ధనః = ఎత్తఁబడిన గోవర్ధనపుకొండగల, సః = ఆ, మురరిపుః = కృష్ణుఁడు, నః = మమ్ము, పునాతు = పవిత్రముసేయుఁగాక.

చ. ముదమున నందగోపికలు మోహమునన్ జనపాలినవ్వునం
ద్రిదశవిభుండు సాధ్వసమలర్ విరివానల సిద్ధపుంగవుల్
జాదలినయాకులత్వమున భూమియు గోపకుమారు లేపునన్
సదయతఁ బౌరులుం గన రసాధర మెత్తినచక్రి ప్రోచుతన్. 54

తా. ఆనందముతో యశోదయు, మదనవికారముతో గోపికలును, ఇదియే మిరా యనుభీతితో నింద్రుఁడును, పుష్పవర్షముతో సిద్ధులును, మనోవ్యాకులతతో భూమియు, మచ్చరముతో గొల్లపిల్లకాయలును, దయతో నూరివారును, నవ్వుతో నితరులును జూడఁగా గోవర్ధనగిరి నెత్తినకృష్ణుఁడు మమ్ము పాపములఁ బాపి పవిత్రులఁ జేయుఁగాక.

శ్లో. ఉపాసతామాత్మవిదః పురాణాః
పరం పుమాంసం నిహితం గుహాయామ్,
వయం యశోదాశిశుబాలలీలా
కథాసుధాసిన్ధుషు లీలయామః. 55

టీ. పురాణాః = పూర్వులైన, ఆత్మవిదః = బ్రహ్మవేత్తలైనమునులు, గుహాయామ్ = దహరాకాశగుహయందు, నిహితం = ఉంచఁబడిన, పరంపుమాంసం = పరమపురుషుని,

ఉపాసతాం=ధ్యానింతురుగాక. వయం=మేముమాత్రము, యశోదా...సిన్ధుషు = యశోదకొడుకుయొక్క బాల్యవిలాసకథ అనునమృతసముద్రములయందు, లీలయా మః=విహరము సల్పెదము.

మ. దహరాకాశనివాస మౌపరము నాత్మజ్ఞాను లీక్షించి ప్ర
త్యహముం గాంతురు గాక నే నలయశోదాబాలలీలాసుధా
లహరీవీచిపరంపరం గదిసి కొల్లల్ గాఁగఁ గ్రీడించున
న్నహనప్రౌఢిఁ జెలంగు డెందమున నానందంబు సంధించెదన్. 55

తా. ఆత్మస్వరూపవేత్త లైన పూర్వపుమునీశ్వరు లాకేసులు హృదయగుహ యందలి పరమాత్మను దదేకచిత్తులై ధ్యానింతురుగాక. మేముమాత్రము లీలాగోప బాలుఁడై క్రీడసలుపుచున్న కృష్ణపరమాత్మయొక్క బాల్యమందలి విలాసకథలను నమృతసముద్రములలో నోలలాడెదము.

శ్లో. విక్రేతుకామా కిల గోపకన్యా మురారిపాదార్పితచిత్తవృత్తిః,
దధ్యాదికం మోహవశా దవోచ ద్గోవిన్ద దామోదర మాధ వేతి.

టీ. దధ్యాదికం=పెరుఁగు మొదలగువానిని, విక్రేతుకామా = అమ్మదలఁచిన, గోపకన్యా = గొల్లపడుచు, మురారి...వృత్తిః=శ్రీహరిపాదములయం దుంచఁబడిన మనోవ్యాపారముగలదై, మోహవశాత్ = (కృష్ణునియందలి) మోహమువలన, గోవింద, దామోదర, మాధవ, ఇతి=అని, అవోచత్=కేక వేసెను.

మ. నవలావణ్యవిలాసినీతిలక మానందంబునన్ సంధనం
భవపాదార్పితచిత్తవృత్తి మరలింపన్ నేరకే వీటిలో
నవనీతాదిక మమ్మఁజో మఱపు జెందం బౌరులం గాంచి మా
ధవ గోవింద ముకుంద కృష్ణ యను సుద్యన్మోహవిభ్రాంతితోన్. 56

తా. ఒకగొల్లపడుచు, పెరుఁగు పాలు నమ్మఁబోయి ఎప్పుడు కృష్ణునియందే మరులుకొనియుండును గాన కృష్ణునియందలిమోహముచే 'పెరుఁగోయమ్మపెరుఁగు' అని పిలువవలసినది యై 'గోవిందా దామోదరా మాధవా' యని కేక లిడఁ దొడం గెను.

శ్లో. ఉలూఖలం వా యమినాం మనో వా
గోపాఙ్గనానాం కుచకుట్మలం వా,
మురారినామ్నః కలభస్య నూన
మాలాన మాసీ త్త్రితయ మేవ భూమౌ. 57

టీ. మురారినామ్నః=కృష్ణుఁడనెడి, కలభస్య=ఏనుఁగుగున్నకు, ఉలూఖలంవా =యశోదయిఁటిలోనిఱోలుగాని, యమినాం=యోగులయొక్క, మనోవా=చిత్త

ముగాని, గోపాఙ్గనానాం= గొల్లవనితలయొక్క, కుచకుట్మలం వా=చనుమొగ్గగాని, భూమౌ=భూమియందు, త్రయమేవ=రెండుమూఁడే, ఆలానం=కట్టుకంబము, ఆసీత్ =ఆయెను.

చ. మునిజనమానసాంబురుహముం బశుపాలకబాలికామణీ
స్తనవనజాతకోరకవితానము లూఖలమున్ మురారివే
హానకలభంబు నిల్పుటకు నై విలసిల్లినకట్టుఁగంబముల్
దనరెడు నొండురెండు నివి దక్క ధరాస్థలిఁ గల్గ నేర్చునే. 57

తా. ఎట్టివారలకును వశపఱచుకో నలవిగాని కృష్ణుఁ డనుకొదమయేనుఁగునకు యశోదయింటిలోనిఱోలుగాని, యోగులచిత్తముగాని, గోపికలచనుబంతులుగాని యిటుల రెండు మూఁడు దప్ప వేఱే బంధనస్థానములు లేవు. వీనికి నిత్యసన్నిహితుఁ డైనట్లు మఱియేరికిఁ గాఁ డనుట.

శ్లో. కరారవిన్దేన పదారవిన్దం ముఖారవిన్దే వినివేశయన్తమ్,
వటస్య పత్రస్య పుటే శయానం బాలం ముకున్దం మనసా స్మరామి.

టీ. కరారవిన్దేన=కేలుఁదామరచే, పదారవిన్దం=అడుగుఁదామరను, ముఖారవిన్దే=మోముఁదామరయందు, వినివేశయన్తం=చొనుపుకొనుచున్నవాఁడును, వటస్య=మఱ్ఱిచెట్టుయొక్క, పత్రస్య=ఆకుయొక్క, పుటే=దొన్నెయందు, శయానం=పండియున్న, బాలం=బాలుఁడగు, ముకున్దం=కృష్ణుని, మనసా=చిత్తముతోడ, స్మరామి=తలఁచెదను.

శా. కేలుం దామరచేఁ బదాబ్జ మెలమిం గీలించి నెమ్మోముపై
వాలిన్ నిల్పి వటప్రవాళమృదుశయ్యం బొల్చునబ్బాలునిన్
లీలాలోలవిశాలలోచనుని లాలిం బెట్టి లాలించుచున్
జోలల్ వాడుయశోదభాగ్యమున కేఁ జోహారు గావించెదన్. 58

తా. కేలుదమ్మిచే నడుగుఁదమ్మిని మోముదమ్మి నిడుకొని మఱ్ఱియాకుదొప్పయందు నిదురఁగూరియున్న కుహనాబాలుఁ డగువెన్నుని మదిలోఁ జింతించెదను.

శ్లో. శమ్భో స్వాగత మాస్యతా మిత ఇతో వామేన పద్మాసన
క్రౌఞ్చారే కుశలం సుఖం సురపతే విత్తేశ నో దృశ్యసే,
ఇత్థం స్వప్నగతస్య కైటభజిత శ్శ్రుత్వా యశోదాగిరః
కిం కిం బాలక జల్పసీతి రచితం ధూధూకృతం పాతు నః. 59

టీ. హేశమ్భో=ఓయీశ్వర, స్వాగతం=సుఖముగవచ్చితివా? పద్మాసన=ఓబ్రహ్మా, ఇత ఇతః వామేన=ఇటుల యెడమప్రక్కను, ఆస్యతాం=కూర్చుండుము. క్రౌఞ్చారే=కుమారా, కుశలం=సేమమా? సురపతే=ఇంద్రా, సుఖం=సుఖముగలదా? విత్తేశ=కుబేరా, నోదృశ్యసే=మాచేఁ జూడఁబడవు. ఇత్థం=ఈలాగున, స్వప్నగతస్య=నిద్రించి

యున్న, కైటభజితః=కృష్ణునియొక్క, గిరః=కలవరింతమాటలను, శ్రుత్వా=విని, యశోదా=యశోద, హేబాలక=ఓబిడ్డా, కింకిం=ఏమేమి, జల్పసి=పలవరించెదవు. ఇతి=అని, రచితం=చేయఁబడిన, ఘూఘూకృతం=పీడాపనోదకమైన 'ఘూఘూ' అను నిష్ఠీవనశబ్దము, నః=మమ్ము, పాతు=రక్షించుఁగాక.

మ. హర రారమ్ము శుభంబె డాపలను భాషాధీశ కూర్చుండుమా
పరిణామంబె కుమార యింద్ర సుఖమే పౌలస్త్య వీక్షింపమే
నరణిఁ నిన్ననఁగా యశోద విని వత్సా యేమి యేమంచు ని
ద్దురము బ్బూచనిసకృష్ణుపై నిడినఘూఘూకారముల్ ప్రోచుతన్. 59

తా. రుద్రా! సుఖముగావచ్చినావా? బ్రహ్మా! ఇక్కడను వైపునఁ గూర్చుండుము. కుమారా! నేమమేనా? ఇంద్రా! సౌఖ్యమా? కుబేరా! ఏమి బొత్తిగా అగపడుటేలేదు. అనికృష్ణుఁడు నిదురలోఁ గలవరింపఁగా, యశోద వచ్చి ఏమిరా కలవరించుచు న్నావు నాయనా యని పీడాపరిహారమునకుఁ గాఁ జేసిన ఘూఘూకారము మమ్ముఁ గాపాడుఁగాక.

అవ. కవి యీశ్లోకంబున యశోదాశ్రీకృష్ణుల ప్రశ్నోత్తరముల వర్ణించు చున్నాఁడు.—

శ్లో. మాతః కిం యదునాథ దేహి చషకం కిం తేన పాతుం పయ
స్తన్నాస్త్యద్య కదాస్తి వా నిశి నిశా కా వాఽన్ధకారోదయః,
ఆమీల్యాక్షియుగం నిశా ప్యుపగతా దేహీతి మాతుర్ముహు
ర్వక్షోజాంశుకకర్షణోద్యతకరః కృష్ణస్స పుష్ణాతు నః. 60

టీ. కృష్ణుఁడు, హేమాతః=ఓయమ్మా అని పిలువ, యశోద, హే, యదునాథ=ఓయాదవులరాజా, కిం=ఏమిరా, (కృ) చషకం=నాకూజాను, దేహి=తెమ్ము. (య) తేన=దానితో, కిం=ఏమిపని? (కృ) పయః=పాలను, పాతుం=త్రాగుటకు, (య) తత్=(అగిన్నె) ఆపాలు, అద్య=ఇప్పుడు, నాస్తి=లేవు. (కృ) కదా=ఎప్పుడు, అస్తివా=ఉండును. (య) నిశి=రాత్రియందు, (కృ) నిశా=రాత్రియన, కా=ఏది? (య) అన్ధకారోదయః=చీఁకటిపడుట, (అనఁగానే) అక్షియుగం=రెండుకన్నులను, ఆమీల్య=గట్టిగా మూసికొని, నిశాపి=రాత్రియు, ఉపగతా=వచ్చినది. దేహి=పాలగిన్నె తెమ్ము. ఇతి=అని, మాతుః=తల్లి యగు యశోదయొక్క, వక్షోజాంశుక కర్షణోద్యతకరః=పైఁటకొంగును లాగుటకై చాఁచఁబడిన చేయిగల, సః=ఆ, కృష్ణః=శ్రీకృష్ణుఁడు, నః=మమ్ము, పుష్ణాతు=పోషించుఁగాక.

ఉ. అమ్మ యదేమిరా యదుకులాగ్రణి గిన్నె యొసంగు మేల పా
లిమ్ముగఁ ద్రావ లేదిపు డదెప్పుడు రేయది యెట్టి దంధకా

రమ్మగు నన్నుఁ గన్గొనిచి రాత్రియె వచ్చెను వేగ పాలు తే
తెమ్మని తల్లిపైఁట వడిఁ దీయుముకుందుఁడు నన్నుఁ బ్రోచుతన్. 60

తా. అమ్మా! ఏమిరా కృష్ణా! నా అపుకోర యేదీ ఇటులిమ్ము! ఎందుకురా! పాలుత్రాగవలె. పాలు లేవే. అయిన ఎప్పుడుండును? రాత్రికి. రాత్రియనఁగా నెట్టు లుండును. రాత్రివచ్చినచోఁ జీఁకటిపడును. అని తల్లియనఁగానే రెండుకన్నులు గట్టిగా మూసికొని, అమ్మా రాత్రికూడవచ్చినది. నాపాలగిన్నె నియ్యవే యని మకురు నేయుచు యశోదపైఁటకొంగును బట్టి లాగుచున్న కృష్ణుఁడు మమ్ముఁ బ్రోచుఁగాక.

శ్లో. కాళిన్దీపులినోదరేషు ముసలీ యావ ద్గతః ఖేలితుం
తావ త్కార్పరికం పయః పిబ హరే వర్ధిష్యతే తే శిఖా,
ఇత్థం బాలతయా ప్రతారణపరాః శ్రుత్వా యశోదాగిరః
పాయాన్న స్స్వశిఖాం స్పృశన్ ప్రముదితః క్షీరేఽర్ధపీతే హరిః.

టీ. హరే=కృష్ణా, ముసలీ=బలరాముఁడు, కాళిన్దీపులినోదరేషు=యమునయిందలి యిసుకతిప్పలనడుమ, యావత్ = ఎంతలో, ఖేలితుం = ఆడుకొనుటకొఱకు, గతః=వెళ్లెనో, తావత్ = వాఁడు వెళ్లి వచ్చులోపల, కార్పరికం = గిన్నెలోనున్న, పయః=పాలను, పిబ=త్రాగుము. తే=నీయొక్క, శిఖా=జుట్టు, వర్ధిష్యతే=పెరుగును. ఇత్థం=ఇట్లు, బాలతయా=కుఱ్ఱియగుటచేత, ప్రతారణపరాః=మోసపుచ్చుటకై పలుకఁబడిన, యశోదాగిరః=యశోదమాటలను, శ్రుత్వా=విని, ప్రముదితః=ఆనందముఁ బొందినవాఁడై, క్షీరే=పాలు, అర్ధపీతే=సగము గ్రోలఁబడినదికాఁగా, స్వశిఖాం=తన జుట్టును, స్పృశన్=తడవుకొనుచున్న, హరిః=కృష్ణుఁడు, నః=మమ్ము, పాయాత్=రక్షించుఁగాక.

ఉ. హేళికనూభవాపులినహేలఁ జరించుబలుండు రాకమున్
బాలక పైఁడిగిన్నెఁ గలపాల్ వెస నానుము గొప్పవెండ్రుక
ల్గ్రాలు నటన్ననందసతిలాలనమాటల కుబ్బి సాముపాల్
గ్రోలుచుఁ జంచుఁ జూచికొనుగోపకుమారుఁడు నన్నుఁ బ్రోచుతన్.

తా. కృష్ణా! అన్న యమునకుఁ బోయి ఆడుకొని వచ్చులోపల పాలన్నియు నీవే త్రాగివేయుము. పాలు ఎంతగా త్రాగిన జుట్టు అంతపొడుగుగాఁ బెరుగును. అను యశోదమాటలు విని యుబ్బినవాఁడై, గిన్నెఁ బట్టుకొని పాలు సగపడఁద్రాగి సిగ దడవి చూచుకొను చిన్నికృష్ణుఁడు మమ్ముఁ గాపాడుగాక.

శ్లో. కైలాసో నవనీతతి క్షితి రియం ప్రాగ్జగ్ధమృల్లోష్టతి
క్షీరోదోఽపి నిపీతదుగ్ధతి లసత్ స్మేరే ప్రఫుల్లే ముఖే,

మాత్రాఽజీర్ణధియా దృఢం చకితయా నష్టాఽస్మి దృష్టః కయా
ఘూఘూ వత్సక ! జీవ జీవ చిర మిత్యుక్తోఽవతాన్నో హరిః. 62

టీ. లసత్స్మేరే=ప్రకాశించుచిఱునగవుగల, ముఖే=నోరు, ప్రఫుల్లేసతి=తెఱవఁబడినదగుచుండఁగా, కైలాసః=వెండికొండ, నవనీతతి=నిత్యము దినుచున్న వెన్నముద్దవలెనయ్యెను. ఇయమ్=ఈ, క్షితిః=భూమి, ప్రాగ్జగ్ధమృల్లోష్టతి=మును పుదిన్న మన్నుగడ్డవలెనగుచున్నది. క్షీరోదోఽపి=పాలకడలియు, నిపీతదుగ్ధతి=త్రాగఁబడినపాలవలెనగుచున్నది, అజీర్ణధియా=అఱుకువయనుతలఁపుతో, దృఢం=మిక్కిలి, చకితయా=భయపడిన, మాత్రా=తల్లిచేత, నష్టా=విపన్నురాలను, అస్మి=అయితిని. వత్సక=బిడ్డా, కయా=ఎవతెచేత, దృష్టః=చూడఁబడితివిరా. ఘూఘూ, (అనుకరణము) చిరం=తడవుకాలము, జీవజీవ=బ్రదుకుముబ్రదుకుము. ఇతి=అని, ఉక్తః=పలుకఁబడిన, హరిః=శ్రీకృష్ణుఁడు, నః=మమ్మును, అవతాత్=రక్షించుఁగాక.

చ. నసిచిననవ్వునెమ్మొగమునన్ ధర భక్షితమృత్తుగాఁ బయో
వనధి నిపీతదుగ్ధమనస్థితిగా రజతాద్రి వెన్నగాఁ
గని భ్రమఁ జెల్లనే చెలువ గాంచెనొ దృష్టిగ నంచు నంబదీ
వనమును ఘూత్కృతుల్ నిచుప వత్తిలుపావనిప్రాపుఁ గాంచెదన్. 62

తా. యశోద, కృష్ణుఁడు మన్నుఁ దిన్నాఁడని విని రావించి చూపు మనఁగా వాఁడు నవ్వుచు నోరు దెఱచి చూప నామెకు వానికడుపులో సమస్తబ్రహ్మాండముం గానిపించెను, అదిచూచి యశోద అందున్న కైలాసపర్వతమును వాఁడు దిన్న వెన్నముద్ద యనుకొనెను. భూమిని చూచి వాఁడుదిన్న మంటిగడ్డ యనుకొనియెను. పాలసముద్రమును వాఁడు రోజు త్రాగినపాలుగాఁ దలఁచెను. ఇట్లు తలఁచి భయపడి, అయ్యో నేచచ్చిపోయితినే కొడుకా యెవరు నిన్ను చూచిరా, యిట్లజీర్ణముచేసినది ? ఘూఘూ, చిరంజీవ, చిరంజీవ యని రక్షపెట్టెను. ఇట్టికృష్ణుఁడు మమ్ముఁ గాచుఁగాక.

శ్లో. కిఞ్చిత్కుఞ్చితలోచనస్య పిబతః పర్యాయపీతస్తనం
సద్యః ప్రస్నుతదుగ్ధబిన్దు మపరం హస్తేన సమ్మార్జతః,
మాత్రైకాఙ్గులిలాలితస్య చుబుకే స్మేరాననస్యాధరే
శౌరేః క్షీరకణాన్వితా నిపతితా దన్తద్యుతిః పాతు నః. 63

టీ. కిఞ్చి...నస్య=కొంచెము ప్రక్కకుఁ ద్రిప్పఁబడినకన్నులు గలవాఁడును, పర్యాయపీతస్తనం=ఒకటివెంటనొకటిని కుడువఁబడిన స్తనమును, పిబతః=త్రాగుచున్నవాఁడును, సద్యః=అప్పుడే, ప్రస్నుతదుగ్ధబింధుం=కాఱినపాలచుక్కలుగల, అపరం=మఱియొకచన్నును, హస్తేన=చేతితో, సమ్మార్జతః=రాయుచున్నవాఁడును, మాత్రా=

తల్లిచేత, చుబుకే=గడ్డమందు, ఏకాఙ్గులిలాలితస్య=ఒకవేలిచే బుజ్జగింపఁబడినవాఁడును, స్మేరాననస్య=చిఱునగవుగల, శౌరేః=కృష్ణునియొక్క, అధరే=పెదవియందు, నిపతితా=పడిన, క్షీరకణాన్వితా=పాలచుక్కలతోఁగూడిన, దన్తద్యుతిః = పండ్లరంగు, నః=మమ్ముల, పాతు=రక్షించుఁగాక.

చ. ఒకకుచ మూని పాల్ గురియునొక్కకుచంబొకకేలఁ బూని యా
ముకుళితనేత్రుఁడై జనని ముద్దునకుం జుబుకంబు వ్రేలఁ జి
ట్టకముగ నంటి మోవిఁ బ్రకటంబగులేనగ వొప్పుశౌరి దు
గ్ధకణసమేతదంత రుచితత్పరతన్ మనుఁ బ్రోచుఁగావుతన్. 63

తా. ఒకటి నెంట నొకటి వరుసగా నందుకొని త్రాగుచునుగనుక, ఒక చన్నును త్రాగుచు, పాలచుక్కలు కాఱుచున్న వేఱొకచన్నును చేతఁ దాఁకుచు చూపునడ్డము త్రిప్పి, గడ్డముమీఁద వ్రేలిడి తల్లి వినోదపఱచుచుండఁ జిఱునవ్వు నవ్వుచున్న కృష్ణుని పాలచుక్కలతోఁగూడిన తెల్లని దంతకాంతి మమ్ముఁ గాపాడుఁగాక.

శ్లో. ఉత్తుఙ్గస్తనమణ్డలోపరిలసత్ప్రాలమ్బముక్తామణే
రన్తర్బిమ్బితమిన్ద్రనీలనికరచ్ఛాయానుకారిద్యుతేః,
లజ్జావ్యాజముపేత్య నమ్రవదనా స్పష్టం మురారే ర్వపుః
పశ్యన్తీ ముదితా ముదేఽస్తు భవతాం లక్ష్మీ ర్వివాహోత్సవే. 64

టీ. వివాహోత్సవే=పెండ్లిసంబంధమందు, లజ్జావ్యాజం=సిగ్గుఅనుసాకును, ఉపేత్య=పొంది, నమ్రవదనా=తలవంచుకొనినదై, ఉత్తుఙ్గ...మణేః=ఉన్నతమైన చనుకట్టుమీఁద మెఱయుచు వ్రేలుచున్న ముత్తెపుకొలికిపూసయొక్క, అంతః=నడుమ, బిమ్బితం=ప్రతిఫలించిన, ఇంద్ర...ద్యుతేః=ఇంద్రనీలమణిరాశియొక్క కాంతిని బోలుచున్న కాంతిగల, మురారేః=శ్రీకృష్ణునియొక్క, వపుః=శరీరమును, స్పష్టం=విశదముగా పశ్యన్తీ=చూచుచున్నదై, ముదితా=సంతసించిన, లక్ష్మీః=రుక్మిణీరూపయగులక్ష్మి, భవతాం=మీకు, ముదే=సంతసముకొఱకు, అస్తు=అగుఁగాక.

మ. హరినీలచ్ఛవి గేరుశౌరిమృదుదేహచ్ఛాయ వక్షోరుహా
పరిముక్తామణియందుఁ గన్పడఁ ద్రపావ్యాజంబునం బెండ్లికూఁ
తురు దాఁ గావున మోము వాంచికొని నంతోషస్థితిం జెందునిం
దిర మాకీవుత నిష్టసంపద దయాదృష్టిన్ విలోకించుచున్. 64

తా. రుక్మిణీకృష్ణులపెండ్లియందు రుక్మిణి తనయురమున వ్రేలుహారము నడిమిముత్తెపుఁబూసయందుఁ బ్రతిబింబించిన కృష్ణుని నల్లనిమేనికాంతిని సిగ్గను నొకసాకుచేఁ దలవంచుకొని యట్టెచూచి యానందించు రుక్మిణీరూపిణియగు లక్ష్మి మీసేమము కొఱకగుఁగాక.

శ్లో. కృష్ణేనాంబ గతేన రన్తు మధునా మృద్భక్షితా స్వేచ్ఛయా
తథ్యం కృష్ణ క ఏవ మాహ ముసలీ మిథ్యాంబ పశ్యాననమ్,
వ్యాదేహీతి విదారితే శిశుముఖే దృష్ట్వా సమస్తం జగ
న్మాతా యస్య జగామ విస్మయపదం పాయాత్స నః కేశవః. 65

టీ. హేఅంబ=ఓయమ్మా, రన్తుం = ఆడుటకొఱకు, గతేన=వెళ్లిన, కృష్ణేన=శ్రీకృష్ణునిచేత, అధునా=ఇప్పుడు, స్వేచ్ఛయా=ఇష్టమువచ్చినట్లు, మృత్=మన్ను, భక్షితా=తినఁబడినది, (అని రాముఁడు యశోదకుఁ జెప్పఁగా నామె) కృష్ణ=కృష్ణుఁడా, తథ్యం=మన్నుదిన్నది నిజమేనా, (అనియడుగ) కృష్ణుఁడు, కః=ఎవఁడు, ఏవం=ఇట్లు, ఆహ=చెప్పెను. (యశోద) ముసలీ=బలరాముఁడుచెప్పినాఁడు. (కృ) అంబ=అమ్మా, మిథ్యా=ఇదికల్లమాట. ఆననం=మొగమును, పశ్య=చూడుము, (యశోద) వ్యాదేహీతి=తెఱవుమనఁగా, విదారితే = తెఱవఁబడిన, శిశుముఖే = బిడ్డనోటియందు, సమస్తం జగత్=ఎల్లలోకములను, దృష్ట్వా=చూచి, యస్య=ఏకృష్ణునియొక్క, మాతా=తల్లి, విస్మయపదం=ఆశ్చర్యస్థానమును, జగామ=పొందెనో, సః=అ, కేశవః=కృష్ణుఁడు, నః=మమ్మును, పాయాత్=రక్షించుఁగాక.

మ. మను భక్షించితె కృష్ణ యెవ్వరని రక్షమ్మా యన్న యన్నాఁడు గ
ర్గోను నామోమునఁ గల్ల చూపు మనుచుఁ నోరెత్త విశ్వంబు లె
ల్లను గన్పించిన నింతపెల్లఁ దిన నేలా గయ్యె నాశ్చర్య మం
చును వీక్షించుయశోదఁ గాంచి సగుకృష్ణుం గాంతు నశ్రాంతమున్.

తా. బలరాముఁడువచ్చి, అమ్మా మనకృష్ణుఁడు ఆడుకొనఁబోయి, ఇష్టము వచ్చినట్లు మన్నుఁదిన్నాఁడు. అని చెప్పఁగా, యశోద, ఏమిరా కృష్ణా నిజమేనా? యన, లేదమ్మా, ఎవరు చెప్పిరి? రాముఁడు. అది కల్లమాట. కాదేని నానోరుఁజూడుము. అని తెఱచిచూప, వానికడుపులో నెల్లలోకములు గాంచి తల్లి యాశ్చర్యపడియెను. అట్టికృష్ణుఁడు మమ్ముఁ గాపాడుఁగాక.

అవ:—ఈ శ్లోకమునందు శ్రీకృష్ణుఁడు రోహిణీనక్షత్రమందుఁ బుట్టెను గావున దాని నుత్ప్రేక్షించుచున్నాఁడు.—

శ్లో. స్వాతీ సపత్నీ కిల తారకాణాం ముక్తాఫలానాం జననీతి రోషాత్,
సా రోహిణీ నీల మసూత రత్నం కృతాస్పదం గోపవధూకుచేషు.

టీ. తారకాణాం=చుక్కలకు, సపత్నీ=సవతియగు, స్వాతీ=స్వాతి, ముక్తాఫలానాం=ముత్తెములకు, జననీకిల=తల్లిగదా, (పుట్టించునది) ఇతి=అని, రోషాత్=మత్సరమువలన, సా=అ, రోహిణీ=అనునక్షత్రము, గోపవధూకుచేషు=గొల్లతలిచనులయందు, కృతాస్పదం=కాఁపురమున్న, నీలం=నల్లని, రత్నం=మణిని, అసూత=కనెను.

ఉ. తారల కెల్లన్ సవతి దా నగుస్వాతి విశుద్ధమౌక్తికో
దారమణుల్ గనం గని నిజాత్మ ననూయ వహించి రోహిణీ
తారక గాంచె గోపవనితాకుచకోరకహారసంతతి
జేరినకృష్ణనాయకమణిన్ రవికోటిఘృణిన్ ముదంబునన్. 66

తా. నక్షత్రములకెల్ల సవతియగు స్వాతి ముత్యముల నీనుచున్నది. అనుమచ్చరమున రోహిణియనునక్షత్రమును, గోపికలచన్నులయందు వ్రేలుచున్న హారమందలి నల్లని నాయకమణి నొకదానిని గనెను. (రోహిణీనక్షత్రమందు కృష్ణుఁడు జన్మించెననిభావము) నక్షత్రములన్నియుఁ జంద్రునకు భార్యలని లోకప్రతీతి. ఇందువలన ముత్యముల కన్నను రత్నము విశేషముగాన స్వాతికన్న రోహిణి యాధిక్యతగాంచెను. స్వాతిముత్యములుగనుట.—స్వాతికార్తెయందు గురియు వర్షబిందువులు ముత్యములగునని ప్రసిద్ధముగ రత్నశాస్త్రాదులయందుఁ జెప్పఁబడినది. మఱియు స్వాతి, ముక్త=మౌక్తి వడసిన వారలకు, అఫల=ఫలముగానివారలఁగనుచున్నది. ఈరోహిణియో ముక్తులకు ఫలరూపమైన నీలమణి నీనుచున్నది. అనియు ఒక భావము ధ్వనించుచున్నది.

శ్లో. నృత్యన్త మత్యన్తవిలోకనీయం కృష్ణం మణిస్తమ్భగతం మృగాక్షీ,
నిరీక్ష్య సాక్షాదివ కృష్ణ మగ్రే ద్విధా వితేనే నవనీత మేకమ్. 67

టీ. మృగాక్షీ=యశోద, నృత్యన్తం=గంతులిడుచున్న, అత్యన్తవిలోకనీయం=మిగులచూడఁదగిన, మణిస్తమ్భగతం=రతనపుఁగంబమందుఁ బ్రతిఫలించిన, కృష్ణం=కృష్ణుని, అగ్రే=ముందర, సాక్షాదివ=ప్రత్యక్షముగా, నిరీక్ష్య=చూచి, ఏకం=ఒక్క, నవనీతం=వెన్నముద్దను, ద్విధా=రెండుగా, వితేనే=భాగించెను.

మ. ప్రకటానందవిచిత్రనాట్యపరుఁ డౌ బాలున్ విలోకించుచుం
జకితాలోకకురంగలోచన మణిస్తంభంబులో నిక్కమై
నకుమారుం బలె దోఁచునీడఁ జెలువొందం గాంచి భాగించె నా
త్మకరాంభోజమునందు నున్న నవనీతం బయ్యెడన్ రెండుగన్. 67

తా. యశోదకృష్ణుఁడు మనోహరముగా గంతులిడి యాడుకొనుచుండ, వానికి వెన్నగుడుపవచ్చి రత్నస్తంభమున నున్న వానినీడను చూచి నిజముగా నిద్దఱుకృష్ణు లని భ్రమసి, చేతిలోనివెన్నముద్దను రెండుగా విఱిచి యీయఁబోవుచున్నది.

శ్లో. వత్స జాగృహి విభాత మాగతం జీవ కృష్ణ శరదాం శతం శతం,
ఇత్యుదీర్య సుచిరం యశోదయా దృశ్యమానవదనం భజామహే. 68

టీ. వత్స=కుమారా, విభాతం=తెల్లవాఱుపూఁట, ఆగతం=వచ్చెను. జాగృహి=నిద్ర లెమ్ము. కృష్ణ=కృష్ణుఁడా! శరదాంశతం=నూఱేండ్లు, జీవ=బ్రతుకుము. ఇతి=ఇట్లు

ఉదీర్య=పలికి, యశోదయా=యశోదచేత, సుచిరం=చాలకాలము, దృశ్యమానవద నం=చూడఁబడిన మొగముగల కృష్ణుని, భజామహే=సేవించెదను.

ఉ. వెన్నయుఁ బాలుఁ ద్రాగుడువు వేగమ లెమ్ము కుమార తెల్లవా
తె న్ననుఁ గన్నతండ్రి నిదురింపకు లే పదివేలయేండ్లు నీ
కు న్నిఁబియాయు వయ్యెడు ముకుంద యటన్న యశోదఁ జూచునా
వెన్నునిముద్దునెమ్మొగము వేడుక మీఱి భజింతు మెప్పుడున్. 68

తా. ప్రొద్దునసే లేచి యశోద కృష్ణా, తెల్లవాటినది. ఇఁక నిద్రలేపరాయని లేపి చిరంజీవ అని రక్షపెట్టి చాలసేపు ప్రేమతోఁజూడఁబడిన కృష్ణుని సేవించెదను.

శ్లో. ఓష్ఠం జిఘ్రన్ శిశు రితి ధియా చుమ్బితో వల్లవీభిః
కణ్ఠం గృహ్ణా న్నరుణితపదం గాఢ మాలిఙ్గితాఙ్గః,
దోష్ణా లజ్జాపద మభిస్పృశ న్నఙ్క మారోపితాత్మా
ధూర్తస్వామీ హరతు దురితం దూరతో బాలకృష్ణః. 69

టీ. వల్లవీభిః=గొల్లతలచేత, శిశుః ఇతి ధియా=పిల్లవాఁడను తలఁపులో, చుమ్బితః=ముద్దుగొనఁబడినవాఁడై, ఓష్ఠం=మోవిని, జిఘ్రన్=కొఱుకువాఁడును. ఆలి ఙ్గితాఙ్గః=కౌఁగిలించుకోఁబడిన శరీరముగలవాఁడై, అరుణితపదం=ఎఱ్ఱనైనతావుగలుగు నట్లు, కణ్ఠం=మెడను, గాఢం=గట్టిగా, గృహ్ణన్=గ్రహించువాఁడును, అఙ్కం= తొడను, ఆరోపితాత్మా=ఎక్కించుకొనఁబడిన యొడలుగలవాఁడై, దోష్ణా=బాహువుతో, లజ్జాపదం=మఱుఁగుపట్టును, అభిస్పృశన్= తాఁకుచున్నవాఁడు, ధూర్తస్వామీ=విటనాయకుఁడునగు, బాలకృష్ణః=చిన్నికృష్ణుఁడు, దురితః=పాపమును, దూరతః=దూరముగా, హరతు=పోగొట్టుఁగాక.

ఉ. బాలుఁ డటంచు ముద్దిడు బాలలఁ బట్టుక మోవి నొక్కి కెం
గేలఁ దెమల్చి మన్మథనికేతన మంకముమీఁద నుంపఁ జాల్
చాలు నటంచు నెత్తికొనఁ జన్గవఁ బట్టుక కౌఁగిలించుగో
పాలకధూర్తశేఖరుఁడు పాపముఁ బాపి కృతార్థు జేయుతన్. 69

తా. గొల్లతలు బాలుఁడని తలఁచి ముద్దుఁగొనఁబోఁగాఁ బెదవిగొఱికెను. కౌగి లించుకోఁగాఁ గట్టిగా మెడఁ బట్టి కౌఁగిలించెను. ఒడిలోఁ గూర్చుండఁ బెట్టుకోఁగా మర్మదేశములఁ దడవెను. ఇట్టి గడుసుపనులు చేయువిటరాజు మాపాపములఁ బాఁప దోలుఁగాక.

శ్లో. ఏ తే లక్ష్మణ జానకీవిరహితం మాం ఖేదయ న్త్యమ్బుదా
మర్మాణీవచ ఘట్టయ న్త్యల మమీ క్రూరాః కదమ్బానిలాః,
ఇత్థం వ్యాహృతపూర్వజన్మచరితం యో రాధయా వీక్షితః
సేర్ష్యం శఙ్కితయా. స న స్సుఖయతు స్వప్నాయమానో హరిః. 70

టీ. హేలక్ష్మణ=ఓయిలక్ష్మణుఁడా, ఏతే=ఈ, అమ్బుదాః=మబ్బులు, జానకీవిరహితం=సతితోఁ బెడఁబాసిన, మాం=నన్ను, ఖేదయన్తి=శోకపెట్టుచున్నవి. క్రూరాః=క్రూరములైన, అమీ=ఈ, కదమ్బానిలాః=కడిమచెట్లయందలి గాడ్పులు, మర్మాణి=ఆయుఃస్థానములను, అలం=మిక్కిలి, ఘట్టయన్తివచ=నొవ్వఁజేయుచున్నట్లున్నవి, ఇత్థం=ఇట్లు, వ్యాహృతపూర్వజన్మచరితం యథాతథా=పలుకఁబడిన తొలిపుట్టువుయందలి కథలుగలుగునట్లుగా, స్వప్నాయమానః=నిదురలోఁ గలవరించుచున్నవాఁడై, యః=ఏకృష్ణుఁడు, శఙ్కితయా=మఱియొకతెపేరు వాడుటచే ననుమానపడిన, రాధయా=రాధచేత, సేర్ష్యం=రోషములోఁ గూడునట్లుగా, వీక్షితః=చూడఁబడెనో, సః=ఆ, హరిః=కృష్ణుఁడు, నః=మమ్ము, సుఖయతు=సుఖింపఁజేయుఁగాక.

శా. అన్నా లక్ష్మణ జానకీరహితు న న్నంభోధరశ్రేణి యీ
సన్నంపున్వలిగాలి మర్మములు నొంచం జొచ్చె నంచుం బురా
ఖిన్నత్వంబు వచింప నీను వెఱవుం గీల్కొన్నచిత్తంబుతోఁ
దన్నుం గ్రాధిక గాంచఁగాఁ గలవరింతం జూచ్చువాఁ డేలుతన్. 70

తా. లక్ష్మణా సీతావియోగము నొందిననన్ను ఈ మేఘములు చల్లగాడ్పులును బాధించుచున్నవిరా, యని వెనుకటిపుట్టువుయందలి గాథలఁ గలువరించి, రాధచేఁ గోపములోఁ జూడఁబడినకృష్ణుఁడు మమ్ము సుఖపెట్టుఁగాక.

శ్లో. ఓష్ఠం ముఞ్చ హరే బిభేమి భవతా పానై ర్హతా పూతనా
కణ్ఠాశ్లేష మముం జహీహి దళితా వాలిఙ్గనే నార్జునౌ,
మా దేహి చ్ఛురితం హిరణ్యకశిపు ర్నీతో నఖైః పఞ్చతా
మిత్థం వారితరాత్రికేళి రవతా ల్లక్ష్మ్యాపహాసా ద్ధరిః. 71

టీ. హేహరే=ఓవిష్ణూ, ఓష్ఠం=పెదవిని, ముఞ్చ=వీడుము. బిభేమి=భయపడుచున్నాను, భవతా=నీచేత, పూతనా=పూతనయనురక్కసి, పానైః=చీఁకుటలచేత, హతా=చంపఁబడినది. అముం=ఈ, కణ్ఠాశ్లేషం=కౌఁగిలింతను, జహీహి=వదలుము, ఆలిఙ్గనేన=నీకౌఁగిలింతచేత, అర్జునౌ=మద్దిచెట్లురెండును, దళితౌ=కూల్పఁబడినవి. ఛురితం=గిల్లుటను, మాదేహి=చేయకుము. నఖైః=గోళ్లచేత, హిరణ్యకశిపుః=హిరణ్యకశిపువను రక్కసుఁడు, పఞ్చతాం=మృతిని, నీతః=పొందింపఁబడెను. ఇత్థం=ఇట్లు, లక్ష్మ్యా=లక్ష్మీదేవి (రుక్మిణి)చేత, అపహాసాత్=పరిహాసమువలన, వారితరాత్రికేళిః=అడ్డుకోఁబడిన రాత్రిక్రీడగల, హరిః=కృష్ణుఁడు, అవతాత్=రక్షించుఁగాక.

ఉ. అమ్మకచెల్ల మోవిచపి యాసకు పూతన సోలెఁ గ్రోలఁగాఁ
గ్రుమ్మకు ఱొమ్ము బల్మిన ధరం బడె మద్దులు కాన గోటిచేఁ

జిమ్మకుమీా హిరణ్యకథచే మది భీతిలె నంచుఁ దచ్చనల్
బ్రమ్మచుఁ గేళి మాఁన్పురముఁ బైకొని కూడినశౌరిఁ గొల్చెదన్. 71

తా. కృష్ణా! నాకు భయమయ్యెడిని. పెదవి గఱవకుము. నీవు వెనుక చనులుపెదవులలోఁ జీకి పూతనను జంపితివి. మెడ విడువుము. పూర్వము నీవు కౌఁగిలించుకొఁగా మద్దులు రెండు కూలిపోయెను. నన్ను గిల్లకుము. ముందు హిరణ్యకశిపుని గోళ్లతోఁ జీల్చి చంపితివి. ఇట్లు పరిహాసముతో రుక్మిణిచేత రాత్రికేళియందు వారింపఁబడినకృష్ణుఁడు మమ్ము గాచుఁగాడ.

శ్లో. రామో నామ బభూవ హుంతదబలాసీతేతి హుం *తాం పితు
ర్వాచా పఞ్చవటీతటే విహరత స్తస్యాహర ద్రావణః,
నిద్రార్థం జననీకథా మితి హరే ర్హుఙ్కారతః శ్రుణ్వతః
సౌమిత్రే క్వ ధను ర్ధనుర్ధను రితి వ్యగ్రా గిరః పాన్తు వః. 72

టీ. రామో నామ = రాముఁడనియెడియొకరాజు, బభూవ=ఉండెను. హుం=ఊఁ, తదబలా=వానిపెండ్లాము, సీతేతి=సీతయనిపిలువఁబడును. హుం=ఊఁ, పితుః వాచా=తండ్రియాజ్ఞచేత, పఞ్చవటీతటే=పంచవటిచెంతను, విహరతః=తిరుగుచున్న, తస్య=వానియొక్క, తాం=ఆభార్యయగుసీతను, రావణః=రావణుఁడనువాఁడు, అహరత్=దొంగిలించెను. ఇతి=ఇట్లు, నిద్రార్థం=నిదురఁబుచ్చుటకై, జననీకథాం=తల్లిచెప్పుచున్న రామకథను, హుంకారతః=ఊఁకొట్టుచు, శ్రుణ్వతః=వినుచున్న, హరేః=శ్రీకృష్ణునియొక్క, సౌమిత్రే=లక్ష్మణా, ధనుః=విల్లు, క్వ=ఎచ్చట, ధనుః=ధనువు, క్వ=ఎచ్చట, ఇతి=ఇట్లు, వ్యగ్రాః=పరవశములైన, గిరః=మాటలు, వః=మిమ్ము, పాంతు=రక్షించుఁగాక.

మ. ఇలలో రాఘవుఁ డొప్పు నాతనిసతి యయ్యెన్ సీత వారిఁ వనం
బులకుం బంచె గురుం డటంచు నిదురం బొందించునయ్యంబవ
ల్కులు దానూఁకొని రావణుండు మహిజం గొంపోయె నా నుల్కి విల్
విలు దే లక్ష్మణ యంచుఁ బల్కుహరియుద్వేలోక్తి నన్ బ్రోచుతన్.

తా. కృష్ణుని నిద్రఁబుచ్చుటకొఱకు యశోద కథలను అబ్బాయీ! రాముఁడనునొకరాజుండెను. ఆతనికి సీతయనుభార్యగలదు. వానిని వానితండ్రి భార్యతోఁ గూడ నడవికంపెను. వారు పంచవటిదగ్గర మెలఁగుచుండ ఆచ్చట సీతను రావణుఁడను వాఁడెత్తుకొనిపోయె ననునంతలో లక్ష్మణా! విల్లు, విల్లు తే తెమ్ము అనుకృష్ణునితొందరతోఁగూడినమాటలు మీకు సేమము నిచ్చుఁగాక.

శ్లో. బాలోఽపి శైలోద్ధరణాగ్రపాణి ర్నీలోఽపి నీరన్ధ్రితమఃప్రదీపః,
ధీరోఽపి రాధానయనావబద్ధో జారోఽపి సంసారహరః కుత స్త్వమ్.

* పా. తా పితుర్వాచా పఞ్చవటీవనే.

టీ. త్వం=నీవు, బాలోఽపి = పిన్నవైనను, శైలోద్ధరణాగ్రపాణిః=కొనచేతితోఁగొండనెత్తినవాఁడవు, నీలోఽపి=నల్లనివాఁడవై యైనను, నీరన్ధ్రితమఃప్రదీపః =కటికిచీఁకటికి (అజ్ఞానమునకు) దీపమవు. ధీరోఽపి = ధైర్యముగలవాఁడవయ్యు, రాధానయనావబద్ధః = రాధకడకన్నులకులోనైతివి. జారోఽపి=విటుఁడ వయ్యును, సంసారసారః=సంసారమోచకుఁడవు, కుతః=ఇదియెట్లో నీమహిమ యెఱుఁగము.

ఉ. బాలుఁడ వయ్యు శైల మొకపాణితలంబునఁ దాల్చి నిల్పఁగాఁ
జాలుట పాపపుంజములు జారుఁడ వయ్యు హరించుటల్ మహా
నీలతనుండవయ్యు నతినిర్భరగాఢతమఃప్రదీపమై
వ్రాలుట ధైర్యశాలి వయి రాధకుఁ జిక్కుట వింతగా హరీ! 73

తా. కృష్ణా! నీవు బాలుఁడ వయ్యు కేల లీలతోఁ గొండనెత్తితివి. నల్లనివాఁడవయ్యు నజ్ఞాన మనుచీఁకటిం బాపుదీపమైతివి. ధీరుఁడ వయ్యును రాధచూపునకులోఁబడితివి. జారుఁడవయ్యు సంసారతారకుఁడవు. ఇది యెట్లో తెలియరాదు.

శ్లో. బాలాయ నీలవపుషే నవకిఙ్కిణీక
జాలాభిరామజఘనాయ దిగమ్బరాయ,
శార్దూలదివ్యనఖభూషణభూషితాయ
నన్దాత్మజాయ నవనీతముషే నమస్తే. 74

టీ. బాలాయ=బాలుఁడును, నీలవపుషే=నల్లనియొడలుగలవాఁడును, నవ...నాయ=క్రొత్తచిఱుగజ్జెలపేరుచే మెఱయు మొల గలవాఁడును,దిగమ్బరాయ=దిసమొలవాఁడును, శార్దూల...తాయ=అందమైన పులిగోరుసొమ్ముచే నలంకరింపఁబడినవాఁడును, నవనీతముషే=వెన్నదొంగయును, నన్దాత్మజాయ=నందునికొడుకగు, నీకొఱకు, నమః=నమస్కారము.

చ. అలరుపసిండికంకణము లందెలు మువ్వలు రావిరేక నం
కులవులిగోరుఁ దామెతులుఁ గుప్పెడవున్మొలనూలు మద్దికా
యలుఁ గలనందనందను దిగంబరుఁ జారుజటీకటోజ్జ్వలు
న్విలసితనీలదేహు నవనీతహరుం డగుబాలుఁ గొల్చెదన్. 74

తా. పిన్నవాఁడును, నల్లనివాఁడును, గజ్జలమొలత్రాడుగట్టుకొనినవాఁడును, దిసమొలవాఁడును, పులిగోరుసొమ్ముచే నలంకరింపఁబడినవాఁడును, వెన్నదొంగయు నగు కృష్ణునికొఱకు నమస్కారము.

శ్లో. పాణౌ పాయసభక్త మాహితరసం బిభ్రన్ముదా దక్షిణే
సవ్యే శారదచన్ద్రమణ్డలనిభం హైయంగవీనం దధత్,

కణ్ఠే కల్పితపుణ్డరీకనఖమ ప్యుద్దామదీప్తిం వహన్
దేవో దివ్యదిగమ్బరో దిశతు నః సౌఖ్యం యశోదాశిశుః. 75

టీ. దక్షిణే పాణౌ = కుడిచేతియందు, అహితరసం = తేనెలో ముంచఁబడిన, పాయసభక్తం = పాలపరమాన్నమును, సుధా = మక్కువతో, బిభ్రత్ = పట్టుకొని యున్నవాఁడును, సవ్యే = ఎడమచేతియందు, శారదచన్ద్రమణ్డలనిభం = శరత్కాలమందలి వెన్నెలతో సమానమగు, హైయంగవీనం = అప్పుడు చిలికితీసినవెన్నను, దధత్ = పట్టుకొన్నవాఁడును, కణ్ఠే = మెడయందు, కల్పి...నఖమపి = కట్టఁబడిన పులిగోరు గలవాఁడును, ఉద్దామదీప్తిం = మిక్కుటపువెలుంగును, వహన్ = తాల్చువాఁడును, దేవః = క్రీడార్థమై మానుషశరీరము దాల్చినవాఁడును, దివ్యదిగమ్బరః = చక్కనిదిసమొలరూపుగల, యశోదాశిశుః = యశోదకొడుకు, నః = మాకు, సౌఖ్యం = సుఖమును, దిశతు = ఇచ్చుఁగాక.

మ. అలడాకేల శరన్మృగాంకనిభ మౌహైయంగవీనంబు న
వ్వలికేల న్రసయుక్తపాయసము గ్రీవాబద్ధచామీకరో
జ్జ్వలశార్దూలనఖం బనం బరకటీచక్రంబుఁ బెంపొంద ని
చ్చలుఁ గ్రీడించుయశోదపట్టి కరుణ న్సౌఖ్యంబు మాకీవుతన్. 75

తా. కుడిచేతఁ దేనెలో ముంచిన పరమాన్నపుముద్దయు, ఎడమచేత నప్పుడు చిలికి యెత్తినవెన్నముద్దయు, మెడలోఁ బులిగోరును గలిగిన జగన్మోహనాకారముగల, దిగంబరుఁడైన యశోదకొడుకు మాకు సేమముఁ గలుగఁజేయుఁ గాక.

శ్లో. కిఙ్కిణికిణికిణిరభసైః రఙ్గణభువి రిఙ్గణైః సదాఽటన్తమ్,
ఝుణ్ఝుణుఝుణుపదయుగళం కఙ్కణకరభూషణం హరిం వన్దే. 76

టీ. కిఙ్కిణి...రభసైః = చిఱుగజ్జెల కిణికిణి యనుమ్రోఁతలుగల, రిఙ్గణైః = దోఁగాడుటలచేత, అఙ్గణభువి = ముంగిలివాకిలియందు, సదా = ఎప్పుడు, అటన్తం = తిరుగుచున్నవాఁడును, ఝుణ్ఝుణు...గళం = ఝుణుఝుణు అనిమ్రోఁగుచున్న రెండుపాదములు గలవాఁడును, కఙ్కణకరభూషణం = మురుగులచే ముద్దుగొలుపుచేతులుగల, హరిం = కృష్ణునిగూర్చి, వన్దే = మ్రొక్కుచున్నాను.

చ. గణనకు నెక్కుడై సకలకంకణనిక్వణనంబు మీఱఁ గుం
జుణుఝుణునాదపాదములకుం దగుహేమమణీనిబద్ధకిం
కిణికిణినాదసంభ్రమము గీడ్పడ దాఁటుచు నందుమందిరాం
గణమున సంచరించునయగారవుముద్దులబాలుఁ గొల్చెదన్. 76

తా. మొలగజ్జెలు గల్లురన ముంగిలిలో దోఁగాడుచు, కాళ్లకడియములు చేతిమురుగులుఁ జిత్రముగా మ్రోఁగించుచు క్రీడించుకృష్ణునకు నమస్కారము.

శ్లో.*సమ్బాధే సురభీణా మమ్బా మాయానయ న్త మనుయాన్తీమ్,
లమ్బాలక మవలమ్బే తం బాలం తనువిలగ్నజమ్బాలమ్. 77

టీ. సురభీణాం=ఆవులయొక్క, సమ్బాధే=త్రొక్కిడియందు, అనుయాన్తీం=తఱుముకొనివచ్చుచున్న, అమ్బాం=తల్లిని, ఆయాసయన్తం=సిలుగులఁబెట్టువాఁడును, లమ్బాలకం=వ్రేలుచుండుసురులుగలవాఁడును, తను...బాలం=మేననంటినబురదగల, తం=ఆ, బాలకం=పుట్టిని, అవలమ్బే=ఆశ్రయించెదను.

ఉ. బాలక కేళి నాలగుమిఁ బల్మఱు నాడఁగ నంబ వెంబడిం
న్దాలిమి లేక రా గునగునం బరువెత్తులలాటభాగజం
బాలకుఁ జక్రవాతశకటాదివిఘాలకు నంగలగ్నజం
బాలకుఁ బాలకుం దలఁతుఁ బాలితదిక్తటలోకపాలకున్. 77

తా. మందలో నావులసందున నాటలతమిం బఱచుచు పసులనడుమ బిడ్డఁడేమయ్యెడినో యని తల్లి వెంబడిఁ బడ గుసుకుఁబరువు లిడుచు నామెను త్రిప్పి యల యఁజేయుచుఁ దలవిరియఁబోసికొని యొడలెల్ల బురదచేసికొని యాడుచున్న యాచిన్నికృష్ణుని నాశ్రయించెదను.

శ్లో. అఞ్చితపిఞ్ఛాపీడం వఞ్చితసౌజన్యవల్లవీవలయమ్,
అధరమణినిహితవేణుం బాలం గోపాల మనిశ మవలమ్బే. 78

టీ. అఞ్చితపిఞ్ఛాపీడం=ఒప్పిదమైన నెమ్మిపురియే తలదాల్పుగాఁ గలవాఁడును, వఞ్చిత...లయం=మోసపుచ్చఁబడిన ప్రేమవతులైన గోపికలసమూహముగలవాఁడును, అధర...వేణుం=మోవిరత్నమందిడికొనిన పిల్లఁగ్రోవిగలవాఁడును, బాలం=శిశువగు, గోపాలం=ఆలకాపరిని, అనిశం=ఎల్లప్పుడును, అవలమ్బే=ఆశ్రయింతును.

మ. విలసత్పింఛవతంసుఁ డై చిగురుమోవిఁ వేణువుం జేర్చి కం
దళితాలాపసుధాపరంపరలచేతం జేతనాచేతన
మ్ములకుఁ నిశ్చలతాచలత్వములపెంపుల్ గూర్చునగ్గోపికా
లలితాంగీసుజనత్వవంచకునిఁ గొల్వం గాంతు గోపాలకున్. 78

తా. నెమ్మిపురిసొమ్ముగాఁగలవాఁడును, గోపికలను వంచించువాఁడును, పిల్లఁగ్రోవి నూఁదుచున్న బాలగోపాలకృష్ణుని నాశ్రయించెదను.

శ్లో. ప్రహ్లాదభాగధేయం నిగమమహాద్రే ర్గుహాన్తరాధేయమ్,
నరహరినదాభిధేయం విబుధవిధేయం మ మానునంధేయమ్. 79

---

* ఈశ్లోకార్థంబు సనత్కుమారసంహితయందు గోపాలసంపత్కృదష్టాక్షరీ మంత్రధ్యాన మని చెప్పఁబడినది. "పఞ్చవర్షీయన మీశానం ధావమానం వ్రజాంగణే, కింకిణీనూపురగ్రీవాకర్ణభూషో జ్వలంస్మరేత్."

టీ. ప్రహ్లాదభాగధేయం=ప్రహ్లాదునియదృష్టమును, నిగమమహాద్రేః=వేదపర్వతము యొక్క, గుహాన్తరాధేయం=కందరమున వసింపఁదగినదియు, నరహరిసదాభిధేయం=నరసింహమని పిలువఁదగిన, విబుధవిధేయం=పండితులకు వశమైన తేజము, మమ=నాకు, అనుసన్ధేయం=ధ్యానింపఁ దగినది.

మ. యమిసంభావితరూపధేయమును బ్రహ్లాదోల్లసద్భాగధే
యము నామ్నాయమహాగుహాంతరనితాంతాధేయముం బోల్పిన
త్సుమనఃశ్రేణివిధేయముం నరమృగాస్తోకాభిధానాభిధే
యముఁ గొల్తుం గమలామనఃకమలనిత్యాధేయముం వేడుకన్. 79

తా. ప్రహ్లాదుని భాగ్యమును, వేదగుహయందు వసించునదియు, నరసింహనామము గలదియు, విద్వాంసుల కెఱుఁగఁదగినదియు నగు వెలుఁగు నాశ్రయించెదను.

శ్లో. సంసారే కిం సారం కంసారే శ్చరణకమలపరిభజనమ్,
జ్యోతిః కిమన్ధకారే యదన్ధకారే రనుస్మరణమ్. 80

టీ. సంసారే=సంసారమందు, కిం=ఏది, సారం=మేలు, కంసారేః=కృష్ణునియొక్క, చరణకమలపరిభజనమ్=కృష్ణునిపాదసేవయే, అన్ధకారే = చీఁకటిలో, జ్యోతిః=వెలుఁగు, కిం=ఏది, యత్=ఏ, అన్ధకారేః=కృష్ణునియొక్క, అనుస్మరణం=ధ్యానమే.

ఉ. సారము కంసవైరిపదసారసచారుతరార్చనంబు సం
సారమునందు నిందుధరసన్నుతి గాఢతమోంధకారని
స్తారము వీనికిం దగినసద్గురుసేవయె కారణంబు గా
కారయ నింతకంటెను శుభావహమైనవిశేష మున్నదే. 80

తా. సంసారమున మేలైన దేది? కంసారిపాదసేవనమే. అజ్ఞానపుఁజీఁకటికి దీపమేది? కృష్ణునిస్మరణమే.

శ్లో. కలశనవనీతచోరే కమలాదృక్కుముదచన్ద్రికాపూరే,
విహరతు నన్దకుమారే చేతో మమ గోపసున్దరీజారే. 81

టీ. కలశ...చోరే=బానయందలి వెన్నను దొంగిలించువాఁడును, కమలా...పూరే=లక్ష్మీదేవికలువకన్నులకు వెన్నెలపొంగైనవాఁడును, గోపసున్దరీజారే=గొల్లతలవిటకాఁడునునగు, నన్దకుమారే=నందునికొడుకునందు, మమ=నాయొక్క, చేతః=చిత్తము, విహరతు=విహరించుఁగాక.

ఉ. శ్రీరమణీమణీవికచదృక్కుముదస్మితసాంద్రచంద్రికా
సారు వ్రజాంగనానివహజారు జగజ్జనతామనోహరా
కారు విశుద్ధమానిహృదగారుఁ బయోనవనీతచోరు నా
భీరకుమారు నాహృదయపీఠికయందు వసింపఁ జేసెదన్. 81

తా. బానలలోనుండి వెన్నను దొంగిలువాఁడును, లక్ష్మియొక్క కలువకన్నులకు వెన్నెలప్రవాహమును, గోపికలకు విటుఁడును నగు నందునికొడుకునందు నాచిత్తము క్రీడించుఁగాక.

అవతారిక.—ఈశ్లోకమున వెన్నదొంగలించు శ్రీకృష్ణునియొక్కయు ఒక గోపికయొక్కయు ఉత్తరప్రత్యుత్తరములీ రూపముగా కవి వర్ణించుచున్నాఁడు.—

*శ్లో. కస్త్వం బాల బలానుజః కిమిహ తే మన్మన్దిరాశఙ్కయా
యుక్తం తన్నవనీతపాత్రవివరే హస్తం కిమర్థం న్యసేః,
మాతః కఞ్చన వత్సకం మృగయితుం మాగా విషాదం క్షణా
దిత్యేవం వరవల్లవీప్రతివచః కృష్ణస్య పుష్ణాతు నః. 82

టీ. హేబాల=ఓకుఱ్ఱఁడా, త్వం=నీవు, కః=ఎవఁడు, బలానుజః=బలరాముని తమ్ముఁడను, ఇహ=ఇచ్చట, (మాయింటిలో) కిం=ఏమిపని, మన్మందిరాశఙ్కయా=మాయిల్లను భ్రమతో, వచ్చితిని, తత్=అది, యుక్తం=మంచిదేకాని, నవ...వరే=వెన్నబానలో, హస్తం=చేతిని, కిమర్థం=ఎందులకు, న్యసేః=పెట్టెదవు. మాతః=ఓయమ్మా! కఞ్చన=ఒక, వత్సకం=లేదూడను, మృగయితుం=వెదకుటకు, క్షణాత్=కొంచెము సేపు, విషాదం=కలవరమును, మాగాః=పొందకు. ఇత్యేవం=ఈలాగున, కృష్ణస్య=కృష్ణునియొక్క, వర...వచః=గొల్లమిటారిమాటల కిచ్చుజవాబు, నః=నమ్ముల, పుష్ణాతు=కాచుఁగాక.

ఉ. చిన్నికుమార యెవ్వఁడవు నీరికిఁ దమ్ముఁడ నేల యిందు రా
మన్నిలయుం బటంచు నిది మంచిదె కే లటు సాఁచె దేటికి
న్వెన్నవనంటిలోన జననీ! యొకదూడను జూడవచ్చితిన్
విన్నఁదనంబు మాను మని వేకితకుఁ బల్కుమురారిఁ గొల్చెదన్. 82

తా. వెన్నదొంగిలుచున్న కృష్ణునిఁ జూచి యొకగొల్లది అబ్బాయీ! ఎవరురా నీవు? అనియడుగ కృష్ణుఁడు నేను బలరామయ్య తమ్ముఁడఁగదా యనెను. సరిగాని మాయింటి కేలవచ్చితివి? మాయిల్లే యనుకున్నాను. అయినవెన్నబానలో చేయిదూర్చదవేల? మాదూడ యొక్కటితప్పిపోయినది. అది యీబానలో నున్నదేమోయని వెదకుచున్నాను. కొంచముసే పూరకుండుము. పోయెదనులే యని చెప్పుకృష్ణుని జవాబులు మమ్ముఁ గాచుఁగాక.

* ఈశ్లోకార్థంబు గోపాలకృష్ణైకాదశాక్షరీమంత్రధ్యానమని సనత్కుమార సంహితయందుఁ జెప్పఁబడియున్నది. “హారంతం నవనీతాదీన్ చౌర్యేణ వ్రజయోషితామ్, సగోపాలైర్వృతం కృష్ణం ధ్యాయే న్మంత్రంజపేదిదమ్.”

శ్లో. గోపాలాజిరకర్దమే విహరసే విప్రాధ్వరే లజ్జసే
బ్రూషే గోకులహుఙ్కృతైః స్తుతిశతైర్మౌనం విధత్సే విదామ్,
దాస్యం గోకులపుంశ్చలీషు కురుషే స్వామ్యం న దాన్తాత్మసు
జ్ఞాతం కృష్ణ తవాఙ్ఘ్రిపఙ్కజయుగం ప్రేమ్ణాచలం మఞ్జులమ్. 82

టీ. గోపా...ర్దమే = గొల్లలయింటివాంగిళ్లబురదలయందు, విహరసే=ఆడెదవు. విప్రాధ్వరే=బ్రాహ్మణులయాగమందు, లజ్జసే = జంకెదవు. గోకులహుంకృతైః = ఆవులఅంకెలతో, బ్రూషే=మాటువలికెదవు. విదాం=పండితులయొక్క, స్తుతిశతైః=స్తోత్రశతములచేత,మౌనం=మౌనమును, విధత్సే=పూనెదవు. గోకులపుంశ్చలీషు = గొల్లఅంకుటాండ్రయందు, దాస్యం=ఊడిగమును, కురుషే=చేయుదువు. దాన్తాత్మసు=శాంతచిత్తులయెడ, స్వామ్యం=ప్రాభవమును, నకురుషే=చేయవు. హేకృష్ణ=ఓకృష్ణా, జ్ఞాతం=తెలిసెను. మంజులం=అందమైన, తవ=నీయొక్క, అఙ్ఘ్రిపఙ్కజయుగం = అడుగుఁదామరలజంట, ప్రేమ్ణా=అనురాగముచేత, చలం=లోలమైనది.

మ. క్రతుభూమిం జొరఁబోవు గోపగృహపంకం బన్న మెట్టేవు గో
తతిహుంకారము విన్నఁ బల్కెదవు విద్వద్గోష్ఠికిం బల్క వా
నతి గావింతువు గోపజారలకు దాన్తశ్రేణిఁ గైకోవు యో
గ్యత యేహేతువు ప్రేమ కారణము గాదా దేవ! నీచర్యకున్. 83

తా. కృష్ణా! గొల్లయిండ్లవెంబడిబురదలోఁదిరిగియాడెదవు. బ్రాహ్మణయజ్ఞములలోఁబోవ సిగ్గుపడుదువు. ఆవులఅంకెలకు మాటువలికెదవుగాని జ్ఞానులు చేయుస్తుతుల నాలింపవు. గొల్లఅంకుటాండ్రకు నూడిగముసేతువు. శాంతచిత్తులకుఁ బ్రభుత్వము సేయుమన్నను చేయవు. నిపోఁబడి తెలిసినదిలే. నీకెక్కడ ప్రేమయున్నదో అక్కడ కేఁగుదువుగాని యెచ్చుతగ్గులు నీకు లేవు.

శ్లో. నమస్తస్మై యశోదాయా దాయాదాయాస్తు తేజసే,
యద్ధి రాధాముఖామ్భోజం భోజం భోజం వ్యవర్ధత. 84

టీ. యశోదాయాః=యశోదయొక్క, దాయాదాయ=పుత్త్రుఁడైన,తస్మై=ఆ, తేజసే=వెలుఁగుకొఱకు, నమః=నమస్కారము. యద్ధి=ఏది, రాధాముఖామ్భోజం = రాధమోముదమ్మిని, భోజంభోజం=ఆస్వాదించి యాస్వాదించి, వ్యవర్ధత = పెరిగెనో.

ఉ. ఏమహితప్రకాశ ముదయించినపిన్నటనాఁటనుండి రా
ధామధురాధరాంచితసుధారసధారలఁ గ్రోలుచున్ యశో
దామహనీయదాయసముదాయముఁ గాంచి ప్రవర్ధమాన మౌ
నామహ మిచ్చుఁ గావుత మహరహంబు నశేషసుఖాయుమున్నతుల్. 84

తా. యశోద సర్వస్వమ్మునకు భోక్తయైన యావెలుఁగునకు మ్రొక్కు లొసఁగెదను. ఏది రాధముఖమకరందమును గ్రోలి క్రోలి పెద్దదయ్యెనో.

శ్లో. అవతారాః సన్త్వన్యే సరసిజనయనస్య సర్వతోభద్రాః,
కృష్ణాదన్యః కోవా ప్రభవతి గోగోపగోపికాముక్త్యై. 84

టీ. సర్వతోభద్రాః=అంతటశుభకరములగు, సరసిజనయనస్య = కృష్ణునియొక్క, అన్యే=ఇతరములైన, అవతారాః=మూర్తులు, సన్తు=ఉండుఁగాక. కృష్ణాత్ = కృష్ణునికంటె, అన్యః=ఇతరుఁడైన, కోవా=ఎవఁడు, గోగోపగోపికాముక్త్యై=గోవులు గోపాలురు గోపికలు వీరల మోక్షమునొందుటకు, ప్రభవతి=సమర్థుఁడగును.

మ. అవతారంబులు లేవె శౌరి కతికళ్యాణంబు లిద్ధాత్రిలో
నవి పెక్కుల్ గల వెంచ గోనికరగోపానీకగోపాంగనా
నివహశ్రేయ మొసంగఁ జాలెని కృపానిర్నిద్రుఁ డైనట్టిశౌ
రిపలెక్ వేఱొకమూర్తి గావునఁ దదంఘ్రిం గొల్తు నెల్లప్పుడున్. 85

తా. విష్ణునిలోకరక్షకము లైనయవతారములు పెక్కులువెలయుఁగాక. గోవులను గోపాలురను గొల్లపడఁతులను కృతార్థులఁగావించుటలోఁ గృష్ణునికంటె యితరుఁడెవఁడు నేర్చును?

శ్లో. *మధ్యే గోకులమణ్డలం ప్రతిదిశం చామ్బారవోజ్జృమ్భితే
ప్రాతర్దోహమహోత్సవే నవఘనశ్యామం రణన్నూపురమ్,
ఫాలే బాలవిభూషణం కటిరటత్సత్కిఙ్కిణీమేఖలం
కణ్ఠే వ్యాఘ్రనఖం చ శైశవకళాకళ్యాణకార్త్స్న్యం భజే. 86

టీ. గోకులమణ్డలమధ్యే=అవులమందలనడుమ, ప్రతిదిశం=ఎల్లవంకలను, అమ్బారవోజ్జృమ్భితే=అమ్బాయనురొదచే వెల్లివిరిసిన, ప్రాతర్దోహమహోత్సవే = ప్రొద్దుటిపూఁటపాలుపితికెడు సంబరమందు, నవఘనశ్యామం=క్రొమ్మబ్బువలె నల్లనైనవాఁడును, రణన్నూపురం=మ్రోయు నందెలుగలవాఁడును, ఫాలే=నుదుట, బాలవిభూషణం=శిశువులకుఁదగినసొమ్మును దాల్చినవాఁడును, కటి... మేఖలం=మొలయందు మ్రోయుచున్న గజ్జెలుగలవాఁడును, కంఠే=మెడయందు, వ్యాఘ్రనఖంచ=పులిగోరు గలవాఁడును, శైశవ... కార్త్స్న్యం=బాల్యకళాసౌభాగ్యసర్వస్వమ్మగుకృష్ణుని, భజే=ఆశ్రయింతును.

మ. మొలనూ లందెలుఁ గజ్జెలున్ మొరయ జీమూతాకృతిం జేరి సుం
దల నంబారవ మెల్లెడం జెలఁగఁ బ్రాతర్దోహ మీక్షింపఁ జా

---

* ఈశ్లోకము గోపాలకృష్ణసర్వసప్తత్క్యాదష్టాక్షరీమంత్రధ్యానమని సనత్కుమారసంహితయందుఁ జెప్పఁబడియున్నది. "పఞ్చవర్షీయున మీశానం ధావమానం ప్రజాంగణే, కిఙ్కిణీనూపురగ్రైవకర్ణభూషోజ్జ్వలంస్మరేత్."

రులలాటంబున రావిరేక పులిగోరుం గంఠవీథిం దటి
త్తులగా ముద్దులు గుల్కు బాలకుని నీ గాంతుం జీవనప్రౌఢికిన్. 86

తా. ప్రొద్దున పొలముపిదుకునప్పుడు అమ్బరవనములో నిండియున్న మందలో మేఘమువలెఁజేరి, గజ్జెల నందెలను మ్రోయించుచు, నుదుట రావిరేకయు మెడలో మొలనూలును, మెడలోఁ బులిగోరును మెఱయ ముద్దుమురిపెములు చూపుచున్న బాల గోపాలకృష్ణమూర్తి నాశ్రయించెదను.

శ్లో. సజలజలదనీలం దర్శితోదారలీలం
కరతలధృతశైలం వేణునాదైరసాలమ్,
వ్రజజనకులపాలం కామినీకేళిలోలం
కలితలలితమాలం నౌమి గోపాలబాలమ్. 87

టీ. సజలజలదనీలం=నీరుమబ్బువలె నల్లనైనవాఁడును, దర్శితోదారలీలం=చూపఁబడిన గంభీరమైనవిలాసములుగలవాఁడును, కర...శైలం=చేతఁబట్టియెత్తఁబడినకొండగలవాఁడును, వేణునాదైః=పిల్లఁగ్రోవి మ్రోఁతలచేత, రసాలం=రసవంతమైనవాఁడును, వ్రజజనకులపాలం=వ్రేపల్లెయందలిజనుల రక్షించువాఁడును, కామినీకేళిలోలం=గోపకాంతలతోఁ గ్రీడసల్పువాఁడును, కలితలలితమాలం=పట్టఁబడిన యందమైన వనమాలగలవాఁడునగు, గోపాలబాలం=గోపాలకృష్ణునిగూర్చి, నౌమి=మ్రొక్కెదను.

మ. మురళీనాదవినోదలోలు నీలమణిజీమూతాతసీనీలు నీ
రరుహాక్షీరతిలోలు హస్తగతశైలజాగ్రన్యస్తశైలుం గదా
చరశీలుం వ్రజలోకపాలుఁ గరుణోదారైకలీలుం భుజాం
తరరాజద్వనమాలుఁ గొల్చెద నమూద్యద్గోపబాలుం మదిన్. 87

తా. నీరుమబ్బువలె నల్లనైనవాఁడును, చిత్రవిలాసములఁ జూపుచున్నవాఁడును, కొండను జేతఁ దాల్చినవాఁడును, తేనెలొలుకు వేణువు నూఁదుచున్నవాఁడును, వ్రేపల్లెయవారలను గాపాడువాఁడును, గోపకామినీక్రీడాసక్తుఁడును, చక్కని వనమాలను దాల్చినవాఁడగు గోపాలకృష్ణునకు మ్రొక్కెదను.

శ్లో. స్మితలలితకపోలం స్నిగ్ధసంగీతలోలం
లలితచికురజాలం చౌర్యచాతుర్యలీలమ్,
శతమఖరిపుకాలం శాతకుమ్భాభచేలం
కువలయదళనీలం నౌమి గోపాలబాలమ్. 88

టీ. స్మితలలితకపోలం=చిఱునగవుచే నందమైన చెక్కిళులుగలవాఁడును, స్నిగ్ధసంగీతలోలం=తీయనిపాటలయందు దవిలియున్నవాఁడును, లలితచికురజాలం=అంద

మైన కురులుగలవాఁడును, చౌర్యచాతుర్యలీలం=దొంగతనము సేయు నేర్పుగలవాఁడును, శతమఖరిపుకాలం=రాక్షసులకు మృత్యువైనవాఁడును, శాత...చేలం=బంగరువన్నెలవలువగలవాఁడును, కువలయదళనీలం=కలువరేకులవలె నల్లనైన, గోపాలబాలం=గోపాలకృష్ణుని, నౌమి=మ్రొక్కెదను.

మ. సరసస్మేరకపోలుఁ గొల్తు మురళీసంగీతలోలుఁ శుభా
కరచామీకరచేలు నీలమణిరంగత్కుంతల శ్రీవిశా
లు రమాపాలు నితాంతచౌర్యగుణశీలుం దానవప్రాణహృ
త్కరవాలుం గపిలాదనీకునలయోద్యన్నీలు గోపాలునిన్. 88

తా. నగవుదొలఁకు చెక్కిళ్లు గలవాఁడును, మృదువుగా గానము సేయువాఁడును, సొంపైనకురులు గలవాఁడును, దొంగతనమున గడితేరినవాఁడును, రాక్షసులపాలిటిమృత్యువును, బంగరువలువ గలవాఁడును, కలువరేకులఁ బోలుకన్నులు గలవాఁడు నగుగోపాలకృష్ణునిఁ గూర్చి మ్రొక్కెదను.

శ్లో. మురళినినదలోలం ముగ్ధమాయూరచూడం
దళితదనుజజాలం ధన్యసౌజన్యలీలమ్,
పరహితనవహేలం పద్మసద్మానుకూలం
నవజలధరనీలం నౌమి గోపాలబాలమ్. 89

టీ. మురళినినదలోలం=పిల్లఁగ్రోవి మ్రోఁతయందుఁ దవిలినవాఁడును, ముగ్ధమాయూరచూడం=సొంపైన నెమలిపురిని తలఁదాల్చినవాఁడును, దళితదనుజజాలం=పోకార్పఁబడిన రక్కసులమూఁకగలవాఁడును, ధన్యసౌజన్యలీలం=కృతకృత్యులగుసాధులయెడ నాదరముకలవాఁడును, పర...హేలం=ఇతరులకు మేలుసేయునూత్నవిలాసములు గలవాఁడును, పద్మసద్మానుకూలం=లక్ష్మికి వశమైనవాఁడును, నవజలధరనీలం=నూతనమేఘమువలె నల్లనివాఁడునగు, గోపాలబాలం=గొల్లపిల్లవానినిఁగూర్చి, నౌమి=మ్రొక్కెదను.

చ. మురళినినాదలోలు నతిముగ్ధశిఖావళపింఛమౌళునిం
బరహితశీలు రాత్రిచరపాలివిఘాలుఁ గృతార్థలోలుఁ బం
కరుహగృహానుపాలు వ్రజకంజముఖీహితహేలు నవ్యపు
ష్కరధరనీలుఁ గొల్తుశుభకాంచనచేలుని గోపబాలునిన్. 89

తా. పిల్లఁగ్రోవి నూఁదుచున్నవాఁడును, సొంపైననెమ్మిపురిని దాల్చినవాఁడును, రాక్షసులరూపుమాపినవాఁడును, సాధురక్షకుఁడును, లోకక్షేమము లైనవిలాసములు గలవాఁడును, లక్ష్మికి వశమైనవాఁడును, క్రొత్తమబ్బువలె నల్లనైనవాఁడునునగు గోపాలబాలునకు మ్రొక్కెదను.

శ్లో. సరసగుణనికాయం సచ్చిదానన్దకాయం
శమితసకలమాయం సత్యలక్ష్మీసహాయమ్,
శమదమసముదాయం శాన్తసర్వాన్తరాయం
సుహృదయజనదాయం నౌమి గోపాలరాయమ్. 90

టీ. సరసగుణనికాయం = మేలైనగుణముల ప్రోవుగలవాఁడును, సచ్చిదానన్దకాయం=సచ్చిదానందరూపుఁడును, శమితసకలమాయం=అణఁగింపఁబడిన యెల్లకుచ్చితములు గలవాఁడును, సత్యలక్ష్మీవిహారం = సూనృతసంపదతోఁ గూడినవాఁడును, శమదమసముదాయం=బహిరంతరింద్రియనిగ్రహముగలవాఁడును, శాన్త...రాయం=శమింపఁజేయఁబడినయెల్లవిఘ్నములు గలవాఁడును, సుహృదయజనదాయం=శుద్ధమైనచిత్తము గలవారలపాలిభాగ్యమగు, గోపాలరాయం=గొల్లఱేఁడగుకృష్ణునిగూర్చి, నౌమి=మ్రొక్కెదను.

చ. సరసగుణోదయుం శమితసర్వనిశాచరమాయునిం సుహృ
న్నరవరదాయు సత్యచిదనంతసుఖోజ్జ్వలకాయు సత్యకా
హరిణదృగిందిరాచిరసహాయుని శాంతమహాంతరాయు జి
త్వరు దమశాంతిముఖ్యసముదాయునిఁ గొల్చెద గోపరాయనిన్. 90

తా. మంచిగుణములకుగనియు, సచ్చిదానందరూపుఁడును, ఎల్లమాయలను జల్లార్చువాఁడును, సత్యసంపద కాకరమైనవాఁడును, అంతరింద్రియబహిరింద్రియనిగ్రహముగలవాఁడును, విఘ్నహంతయు, సాధుజనులపాలిభాగ్యము నగుకృష్ణునిగూర్చి నమస్కరించెదను.

శ్లో. లక్ష్మీకళత్రం లలితాబ్జనేత్రం పూర్ణేన్దువక్త్రం పురుహూతమిత్రమ్,
కారుణ్యపాత్రం కమనీయగాత్రం వన్దే పవిత్రం వసుదేవపుత్రమ్. 91

టీ. లక్ష్మీకళత్రం=లక్ష్మియేభార్యగాఁగలవాఁడును, లలితాబ్జనేత్రం=సుందరమైనతామరలవంటికన్నులుగలవాఁడును, పూర్ణేన్దువక్త్రం = నిండుజాబిల్లివంటిమోముగలవాఁడును, పురుహూతమిత్రం=ఇంద్రునకుఁ జెలియైనవాఁడును, కారుణ్యపాత్రం=దయకు నెలవైనవాఁడును, కమనీయగాత్రం=సుందరమైన మేనుగలవాఁడును, పవిత్రం=పావనుఁడైన, వసుదేవపుత్రం=వసుదేవునికొడుకగు కృష్ణునిగూర్చి, వన్దే=నమస్కరించుచున్నాను.

ఉ. శ్రీరమణీకళత్రు సరసీరుహపత్త్రవిశాలనేత్రు బృ
న్దారకనాథమిత్రుఁ గరుణాగుణపాత్రుఁ బవిత్రుఁ బూర్ణిమా
నీరజవైరివక్త్రుఁ గమనీయవయోగపటుగాత్రు నాబృహ
ద్ధీరవనాథుచైత్రు వసుదేవునిపుత్రు మదిం దలంచెదన్. 91

తా. లక్ష్మీభర్తయు, తామరలఁబోలు కన్నులుగలవాఁడును, నిండుజాబిల్లివంటి మోముగలవాఁడును, ఇంద్రునకు నెచ్చెలియైనవాఁడును, దయకు నెలవైనవాఁడును, సుందరమైనశరీరముగల యందగాఁడగు కృష్ణునకు మ్రొక్కెదను.

శ్లో. మదమయ మదమయదురగం యమునా మవతీర్య వీర్యశాలీ యః,
మమ రతి మమరతిరస్కృతిశమనపర స్స క్రియా త్కృష్ణః. 92

టీ. యః=ఎవఁడు, వీర్యశాలీసన్=పరాక్రమముగలవాఁడై,యమునాం=యమునానదిని, అవతీర్య=దిగి, మదమయం=పొగరుకొనియున్న, ఉరగం=పామును, అదమయత్=శిక్షించెనో, అమర ..పరః = దేవతాపరాధముల శమింపఁజేయువాఁడగు, సః=ఆ,కృష్ణః=శ్రీకృష్ణుఁడు, మమ=నాకు, రతిం=ప్రీతిని, క్రియాత్=చేయుఁగాక.

శా. కాళిందీజల ముబ్బి గట్లు కెదు రెక్కం జొచ్చి హాలాహల
జ్వాలాలీఢకరాళకాళియఫణాజాలంబు నృత్తక్రియం
గాలం గేల నడంచి నిర్జరతిరస్కారంబు వారించుగో
పాలస్వామికటాక్షవీక్షణము మాపాలం దిరం బయ్యెడిన్. 92

తా. యమునయందుండి, జలమును విషమయముగాఁ జేయుచున్న కాళియునణఁచి గోవులను గోపాలురను గాపాడినవాఁడును, దేవతలకుఁ దోడునీడయై కాపాడువాఁడగుకృష్ణుఁడు నాకు మే లొసంగుఁగాక.

శ్లో. మౌళౌ మాయూరబర్హం మృగమదతిలకం చారులాలాటపట్టే
కర్ణద్వన్ద్వే చ తాళీదళ మతిమృదులం మౌక్తికం నాసికాయామ్,
హారో మన్దారమాలాపరిమళభరితే కౌస్తుభస్యోపకణ్ఠే
పాణౌ వేణుశ్చ యస్య వ్రజయువతియుతః పాతు పీతామ్బరో నః. 93

టీ. మౌళౌ=తలయందు, మాయూరబర్హం=నెమ్మిపురియు, చారు...పట్టే=అందమైననొసలియందు, మృగమదతిలకం = కస్తురిచుక్కయు, కర్ణద్వన్ద్వే=రెండుచెవులయందు, అతిమృదులం = మిక్కిలిలేఁతదైన, తాళీదళం = తాటాకును, నాసికాయాం=ముక్కున, మౌక్తికం=ముత్యమును, మన్దార...రితే=మందారపుష్పమాలికపరిమళముచేనిండిన, కౌస్తుభస్య=కౌస్తుభ మాణిక్యముయొక్క, ఉపకంఠే = వెంబడిని, హారః=వనమాలికయు, పాణౌ=చేతిలో,వేణుశ్చ=పిల్లఁగ్రోవియు(కలవో), వ్రజయువతియుతః=గొల్లపడఁతులతోఁ గూడియున్న, పీతామ్బరః=బంగరుపండు వన్నెపట్టుదోవతి గలకృష్ణుఁడు, పాతు=రక్షించుఁగాక.

మ. నుదుటం గస్తురిబొట్టు నాసికతుద న్ముత్యంబు కర్ణద్వయిన్
మృదుతాళీదళయుగ్మముల్ చురళి పాణిన్ మౌళిఁ బింఛంబు పే

రెదపైఁ గౌస్తుభహారకల్పనుమనో హేమాంబరాడంబరం
బొదవఁ గోపికలెల్లఁ గొల్వ హరి డాయుగా మమ్ము నెల్లప్పుడున్. 93

తా. సిగయందు నెమ్మిపురియు, నుదుటఁ గస్తురిబొట్టును, చెవులఁ దాటాకులును, ముక్కున ముత్తియమును, మెడలో మందారమాల కౌస్తుభము హారమును, చేతిలోఁ బిల్లఁగోవియు, ఒడలియందుఁ బట్టువస్త్రమును గలకృష్ణుఁడు మమ్ముఁ గాపాడుఁగాక.

శ్లో. మురారిణా వారివిహారకాలే మృగేక్షణానాం ముషితాంశుకానామ్,
కరద్వయంవా కచసంహతిర్వా ప్రమీలనంవా పరిధాన మాసీత్.

టీ. వారివిహారకాలే=నీటియాటలప్పుడు, మురారిణా=కృష్ణునిచేత, ముషితాంశుకానాం=అపహరింపఁబడినబట్టలుగల, మృగేక్షణానాం=గొల్లతలకు, కరద్వయం వా=చేదోయిగాని, కచసంహతిర్వా=కేశసమూహముగాని, ప్రమీలనంవా=కనుల మూఁతగాని,పరిధానం=కట్టుకోక, అసీత్=అయెను.

ఉ. వారివిహారకాలమున వారిరుహాక్షుఁడు చీర లెత్తఁగా
వారిజపత్త్రపాళి కచభారము కన్నులమోడ్పుఁ జేతు ల
వ్వారిగ మాటులై యెసఁగె వారిచరాక్షుల కెల్ల నారయగా
వారికి మాటు లేటికి నవారితమోహితమంబు గ్రమ్మఁగన్. 94

తా. జలక్రీడ సేయునప్పుడు గోపికలవస్త్రములు వెన్నుఁడు దొంగిలించఁగా, వారు చేతులతో వెండ్రుకలతో గోప్యములను మూసికొనియుఁ గన్నులు మూసికొనియు నుండిరి.

శ్లో. యాసాం గోపాఙ్గనానాం లసదసితతరాలోలలీలాకటాక్షా
యన్నాసాచారుముక్తామణిరుచినికరవ్యోమగఙ్గాప్రవాహే,
మీనాయన్తేఽపి తాసా మతిరభసచలచ్చారునీలాలకాన్తా
భృఙ్గాయన్తేయదఙ్ఘ్రిద్వయసరసిరుహే పాతు పీతామ్బరో నః. 95

టీ. యన్నాసా...ప్రవాహే=ఎవని ముక్కు ముత్యపుకాంతులప్రోవు లనుమిన్నేటిజాలునందు, యాసాం=ఏ, గోపాఙ్గనానాం=గొల్లకాంతలయొక్క, లస...టాక్షా=మెఱయుచున్న మిక్కిలినల్లనైన చపలములైనవిలాసపువాలుఁ జూపులు, మీనాయన్తే=చేఁపలవలె నగుచున్నవో, తాసాం=ఆగోపికలయొక్క, అతి...కాన్తాః=మిక్కిలి వేగముగాఁ దిరుగుచున్న యందములైన నల్లనిముంగురులు, యదఙ్ఘ్రి...రుహే=ఎవని యడుగుదామరలజతయందు, భృఙ్గాయన్తే=తుమ్మెదవలె నగుచున్నవో, సః=ఆ, పీతామ్బరః=కృష్ణుఁడు, నః=మమ్ముల, పాతు=కాపాడుఁగాక.

మ. సరవిఁ మీనము లయ్యె నే నిభుని నాసాముక్తికోద్యత్ప్రభా
మరగంగన్ ప్రజభామినీచటులలోలాపాంగదృక్కాంతులు లే

హరిపాదాంబురుహంబునందు నళులై వ్యాపించె గోపాంగనా
తరళారాళవినీలకుంతలము లాధన్యుండు నన్ బ్రోచుతన్. 95

తా. ఎవనితలకు లీను ముక్కముత్తెపుకాంతి అనుగంగమడువులయందు గోపికలచూపులు చేపలగుచున్నవో, ఎవనియడుగుఁదామరలయందు వారియలకలు తుమ్మెద లగుచున్నవో, అట్టికృష్ణుఁడు మమ్ము గాపాడుఁగాక.

శ్లో. యద్వేణుశ్రేణిరూపస్థితసుషిరముఖోద్గీర్ణనాదప్రభిన్నా
ఏణాక్ష్యస్తత్క్షణేన త్రుటితనిజపతిప్రేమబన్ధా బభూవుః,
అస్తవ్యస్తాలకాన్తాః స్ఫురదధరకుచద్వన్ద్వనాభిప్రదేశాః
కామావేశప్రకర్షప్రకటితపులకాః పాతు పీతామ్బరో నః. 96

టీ. ఏణాక్ష్యః=లేడికన్నులఁబోలుకన్నులుగలయువతులు, యద్వేణు...భిన్నాః=ఎవనిపిల్లఁగ్రోవియందు బారుగానున్న రంధ్రములనుండి పుట్టిన ధ్వనిచేఁ జలించినవారై, అస్తవ్యస్తాలకాన్తాః=తాఱుమాఱై చిక్కువడిన కొనముంగురులు గలవారై, స్ఫుర...దేశాః=అదురుచున్న మోవులు చనులు పొక్కిళ్లుఁగలవారై, కామా...పులకాః=మదనవికారాతిశయముచేఁ దెలుపఁబడిన గగుర్పాటుగలవారై, తత్క్షణేన=అక్షణముననే, త్రుటిత...బన్ధాః=త్రెంపఁబడిన తమమగలయందలి యనురాగపుముడి గలవారు, బభూవుః=అయిరో, పీతామ్బరః=పట్టువలువను గట్టిన యాకృష్ణుఁడు, నః=మమ్ము, పాతు=ప్రోచుఁగాక.

మ. మురళీరంధ్రవినిర్గతస్వరముచే మోహించి గోపాంగనల్
మరుబారిం బలుఁగుబ్బ లుబ్బి పులకింపం గ్రొమ్ముడుల్ వీడ వా
తెఱసొంపుల్ నిగిడింప నీవియును భర్తృప్రేమముల్ జాఱ నే
హరివెంటం జరియించు రట్టిసుకుమారాకారుఁ గీర్తించెదన్. 96

తా. ఎవనిపిల్లఁగ్రోవిమ్రోఁతను విని పురవనితలెల్లరును, కొప్పులుజాఱ, చను లదుర, మోవులుగులుక, పొక్కిలియుబుక, పఱువులు వాఱి, తమమగలయందలిప్రేమబంధమును వీడిరో, యాకృష్ణుఁడు మమ్ముఁ గాపాడుఁగాక.

శ్లో. దేవక్యా జఠరాకరే సముదితః క్రీతో గవాం పాలినా
నన్దేనానకదున్దుభేర్నిజసుతాపణ్యేన పుణ్యాత్మనా,
గోపాలావలిముగ్ధహారతరలో గోపీజనాలఙ్కృతిః
స్థేయాన్నో హృది సన్తతం సుమధురః కోఽపీన్ద్రనీలో మణిః. 97

టీ. దేవక్యాః=దేవకియొక్క, జఠరాకరే=గర్భసముద్రమందు, సముదితః=పుట్టినదియు, పుణ్యాత్మనా=పుణ్యమూర్తియగు, నన్దేన=నందుఁడనువాఁడు, గవాంపాలినా=ఆల

శాపరిచేత, ఆనకదున్దుభేః=వసుదేవునివలన, నిజసుతాపణ్యేన = తనకూఁతురనెడు వెల చేత, క్రీతః=కొనఁబడినదియు, గోపాలా...తరళః=అలకాపరులబాలురనెడి అందమైన మాలకు నాయకమణియైనదియు, గోపీజనాలజ్కృతిః=గోపికలసొమ్మైనదియు, సుమ ధురః=అత్యన్తసుందరమైన, కోఽపి=వర్ణింపరాని, ఇన్ద్రనీలః మణిః=నీలరత్నము, నః =మాయొక్క, హృది=చిత్తమందు, సన్తతం=ఎప్పుడు, స్థేయాత్=ఉండుఁగాక.

మ. వసుదేవప్రియుజారగర్భఖనిజత్వం బొప్ప జన్మించి యా
వసుదేవుం డిడ నందగోపుఁడు సుతాపణ్యంబునం గొంచు రా
ననమానవ్రజబాలహారతరళం బై గోపికాకల్ప మై
రసలీలాకృతి యైనకృష్ణమణి నశ్రాంతం బెదఁ నిల్పెదన్. 97

తా. దేవకికడుపుఁగడలియందు బుట్టినదియు, పుణ్యపూరుషుఁ డగునందుఁడను గొల్లనిచేత తనకూఁతురు యోగమాయనిచ్చి, వసుదేవునినుండి కొనఁబడినదియు, గోప కుమారులబాలనెడి హారమునకు నడిమిపూసయైనదియు, గోపికలప్రియమైన సొమ్మై నదియు,అత్యంతసుందరమైన యొకయింద్రనీలరత్నము మాచిత్తసీమలో నుండుఁగాక. (అనఁగా; శ్రీకృష్ణమూర్తి మామనంబుల నెల్లపుడు నిలుచుగాత. అనిముఖ్యభావము. భగవదాజ్ఞవలన యశోదకడుపున మాయాస్త్రీ శిశువై పుట్టఁగా వసుదేవుఁడు దేవకీ గర్భమం దుదయించినట్టి కృష్ణుని యశోదాశయనంబున నునిచి యాశిశువునెత్తికొని వచ్చెనను భాగవతకథాది ప్రమాణములనుబట్టి కొన్నిపద్యములయందు భావవిశేషంబు లున్నవి. ఐనను గ్రంథవిస్తరభీతిచే విరమింపఁబడుచున్నవి.)

శ్లో. పీఠే పీఠనిషణ్ణ బాలకగళే తిష్ఠ న్న గోపాలకో
యన్త్రాన్తఃస్థితదుగ్ధభాణ్డ మవకృష్యాచ్ఛాద్య ఘణ్టారవమ్,
వక్త్రోపాన్తకృతాఞ్జలిః కృతశిరఃకమ్పం పిబ న్యః పయః
పాయా దాగతగోపికానయనయో ర్గణ్డూషఫూత్కారకృత్. 98

టీ. పీఠే=పీఁటయందు, పీఠనిషణ్ణబాలకగళే=పీఁటమీఁదనున్న పిల్లకాయ ఆదొంతరమీఁద, తిష్ఠన్=నిలచినవాఁడై, యన్త్రాన్తః...భాణ్డం=ఉట్టిలోని పెరు గుదుత్తను, అవకృష్య=వంచి, ఘణ్టారవం=గంట మ్రోఁతను, ఆచ్ఛాద్య=నిలిపి, వక్త్రో.. జలిః=నోటిదగ్గర దోసిలి పెట్టుకొనినవాఁడై, కృతశిరఃకమ్పం యథాతథా = చేయఁబడిన తలయూఁపుగలుగునట్లు, యః=ఎవఁడు, పయః=పాలను, పిబన్= త్రాగుచున్నవాఁడై, ఆగత...నయోః = ఇంతలో వచ్చినగొల్లదానికన్నులయందు, గణ్డూషఫూత్కారకృత్=పుక్కిలించి యుమిసినవాఁడో, సః=అ, గోపాలకః=అల కాపరికుఱ్ఱఁడు, పాయాత్=కాపాడుఁగాక.

ఉ. తోరవుఁబెద్దగద్దియలు దొంతరగా నిడి బాలు నావయిం
చేరిచి వాని మూఁపున వసించుచు నుట్టిపనంటి వంచి ఘం
టారుతి నిల్పి పాల్ కరమునం దల యూఁచుచు నాని వచ్చునా
భీరికకన్నులం దుమిసి పెట్టుక దూటెనజూటుఁ గొల్చెదన్. 98

తా. ఒకదానిమీఁద నొకటి దొంతరగాఁ బీఁటలిడి, వానిమీఁద యొకనిమీఁద నొకనిని వరుసగా పిల్లకాయల నెక్కించి, చివరవాని మెడమీఁద తా నెక్కి గంట మోఁగకుండఁ బట్టుకొని, దుత్తవంచి నోటిదగ్గర దోసిలియుంచుకొని తలయూఁచుచు పెరుఁగుత్రాగుచు, ఇంతలో వచ్చిన గొల్లదాని మొగముమీఁద పుక్కిలించియుమిసి, దుమికి పాఱిపోయినకృష్ణుఁడు రక్షించుఁగాక.

శ్లో. యజ్ఞై రీజిమహే ధనం దదిమహే పాత్రేషు నూనం వయం
వృద్ధా న్భేజిమహే తప శ్చకృమహే జన్మా న్తరే దుశ్చరమ్,
యేనాస్మాక మభూ దనన్యసులభా భ క్తి ర్భవద్వేషిణీ
చాణూరద్విషి భ క్తకల్మషముషి శ్రేయగవుషి శ్రీజుషి. 99

టీ. వయం=మేము, జన్మాంతరే=పూర్వజన్మమున, యజ్ఞైః = జన్నములచేత, ఈజిమహే=యజించియుంటిమి. పాత్రేషు = యోగ్యులయందు, ధనం=విత్తమును, దదిమహే=ఇచ్చుచుంటిమి. నూనం=నిజము. వృద్ధాన్=జ్ఞానులను, భేజిమహే=సేవించితిమి. దుశ్చరం=చేయరాని, తపః=తపస్సును, చకృమహే=చేసితిమి. యేన = ఏ హేతువుచేత, అస్మాకం=మాకు, భ క్త...ముషి=భక్తులపాపములహరించు, శ్రేయస్స పుషి=సంపదలనుగాపాడు, శ్రీజుషి=లక్ష్మినిఁబొందిన, చాణూరద్విషి=కృష్ణునియందు, అనన్యసులభా=ఇతరులకుదొరకని, భవద్వేషిణీ = సంసారనాశకమైన, భక్తిః=భక్తి, అభూత్=కలిగెనో.

మ. మును జన్మాంతరవేళ దుష్కరతపంబుల్ పాత్రదానంబు స
జ్జనసంసేవయు సధ్వరంబు లొనరించం గంటిఁ గా కున్నఁ గ
ల్గునె లోకోత్తరభ క్తి నాదుమది నాలోకింపఁ బాదావనే
జనకృత్తోమణు దుష్టభీమణు మహాచాణూరవిద్వేషణున్. 99

తా. మాకు శ్రీకృష్ణదేవునియందు దృఢభక్తి గుదురుట చూడఁగా, మేము పూర్వభవమున బహుయజ్ఞములు చేసితిమి. బహుదానములఁ జేసితిమి. పెద్దల సేవించితిమి. మహాతపస్సు చేసితి మనియు నూహింపవలసియున్నది. (ఇచట శ్రీజుషి యని ప్రయోగించుట అశ్రితరక్షణాదులయందును సర్వోత్కర్షణమందును హేతుభూతుఁడని తెలియఁజేయుటకొఱకు అని గ్రహించునది.)

శ్లో. త్వయి ప్రసన్నే మమ కిం గుణేన త్వయ్యప్రసన్నే మమ కిం గుణేన,
రక్తే విరక్తేచ వరే వధూనాం నిరర్థకః కుఙ్కుమపత్త్రభఙ్గః. 100

టీ. త్వయి=నీవు, ప్రసన్నే=కరుణగలవాఁడవేని, మమ=నాకు, గుణేన=నీతితోఁడ, కిం=ఏమిపని? త్వయి=నీవు, అప్రసన్నే=ప్రసన్నుఁడవు కావేని, మమ=నాకు, గుణేన=మంచిగుణములతో, కిం=ఏమిపని ? వధూనాం=జవ్వనులకు, వరే=మగఁడు, రక్తే=ప్రేమించినవాఁడైనను, విరక్తేచ=ప్రేమలేనివాఁడయినను, కుఙ్కుమపత్త్రిభఙ్గః=మకరికాదిపత్త్రిరచన, నిరర్థకః=ఉపయోగము లేనిదేకదా.

చ. నీవు ప్రసన్నమైనయెడ నేరుపు లేటికి నప్రసన్నతన్
నీవు పరాకుచేసినను నేరుపు లేమిటి కెంచి చూడఁ గృ
ష్ణా! విభుఁ డాదరించునపుడుంబున నొల్లమి నేయు వేళలం
గావలెనే లతాంగులకుఁ గైవగుకుంకుమపత్త్రభంగముల్. 100

తా. కృష్ణా! నీవు ప్రసన్నుఁడవైన నాకు మంచిగుణము లేకున్న చేటులేదు. నీవు ప్రసన్నుఁడవు కాకుండిన నాకు మంచిగుణము లేకున్నను బాధలేదు. ఉండియుఁ బ్రయోజనము లేదు. యువతులకు మగఁ డనుకూలుఁడేని, యలంకారములు లేకున్నను బాధలేదు. అతఁడు ప్రతికూలుఁడౌనేని, ఎన్నియలంకారములున్నను వ్యర్థమే.

శ్లో. గాయన్తి క్షణదావసానసమయే సానన్ద మిన్దుప్రభా
రున్ధన్త్యో నిజదన్తకాన్తి నివహై ర్గోపాఙ్గనా గోకులే,
మథ్నన్త్యో దధి పాణికఙ్కణఝణత్కారానుకారం జవా
ద్వ్యావల్గద్వసనాఞ్చలా య మనిశం పీతామ్బరోఽవ్యాత్సనః. 101

టీ. గోకులే=గొల్లపల్లెయందు, గోపాఙ్గనాః=గొల్లకాంతలు, క్షణదావసానసమయే=తెల్లవాఱుజామున, దధి=పెరుఁగును, మథ్నన్త్యః=చిలుకుచున్నవారలై, నిజదన్త...నివహైః=తమపలువరుసలగుంపులచే, ఇందుప్రభాం=వెన్నెలను, రున్ధన్త్యః=నివారించుచున్నవారలై, నిజ...కారం=తమచేతిగాజులచప్పుడులకనుకూలముగా, జవాత్=తొందరవలన, వ్యావల్గద్వసనాఞ్చలాః=విసరుచున్నపైఁటకొంగులుగలవారలై, యం=ఏకృష్ణుని, అనిశం=ఎల్లప్పుడు, సానన్దం=సంతోషముగా, గాయన్తి=పాడుదురో, సః=అ, పీతామ్బరః=పట్టుబట్టలవాఁడు, నః=మమ్ము, పాయాత్=రక్షించుఁగాక.

ఉ. ప్రాకటకంకణారవము భాసిలి పయ్యెదకొంగు దూఁగఁగా
వేకువ మోద మొప్ప నరవిందముఖుల్ పెరుగుల్ మథించుచుం
గోకవిరోధికిం గలలు గూర్చురదద్యుతి మీఱ నేహరిం
గోకులవాటిఁ బాడుదురు కోరికలాహరి యిచ్చుఁ గావుతన్. 101

తా. వ్రేపల్లెలోఁ దెల్లవారుజామున గోపికలందఱు పెరుఁగు చిలుకుచుఁ దమ పలుఁరంగులతో వెన్నెలను దిరస్కరించుచు, చేతిమురుఁగుల మోఁతలకుఁదగినట్లు పైఁట కొంగు లాడఁగా,నానందములో నెవనిఁ బాడుచుందురో, అకృష్ణుఁడు మమ్ముఁ బ్రోచుఁ గాక.

శ్లో. అంసాలమ్బితవామకుణ్డలభరం మన్దోన్నతభ్రూలతం
కిఞ్చిత్కుఞ్చిత కోమలాధరపుటం సాచిప్రసారేక్షణమ్,
ఆలోలాఙ్గులిపల్లవై ర్మురళికా మాపూరయన్తం ముదా
మూలేకల్పతరో స్త్రిభఙ్గిలలితం జానే జగన్మోహనమ్. 102

టీ. అంసా...భరమ్=ఎడమబుజముమీఁద మోపఁబడిన యంటుజోడుబరువు గలవాఁడును, మన్దోన్నతభ్రూలతమ్ = కొంచెముగానెత్తఁబడిన తీవలనుబోమలు గల వాఁడును, కిఞ్చి... పుటమ్=కొంచెమువిఱువఁబడిన లేఁతెదవిగలవాఁడును, సాచిప్రసారేక్షణమ్=అడ్డముగాఁ ద్రిప్పఁబడిన చూపులుగలవాఁడును, ముదా = ఆనందములో, ఆలోలాఙ్గులిపల్లవైః=కదలుచున్న చిగురువ్రేళ్లతో, మురళికామ్=పిల్లఁగ్రోవిని,ఆపూరయన్తమ్=ఊఁదుచున్న వాఁడును, కల్పతరోః=కల్పవృక్షముయొక్క, మూలే= మొదటనున్న, త్రిభంగిలలితమ్ = మూఁడువంపులచే ముద్దుగులుకువాఁడును, అగు, జగన్మోహనం=లోకమోహకుఁడగు కృష్ణుని, జానే=ధ్యానించి తెలిసికొనుచున్నాను.

ఉ. మూఁపున వామకుండలము మోవి నొకించుక మోపునందమున్
జూపెడునోరచూపు సొగసుంబొమ నొక్కట నిక్కఁ గన్పడం
గ్రేపులు సొక్కఁ గల్పకముక్రిందఁ ద్రిభంగిగ నిల్చి యంగుళీ
వ్యాపితవంశపూర్తి యొయి వర్తిలు మోహనమూర్తిఁ గొల్చెదన్. 102

తా. అంటుపోఁగు బుజముమీఁదను బడునట్లు తల యొరగఁ బెట్టికొని, ఆనందముచేఁ గొంచెముగావంగిన కనుబొమ్మలుకలుగునట్లు, పెదవిని విఱిచి పిల్లఁగ్రోవిని గఱచికొని యొయ్యారముగాఁజూచుచు వ్రేళ్లనుచేసి మహానందముతోఁ బిల్లఁగ్రోవి నూఁదికొనుచుఁ గల్పవృక్షము నీడఁ గూర్చున్న శ్రీకృష్ణుని ధ్యానించెదను.

శ్లో. మల్లైశ్శైలేన్ద్రకల్పః శిశురితరజనైః పుష్పచాపోఽఙ్గనాభి
ర్గోపైస్తు ప్రాకృతాత్మాదివి కులిశభృతా విశ్వకాయోఽప్రమేయః,
క్రుద్ధః కంసేన కాలో భయచకితదృశా యోగిభిర్ధ్యేయమూర్తి
ర్దృష్టోరఙ్గావతారే హరి రమరగణానన్దకృ త్పాతు యుష్మాన్. 103

టీ. రంగావతారే=కంసునిసభలోఁ దారసిల్లినయుద్ధములో,మల్లైః=చాణూరుఁడు మొదలగుమల్లులచేత,శైలేన్ద్రకల్పః=కొండతోఁదుల్యమైనవాఁడు గాను,ఇతరజనైః=

తక్కుంగలచూపఱులచేత, శిశుః=బాలుఁడుగాను, అఙ్గనాభిః = స్త్రీలచే, పుష్పచాపః=మన్మథుఁడుగాను, గోపైః = గోపాలురచేత, ప్రాకృతాత్మా=పామరుఁడుగాను, దివి = ఆకసమునసుండి చూచుచున్న, కులిశభృతా = ఇంద్రునిచేత, అప్రమేయః = ఊహింపరాని, విశ్వకాయః = విశ్వరూపము గలవాఁడుగాను, భయ...దృశా = భయవిహ్వలములైన కన్నులుగల, కంసేన=కంసునిచేత, క్రుద్ధః=కోపముగొనిన, కాలః =యముఁడుగాను, యోగిభిః = యోగులచేత, ధ్యేయమూర్తిః = ధ్యానింపఁదగినయాకృతికలవాఁడుగాను, దృష్టః=తలఁపఁబడినవాఁడును, అమరగణానన్దకృత్=దేవతాసంతోషకారియునగు, హరిః = శ్రీకృష్ణమూర్తి, యుష్మాన్ = మిమ్ముల, పాతు = రక్షించుఁగాక.

చ. నగ మని చెట్లు పావఁ డని నాగరికుల్ మరుఁ డంచుఁ గాంత ల
భ్రగపతి విశ్వరూపుఁ డని ప్రాకృతుఁ డంచును గోపబాలు రు
గ్రగతిఁ దనర్చుమృత్యు వని కంసుఁడు యోగులు స్వామిగాఁ గనం
దగి సుర లుబ్బ రంగమునఁ దార్కొను దేవుఁడు మిమ్ముఁ బ్రోచుతన్. 103

తా. కంసుఁడు గల్పించిన మల్లయుద్ధరంగమున చాణూరాదుల కొక కొండగాను, చూపఱులకు బాలుఁడు గాను, స్త్రీలకు మదనుఁడుగాను, గోపాలకులకు తమతోడి గోపాలుఁడుగాను, ఆకసమునసుండి చూచునింద్రాదులకు విశ్వమూర్తిగాను, కంసునకు తనపాలిటియముఁడుగాను, యోగులకు ధ్యానింపఁదగినమూర్తిగాను గన్పించుచు దేవతామోదకారియగు కృష్ణుఁడు మిమ్ముఁ బ్రోచుఁ గాక.

శ్లో. సంవిష్టో మణివిష్టరేఽఙ్కతల మధ్యాసీనలక్ష్మీముఖే
కస్తూరీతిలకం ముదా విరచయన్ హర్షాత్కుచౌ సంస్పృశన్,
అన్యోన్యస్మితచన్ద్రికాకిసలయై రారాధయ న్మన్మథం
గోపీగోపపరీవృతో యదుపతిః పాయా జ్జగన్మోహనః. 104

టీ. మణివిష్టరే=రత్నాలపీటయందు, సంవిష్టః=కూరుచున్నవాఁడై, అఙ్క...ముఖే=తొడమీఁదఁ గూరుచున్న లక్ష్మిమోమున, ముదా = వేడుకతో, కస్తూరీతిలకమ్=కస్తురిచుక్కను, విరచయన్ = పెట్టుచు, హర్షాత్=సంతసముతో, కుచౌ=స్తనములను, సంస్పృశన్ = అంటుచు, అన్యోన్య...కిసలయైః = పరస్పరప్రసక్తములైన చిఱునగవులనుచిగుళ్లతో, మన్మథం=పూవింటివానిని, ఆరాధయన్=కొలుచుచు, గోపీగోపపరీవృతః=గోపీగోపాలురతోఁ గూడియున్న, జగన్మోహనః = లోకమోహనుఁడగు, యదుపతిః=యాదవులదొర, పాయాత్=(మమ్ము) రక్షించుఁగాక.

చ. చెలు వగురత్నపీఠమున శ్రీసతి నంకముఁ జేర్చి కస్తురిం
దిలకము దిద్ది దిద్ది తమి దీరక వెంటన గుబ్బ లంట మో

ములఁ దళుకొత్తునవ్వు విరిమొ త్తములన్ మరుపూజ సేయు న
చ్చెలు వగువల్లవ ప్రకర సేవిత మోహనమూ ర్తి ప్రోచుతన్. 104

తా. రతనపుఁబీఁటపయిఁగూర్చుండి, తొడయందలి లక్ష్మీదేవి మోమున వేఁడు కగాఁ దిలకముదిద్దుచు, సంతోషముతోఁ గుచములనంటుచు, ఉభయులనవ్వులచే మన్మథునిఁ బూజించుచు, గోపీగోపకులతోఁగూడి కొలువు దీరి జగన్మోహనుఁ డైయున్న యాదవనాథుఁడు మమ్ముఁ గాచుఁగాక.

శ్లో. ఆకృష్టే వసనాఞ్చలే కువలయశ్యామా త్రపాభరకృతా
దృష్టిః సంవలితా రుచా కుచయుగే స్వర్ణప్రభే శ్రీమతి,
బాలః కశ్చన చూతపల్లవ ఇతి ప్రాప్తస్మితాస్యశ్రియం
శ్లిష్యం స్తా మథ రుక్మిణీం నతముఖీం కృష్ణ స్స పుష్ణాతు నః. 105

టీ. వసనాఞ్చలే=చీరకొంగు, ఆకృష్టే సతి=లాగఁబడిన దగుచుండఁగా, కువలయశ్యామా = కలువవలె నల్లనైనదియు, త్రపాభరకృతా=సిగ్గుచే వాలినదియు, శ్రీమతి =చక్కనైన, రుచా=కాంతిచే, స్వర్ణప్రభే=బంగారువన్నెగల, కుచయుగే=చనుదోయియందు, సంవలితా=సంక్రమించిన, దృష్టిః=చూపు, చూతపల్లవ ఇతి=మామిడిచిగురని, ప్రాప్తస్మితాస్యశ్రియం=చిఱునగవుతోఁగూడిన మోముగలదియు, నతముఖీం = మోమువంచుకొనియున్న, తామ్=ఆ, రుక్మిణీం=రుక్మిణీదేవిని, శ్లిష్యన్=కౌఁగిలించుకొన్నవాఁడును, కశ్చన=అనిర్వాచ్యుఁడును, బాలః=చిన్నవాఁడగు, సః=ఆ, కృష్ణః=కృష్ణుఁడు, నః=మమ్ము, పుష్ణాతు=పోషించుఁగాక.

మ. అలరుంబయ్యెదకొంగు దీయఁ దపనీయశ్రీ విడంబించుగు
బ్బలపై సిబ్బితిగబ్బిచూపు నెలకొల్పం దద్ద్యుతిన్ నూత్నచూ
తలతాపల్లవరీతిఁ గాంచి స్మితవక్త్రప్రౌఢ యారుక్మిణీ
లలనం గౌఁగిట గారవించుహరి కళ్యాణంబు మా కిచ్చుతన్. 105

తా. పైఁటకొంగు లాగఁగానే సిగ్గుపడి మోము వంచుకొని బంగరుచాయగల తనచనులయందు, వ్రాలిన తనదృష్టి యాపసుపువన్నెతోఁ గలసి యుండుటను జూచి మామిడిచిగురని తలఁచుచు నవ్వుకొని రుక్మిణిఁ గౌఁగిలించు కుమారబాలుఁడగు కృష్ణుఁడు మమ్ముఁ గాపాడుఁగాక.

అవ. ఈశ్లోకమును రుక్మిణీకృష్ణసంవాదముగ గవి చెప్పుచున్నాఁడు.

శ్లో. ఉర్వ్యాం కో౽పి మహీధరో లఘుతరో దోర్భ్యాం ధృతో లీలయా
తేన త్వం దివి భూతలే చ సతతం గోవర్ధనోద్ధారకః,

త్వాం త్రైలోక్యధరం వహామి కుచయో రగ్రే న త ద్గణ్యతే
కిం వా కేశవభాషణేన బహునా పుణ్యై ర్యశో లభ్యతే. 106

టీ. హేకేశవ=ఓకృష్ణా, త్వయా=నీచేత, ఉర్వ్యామ్=భూమియందు, కోఽపి=ప్రసిద్ధముకాని, లఘుతరః=చులకనగు, మహీధరః=కొండ, లీలయా=వేడుకచేత, దోర్భ్యామ్=బాహువులచే,ధృతః=తాల్చఁబడినది. తేన=ఆకారణముచేత,త్వమ్=నీవు, దివి=స్వర్గముననను, భూతలేచ భూమియందును, సతతం=ఎల్లప్పుడు, గోవర్ధనోద్ధారకః=గోవర్ధనపుఁ గొండనెత్తినవాఁడని, (కీర్తింపఁబడుదువు.) త్రైలోక్యధరం=ముల్లోకములను భరించువాఁడవగు, త్వాం=నిన్ను, కుచయోః=చనులయొక్క, అగ్రే=మీఁద, వహామి=మోయుదును. తత్=ఆసంగతి, నగణ్యతే=లెక్కింపఁబడదు. బహునాభాషణేన=పలుమాటలతో, కింవా = ఏమిలాభము? పుణ్యైః=సుకృతములచేత, యశః=కీర్తి, లభ్యతే=పొందఁబడును.

మ. ధరణిం జేతుల నొక్క చిన్నగిరి యెత్తఁ నిన్ను గోవర్ధనో
ద్ధరణుం డంచు నుతించె నీదళ దిశల్ త్రైలోక్యధారేయ! ని
న్నురువక్షోజములన్ భరింప ననుఁ బేర్కొ రెవ్వరుం బుణ్యవి
స్ఫురణం గీర్తి చెలంగుఁ బెక్కువచనంబుల్ కృష్ణ! యింకేటికిన్. 106

తా. కృష్ణా, నీవొక తేలికరైన కొండను (గోవర్ధనగిరిని) అనాయాసముగా నెత్తితి వని నిన్ను భూమిలో జనులు, స్వర్గములో వేల్పులు గోవర్ధనోద్ధారకుఁడని యిప్పటికిని బొగడుచున్నారు. త్రిలోకధారివగు నిన్ను, సర్వకాలములయందు కుచములమీఁద నుంచి మోచు నన్నొక్కరును దలఁపరు. ఎందుకు ఈసోది. ఇంతకు గొప్ప పేరు రావలెనన్నఁ బుణ్యము జేసికొనవలెను. దానికి యోగ్యతాయోగ్యతలు పనికిరావు.

శ్లో. సన్ధ్యావన్దన భద్రమస్తు భవతే భోః స్నాన తుభ్యం నమో
భో దేవాః పితరశ్చ తర్పణవిధౌ నాహం క్షమః క్షమ్యతాం,
యత్ర క్వాపి నిషీద్య యాదవకులో త్తంసస్య కంసద్విషః
స్మారంస్మార మఘం హరామి తదలం మన్యే కి మన్యేన మే. 107

టీ. హేసన్ధ్యావన్దన=ఓ సంధ్యావందనమా, భవతే=నీకొఱకు, భద్రం=శుభము, అస్తు అగుఁగాక. భోః స్నాన=ఓ స్నానమా, తుభ్యం=నీకొఱకు, నమః=నమస్కారము! భోః దేవాః పితరశ్చ=ఓదేవతలారా పితరులారా, తర్పణవిధౌ=మీకుఁదర్పణము చేయుఁటయందు, అహం=నేను, నక్షమః=చాలినవాఁడను కాను. క్షమ్యతాం=సైచుఁడీ. యత్ర క్వాపి=ఎక్కడనో ఒక్కచోట, నిషీద్య=కూరుచుండి, యాదవకులోత్తంసస్య=యదువంశ నాయకుఁడగు, కంసద్విషః=కృష్ణుని, స్మారంస్మారం=తలఁచి తలఁచి, అఘమ్=పాపమును, హరామి=పాపుకొందును. తత్=ఆహరిధ్యానము, అలం=చాలును.(అని) మన్యే=తలంచెదను. మే=నాకు, అన్యేన=ఇతరచింతతో, కిం=ఏమిపని.

చ. సతతము సంధ్యకున్ శుభము స్నానజపాదివిశేషసత్క్రియా
తతికిని మ్రొక్కు దేవపితృతర్పణచర్య కళ_క్తియుక్తుఁడన్
మతిఁ గరుణింప నొక్కనిఘమస్థితిఁ గంసరిపున్ యదూద్వహున్
స్తుతి యొనరించి కల్మషవిదూరుఁడ నౌదు ననన్యకర్మతన్. 107

తా. ఓసంధ్యావందనమా! నీకొకదండము. ఓస్నానమా! నీకు నొక్కమ్రొక్కు. నేచేయఁజాలను. ఓదేవతలారా, పితరులారా! నే మీకుఁ దర్పణముఁ జేయలేనైతిని; మన్నింపుఁడు. నేనేమూలనైనఁగూర్చుండి కృష్ణుని ధ్యానించుకొందును. నాకదిచాలు. మఱియొకదానితో నా కేమిపని?

శ్లో. హేగోపాలక హేకృపాజలనిధే హేసిన్ధుకన్యాపతే
హేకంసాంతక హేగజేన్ద్రకరుణాపారీణ హేమాధవ,
హేరామానుజ హేజగత్త్రయగురో హేపుణ్డరీకాక్ష మాం
హేగోపీజననాథ పాలయ పరం జానామి న త్వాం వినా. 108

టీ. హేగోపాలక=ఓగొల్లఁడా, హేకృపాజలనిధే=ఓదయాసముద్రమా, హేసింధుకన్యాపతే=ఓకడలికూఁతురిమగఁడా, హేకంసాంతక=ఓకంసవిధ్వంసీ, హేగజేంద్రకరుణాపారీణ=ఓగజరాజవరదా, హేమాధవ=ఓలక్ష్మీపతీ, హేరామానుజ=ఓబలరామునితమ్ముఁడా, హేజగత్త్రయగురో=ఓముల్లోకములదొరా, హేపుణ్డరీకాక్ష=ఓతెల్లదామరలఁబోలు కన్నులుగలవాఁడా, హేగోపీజననాథ=ఓగొల్లపడుచుల ప్రాణప్రియుఁడా, మాం=నన్ను, పాలయ=కాపాడుము, త్వాంవినా=నిన్నువిడిచి, పరం=అన్యుని, నజానామి=ఎఱుఁగను.

శా. ఓకారుణ్యసముద్ర యోకరటిరక్షోదీర్ణ యోమాధవా
యోకంసాంతక యోరమానసహచరా యోవల్లవీకింకరా
యోకంజేక్షణ యోజగద్గురుమణీ యోరోహిణేయానుజా
మీకన్నన్ మఱియన్య నే నెఱుఁగఁ జుమ్మీ నన్ను రక్షింపుమీ. 108

తా. ఓగోపాలా, ఓదయామయా, ఓలక్ష్మీనాథా, ఓకంసవిధ్వంసీ, ఓగజరాజవరదా, ఓమాధవా, ఓకృష్ణా, ఓముల్లోకములతండ్రీ, ఓతామరకన్నులవాఁడా, ఓగోపాంగనావల్లభా, ననుఁగావుము. నీకంటె నన్య నెఱుఁగను.

శ్లో. కస్తూరీతిలకం లలాటఫలకే వక్షఃస్థలే కౌస్తుభం
నాసాగ్రే నవమౌక్తికం కరతలే వేణుం-కరే కఙ్కణమ్,
సర్వాఙ్గే హరిచన్దనం చ కలయన్ కణ్ఠే చ ముక్తావళిం
గోపస్త్రీపరివేష్టితో విజయతే గోపాలచూడామణిః. 109

టీ. లలాటఫలకే=పలకవంటి నొసలియందు, కస్తూరీతిలకం=కస్తురిచుక్కను, వక్షఃస్థలే=ఱొమ్మున, కౌస్తుభమ్ = కౌస్తుభమును, నాసాగ్రే=ముక్కుకొనయందు, నవమౌక్తికం=క్రొత్తముత్తెమును, కరతలే=చేతియందు, వేణుం=పిల్లఁగ్రోవిని, కరే=ముంజేతియందు, కంకణమ్=మురుఁగును, సర్వాఙ్గే = ఒడలియందంతటను, హరిచన్దనంచ=శ్రీచందనమును, కణ్ఠే=మెడయందు, ముక్తావళిమ్=ముత్యాలహారమును, కలయన్=ధరించుచున్న, గోపాలచూడామణిః=గోపాలశ్రేష్ఠుఁడు, గోపస్త్రీపరివేష్టితః=గొల్లపడఁతులతోఁ గూడినవాఁడై, విజయతే=వెలయుచున్నాఁడు.

మ. నుదుటం గస్తురిబొట్టు నాసికతుద న్ముత్తెంబు శ్రీగంధనం
పద నెమ్మేనఁ గరంబులం గటకముల్ పంశంబు హస్తాగ్రమం
దెదపై నిస్తులకౌస్తుభంబు నెఱుతన్ శృంగారహారంబు నిం
పొదవం గృష్ణుఁడు గోపికావృతుఁడు సర్వోత్కృష్టుఁడై వర్తిలున్.

తా. మొగమునఁగస్తురిచుక్కయు, ఱొమ్మున కౌస్తుభమును, ముక్కున ముత్యమును, చేతిలోఁ బిల్లఁగ్రోవియు, మణికట్టున మురుగును, ఒడలంతయు గంధమును, మెడలో ముత్యాలదండను దాల్చినకృష్ణుఁడు గోపీజనపరివృతుఁడై వెలయుచున్నాఁడు.

శ్లో. లోకా నున్మదయన్ శ్రుతీ ర్ముఖరయన్ క్షోణీరుహాన్ హర్షయన్
శైలా న్విద్రవయన్ మృగా న్వివశయ న్గోబృన్ద మానన్దయన్,
గోపాన్ సంభ్రమయన్ మునీ న్ముకుళయన్ సప్తస్వరాన్ జృమ్భయ
న్నోఙ్కారార్థ ముదీరయ న్విజయతే వంశీనినాద శ్శిశోః. 110

టీ. శిశోః=బాలకృష్ణునియొక్క, వంశీనినాదః=పిల్లఁగ్రోవిమ్రోఁత, లోకాన్=భువనములను, ఉన్మదయన్ = మోహింపఁజేయుచు, శ్రుతీః=వేదములను, ముఖరయన్=బదులుమ్రోఁతపెట్టించుచు, క్షోణీరుహాన్=వృక్షములను, హర్షయన్=సంతసింపఁజేయుచు, శైలాన్=కొండలను, విద్రవయన్=కరఁగించుచు, మృగాన్=మృగములను, వివశయన్=ఒడలుమఱపించుచు, గోబృన్దం=గోవులమందను, ఆనందయన్=ఆలరింపఁజేయుచు, గోపాన్=గొల్లలను, సంభ్రమయన్=సంబరపెట్టుచు, మునీన్=ఋషులను, ముకుళయన్=ధ్యాననిమీలితులనుగాఁజేయుచు, సప్తస్వరాన్=ఏడుస్వరములను, జృమ్భయన్=విస్తరించుచు, ఓంకారార్థం=ఓంకారవాచ్యమును, ఉదీరయన్=చెప్పుచు, విజయతే=వెలయుచున్నది.

మ. మృగములుసొక్క మ్రాఁకు లిగురింపఁగ రాలు గరంగ మ్రోయఁగా
నిగమము లావు లుబ్బఁగ మునిచ్ఛట మ్రాన్పడ గోవు లాడఁగా
జగము నెలంగ నోంకృతి యొసంగఁగ సప్తవిధస్వరాంగులు
ల్లిగుడఁ గడంగె బాలమురళీనినదంబు ముదం బెసంగఁగన్. 110

తా. చిన్నికృష్ణుని వేణుగానధ్వని భువనముల మోహింపఁజేయుచున్నది. వేదముల మాఱుపలికించుచున్నది. వృక్షముల నానందము నొందించుచున్నది. కొండల నీఱుసేయుచున్నది. మృగములను మఱులుకొల్పుచున్నది. గోవులను తృప్తిపఱచుచున్నది. గోపాలురకుఁ దిక్కు దెచ్చుచున్నది. మునులను గనులుమూయించుచున్నది. సప్తస్వరముల వెదఁజల్లుచున్నది. ఓంకారార్థమును వ్యాఖ్యానము సేయుచున్నది.

*శ్లో. యస్యాత్మభూతస్య గురోః ప్రసాదా
దహం విముక్తోఽస్మి శరీరబన్ధాత్,
సర్వోపదేష్టుః పురుషోత్తమస్య
తస్యాఙ్ఘ్రిపద్మం ప్రణతోఽస్మి నిత్యమ్. 111

టీ. ఆత్మభూతస్య = ఆత్మరూపియగు, యస్య=ఏ, గురోః=సోమగిరిదేశికుని యొక్క (కృష్ణునియొక్క), ప్రసాదాత్ = కారుణ్యమువలన, అహం=నేను, శరీరబన్ధాత్=జన్మబంధమునుండి, విముక్తః=విడిపింపఁబడినవాఁడను, అస్మి=ఐతినో, సర్వోపదేష్టుః = అన్నియుపదేశములుసేయు, తస్య=అ, పురుషోత్తమస్య = పురుశ్రేష్ఠుని (విష్ణుని)యొక్క, అంఘ్రిపద్మం=అడుగుఁదామరను గూర్చి, నిత్యం=ఎల్లవేళలయందు, ప్రణతః అస్మి=మ్రొక్కెదను.

తా. ఆత్మరూపియగు నే మహానుభావుని యనుగ్రహమునవల నేను సంసారసాగరమునుండి జన్మమరణములను వీడి గట్టునఁ బడఁగలిగితినో, అట్టి శ్రీగురువుయొక్క పాదకమలములకు నమస్కారము.

మాలినీవృత్తము. సతతవినుతభీమా సచ్చిదానందసీమా
శతమఖనుతనామా సాధుమానప్రణామా
దితిజకులవిరామా దేవతాసద్వభౌమా
వితతతపనధామా వేంకటాహార్యధామా.

మ. ఇతి కృష్ణాశ్రయయోగిపుంగవకృపావీతార్తసారస్వతా
భ్యుదయశ్రీవిభవప్రసిద్ధచిదచిద్భోగతమూలాశాన్తి స
త్యదయాభూషణ వెల్లపూడిమణి పిద్దామాత్య వెంగాగ్రణీ
గదితాశ్వాసము వొల్చు రెండవది యై కర్ణామృతశ్రీకృతిన్.

ద్వితీయాశ్వాసము సంపూర్ణము.

---

* ఈశ్లోకము కొన్నిప్రతులయందు గానరాదు. తెలుఁగున పరివర్తనము నైతము లేదు. దానఁజేసి ఇత్యాది ప్రక్షిప్తమని కొంద ఱూహించినట్లే ఇది ప్రకృతమునకుఁ గూడ సంబంధించినట్లు తోఁపదు.

# తృతీయాశ్వాసము.



శ్లో. అస్తి స్వస్త్యయనం సమస్తజగతా మభ్యస్తలక్ష్మీస్తనం
నస్తధ్వస్తరజస్తమోభిరనిశం న్యస్తం పురస్తాదివ,
హస్తోద స్తగిరీన్ద్రమస్తకతరుప్రస్తారవిస్తారిత
ప్రస్తస్వస్తరుసూనసంస్తరలసత్ప్రస్తావిరాధాస్తుతమ్. 1

టీ. సమస్తజగతామ్=ఎల్ల లోకములకు, స్వస్త్యయనం=శుభప్రదమైనదియు, అభ్యస్తలక్ష్మీస్తనమ్=లక్ష్మీదేవి స్తనములయందు పరిచితమైనదియు, ధ్వస్తరజస్తమోభిః=పాడుచేయఁబడిన రజస్తమోగుణములు గలవారిచేత, అనిశమ్=ఎల్లప్పుడు, పురస్తాత్=ముందట, న్యస్తమివ=ఉంచఁబడిన దానివలెనున్నదియు, హస్తో...లసత్=చేతులతో నెత్తఁబడిన గోవర్ధనగిరి మీఁది చెట్లగుంపులనుండి గుట్టలుగా రాలుచున్న పూవులచే నినుమడించిన కల్పకుసుమముల పఱుపుచేఁ బ్రకాశించునదియు, ప్రస్తావి=పొగడఁబడిన, రాధాస్తుతం=రాధచేఁ బొగడఁబడిన, వస్తువు, అస్తి=కలదు.

శా. హస్తోద స్తగిరీంద్రమ స్తకతరువ్యత్యస్తవిస్తారిత
ప్రస్తస్వస్తరుసూనసంస్తరలసత్ప్రస్తార మభ్యస్తవ
ద్మాస్తోకస్తన మస్తకల్మషపురోన్యస్తంబు సుద్యజ్జగ
త్స్వస్తిశ్రీదము రాధికాస్తుతము చంచద్వస్తు వెంతే తగున్. 1

తా. ఎల్లలోకములకు రక్షకమైనదియు, లక్ష్మీదేవి చనులయందలవాటుపడినదియు, రజస్తమోదూరులచే నెల్లప్పుడు స్వాధీనము చేసికోఁబడినదియు, చేతులతో గోవర్ధనము నెత్తినప్పుడు దానిమీఁది చెట్లనుండి రాలుపూవులచేతను, మింటనుండి పడు కల్పకుసుమములచేతను బఱచఁబడిన క్రిందిభాగముగలదియు, జగన్నుతమైన రాధాస్తవపాత్రమైనయొకవస్తు వున్నది.

శ్లో. రాధారాధిత విభ్రమాద్భుతరసం లావణ్యరత్నాకరం
సాధారణ్యపదవ్యతీతసహజస్మేరాననామ్భోరుహమ్,

ఆలమ్బే హరినీలగర్వగురుతాసర్వస్వనిర్వాపణం
బాలం వైణవికం విముగ్ధమధురం మూర్ధాభిషిక్తం మహః. 2

టీ. రాధా...రసమ్=రాధచే సేవింపఁబడు విలాసముచే నాశ్చర్యమైన శృంగారముగలదియు, లావణ్యరత్నాకరం=తేటఁదనమునకు సంద్రమైనదియు, సాధారణ్య...రహం=లోకసామాన్యపదవిని దాఁటినసహజమగు చిఱునవ్వుగల మోముఁదమ్మిగలదియు, హరి...పణమ్=ఇంద్రనీలముయొక్క గర్వభారమునంతయు రూపుమాపినదియు, బాలం=కిశోరరూపమైనదియు, విముగ్ధమధురం = ప్రకృతి సుందరమై చిత్తాకర్షకమైనదియు, మూర్ధాభిషిక్తం=మనోహర వస్తువులకురాజగు, వైణవికం=వీణాగానమందు మిన్న యగు, మహః=ఒకానొక తేజమును, ఆలమ్బే=ఆశ్రయించుచున్నాను.

శా.సాధారణ్య[1]పదవ్యతీతదరహాసశ్రీముఖాంభోజుఁ డై
మాధుర్యైకనిధానుఁ డై మరకతాశ్మప్రౌఢిగర్వార్భటీ
వైధుర్యావహతేజుఁ డై సరసనిర్వ్యాజాంగశృంగారుఁ డై
రాధారాధితుఁ డై నవైణవికమూర్ధన్యుఁ డా మదిం గొల్చెదన్. 2

తా. రాధచే ననుభవింపఁబడిన యాశ్చర్యవిలాసపుంజముగలదియు, తేటఁదనపుఁజోకైనదియు, లోకసాధారణముగాని, యవ్యాజమై ప్రకృతిసుందరమైన నగుమోముగలదియు, ఇంద్రనీలమునకున్న సౌందర్యగర్వ మంతయుఁ బిండి తలబరువుదింపినదియు, కిశోరరూపమైనదియు, అత్యంతసుందరమును మధురము నైనదియు, సౌందర్యవస్తువులకు రాజుగాఁ జేయఁబడినదియు, వీణావాదనచణమైన యొకానొకదివ్యతేజము నాశ్రయించెదను.

శ్లో.కరిణా మలఙ్ఘ్యగతి వైభవం భజే
కరుణావలమ్బితకిశోరవిగ్రహమ్,
యమినా మనాతరవిహారి మానసే
యమునావనాన్తరసికం పరం మహః. 3

టీ. కరిణాం=ఏనుఁగులకు, అలఙ్ఘ్యగతివైభవం=గెలువరానినడకసోయగముగలవాఁడును, కరుణా...గ్రహం=దయతోఁ దాల్చఁబడిన బాలరూపముగలవాఁడును, యమినాం=యోగులయొక్క, మానసే = చిత్తమున, అనారతవిహారి=విడువకుండునదియు, యమునావనాన్తరసికం=యమునదరినున్న యడవి సారస్యము నెఱిఁగినదియు, పరం=ఉత్తమమైన, మహః=తేజమును, భజే=సేవించెదను.

ఉ. అల్లన మందయానము గజావలి గోరఁగ మానిమానసో
త్ఫుల్లసరోజపాళిఁ బదముల్ నెలఁగన్ యమునాతరంగిణీ

1 సరణ్యతీతి.

నల్లలితాంబుపూరములు సారవయస్యలమీఁదఁ జిమ్ముచుం
జల్లనిచూపులం గరుణఁ జల్లెడు నల్లనిబాలుఁ గొల్చెదన్. 3

తా. ఏసుఁగు గున్నలకు మీఱరాని గతిసౌష్ఠవముగలదియు, భక్తానుగ్రహార్థము గోపవేషముమదాల్చినదియు, యోగులమానసముల నేప్రొద్దు వీడకుండునదియు, యమునాతీరమండలి యడవిసొబగెతీఁగిన యొక యుత్తమ దివ్యతేజమును సేవించెదను.

శ్లో. అతన్త్రితత్రిజగదపి వ్రజాఙ్గనా
*నియన్త్రితం విపులవిలోచనాఙ్గయా,
నిరన్తరం మమ హృదయే విజృమ్భతాం
సమన్తతః సరసతరం పరం మహః. 4

టీ. అతన్త్రితత్రిజగదపి=అస్వతంత్రములుగాఁ జేయఁబడిన ముల్లోకములు గలదయ్యును, విపులవిలోచనాఙ్గయా=వెడదకన్నుల యుత్తరవుచేత, వ్రజాఙ్గనానియన్త్రితం=గొల్లకాంతలచే బాధింపఁబడినదియు, సమన్తతః=ఎల్లయెడల, సరసతరం=కడురసికమైన, పరం=మేలైన, మహః=వెలుఁగు, మమ=నాయొక్క, హృదయే=చిత్తమున,నిరన్తరం=ఎల్లప్పుడు, విజృమ్భతామ్=చెలరేఁగుఁగాక.

ఉ. లోకము లన్నియుం దనకు లోఁబడఁగాఁ గొని యేలుమేటి యస్తోకమనోహరాననముపశోభితుఁ డెంతటివింత గోపికాలోకనలీల నెల్లపనులుం దనుఁ బాసి యొనర్చె వారిదే
కాక ప్రభావ మట్టిత్రిజగత్సులభుఁ మది నాశ్రయించెదన్. 4

తా. ముల్లోకముల నస్వతంత్రములుగాఁ జేసినను తానుమాత్రము గొల్లయిల్లాండ్రకనుసన్నలకు లోనైనదియు సర్వవిధముల సరసమైన యుత్కృష్టతేజ మెప్పుడు ను నామనమున నిండియుండుఁగాక.

శ్లో. కన్దర్పప్రతిమల్లకాన్తివిభవం కాదమ్బినీబాన్ధవం
బృన్దారణ్యవిలాసినీవ్యసనినం వేషేణ భూషామయమ్,
మన్దస్మేరముఖామ్బుజం మధురిమవ్యామృష్టబిమ్బాధరం
వన్దే కన్దళితార్ద్రయౌవనవనం కైశోరకం శార్ఙ్గిణః. 5

టీ. కందర్ప...భవం=మన్మథునికిఁ బ్రతిభటమైన సొబగునొయ్యారముంగలదియు,కాదమ్బినీబాన్ధవమ్=మబ్బుతుట్టెలచుట్టమును, బృందారణ్యవిలాసినీవ్యసనినం=బృందావనమండలి (గొల్ల) హొయలులకత్తెలనంటుకొన్నదియు, వేషేణ=అలంకారముచేత,భూషామయం=సొమ్ముల పెట్టెయైనదియు,మన్దస్మేరముఖామ్బుజమ్=చిఱునగవుకల

* వియన్త్రితం.

మోముదమ్మిగలదియు, మధురిమవ్యామృష్టబిమ్బాధరం=తీయఁదనముచేఁబూయఁబడిన దొండపండువంటి పెదవిగలదియు, కన్దళితార్ద్రియావనవనమ్= ఉద్బుద్ధమై రసార్ద్రమైన జవ్వనపుటడవిగలదియునగు, శార్ఙ్గిణః=కృష్ణునియొక్క, కైశోరకం=పసితనమునుగూర్చి, వన్దే=నమస్కరించెదను.

శా. కందర్పప్రతిమల్లధాము నవమేఘశ్యామునిఁ బ్రేమోల్లస
ద్బృందారణ్యవధూరతుఁ మధురిమామృష్టాధరోష్ఠాన్వితు
న్మందస్మేరకపోలు వేషకృతనానాభూషణోద్వేలుఁ జె
ల్వొందం గొల్చెద బాల్యయావనవిలాసాలంకృతుఁ శ్రీయుతున్. 5

తా. మన్మథునిఁ బ్రతిఘటించు సౌందర్యముగలదియు, మొగిల్లకుఁ జుట్టమైనదియు, బృందావనమందలి గోపయువతులం దనురక్తమయినదియు, ఒడలెల్ల సొమ్ములచే నిండినదియు, చిఱునవ్వుచే నందమైనమోముగలదియు, తేనెగాఱు పెదవిగలదియు, శృంగారపూర్ణమైన ప్రథమయావనముగలదియు, నగు శ్రీకృష్ణునితేఁబ్రాయముంగూర్చి మ్రొక్కెదను.

శ్లో. అముక్తమానుష మముక్తనిజానుభావ
మారూఢయావన మగూఢవిదగ్ధలీలమ్,
అమృష్టయావన మనష్టకిశోరభావ
మాద్యం మహః కిమపి మాద్యతి మానసే మే. 6

టీ. అముక్తమానుషం=శైకొనఁబడిన మానుష భావము గలదియు, అముక్తనిజానుభావం=విడువఁబడని తన ప్రభావముగలదియు, ఆరూఢయావనం=పొందఁబడినయావనముగలదియు, అగూఢవిదగ్ధలీలం=వెల్లడియైన గడుసుఁదనపు విలాసములు గలదియు, అమృష్టయావనమ్=చొఱఁబడిన యావనముగలదైనను, అనష్టకిశోరభావం=పూర్తిగా వీడనిపిన్న నేఁతలుగలదియు, కిమపి=అనిర్వాచ్యమైన, ఆద్యం=మొదటిదగు, మహః=తేజము, మే=నాయొక్క, మానసే=చిత్తమున, మాద్యతి=కైపువెట్టుచున్నది.

ఉ. మానవలీలయుఁ నిరుపమానమహామహిమానుభావముఁ
మేనిపరిగ్రహంబు మితి మీఱినప్రౌఢియు బాల్యచాపలా
నూనవిలాసముఁ నవమనోహరయావనముం జెలంగ నెం
తేనియు హర్షవిస్మయము లిచ్చుఁ జెలంగ వెలుంగు నామదిన్. 6

తా. మనుజరూపముఁ దాల్చియుఁ దననిజానుభావముల వీడనిదియు, యావనోదయమై వెల్లివిరియు విలాసములుగలదియు, యావనము వచ్చినను చిన్నతనపుఁజేఁతల విడువనిదియునగు ననిర్వాచ్యమైన యామొదలితేజము నామనమును బరవశముగాఁ జేయుచున్నది.

శ్లో. తే తేభావా స్సకలజగతీలోభనీయప్రభావాః
నానాతృష్ణాసుహృది హృది మే కామ మావిర్భవన్తు,
వీణావేణుక్వణితలసితస్మేరవక్త్రారవిన్దా
న్నాహం జానే మధుర మపరం నన్దపుణ్యామ్బురాశేః. 7

టీ. సకల...భావాః - ఎల్లలోకములకును వాంఛింపఁదగిన యనుభావములుగల, తేతే=ఆయా, భావాః=వస్తువులు, నానా...సుహృది=పలువిధములైన యాశలకు మిత్రమైన, మే=నాయొక్క, హృది=చిత్తమున, కామం=మిగుల, ఆవిర్భవంతు=పుట్టుఁగాక. అహం=నేను, నందపుణ్యామ్బురాశేః=నందునిపుణ్యములకు సముద్రప్రాయమైన వస్తువుయొక్క, వీణా...విన్దాత్=వీణనంటిపిల్లఁగ్రోవిమ్రోఁతలచే సొబగారుమోముదమ్మికంటె, అపరం=మఱియొక, మధురం=ప్రియవస్తువును, నజానే=ఎఱుఁగను.

మ. అమితాశావశమౌమదిఁ నిఖిలలోకాశాస్య మౌపెక్కు భా
వముఁ లెన్నేనియు నిల్చుఁ గాక విలసద్వంశీనినాదానుమో
దము మందస్మితసుందరం బగుయశోదానందపుణ్యాంబుసా
రముకన్నఁ మధురంబు లే దొకటి చర్చల్ సేయ నిం కేటికిన్. 7

తా. ఎల్లజగముల మోహింపఁజేయఁజాలు నేరుపుగల యాయాభావములు నానాదురాశలతోఁగూడి నామదిలోఁ బుట్టుచుండుఁగాక. నేనుమాత్ర మెన్నివిధములఁదలఁచి చూచినను నందునినోములపంటయగు కృష్ణుని వేణుగానమధురమైన మోముకంటె నింకొక ప్రియవస్తువును గానను.

శ్లో. సుకృతిభి రాదృతే సరసవేణునినాదసుధా
రసలహరీవిహారనిరవగ్రహకర్ణపుటే,
వ్రజవరసున్దరీముఖసరోరుహసారసికే
మహసి కదాను మజ్జతి మదీయ మిదం హృదయమ్. 8

టీ. సుకృతిభిః=పుణ్యవంతులచేత, ఆదృతే=మెచ్చఁబడినదియు, సరస...పుటే=సొంపైన పిల్లఁగ్రోవిమ్రోఁతలను తేనెకాలువలఁ గ్రీడించుటచేఁ దనిసిన కర్ణరంధ్రములుగలదియు, వ్రజ...సికే=గోపకాంతల మోముఁదామరలసౌభాగ్యము నెఱిఁగిన, మహసి=వెలుఁగునందు, ఇదమ్=ఈ, మదీయమ్=నాసంబంధియైన, హృదయం=చిత్తము, కదాను=ఎప్పుడు, మజ్జతి=మునుఁగునో.

చ. విమలతపోధనామృతము వేణురవామృతసారపూరవి
శ్రమపదకర్ణగోళము వ్రజప్రమదాముఖపద్మచంచరీ
కము కమనీయనాకము సకామజనావన మైనదివ్యతే
జమున మునుంగు టెన్నఁడొకొ చల్లగ నుల్లము పల్లవింపఁగన్. 8

తా. అనేకులగు పుణ్యాత్ములచే గారవింపఁబడినదియు, మనోహరవేణుగానమను నమృతప్రవాహములో నీఁది తనిసిన కర్ణరంధ్రములుగలదియు, గొల్లపడంతుల మోముఁదామరల సారస్యమెఱింగిన దివ్యతేజమం దీనాచిత్తమెప్పుడు మునిఁగి (లయమయి) పోవునో !

శ్లో. తృష్ణాతురే చేతసి జృమ్భమాణం ముష్ణన్ముహుర్మోహమహాన్ధకారమ్,
పుష్ణాతు నః పుణ్యదయైకసిన్ధోః కృష్ణస్య కారుణ్యకటాక్షకేళిః. 9

టీ. తృష్ణాతురే=ఆశాగ్రస్తమైన, చేతసి=నాచిత్తమందు, ముహుః=తేపతేపకు, జృమ్భమాణం=కమ్ముకొనుచున్న, మోహమహాన్ధకారం=అజ్ఞానమను పెనుచీఁకటిని, ముష్ణన్=దొంగిలించుచున్న, పుణ్యదయైకసిన్ధోః=పుణ్యమునకును దయకును ముఖ్యస్థానమైన, కృష్ణస్య=శ్రీకృష్ణునియొక్క, కారుణ్యకటాక్షకేళిః=దయగలకడగంటి చూపులవిలాసము, నః=మమ్ము, పుష్ణాతు=పోషించుఁగాక.

మ. అమితాశావశ మైననామది నవశ్యం బైనమోహాంధకా
రము గారుణ్యకటాక్షవీక్షణవిభారాశిఁ బిఘాలించి నె
య్యమునం బ్రోచు దయాపయోధి ఘనబృందారణ్యకర్మంది బృం
దమనోలోచనసాధు సేవధి ప్రమోదం బొప్ప నెల్లప్పుడున్. 9

తా. తేపతేపకుఁ గ్రమ్ముకొనుచున్న నాచిత్తమందలి యజ్ఞానగాఢాంధకారము మ్రింగివేసిన పుణ్యదయారాశియగు శ్రీకృష్ణునిదయామయమైన కడగంటిసొబగు నన్ను రక్షించుఁగాక.

శ్లో. నిఖిలాగమమౌళిలాలితం పదకమలం పరమస్య తేజసః,
వ్రజభువి బహుమన్మహేతరాం సరసకరీషవిశేషరూషితమ్. 10

టీ. నిఖిలా...లాలితం=ఎల్లవేదాంతములచే నుపచరించఁబడినదియు, వ్రజభువి=వేపల్లెయందలి, సరస...రూషితమ్=పచ్చిపేఁడచిదురుపలచేఁ బూయఁబడిన, పరమస్య తేజసః=గొప్పతేజముయొక్క, పదకమలం=అడుగుఁదామరను, బహుమన్మహేతరాం=మిగులగౌరవించెదము.

మ. సిరి కేల్దమ్ముల నొత్తఁగా శ్రుతివధూసీమంతసింధూరసుం
దర మై యొప్పెసలార నందముగ మందన్ నందగోపాలుసుం
దిరశాలాంతకరీషరూషితరసోదీర్ణంబు లౌపాదము
ల్పరమానందముఁ జేయు నామదికి నుల్లాసంబు గల్పించుచున్. 10

తా. ఉపనిషత్తులచేఁ బొగడఁబడినదియు, గొల్లపల్లియలోని పిడుకలయందలి పేఁడచిదురుపలను బూసికొన్నదియునగు నొకపరమతేజమును స్తుతించెదము.

శ్లో. ఉదారమృదులస్మితవ్యతికరాభిరామాననం
ముదా ముహు రుదీర్ణయా మునిమనోమ్బుజామ్రేడితమ్,
మదాలసవిలోచనవ్రజవధూముఖాస్వాదితం
కదా ను కమలేక్షణం కమపి బాల మాలోకయే. 11

టీ. ఉదార...ననం = గంభీరమైన చిఱునవ్వుకలయికచే నందమగుమోముగల, వాఁడును, ముహుః = తేపకు, ఉదీర్ణయా, పుట్టిన, ముదా = ఆనందముతోఁ (గూడిన) మునిమనోమ్బుజామ్రేడితం = యోగిచిత్తములయం దిబ్బడియైనవాఁడును, మదాలస... దితమ్ = (యౌవన) మదఘూర్ణితనేత్రలగుగొల్లయిల్లాండ్ర మోములచేఁ దనివారఁ జూడఁబడినవాఁడును, కమలేక్షణమ్ = తామరలవంటికన్నులుగల, కమపి = అనిర్వాచ్యమహిమగల, బాలం = కుఱ్ఱని, కదా ను = ఎప్పుడు, ఆలోకయే = చూతునో!

ఉ. కన్నులకొద్దిఁ జూచి వ్రజకాంతలు వేడుక ముద్దు లాడఁగా
సన్నపునవ్వువెన్నెలలు నల్లఁగఁ జల్లగ నెల్లమౌనులున్
సన్నుతమానసాబ్జముల సారెకు సారె వహింప మించున
క్కన్నులపంట వైనముఖకంజము రంజిలుబాలుఁ గాంచెదన్. 11

తా. గంభీరముగాఁ జిన్నినవ్వులతో మోముగలవాఁడును, యోగిపుంగవులచే మహానందముతో ధ్యానింపఁబడినవాఁడును, మదవతులైన గొల్లపడుచులచేఁ బ్రేమింపఁబడువాఁడును, తామరలవంటి కన్నులుగలబాలరూపుఁడైన దేవుని నే నెప్పుడు చూడఁగలనో!

శ్లో. వ్రజజనమదఘూర్ణల్లోచనోచ్ఛిష్టశేషీ
కృతమతిచపలాభ్యాం లోచనాభ్యా ముభాభ్యామ్,
సకృదపి పరిపాతుం తే వయం పారయామః
కువలయదళనీలం కాంతిపూరం కదా ను. 12

టీ. వయం = మేము, వ్రజ...కృతం = మదించిన గొల్లపడతుల కన్నులచేఁ ద్రాగి వేయఁగా మిగిలిన, తే = నీయొక్క, కువలయదళనీలం = కలువఱేకువలె నల్లనైన, కాంతిపూరం = సొబగులమొత్తమును, అతిచపలాభ్యాం = మిగుల నాశచేఁ గొట్టుకొను చున్న, ఉభాభ్యాం = రెండగు, లోచనాభ్యాం = కన్నులచే, సకృదపి = ఒక్కమాఱైనను, పరిపాతుం = గ్రోలుటకొఱకు, కదా ను = ఎన్నఁటికి, పారయామః = అర్హతగలవారమగుదుమో!

మ. కొమరుం బ్రాయపుముబ్బుగుబ్బతిలఁ గోర్కుల్ జొబ్బిలన్ వల్లవ
ప్రమదల్ గన్నుల నాని యాని దిగుపాలున్ శేషమై పొల్చునా

రమణీయోత్పలకాంతిపూర మెదురై రా నొక్కసారైనఁ బ్రాం
కముగా నీకనుదోయి నానఁ గలభాగ్యం బెన్నఁడో కల్గెడున్. 12

తా. కృష్ణా, గొల్లపడుచులచేఁ దమ నేత్రములచేఁ ద్రాగిత్రాగి యెంగిలిచేసి విడువఁ బడినదైనను కలువలవలె నల్లనై మహాతృష్ణను గలిగించు నీసొబగు నొక్కతూరియైన రెండుకన్నులతోఁ దనివితీరఁ జూచుటకు మాకెప్పటికి యోగ్యత కలుగునో కదా!

శ్లో. ఘోషయోషిదనుగీతయౌవనం కోమలస్తనితవేణునిస్వనమ్,
సారభూత మభిరామసమ్పదాం ధామ తామరసలోచనం భజే. 13

టీ. ఘోష...వనం=గొల్లభామలచే స్తుతింపఁబడిన యౌవనముగలదియు, కోమల...స్వనం=మధురధ్వనిగల వేణుగానముగలదియు, అభిరామసంపదాం=సౌందర్యసంపదలకు, ధామ=చోటగు, తామరసలోచనం= తామరలవంటి కన్నులుగల, ధామ=తేజమును, భజే=సేవించెదను.

ఉ. వ్రేఁజవరాండ్రు జవ్వనపువిన్ననువుం గొనియాడఁగా ముఖాం
భోజమునందు లేయుఱుముఁబోనిరవంబున వేణు వొప్ప గా
రాజితకాంతిసంపదలరాశి యనఁగ వెలుఁగొందుశారదాం
భోజదళాక్షు దైవతవిభుం ద్రిజగత్పతి నాశ్రయించెదన్. 13

తా. గొల్లకాంతలచేఁ బాడఁబడిన యౌవనమహిమగలవాఁడును, మనోహరమైన పిల్లఁగ్రోవిపాటగలవాఁడును, సొబగులగనియు, తామరలవంటి కన్నులుగలవాఁడును నగు తేజోరూపుఁడగు శ్రీకృష్ణపరబ్రహ్మను సేవించెదను.

శ్లో. లీలయా లలితయావలమ్బితం మూలగేహమివ మూర్తిసమ్పదామ్,
నీలనీరదవికాసవిభ్రమం బాలమేవ వయ మాద్రియామహే. 14

టీ. లలితయా=సొంపైన, లీలయా=సొబగుచే, అవలమ్బితం=ధరింపఁబడినవాఁడును, మూర్తిసమ్పదాం=శరీరసౌందర్యములకు, మూలగేహమివ= నివాసస్థానమువలెనున్నవాఁడును, నీలనీరదవికాసవిభ్రమం=నీరుమబ్బులసొబగువంటిసొబగుగలవాఁడును నగు, బాలమేవ=బాలకృష్ణునే, వయం=మేము, ఆద్రియామహే=మెచ్చుకొందుము.

శా. బాలుఁ మోహనవేషలీలు మురళీపాండిత్యశీలుఁ దయా
లోలుఁ సాంద్రఘనాఘనావళివినీలుఁ గోపకన్యానుత
శ్రీలావణ్యవయోవిశాలు నవనీరేజాయతాక్షిప్రభా
జాలుఁ సర్వకళాలవాలు నతివాంఛం గొల్తు నానెమ్మదిన్. 14

తా. మనోహరసౌందర్యము గలవాఁడును ఎల్లసొబగులకు నిధివంటివాఁడును, నల్లని మేఘములకాంతివంటి కాంతిగలవాఁడును నగు గోపాలబాలునే మేము భక్తితో సేవించెదము.

శ్లో. వన్దేమురారే శ్చరణారవిన్దద్వన్ద్వం దయాదర్శితశైశవస్య,
వన్దారుబృన్దారకబృన్దమౌళిమన్దారమాలావినిమర్దభీరు. 15

టీ. దయా...వస్య=భక్తానుగ్రహార్థము బాలరూపము౯ దాల్చిన, మురారేః=శ్రీకృష్ణునియొక్క, వన్దారు...భీరు=మ్రొక్కుచున్న దేవసంఘముల కిరీటములయందు౯ జుట్టికొన్నకల్పవృక్షములపూవుదండలరాపిడికి జడియుచున్న, చరణారవిందద్వం ద్వం=అడుగు౯దామరల జంటనుగూర్చి, వందే=మ్రొక్కుచున్నాను.

మ. దితిజానీకము౯ ద్రుంప మానితతి వర్తింప౯ యశోదాదయో
దితకై శోరకళావిలాసు౯ డగునాదేవాదిదేవోత్తము౯
నతబృందారకబృందమౌళివిలసన్మందారమాలాతర౦
గితధారాళమరందబిందుమసృణాంఘ్రిద్వంద్వు సేవించెదన్. 15

తా. నమస్కరింప వచ్చినదేవతల శిరస్సులయందలి పూవుదండలరాపిడికి భయపడుచున్నదియు, (అన౯గా: దేవతలచే ననవరతము మ్రొక్క౯బడునదియనుట) భక్తపాలనమునకై గోపాలబాలరూపము౯ దాల్చిన శ్రీహరియొక్క యందమైనయాయడుగు౯దామరలను మ్రొక్కెదను.

శ్లో. యస్మిన్నృత్యతి యస్యశేఖరభరైః క్రౌఞ్చద్విష శ్చన్ద్రికీ
యస్మిన్దృప్యతి యస్య ఘోషసురభిం జిఘ్రన్వృషో ధూర్జటేః,
యస్మిన్సజ్జతి యస్య విభ్రమగతిం వాఞ్ఛన్హరే స్సిన్ధుర
స్తద్బృన్దావనకల్పకద్రుమవనం తం వా కిశోరం భజే. 16

టీ. యస్మి౯=ఏబృందావనమందు, యస్య=ఏకృష్ణునియొక్క, శేఖరభరైః=జొదలనున్న నెమ్మిపురులకట్టలచేత, క్రౌంచద్విషః=కుమారస్వామియొక్క, చన్ద్రికీ=నెమిలి, నృత్యతి=పొంగియాడునో, యస్మి౯=ఏయడవిలో, ధూర్జటేః=శివునియొక్క,వృషః=ఎద్దు; యస్య=ఏకృష్ణునియొక్క, ఘోషసురభిం=మందయందలియావు నృజిఘ్ర౯=మోహముచే మూర్కొనుచు, దృప్యతి=గర్వించునో, యస్మి౯=ఏయడవిలో,హరేః=ఇంద్రునియొక్క, సింధురః=ఏనుగు, యస్య=ఏకృష్ణునియొక్క,విభ్రమగతిం=ఒయారపునడకను, వాంఛ౯=కోరుచు, సజ్జతి=అట్లు నడవ౯బూనునో, తత్=ఆ,బృన్దా...వనం=బృందావనమనెడి కల్పవృక్షములతోపును, తం=ఆ, కిశోరం=బాలునిగాని, భజే=సేవించెదను.

శా. ఎందే నెవ్వనిమౌళి౯ గాంచి గుహవాజీంద్రంబు నర్తించు౯ దా
నెందే నెవ్వనిగోనరీతి హరిమత్తేభంబు౯ గాంక్షించు౯ దా

నెం డే నెవ్వనిమంద మూర్కొ-నుచు భూతేశాశ్వముం బొంగు నా
బృందారణ్యసుకద్రుసాంద్రవని నాకృష్ణుఁ బూదిం గొల్చెదన్. 16

తా. ఏబృందావనమున కృష్ణునితలలోని నెమిలిపురిని జూచి, కుమారవాహనమైన నెమలి యుత్సాహముతో కుంచె విప్పియాడునో, ఎచట శివుని యాఁబోతు మంద లోనియావుల మదముచే మూర్కొ-నునో, ఎచ్చోట నింద్రునిమైరావతము కృష్ణునినడ కనుజూచి తాను దానిసేరువఁబోవునో, ఆబృందావనమున శ్రీకృష్ణస్వామిని సేవించె దను. శ్రీహరిసేవార్థమై యింద్రాదులెల్లరు నిత్యసన్నిహితులై యుందురని భావము.

శ్లో. అరుణాధరామృతవిశేషితస్మితం
వరుణాలయానుగతవర్ణవైభవమ్,
తరుణారవిన్దదళదీర్ఘలోచనం
కరుణామయం కమపి బాలమాశ్రయే. 17

టీ. అరుణా...స్మితం=ఎఱ్ఱనై అమృతమువలె భోగ్యమైన అధరముచేత మిక్కి-లి సుందరముగాఁ జేయఁబడిన చిఱునవ్వు గలవాఁడును, వరుణ...వైభవమ్=సముద్రముతో పోల్పఁబడిన కాంతిసమృద్ధి గలవాఁడును, తరుణా...లోచనం= అప్పుడేపూచిన తామరరేకులవంటి విశాలములైన కన్నులు గలవాఁడును, కరుణామయం=దయాస్వరూపుఁడైన, కమపి=ఒకానొక (వాచామగోచరుఁడైన), బాలం=బాలకృష్ణుని, ఆశ్రయే=సేవించుచున్నాను.

ఉ. చల్లనివాని నవ్వు వెనఁజల్లెడువాని దయారసంబు జొ
బ్బిల్లెడువాని గెంపుజిగి పెంపు నెలంగెడుమోవివాని సం
ఫుల్లసరోజనేత్రములఁ బొల్చినవానిఁ బయోధివీచికా
వేల్లితనీలనీరదనవీనతనుద్యుతివానిఁ గాంచెదన్. 17

తా. మిక్కి-లియందమై మధురమైన యధరమునందు దొలఁకుటచేత మతింతగ ముద్దులుగులుకుచున్న చిఱునగవుగలవాఁడును, సముద్రమును బోలిన దేహకాంతి గల వాఁడును, లేఁదామర రేకులవంటి కన్నులుగలవాఁడును, దయాస్వరూపుఁడును నయిన బాలకృష్ణుని నాశ్రయించుచున్నాను.

శ్లో. లావణ్యవీచీరచితాఙ్గభూషాం భూషాపదారోపితపుణ్యబర్హామ్,
కారుణ్యధారాళకటాక్షమాలాం బాలాం భజే వల్లవవంశలక్ష్మీమ్.

టీ. లావణ్య...భూషాం=ముత్తెపుతేటవంటి కాంతియొక్క- అలలచేత చేయఁబడినఅవయవములయొక్క- అలంకారముగలదియు, భూషా...బర్హాం=అలంకార స్థానమునం దుంచఁబడినపవిత్రమైననెమలిపింఛముగలదియు, కారుణ్య...మాలాం=కరుణారసముచేత ఎల్లప్పుడు నిండియుండు కడగంటిచూపులయొక్క- మాలిక (వరుస) గలది

యున్, బాలాం=లేతప్రాయముగల, వల్లవవంశలక్ష్మీం=గొల్లవారికొలముయొక్కలక్ష్మిని, (సంపదనుగలిగించు బాలకృష్ణుని) భజే=ఆశ్రయించెదను.

చ. మెఱుఁగుల కేమి చక్కఁదనమే వదిలంచులు సేయు మాయురే
సురుచిరపింఛదామకమె సొమ్ములలో వెల లేనిసొమ్మగుం
బరమకృపాకటాక్షసుమమాలిక బావురె నందమందిరేం
దిరముదిపెంపుశైశవము సీటులు మీఱె నయారె కంటిరే. 18

తా. ముత్తెపుతేటవలె తళతళలాడు కాంతివిశేషముచేత దేహమున శలంకారమును గలిగించుచున్నదియు, భూషణములు ధరించు స్థానములయందు నెమలిపింఛము నుంచుకొనినదియు కరుణారసము నొలుకుచున్న కడకంటిచూపులుగలదియు నగు బాలకృష్ణుఁ డనెడు గొల్లవారిసంపదను ఆశ్రయించుచున్నాను.

శ్లో. మధురైకరసం వపుర్విభో, ర్మథురావీథిచరం భజామహే,
నగరీమృగశాబలోచనా, నయనేన్దీవరవర్ష వర్షితమ్. 19

టీ. మధురైకరసం=సౌందర్యముయొక్క ముఖ్యమైన సారమైనదియు, మధురా...చరం=మధురాపట్టణపు వీధులయందు సంచరించునదియు, నగరీ...తర్షితం=మధురాపట్టణమునందలి లేడిపిల్లలకన్నులవంటికన్నులుగల స్త్రీలయొక్క కన్నులనెడు నల్లగలువలవర్షముచేత సంతసించినదియు నగు, విభోః = శ్రీకృష్ణునియొక్క, వపుః= దేహమును, భజామహే=సేవించుచున్నాము.

మ. అమరన్ సాహిణులెల్ల నుల్లసిలఁగా నారట్టకంభాణముం
దుమికించం దిశలందుఁ గ్రేళ్లుఱుకుమాధుర్యైకకాంతుల్ ఘన
భ్రమ సేయన్ మధురావధూచపలనేత్రవ్రాతనీలాబ్జవ
ర్షము పైఁ గ్రమ్మఁగఁ జిత్రమై చెలఁగు కృష్ణస్వామి నీక్షించెదన్. 19

అత్యంతమైన సౌందర్యమే ముఖ్యముగాఁ గలిగి మధురాపట్టణమందు సంచరించుచు అచ్చటి స్త్రీలచూపులచేత సంతసించు శ్రీకృష్ణునిదివ్యమంగళవిగ్రహమును సేవించుచున్నాము.

శ్లో. పర్యాకులేన నయనాన్తవిజృమ్భితేన
వక్త్రేణ కోమలదరస్మితవిభ్రమేణ,
మన్ద్రేణ మఞ్జులతరేణ చ జల్పితేన
నన్దస్య హన్త తనయో హృదయం ధునోతి. 20

టీ. పర్యాకులేన=చంచలమైన, నయనాంతవిజృంభితేన = కడకన్నులయొక్క నిక్కుటచేతను, కోమల...విభ్రమేణ=కోమలమైన చిఱునగవుయొక్క విలాసముగల,

వక్త్రేణ=ముఖముచేతను, మంద్రేణ=గంభీరమై, మంజులతరేణ = మిక్కిలిమనోహరమైన, జల్పితేనచ=పలుకుచేతను, నందస్య = నందునియొక్క, తనయే=కుమారుఁడైన కృష్ణునియందు, హృదయం=మనస్సు, ధునోతి=ప్రీతిగలిగియున్నది.

మ. బెళుకుంగన్నులు మోముచుట్టుఁ దిరుగన్ బింబాధరోష్ఠంబుపైఁ
దళుకున్వెన్నెల లీనులేనగవు వింతల్ మాధురిం జెందఁ గం
దళితాలాపసుధారుచుల్ చెవికి నానందంబుగా నందమం
దల నానందముఁ జిందు బాలుని యశోదానందనుం గాంచెదన్. 20

తా. చంచలములైన కడకంటిచూపులును మిక్కిలియందమగు చిఱునగవును ముద్దులొలుకు (భావగంభీరముగల) పలుకులును గల శ్రీకృష్ణునియందు నామనస్సు ప్రేమకలిగియున్నది.

శ్లో. కన్దర్పకణ్డూలకటాక్షబన్దీ రిన్దీవరాక్షీ రభిలాషమాణాన్,
మన్దస్మితాధారముఖారవిన్దా న్వన్దామహే వల్లవధూర్తపాదాన్. 21

టీ. కందర్ప...బందీః=కామముచేత తాళఁజాలని మక్కువను దెల్పునట్టి కడకంటిచూపులకు లోఁబడిన, ఇందీవరాక్షీః = నల్లగలువలవంటి కన్నులుగల స్త్రీలను, అభిలాషమాణాన్=కోరుచున్నవారును, మన్ద...విన్దాన్=చిఱునగవునకునికిపట్టైన మోముదామరగలవారునునగు, వల్లవ...పాదాన్ = గొల్లవిటకాఁడుగారిని, వందామహే=నమస్కరించుచున్నాము.

మ. సరసాపాంగతరంగరంగితవిలాసప్రౌఢిచే నగ్గమై
మరుబారిన్ వలిగుబ్బ లుబ్బి పులకింపం గ్రొమ్ముడుల్ వీడఁ ద
త్తరపున్మేల్ సిచ మెత్తి మత్తిలినకాంతాపాళి లాలించు బి
త్తరపున్నవ్వు మొగంబునుం గలుగు ధూర్తస్వామిఁ గీర్తించెదన్. 21

తా. సుందరములయిన కడకంటిచూపులకు లోఁబడిన స్త్రీలఁ గోరుచున్నవాఁడై చిఱునవ్వు దొలఁకునట్టి ముద్దుమొగముగల గోపాలకృష్ణునికి వందనము చేయుచున్నాము.

శ్లో. లీలాటోపకటాక్షనిర్భరపరిష్వఙ్గప్రసఙ్గాధిక
ప్రీతే గీతివిభఙ్గసఙ్గరలసద్వేణుప్రణాదామృతే,
రాధాలోచనలాలితస్య లలితస్మేరే మురారే ర్ముదా
మాధుర్యైకరసే ముఖేన్దుకమలే మగ్నం మదీయం మనః. 22

టీ. రాధా...లాలితస్య=రాధయొక్క కన్నులచేత బుజ్జగింపఁబడినవాఁడైన, మురారేః=కృష్ణునియొక్క, లీలా...ప్రీతే=విలాసములయొక్క అతిశయముచేతను గాఢమైన కౌఁగిలింతయందు మిక్కిలిప్రీతిగలదియు, గీతి...దామృతే = గానముల

యొక్క రచనాభేదముల యొరయికచేతఁ బ్రకాశించుచున్న పిల్లనగ్రోవియొక్క ధ్వని యనెడు అమృతముగలదియు, లలితస్మేరే=అందమైన చిఱునవ్వుగలదియు, మాధుర్యశ్రీకరసే=సౌందర్యమనెడు ముఖ్యమైన రసముగలదియునగు, ముఖేందుకమలే=చంద్రునివలెను తామరవలెను నున్న మోమునందు, మదీయం=నాదియగు, మనః=మనస్సు, ముదా=సంతోషముతో, మగ్నమ్=మునిఁగినది.

మ. లలితాలోకతరంగసంగతము లీలామందహాసప్రభా
పులినంబుఁ మురలీరవామృతరసంబుఁ రాధికాలోచనో
త్పలసంభావితమాధురీగుణము నై భాసిల్లు శ్రీకృష్ణుని
ర్మలవక్త్రాంబురుహాకరంబున రమింపం గోరెదఁ నామదిన్. 22

తా. రాధాదేవి శ్రీకృష్ణుని విలాసములోఁ జూచుచుండఁగా నతనిముఖ మాదేవియొక్క కౌఁగిలింతయందు మిక్కిలి ప్రీతిని దెల్పుచున్నదై, నానావిధములైన గాన విశేషములయొక్క మార్పుచేత నమృతమువంటి వేణునాదముగలదై, ముద్దులుగుల్కు చిఱునవ్వుగలిగి, అత్యంతసౌందర్యముగలిగి కాంతిచేఁ జంద్రుని దామరగను బోలియున్న మోమునందె నామనస్సు నిలిచియున్నది.

శ్లో. శరణాగతవజ్రపంజరే, శరణే శార్ఙ్గధరస్య వైభవే,
కృపయా ధృతగోపవిగ్రహే, కిము దన్య న్మృగయామహే వయమ్.

టీ. శరణా...జ్రే=శరణుచొచ్చినవారికి వజ్రములతోఁ జేయఁబడిన పంజరమైనదియు, కృపయా=దయచేత, ధృత...విగ్రహే=ధరింపఁబడిన గొల్లవాని దేహముగలదియును అగు, శార్ఙ్గధరస్య=విష్ణువుయొక్క, వైభవే=పెంపు, శరణే=రక్షకమగుచుండఁగా, అన్యత్=ఇతరమైన, కిమత్=దేనిని, వయం=మేము, మృగయామహే=వెదకుదుము ?

ఉ. ఇవ్వల నవ్వలఁ వెదక నేటికి నన్యుల మాటిమాటికి
న్దవ్వుల నుండియైనఁ గరుణావరుణాలయగోపమూర్తియై
నవ్వుచు డాయ వచ్చి యుదరఁ శరణాగతవజ్రపంజరుం
డవ్వనజాతనేత్రుఁ డనయంబు నయంబు నెలంగఁ బ్రోవఁగన్. 23

తా. శరణుసొచ్చినవారికి అత్యంతరక్షకుఁడై శరణాగతులయందలి దయచేత గొల్లవాఁడుగనుండిన శ్రీకృష్ణుఁడు రక్షకుండనఁగా మఱియితరులగు రక్షకులను వెదుక నక్కఱలేదు.

శ్లో. జగత్త్రయైకాన్తమనోజ్ఞభూమి చేత స్యజస్రం మమ సన్నిధత్తామ్,
రమాసమాస్వాదితసౌకుమార్యం రాధాస్తనాభోగరసజ్ఞమాంఘ్రిః. 24

టీ. జగత్...భూమి=ముల్లోకములకును అచ్చపు చక్కఁదనమునకును ఉనికిపట్టైనదియు, రమా...మార్యం = లక్ష్మీదేవిచేత అనుభవింపఁబడిన సుకుమారత్వము గలదియు, రాధా...జ్ఞమ్=రాధాదేవియొక్క కుచములవిరివియొక్క రసము నెఱిఁగినదియు అగు, తేజః=శ్రీకృష్ణుఁడను తేజము, మమ=నాయొక్క, చేతసి=మనస్సునందు, అజస్రమ్=ఎల్లప్పుడు, సన్నిధత్తామ్=నిలుచుఁగాత.

ఉ. నామది నామతింతు భువనత్రయమోహనరూపధేయ రా
ధామదిరేక్షణాపరిణత స్తనభారవిధేయు భోజక
న్యామహనీయవిభ్రమరసాస్పదవిగ్రహ సౌకుమార్యలీ
లామధురాధర స్మితకలాపుఁ గళాగురువర్యు నెప్పుడున్. 24

తా. మూఁడులోకములకును ఆధారమైనవాఁడును అచ్చపుచక్కఁదనమునకు స్థానమైనవాఁడును, లక్ష్మీరూపిణియగు రుక్మిణీదేవిచేతఁ జక్కఁగ ననుభవింపఁబడినవాఁడును రాధాదేవి స్తనములయొక్క సౌందర్యము నెఱింగినవాఁడు నైన శ్రీకృష్ణునియందు నామనస్సు నిల్చుఁగాత.

శ్లో. వయ మేతే విశ్వసిమః, కరుణాకరమూర్తి కింవద న్త్వఙ్గే,
అపిచ విభో తవ లలితే, చపలతరా మతి రియం బాల్యే. 25

టీ. విభో=స్వామీ, కరుణా...త్వఙ్గే=దయకు జన్మస్థానమైన ఆకారముగలవాఁడు అనులోకప్రవాదరూపమైనశరీరమందు, ఏతేవయమ్=ఈమేము, విశ్వసిమః=నమ్ముచున్నాము. అపిచ=మఱియు, తవ=నీయొక్క, లలితే=సొగసైన, బాల్యే=బాల్యమందు, ఇయమ్మతిః=ఈబుద్ధి, చపలతరా=మిక్కిలి మక్కువగలిగియున్నది.

చ. అనిశము లోక మెల్లఁ గరుణాకరమూర్తి వటంచుఁ జెల్పఁగా
జననపరంపరల్ గడచి సౌఖ్యము నొందుదు నంచుఁ గృష్ణ నా
మనమున నమ్మినాఁడ నను మాత్రము కాదు భవత్కిశోరతా
జనితకథాసుధారసము సారెకుఁ గ్రోలఁగఁ దత్తరించెదన్. 25

తా. కృష్ణా! నీవు పెద్దవాఁడవై ఎందఱినో రక్షించి కీర్తిని బొందినను, అట్టి నీ పెద్దతికమునకన్నను మిక్కిలి ముద్దులుగుల్కు నీబాల్యమునందే నామనస్సు మిక్కిలి మక్కువ గలిగి యున్నది.

శ్లో. వత్సపాలచరః కోఽపి వత్స శ్శ్రీవత్సలాఞ్ఛనః,
ఉత్సవాయ కదా భావీ త్యుత్సుకే మమ లోచనే. 26

టీ. వత్సపాలచరః=దూడలను గాచు గొల్లపిల్లవాండ్రలోఁ దిరుగుచున్నవాఁడు, శ్రీవత్సలాంఛనః=శ్రీవత్సమను పుట్టుమచ్చ ఱొమ్మునందుఁగలవాఁడును అగు, కోఽపి వత్సః=ఇట్టివాఁడని చెప్పనలవిగాని యొకచిన్నవాఁడు, ఉత్సవాయ=వేడుకకొఱకు,

కదా=ఎప్పుడు, భావిలీ=అగునో యని, మమ=నాయొక్క, లోచనే = కన్నులు, ఉత్సుకే=ఉద్యుక్తములై యున్నవి.

శా. శ్రీవత్సాంకితవక్షుఁ డుల్లసిత నీరేజాక్షుఁ డంభోధిక
న్యావక్షోరుహకుంభికుంభయుగళాధ్యక్షుండు బ్రహ్మాదిసా
ఖ్యావిర్భావవిధానదక్షుఁ డగువాఁ డానందపుత్రాకృతిన్
గోవత్సంబుల మేపఁ గన్గొనుచుఁ జక్షుఃప్రీతి వాటించెదన్. 26

తా. దూడలఁగాచు గొల్లవాండ్రనడుమఁ దిరుగుచు శ్రీవత్సలాంఛనముగల చిన్నికృష్ణుఁడు కన్నులపండువుగా నాకెప్పు డగపడునోయని యువ్విళ్ళూరుచున్నాను.

శ్లో. మధురిమభరితే మనోభిరామే
మృదులతరస్మితముద్రితాననేన్దౌ
త్రిభువననయనైకలోభనీయే
మహసి వయం వ్రజభాజి లాలసాః స్మః. 27

టీ. మధురిమభరితే=సౌందర్యముచేత నిండినదియు, మనోభిరామే=మనస్సున కింపైనదియు, మృదుల...నేన్దౌ=మిక్కిలి సుకుమారమై చిఱునవ్వుచేత గుఱుతిడఁబడిన చంద్రునివంటి మోముగలదియు, త్రిభువన...భనీయే=మూఁడులోకములయందుండు వారియొక్క నేత్రములకు ముఖ్యముగాఁ గోరఁదగిన, వ్రజభాజి=వ్రేపల్లెను బొంది నది అగు, మహసి=శ్రీకృష్ణుఁడను తేజమునందు, వయం=మేము, లాలసాః=ఆసక్తి గలవారము, స్మః=అగుచున్నాము.

మ. రమణీయస్మితమాధురీకలితముద్రాముద్రితంబై సుధా
సమసల్లాపకలాపమై త్రిజగతీసంమోహనాకారమై
కమలానేత్రమనోభిరామరుచియై కన్పట్టువక్త్రేందుబిం
బమునన్ మీఱి వెలుంగు గొప్పగృహసౌభాగ్యంబు నేఁ గోరెదన్.

తా. మిక్కిలి చక్కఁదనముగలిగి మనస్సున కింపై లేఁతనవ్వు నెలకొన్నచందురునిబోలిన మోముగలిగి ముల్లోకములవారికిని మిక్కిలి యాసతోఁ జూడఁదగిన గొల్ల పల్లెలందుఁ దిరుగునట్టి తేజస్స్వరూపుఁడైన శ్రీకృష్ణునియందు మేము ఆసక్తిగలిగి యున్నారము.

శ్లో. ముఖారవిన్దే మకరన్దబిన్దు, నిష్యన్దలీలామురలీనినాదే,
వ్రజాఙ్గనాపాఙ్గితరఙ్గభృఙ్గి, సఙ్గ్రామభూమౌ తవ లాలసాస్మః. 28

టీ. మకరంద...నినాదే = పూఁదేనెయొక్క బొట్లయొక్క స్రవించుటగల విలాసార్థమైన పిల్లఁగ్రోవియొక్క నాదముగలదియు, వ్రజ...భూమౌ=వ్రేపల్లెయందలి స్త్రీలయొక్క కడకంటిచూపులయొక్క అలలు అనెడు తుమ్మెదలయొక్క, యుద్ధము

నకు స్థానమైనదియు అగు, తవ=నీయొక్క, ముఖారవిందే = మోముదామరయందు, లాలసాః=ఆసక్తిగలవారము, స్మః=అగుచున్నాము

మ. మురళీగానమరందబిందుకృతసమ్మోదభ్రమద్వల్లవీ
నరసాపాంగతరంగభృంగపటలీసంగ్రామరంగస్థలీ
సరణిం జెల్వగునీముఖాంబుజమునం జించన్మనః పంకజా
కరమధ్యంబునఁ బాదుకొల్పుటకు నాకాంక్షింతు నెల్లప్పుడున్. 28

తా. కృష్ణా! మకరందబిందువులవలె మధురమైన వేణునాదములు చేయుచు గోపికాస్త్రీలయొక్క చూపులు పై వ్యాపించుచున్న నీముఖకమలము సేవించుటకు మిక్కిలి ఆసక్తిగలిగి యున్నారము.

శ్లో. ఆతామ్రాయతలోచనాంశులహరీలీలాసుధాప్యాయితైః
గీతామ్రేడితదివ్యకేళిభరితైః స్ఫీతం వ్రజస్త్రీజనైః,
స్వేదామ్భఃకణభూషితేన కిమపి స్మేరేణ వక్త్రేన్దునా
పాదామ్భోజమృదుప్రచారసుభగం పశ్యామి దృశ్యం మహః. 29

టీ. ఆతామ్ర...యితైః=తొంచెము ఎఱ్ఱనివియు నిడుదలైనవియు అగు కన్నుల కిరణముల ప్రవాహముయొక్క విలాసమనెడి అమృతముచేత సుఖించినవియు, గీతా... కితైః=గానములచేత రెండింతలుగాఁ జేయఁబడిన సుందరములైన విలాసములచేత నిండినవియు అయిన, వ్రజస్త్రీజనైః=గోపికల సమూహములచేత, స్ఫీతమ్ = వృద్ధిపొందినదియు, పాదా...సుభగమ్=అడుగుదామరల సుకుమారమైన నడకచేత అందమైనదియు, స్వేదామ్భః కణభూషితేన=చెమటనీటియొక్క బొట్లచేత అలంకరింపఁబడినదై, స్మేరేణ=చిఱునవ్వుగల, వక్త్రేందునా=చంద్రునివంటి ముఖముతోఁగూడినదియు, దృశ్యం=చూడఁదగినదియు, కిమపి = ఇట్టిది అని చెప్పుటకు సాధ్యముకానిదియు అగు, మహః=శ్రీకృష్ణుఁడను తేజమును, పశ్యామి=చూచుచున్నాను.

మ. మురిపెంపుంజిఱునవ్వుఁ గ్రొంజెమటసొంపుల్ నింపునెమ్మోముపై
నరసాలోకసుధాతరంగములు మించన్ వేణుగానధ్వనుల్
ల్దఱచై రంజిలఁ జొక్కి గోపికలు గొల్వన్ నృత్యలీలాయత
స్ఫురణన్ మెల్లన సంచరించుహరి నంభోజాక్షు నీక్షించెదన్. 29

* ఈశ్లోకార్థంబు శ్రీగోపాలకృష్ణమంత్రరాజధ్యానం బని గోపాలకల్పంబునందుఁ జెప్పఁబడియున్నది.

శ్లో. గోపీనాంపాదపద్మాని, గృహీత్వా సహనృత్యతః,
ధ్యాయేల్లక్షం జపంచైవ కన్యకా ముద్వహేచ్ఛుభామ్.

తా. కొనలయందు ఎఱ్ఱనై విస్తారములయిన నేత్రములకాంతుల పరంపరలను అమృతప్రవాహమువలె వెల్లిఁగొల్పుచు పాటలచేత రెట్టింపఁబడిన యాటలుగల గోపికలతో కడుసంతసించుచు, చిఱుచెమటబిందువులచే నొప్పుచు చిఱునగవుగల మోముతో సుకుమారముగా నడుగులువేయుచు అడుమందు శ్రీకృష్ణునిఁ జూచెదను.

*శ్లో. పాణౌ వేణుః ప్రకృతిసుకుమారాకృతౌ బాల్యలక్ష్మీః
పార్శ్వే బాలాః ప్రణయసరసాలోకితాపాంగలీలాః,
మౌళౌ బర్హం మధురవదనాంభోరుహే మౌగ్ధ్యముద్రే
త్యార్ద్రాకారం కిమపి కితవం జ్యోతి రన్వేషయామః. 30

టీ. పాణౌ=హస్తమందు, వేణుః=పిల్లఁగ్రోవియు, ప్రకృ...కృతౌ=స్వభావముచేత కోమలమైన ఆకారమునందు, బాల్యలక్ష్మీః = బాల్యముయొక్క సంపదయును, పార్శ్వే=ప్రక్కను, ప్రణయ...లీలాః=ప్రేమచేత రసముతోఁగూడిన చూపులుగలకడకన్నులయొక్క విలాసముగలవారైన, బాలాః=బాలురును, మౌళౌ = శిగయందు, బర్హం=నెమిలిపింఛమును, మధురవదనాంభోరుహే=మిక్కిలి యందమగు మోముఁదామరయందు, మౌగ్ధ్యముద్రా=బేలతనపుగుఱుతును, ఇతి=ఇట్లు, ఆర్ద్రాకారం=మనోహరమైన ఆకారముగల, కితవం=కృత్రిమమైన, కిమపి=వచింపనలవిగాని, జ్యోతిః=తేజమును, (శ్రీకృష్ణుని) అన్వేషయామః=వెదకుచున్నాము.

మ. సరసాపాంగవినోదవాక్యములు మించన్ బాలకుల్ గొల్వఁగా
మురళిం గేల నమర్చి పింఛమకుటంబున్ మోముచెల్వంబు సుం
దరవేషంబును బాల్యకాయమును దయార్ద్రస్వాంతముం గల్గుబి
త్తరపుంధూర్తశిఖామణిన్ వెదకి హృత్పద్మంబునన్ నిల్పెదన్. 30

తా. చేత వేణువును ధరించి స్వభావముగా సుకుమారమైన యాకారమునందు బాల్యవేషము సొంపు గుల్కఁగా పార్శ్వములయందు ప్రేమను జెల్వు సరసములైన కడకంటి చూపులుగల గోపబాలకులుండఁగా శిగను పింఛమును దాల్చి మోమునందుఁ బసితనపు బేలతన మింపులు గుల్కఁగా, అందమైన ఆకారము గలిగి కృత్రిమమైన బాలగోపాలవేషమును దాల్చిన శ్రీకృష్ణుని వెదకుచున్నారము.

---

* ఈశ్లోకార్థంబు శ్రీగోపాలకృష్ణైకాదశాక్షరీమంత్రధ్యానంబని సనత్కుమారసంహితయందుఁ జెప్పఁబడియున్నది.

శ్లో. వారస్తం సవనీతాది చార్యేణ వ్రజయోషితాం
గోపీబాలైర్యుతంకృష్ణంధ్యాయేన్మంత్రమిమంజపేత్.

శ్లో. ఆరూఢవేణుతరుణాధరవిభ్రమేణ
మాధుర్యశాలివదనాంబుజముద్వహన్తీ,
ఆలోక్యతాం కిమనయా వనదేవతా వః
కైశోరకే వయసి కాపి చ కాన్తియష్టిః. 31

టీ. వనదేవతాః=ఓవనదేవతలారా, వః=మీకు, అనయా=ఈవ్యర్థమైన పనిచేత, కిం=ఏమిప్రయోజనము ? కైశోరకే=బాల్యమైన, వయసి=వయస్సునందు, ఆరూఢ... విభ్రమేణ=ఉంచఁబడిన పిల్లనగ్రోవి గలదియు, కోమలమైనదియు నగుపెదవి యొక్క విలాసముచేత, మాధుర్యశాలి=సౌందర్యముచేత ఒప్పుచున్న, వదనాంబుజం=మోము దామరను ఉద్వహన్తీ=వహించుచున్నదై, కాపి=చెప్పనలవి కానిదైన, కాంతియష్టిః=కఱ్ఱవలె నిలుకడగాఁగుదిరియున్న కాంతి (శ్రీకృష్ణమూర్తి), ఆలోక్యతాం=చూడఁబడుఁగాత.

ఉ. దాఁపక వంశి నింపొదవ దా నధరంబున మోపి నాదనం
ప్రాపితమందహాసమధురాననుఁడై మహనీయ తేజుఁడై
క్రేపుల మేప మీపొదల కేగినవాఁ డనిల్చినాఁడు మీ
గోపితి రేని పట్టుఁ డిఁక నోవనదేవతలార తెల్పితిన్. 31

తా. వనదేవతలారా, మీరు ఇతరములయిన కార్యములు మాని సుకుమారమై ముద్దులుగుల్కెడు కెంజెదవిమీఁద వేణువు నిడుకొని విలాసముచేత కడుసుందరమైన మోముదామరగలిగి బాల్యప్రాయముగలిగి నిలుకడగల కాంతియో యనునట్లున్న చిన్నికృష్ణుని సేవింపుఁడు. ఇదియే ప్రయోజనకారి.

శ్లో. అనన్యసాధారణకాన్తికాన్త మాక్రాన్తగోపీనయనారవిన్దమ్,
పుంసః పురాణస్య నవం విలాసం పుణ్యేన పూర్ణేన విలోకయిష్యే. 32

టీ. అనన్య...కాంతం=ఇతరులకు సాధారణముగాని కాంతిచేత మనోహరమైనదియు, ఆక్రాన్త...విందం=ఆక్రమింపఁబడిన గోపికలయొక్క కనుదామరలు గలదియు అగు, పురాణస్య పుంసః = పురాణపురుషుఁడగు నారాయణునియొక్క, నవం విలాసం=క్రొత్తవిలాసమును, పూర్ణేన = నిండిన, పుణ్యేన = పుణ్యముచేత, విలోకయిష్యే=చూచెదను.

చ. ఇతరుల కందరానిజగదేకమనోహరకాంతియుక్తి నమూ
గతనవయౌవనాకరవికాసము లన్నియు గోపబాలికా
యుతనయనారవిందముల కగ్గము సేయుపురాణపూరుషుఁ
మతిఁ దలపోసి చూచెద సమగ్రసనాతనపుణ్యసంగతిన్. 32

తా. ఇతరులకు ఎవ్వరికిని లేని దివ్యకాంతిచేత సుందరమైె గోపికల కన్నుదామరలచే మిక్కిలి యాసతోఁ జూడఁబడునట్టి శ్రీకృష్ణుని విలాసమును పూర్వమునందు పుణ్యము చేసియుంటినేని సేవింపఁగలను.

శ్లో. సాష్టాఙ్గపాత మభివన్ద్య సమస్తభావైః
సర్వాన్ సురేన్ద్రనికరా నిద మేవ యాచే,
మన్దస్మితార్ద్రమధురాననచన్ద్రబిమ్బే
నన్దస్య పుణ్యనిచయే మమ భక్తి రస్తు. 33

టీ. సాష్టాంగపాతం =(హస్తములు పాదములు భుజములు ఉరము లలాటము) అను అష్టాంగములు క్రింద పడునట్లుగా, సర్వాన్ = సకలములైన, సురేంద్రనికరాన్ = దేవతాశ్రేష్ఠులసమూహములను, అభివంద్య = నమస్కరించి, సమస్తభావైః = సర్వవిధములచేత, ఇద మేవ = ఇదియే, యాచే = యాచించుచున్నాను. (ఏదియనఁగా) మంద...బింబే = చిఱునవ్వుచేత సరసమై సుందరమై చంద్రబింబమును బోలిన మోము గల, నందస్య = నందగోపకునియొక్క, పుణ్యనిచయే = పుణ్యరాశియందు (అనఁగా: అందుండుచేసిన పుణ్యమునకు ఫలముగా నవతరించిన శ్రీకృష్ణునియందు), మమ = నాకు, భక్తిః = భక్తి, అస్తు = కలుగుఁగాక.

మ. అమరన్ సర్వసుపర్వముఖ్యతతికిన్ సాష్టాంగదండప్రణా
మము గావించుచు సర్వభావముల నాత్మన్ వేఁడెదన్ మందహా
సముఖాంభోజవిలాసవైభవనివాసంబై ననందార్జితో
త్తమపుణ్యావలియంద భక్తి నెలు వందన్ మాకు నెల్లప్పుడున్. 33

తా. నేను దేవతలనందఱిని గొల్చి యాచించున దేమనఁగా: చిఱునవ్వుచే ముద్దులుగుల్కెడు నందమగు మోముచంద్రుఁడు గల నందునిపుణ్యఫలముగా నవతరించిన శ్రీకృష్ణునియందు నాకు భక్తి గలుగుఁగాక.

శ్లో. ఏషు ప్రవాహేషు న ఏవ మన్యే క్షణోఽపి గణ్యః పురుషాయుషేషు,
ఆస్వాద్యతే యత్ర కయాపి భక్త్యా నీలస్య బాలస్య నిజం చరిత్రమ్. 34

టీ. ఏషు ప్రవాహేషు = ఈ ఎడతెగక జరుగుచున్నట్టి, పురుషాయుషేషు = పురుషుని జీవితకాలములలో, యత్ర = ఏక్షణమందు, కయాపి = అనన్యవిషయమై (యిట్టిదియని నుడువ నశక్యమైన); భక్త్యా = భక్తిచేత, నీలస్య = నీలవర్ణుఁడైన, బాలస్య = బాలకృష్ణునియొక్క, నిజం = స్వకీయమైన, చరిత్రం = వృత్తాంతము, ఆస్వాద్యతే = సుఖముగా అనుభవింపఁబడుచున్నదో, స ఏవ క్షణః = అక్షణమె, గణ్యః = లెక్కింపఁదగినది. (సార్థకమైనది.)

ఉ. ఏమిటి కంబుజాక్షు మది నెంచనియాయువు లెక్కపెట్టఁగాఁ
బామరవృత్తి నైన మఱి భక్తివిధంబున నైన బాలలీ
లామహనీయుఁ డౌహరిఁ దలంచునిమేషము లుర్వ ముహూర్తముల్
జాములు లెక్క కెక్కునటు సల్పనికాలము లెల్ల వ్యర్థముల్. 34

తా. పురుషుని జీవితకాలములు జన్మపరంపరలచేత నెడతెగక జరుగుచున్నవి గాని అవియన్నియు సార్థకములుగావు. భక్తితో శ్రీకృష్ణునిచరిత్రము ఏక్షణమందు సుఖముగా వినఁబడునో ఆక్షణమె సార్థకమైనది.

శ్లో. నిసర్గసరసాధరం నిజదయార్ద్రదివ్యేక్షణం
మనోజ్ఞముఖపఙ్కజం మధురసార్ద్రమన్దస్మితమ్,
రసజ్ఞహృదయాస్పదం రమితవల్లవీలోచనం
పునఃపున రుపాస్మహే భువనలోభనీయం మహః. 35

టీ. నిసర్గసరసాధరం = స్వభావముతో రసవంతమైన పెదవిగలదియు, నిజ... క్షణం=తనదియగు దయారసముచేత తడిసినమహనీయములగు కన్నులుగలదియు, మనో...ఙ్కజం=సుందరమైనదియు తామరను బోలినదియు అగు ముఖము గలదియు, మధు...స్మితం=తేనెచేతఁ దడిసిన (తేనెవలె భోగ్యమైన) చిఱునవ్వుగలదియు, రస...స్పదం=రసికులైనవారిహృదయమువలె స్థానముగాఁ గలదియు, రమిత...లోచనం = రమించునట్లుగా చేయఁబడిన గోపికలనేత్రములు గలదియు, భువనలోభనీయం = లోకములకు పేరాసపడఁదగినదియు, అగు, మహః = శ్రీకృష్ణుఁడను తేజస్సును, పునః=పలుమాఱు, ఉపాస్మహే=ఉపాసించుచున్నాము.

ఉ. కమ్మని తేనెవానజడి గ్రమ్మెడుమోవి సుధారసంబులం
జిమ్మెడు తేటనవ్వు దయ చిప్పిలుచూపులు మోముఁదమ్మి చె
ల్వమ్మును గోపికల్ గని హాళాహాళిఁ జెంద రసజ్ఞు లెల్ల లో
కమ్ములఁ గాంచి సొక్కనవకం బగు తేజముఁ గొల్చెదన్ మదిన్. 35

తా. స్వభావముచేత సరసమైన యధరముగలిగి దయారసము కన్నులయందుఁ జూపుచుఁ సొంపుదక్కెడు మోముగలిగి, ముద్దులుగుల్కెడు నందమగు చిఱునవ్వుగలిగి, రసికులగువారియుల్లంబుల నెలకొనుచు, గోపికలనేత్రములకు పరవశమై లోకము లోనివారికందఱికిని పేరాసపడఁదగిన శ్రీకృష్ణుఁడను తేజమును సారెసారెకును గొలుచుచున్నారము.

శ్లో. న కో౽పి బాల స్సరసీరుహాక్ష స్సా న చ వ్రజస్త్రీజనపాదధూళిః,
ముహు స్తదేతద్యుగళం మదీయే మోహమహ్యామానే౽పి మనస్యు దేతు.

టీ. సః=ప్రసిద్ధుఁడై, కోఽపి=అనిర్వాచ్యుఁడైన, సరసీరుహాక్షః = తామరల వంటి కన్నులుగలవాఁడు అగు, బాలః=బాలకృష్ణుఁడును, సా=ప్రసిద్ధమైన, వ్రజస్త్రీ జనపాదధూళి ళ్చ=గోపికాసమూహముయొక్క అడుగులయందలి దుమ్మును, ఏతత్ యుగళం=ఈరెండును, మోహమభ్యుమానేఽపి = మోహమును పొందుచున్నదైనను, మదీయే=నాదియగు, మనసి=మనస్సునందు, ముహుః=మాటిమాటికి, ఉదేతు=పుట్టును గాక.

చ. అలఘువిమోహభారమున నల్కుచుఁ గుయ్యిడుననున్నఁ బ్రోవఁగా
లలితవిశాలలోచనములం బరికించుచు వాయువేగుఁడై
దులదుల వచ్చుబాలుఁడును దోడనె కానసియూడ నాతనిం
గలిసికొనంగ వచ్చువ్రజకాంతలపాదరజంబుఁ గాంచెదన్. 36

తా. నా మనస్సు ఎంత యజ్ఞానమును బొందుచున్నదైనను తామరలవంటి కన్నులుగల చిన్నికృష్ణునియందు అకృష్ణునిసంబంధముచేత పుణ్యాత్మలైనగోపికల పాదధూళియందును ఎల్లప్పుడు నిలిచి సేవించుఁగాక.

శ్లో.మయిప్రయాణాభిముఖేచ వల్లవీ స్తనద్వయీదుర్లలిత స్స బాలకః,
శనైశ్శనైశ్శ్రావితవేణునిస్వనో విలాసవేషేణ పురః ప్రతీయతామ్.

టీ. మయి=నేను, ప్రయాణాభిముఖే = ప్రయాణము చేయుటకు ఎదురుకొన్నవాఁడ నగుచుండఁగా, వల్లవీ...లలితః = గోపికలయొక్క చన్నుదోయిచేత ఎక్కువగా లాలనచేయఁబడిన వాఁడైన, సః బాలకః=ప్రసిద్ధుఁడయిన చిన్నికృష్ణుఁడు, శనైశ్శనైః=మెల్లమెల్లఁగా, శ్రావి...స్వనః=వినిపింపఁబడిన పిల్లఁగ్రోవియొక్క ధ్వని గలవాఁడగుచు, విలాసవేషేణ = విలాసముగల వేషముతోడ, మమ = నాకు, పురః=ఎదుట, ప్రతీయతామ్=తోఁచును గావుత.

ఉ. గొల్లమిటారివూపచనుగుత్తులు హత్తిన వింతలాగుతోఁ
జల్లనిచూపుతో వదలి సారెకు జాఱెడుపీలిదండతో
నల్లపరాకుఁ దెల్పుటకు నై విలసిల్లినపిల్లఁగ్రోవితో
నల్లనిబాలుఁ డొక్కరుఁడు నావయనంబున నిల్చు ముంగలన్. 37

తా. నేను ప్రయాణమగునపుడు గోపికల కుచయుగములచేత మిక్కిలి లాలింపఁబడిన కృష్ణుఁడు మందమధురముగా వేణుగానముసేయుచు విలాసముగల వేషముతో నాకు ముందర తోఁచుచుండును గాక.

శ్లో.అతిభూమి మభూమి మేవ వా వచసాం వాసితవల్లవీ స్తనమ్,
మనసా మపరం రసాయనం మధురాద్వైత ముపాస్మహే మహః.38

టీ. వచసాం=వాక్కులకు, అతిభూమిం=మిక్కిలి విషయమయినదియు, వాఁలేక, అభూమిం=విషయము కానిదియు (పరస్వరూపముచే వాగతీతుఁడనియు సౌలభ్య

యుక్తమైన యీవిభవస్వరూపముచే మిక్కిలి విషయమైన వాఁడును అనియు భావము).
వానీతవల్లవీ స్తనం=నివాసస్థానముగా చేసికొనఁబడిన గోపికలయొక్క స్తనములుగల
దియు, మనసాం=మనస్సులకు, అపరం=రెండవదిలేని (సాటిలేని), రసాయనం=భోగ్య
మైనదియు, మధురాద్వైతం=మధురమే తప్ప రెండవది లేనిదియు అగు, మహః=తేజ
మును, ఉపాస్మహే=సేవించుచున్నారము.

చ. పలుకఁ గొలందిగానియనుభావముఁ గాంచియు నద్వితీయు మై
పొలుపు వహించి నెమ్మది కపూర్వరసాయన మై మహోన్నతిం
దొలఁకెడు దివ్య తేజము మనోహరవల్లవపల్లవాధరీ
లలితపయోధరాంతరవిలాసనివాసము గాంచెఁ గంటిరే. 38

తా. వాగతీతుఁడును, వాక్కులకు విషయమైనవాఁడును అనవరతము గొల్లచెలు
వల గుబ్బలకౌఁగిలింతలయందె మిక్కిలి యాసక్తిగలవాఁడును, మనస్సునకు తలంచినం
తమాత్రమున నత్యంతసుఖము నిచ్చువాఁడును అచ్చపు చక్కఁదనము గలవాఁడును
అగు శ్రీకృష్ణుఁడను తేజమును సేవించుచున్నారము.

శ్లో. జనన్యా న్తరేఽపి జగదేకమణ్డనే, కమనీయధామ్ని కమలాయతేక్షణే,
వ్రజసున్దరీజనవిలోచనామృతే, చపలాని సన్తు సకలేన్ద్రియాణి మే.

టీ. జగదేకమండనే=లోకములకు సాటిలేని అలంకారమైనదియు, కమలాయ
తేక్షణే=కమలమువలె విశాలములయిన నేత్రములు గలదియు, వ్రజ...నామృతే=
గొల్లపల్లెయందలి చక్కని స్త్రీలయొక్క కన్నులకు అతిభోగ్యమైనదియు, అగు, కమ
నీయధామ్ని=మనోహరమైన తేజమునందు (శ్రీకృష్ణునియందు), జనన్యాంతరేఽపి=మరి
యొక జన్మమందును, మే=నాయొక్క, సకలేంద్రియాణి=సర్వేంద్రియములును, చప
లాని=మిక్కిలి ఆసక్తిగలవిగా, సన్తు=అగుఁగాక.

మ. శతపత్రోజ్జ్వలపత్రనేత్రు వ్రజకంజాతాననాలోకనా
మృతధారాధరచారుగాత్రు భువనోన్నైకభూషాసము
న్నతచారిత్రుఁ బవిత్రుఁ గొల్చి యసుజన్మంబుల విలోలేంద్రియ
ప్రతతుల్ సౌఖ్యము నొందుఁగాత నిజచాపల్యంబు లీడేరఁగన్. 39

తా. లోకములకు ముఖ్యమైన యలంకారమై తామరలవంటి కన్నులుగలిగి
గోపికల కన్నులకు భోగ్యమై దివ్యసుందరమగు శ్రీకృష్ణుఁడను తేజమునందు జన్మాంత
రమందును నాయొక్క సర్వేంద్రియములును ఆసక్తి గలిగి యుండునుగాక.

శ్లో. మునిశ్రేణీవన్ద్యం మదభరలసద్వల్లవవధూ
స్తనశ్రోణీబిమ్బస్తిమితనయనామ్భోజసుభగమ్,

పునశ్శ్లాఘాభూమిం పులకితగిరాం నైగమగిరాం
ఘనశ్యామం వన్దే కిమపి కమనీయాకృతి మహః. 40

టీ. ముని...వంద్యం = మునులసమూహమునకువందనము చేయఁదగినదియు, మద...సుభగం=మిక్కుటమైన మదముచేత ప్రకాశించుచున్న గోపస్త్రీలయొక్క కుచములయందును వట్రువలైన పిఱుఁదులయందు నిశ్చలములైన తామరలవంటి కన్నులచేత సుందరమైనదియు, పునః = ఇంకను, పులకితగిరాం=గగ్గురువొడిచిన వాక్కులుగల, నైగమగిరాం=వేదవాక్కులకు, శ్లాఘాభూమిం = పొగడ్తకు విషయమైనదియు, ఘనశ్యామం=మేఘమువలె నల్లనైనదియు, కమనీయాకృతి = మనోజ్ఞమైన ఆకారముగలదియు, కిమపి=వచింపనశక్యమైనదియు, అగు, మహః = శ్రీకృష్ణాఖ్యతేజమునుగూర్చి, వందే=నమస్కరించుచున్నాను.

చ. పులకలు గ్రమ్మ మౌనిజనముల్ శ్రుతివాక్యములన్ నుతింపఁగా
జలదమనోహరాకృతి యెసంగ మదాలసవల్లవాంగనా
లలితపయోధరాంతరవిలాసకటీతటలోలలోచనం
బులఁ దనరారునందకృతపుణ్యనిధానము నన్నుఁ బ్రోచుతన్. 40

తా. సకలమునులచేత నమస్కరింపఁదగినవాఁడును, యౌవనమదసుందరలగు గోపికల కుచములందును పిఱుఁదులందును సుందరముగఁ జూడ్కులను నిలుపువాఁడును, మఱియు వేదవాక్యములచేత మిక్కిలి ప్రీతితో పొగడఁబడినవాఁడును, మేఘమువలె నీలమైనవర్ణము గలిగి యత్యంతసుందరమైన యాకారము గలవాఁడు నగు శ్రీకృష్ణునికి వందనము చేయుచున్నాను.

శ్లో. అనుచుమ్బతా మవిచలేన చేతసా
మనుజాకృతే ర్మధురిమశ్రియం విభోః,
అయి దేవ కృష్ణ దయితేతి జల్పతా
మపి నో భవేయు రపి నామ తాదృశాః. 41

టీ. అవిచలేన=అంతగా చలింపకుండెడు, చేతసా=మనస్సుచేత, మనుజాకృతేః=మనుష్యరూపము దాల్చిన, విభోః=స్వామియొక్క, మధురిమశ్రియం=సౌందర్యసంపదను, అనుచుంబతాం = ఆస్వాదించువారును, దేవ-కృష్ణ-దయిత = శ్రీకృష్ణమూర్తీ, ఇతి=అని, జల్పతాం=చెప్పుచున్నవారును, అగు, నః అపి = మాకునుగూడ, తాదృశాః=అట్టివి (మేము మనస్సులోఁ దలఁచినట్టివి) అపినామభవేయుః=అగునా? అగునో యేమో.

ఉ. మానుషవేషధారి యగుమాధవుమోహనకాంతి చంచలం
బై నటియించుచిత్తమున నానుచుఁ 'గృష్ణ! ముకుంద!' యంచు న

స్నానము మీఱఁగాఁ బలుక మా కొనఁగూడెడుఁ గాత నీదృశ
ధ్యానవిధేయు లైననసకాదిమహాపునిభాగ్యసంపదల్. 41

తా. చలింపని మనస్సుచేత శ్రీకృష్ణుని దివ్యసౌందర్యమును దలంచుచు 'శ్రీ కృష్ణ, ఓదేవ, ఓదయిత' అని పలుకుచున్న నావంటివారికినిగూడ పూర్వము ప్రత్యక్షముగా అనుభవించిన మహాత్ములకుఁ గలిగిన భాగ్యములు గలుగునో యేమో కదా.

శ్లో. కిశోరవేషేణ కృశోదరీదృశాం, విశేషదృశ్యేన విశాలలోచనమ్,
యశోదయా లబ్ధయశోనవాంబుధే, ర్నిశామయే నీలనిశాకరం కదా.

టీ. కృశోదరీదృశాం = సన్నని నడుములుగల గోపికల కన్నులకు, విశేషదృశ్యేన=మిక్కిలి యాసక్తితోఁజూడఁదగిన, కిశోరవేషేణ = బాల్యవేషముతో (గూడిన వాఁడును), విశాలలోచనం = వెడలుపైన కన్నులుఁగలవాఁడును, యశోదయా = యశోదచేత, లబ్ధయశోనవాంబుధేః=పొందఁబడిన కీర్తియను క్రొత్తసముద్రమునకు, నీలనిశాకరం=నల్లనిచంద్రుఁడైనవాఁడును (అయిన కృష్ణుని), కదా=ఎప్పుడు, నిశామయే=చూతును ?

శా. లీలాలోలవిశాలలోచనునిఁ గేళీశైశవాలంకృతు
న్బాలుం బాలికలోకపాలువ్రజకాన్తల్ సొక్కుచుం బెక్కుచం
దాలం గన్నులకోర్తిఁ గన్గొనుయశోదాకీర్తిరత్నాకర
ప్రాలేయాంశుని నీలనీరదతనుఁ భావింతు నెల్లప్పుడున్. 42

తా. బాలుఁడైనను యౌవనవతులగు గోపికలకు ఆశింపఁదగిన దివ్యసౌందర్యము గలవాఁడును యశోదబిడ్డఁడగుటచే ఆయమకు కీర్తిని వృద్ధిఁబొందించువాఁడును అగు శ్రీకృష్ణుని ఎప్పుడు చూతును?

శ్లో. ప్రకృతిరవతునోవిలాసలక్ష్మ్యాః, ప్రకృతిజడం ప్రణతాపరాధవీథ్యామ్,
సుకృతికృతపదం కిశోరభావే, సుకృతిమనః, ప్రణిధానపాత్ర మోజః.

టీ. కిశోరభావే=బాల్యమునందు, విలాసలక్ష్మ్యాః = విలాసములసంపదకు, ప్రకృతిః = మూలకారణమైనదియు, ప్రణ...వీథ్యాం = నమస్కరించువారి అపరాధములయొక్క పరంపరలవిషయమై, ప్రకృతిజడం=స్వభావముగా మందమైనదియు, సుకృతి...పాత్రం = పుణ్యపురుషులమనస్సులయొక్క నిశ్చలత్వమునకు విషయమయినదియు,సుకృ...పదం = పుణ్యపురుషులయందు చేయఁబడిన స్థానముగలదియు, అగు, ఓజః = శ్రీకృష్ణుఁడను తేజము, నః=మమ్ము, అవతు = రక్షించుఁగాక.

చ. హితజనతాపరాధముల నెన్నెడువట్ల జడస్వభావ మై
కృతమతు లాత్మలోనఁ బరికింపఁగఁ బాత్రము నై కిశోరతా
ప్తిపదమై విలాసమృదురీతికి హేతువు నై మనోహరా
కృతిఁ గనిపించునా సుకృతి కేవలతేజము మమ్ముఁ బ్రోఁచుతన్. 43

తా. బాల్యమునందు సకలములైన విలాసములుగలిగి ఆశ్రితులు చేసిన యప రాధములను పాటింపక కాపాడుచు, పుణ్యాత్ములుచేయు మనస్సమాధికి విషయమై (అనఁగా యోగులు తనను గూర్చియే మనస్సును సమాహితము చేయుచున్నారు) అట్టి సజ్జనులహృదయములందు నెలకొనియుండు శ్రీకృష్ణుఁడు మమ్ము రక్షించును గాక.

శ్లో. అపహసితసుధామదావలేపై రతిసుమనోహరమార్ద్రమందహాసైః,
వ్రజయువతివిలోచనావలేహ్యం రమయతు ధామరమావరోధనం నః.

టీ. అప...లేపైః=ఎగతాళి చేయఁబడిన అమృతముయొక్క మదముచేతనైనగ ర్వముగల, ఆర్ద్రమందహాసైః=సరసములైన చిఱునవ్వులచేత, అతిసుమనోహరం=మి క్కిలి సుందరమైనదియు, వ్రజ...లేహ్యం=యౌవనవతులయిన గోపికలకన్నులచేత నాకఁదగినదియు (అతిప్రీతిచేతఁ జూడఁదగినది అనిభావము), రమావరోధనం=లక్ష్మీ దేవికి నల్లభుఁడైనదియు, అగు, ధామ=శ్రీకృష్ణుఁడను తేజస్సు, నః=మమ్ము, రమయతు= ఆనందమును బొందింపఁజేయును గాత.

చ. నవసుధకన్న నొప్పునవ్వు చిఱునవ్వులు మోమున గోము నూన వ
ల్లవలలనావిలోచనవిలాసవిలేహ్యము నై రమారమణీ
భవనభుజాంతరస్థలిని భాసిలునంద తనూజ ప్రభావనం
భవఫల మైనధామము శుభంబు లభంగురభంగి నిచ్చుతన్. 44

తా. అమృతమువలె అత్యంతభోగ్యములైన మందహాసములచేత మిక్కిలి సుందరమైనవాఁడును, గోపికల చూడ్కులకు మిగుల వేడ్కఁగొలుపుచున్నవాఁడును, లక్ష్మీదేవికి ప్రాణనాథుఁడును అయిన శ్రీకృష్ణుఁడు మమ్ము రక్షించుగాక.

శ్లో. అఙ్కురితస్మేరదశావిశేషై రశ్రాన్తహర్షామృతవర్షమక్ష్ణామ్,
సంక్రీడతాం చేతసి గోపకన్యాఘనస్తనస్వస్త్యయనం మహో నః.

టీ. అఙ్కు...శేషైః=అంకురించిన చిఱునవ్వుతోఁగూడిన అవస్థాభేదముల చేత, అక్ష్ణాం చూచువారికన్నులకు, అశ్రా...వర్షం=ఎడతెగనిసంతోషమను అమృత వర్షమైనదియు, గోప...యనం=గోపస్త్రీలయొక్క చక్కనిచన్నులకు మంగళము నిచ్చునదియు, అగు, మహః=తేజస్సు, నః=మాయొక్క, చేతసి=మనస్సునందు, సం క్రీడతాం=లెస్సగా క్రీడించుఁగాక.

చ. అతులితమందహాసరుచిరాననముల్ విలసిల్ల దర్శనో
ద్యతజనితావలోకఘనహర్షసుధామయవర్షరూప మై
సతతము గోపికాఘనకుచస్థలనిస్తులదివ్యమంగళా
యుతనము నై నధామము నిరంతరముం జరియించు నామదిన్. 45

తా. క్రొత్తక్రొత్తగ మొలకలెత్తుచుండు చిఱునగవుచేత చూచువారి కెల్ల అమృతపుసోనలు గురిసినట్లు ఆనందమును గలిగించునదియు గొల్లపడుచుల చన్నుఁగవలకు నిబ్బరమైనయానందమును గూర్చునదియు అగు శ్రీకృష్ణుఁడను దివ్యతేజము మాహృదయమునందు క్రీడించునుగాక.

శ్లో. మృగమదపఙ్కసఙ్కరవిశేషితవన్యమహీ
గిరితటగణ్డగైరికఘనద్రవవిద్రుమితమ్,
అజితభుజాన్తరం భజత హే బత గోపవధూ
స్తనకలశస్థలీఘుసృణమర్దనకర్దమితమ్. 46

టీ. మృగ...విద్రుమితం = కస్తూరిబురదయొక్క కూడికచేత ఎక్కువగా చేయఁబడిన అడవియందుండునట్టి పెద్దకొండయొక్క చఱియయందలి పెనుబండలయొక్క గైరికమను ధాతువిశేషముయొక్క దట్టమైన ద్రవముచేత పగడముగాఁ జేయఁబడినదియు, గోప...కర్దమితమ్ = గోపికల కలశములవంటి స్తనములయొక్క ప్రదేశమందలి కుంకుమయొరపిడిచేత బురదగలిగినవిగాఁ జేయఁబడినదియు అగు, అజి...తరం = జయింపరానివాఁడైన కృష్ణునియొక్క ఱొమ్మును, బతహే = ఓజనులారా !, భజత = సేవింపుఁడు.

చ. మృగమదపంకసంకరగిరిస్థితగైరికధాతురక్తిమం
బొగరు వహించి వల్లవవధూపృథులస్తనకుంకుమంబునన్
ద్విగుణితకాంతివక్షుఁ డగునీరరుహాక్షుఁ గృపాకటాక్షునిం
దగిలి భజింప నిల్పుఁడు ముదంబున నుత్తములార చిత్తముల్. 46

తా. అడవియందలి గొప్పకొండల చఱులయందు కస్తూరిమృగములు లెక్కకు మిక్కిలి పరుండఁగా వానిపొక్కిటి కస్తూరి మిక్కిలి యంటుకొని యాబండలయందలి ఎఱ్ఱని గైరికధాతువు పరిమళించుచుండును. అట్టిగైరికధాతుద్రవమును పూసికొనుటవలన పగడమువలెఁ గనుపట్టుచు గోపికల గుబ్బలయందుఁ బూసికొనిన కుంకుమపూఁత దట్టముగా నంటుకొని యందగించు కృష్ణుని ఱొమ్మును జనులారా సేవింపుఁడు

శ్లో. ఆమూలపల్లవితలీల మపాఙ్గజాలై
రాసిఞ్చతీ భువన మాదృతగోపవేషా,
బాలాకృతి ర్మృదులముగ్ధముఖేన్దుబిమ్బా
మాధుర్యసిద్ధి రవతా న్మధువిద్విషో నః. 47

టీ. ఆమూలపల్లవితలీలం = మొదటివరకు చిగురొత్తిన విలాసములుగలుగునట్టుగా(అంతయు విలాసముగనే), అపాంగజాలైః = కడకంటిచూపులయొక్క సమూహములచేత, భువనం = ప్రపంచమును, ఆసించతీ = తడుపుచున్నదియు, ఆదృతగోపవేషా = ఆదరింపఁబడిన గొల్లవేషముగలదియు(గొల్లవేషమును దాల్చినదియు), బాలాకృతిః = బాల్యసంబంధియైన

ఆకారముగలదియును, మృదు...బింబా = కోమలమయి సుందరమయి చంద్రబింబమును బోలిన మోముగలదియునగు, మధువిద్విషః = విష్ణుమూర్తియొక్క, మాధుర్యసిద్ధిః = సౌందర్యఫలపరిపాకము, నః = మమ్ము, అవతు = రక్షించుచునుగాక.

చ. కరుణను బాదుకొల్పినజగంబుఁ గటాక్షసుధారసాప్తిచేఁ
బరిణతపల్లవప్రనవపక్వఫలంబును గా నొనర్చుచుం
జిఱుత మిటారిప్రాయమునఁ జెల్వగుచక్కఁదనాలపంట న
మ్మురహరుఁ బూర్ణచంద్రముఖు మోహనపల్లవవేషుఁ గొల్చెదన్. 47

తా. పరిపూర్ణముగ విలాసములను దొలఁకునట్లు చల్లని కడకంటిచూపులచేత జగమును ఆప్యాయనమును బొందించుచున్నవాఁడును గొల్లపిల్లవాని వేషమును దాల్చినవాఁడును, కోమలమై సుందరమై చంద్రునివలె ఆహ్లాదకరమైన మోముగలవాఁడైన శ్రీకృష్ణునియొక్క సౌందర్యసారము మమ్ము రక్షించునుగాక.

శ్లో. విరణన్మణినూపురం వ్రజే చరణామ్భోజ ముపాస్స్వ శార్ఙ్గిణః,
సరసే సరసి శ్రియాశ్రితం కమలం వా కలహంసనాదితమ్. 48

టీ. సరసే = మనోహారమయిన, సరసి = సరస్సునందు, శ్రియా = కాంతిచేత, అశ్రితం = ఆశ్రయింపఁబడినదై, కలహంసనాదితం = రాజహంసచేత ధ్వనిగలదిగా చేయఁబడినదియు అగు, కమలంవా = కమలమువలె, వ్రజే = గొల్లపల్లెయందు, విరణన్మణినూపురం = మ్రోయుచున్న అందెగల, శార్ఙ్గిణః = కృష్ణునియొక్క, చరణాంభోజం = అడుగుఁదామరను, ఉపాస్స్వ = సేవింపుము.

ఉ. సారసరోమరాళవరసారసనన్నిభనూత్నరత్నమం
జీరవిలాసపాదములచేఁ జరియించుచు వీథి లేఁగలం
బాఱఁగ దోలి వెంబడిని పర్వులు వాఱుచుఁ జేరి పట్టుచుం
గేరి నటించుచిన్నియదుకేసరి నామది నాశ్రయించెదన్. 48

తా. శ్రీకృష్ణుఁడు గొల్లపల్లెయందు సంచరించుచుండఁగా అందెలచేత మ్రోయుచున్న పాదాబ్జము సరస్సులో కాంతియుక్తమై కలహంసనాదితమగు కమలమును బోలియున్నది. అట్టిపాదము నుపాసింపుము.

శ్లో. శరణ మశరణానాం శారదామ్భోజనేత్రం
నిరవధిమధురిమ్ణా నీలవేషేణ రమ్యమ్,
స్మరశరపరతన్త్రస్మేరనేత్రామ్బుజాభి
ర్వ్రజయువతిభి రవ్యా ద్వ్రాప్తానం వేష్టితం నః. 49

టీ. అశరణానాం=దిక్కులేనివారిని, శరణం = రక్షించునదియు, శారదాంభోజనేత్రం=శరత్కాలమందలి పద్మములవంటి నేత్రములు గలదియు, నిరవధిమధురిమ్ణా=మితిలేనిసౌందర్యముగల, నీలవేషేణ=నల్లనివేషముచేత, రమ్యం=రమణీయమైనదియు, స్మర...జాభిః=మన్మథునియొక్క బాణములకు అధీనములైన వికసించిన తామరలవంటి కన్నులుగలవారైన, వ్రజయువతిభిః=గోపికలచేత, సంవేష్టితం=చక్కఁగా చుట్టుకొనఁబడినదియు అగు, బ్రహ్మ = శ్రీకృష్ణపరమాత్మ, నః=మమ్ము, అవ్యాత్=రక్షించునుగాక.

మ. శరదంభోరుహనేత్రు నిస్తులకళాసౌందర్యపాత్రు మనో
హరపౌరందరనీలగాత్రుఁ గుసుమాస్త్రావేశజాతస్మితాం
కురనంద వ్రజసుందరీపరివృతుం గోపాంగనాలింగితుం
శరణత్రాణసమున్నతుం వరదయాసారోన్నతుం గొల్చెదన్. 49

తా. దిక్కులేనివారిని గాపాడుచున్నవాఁడై అత్యంత సుందరమగు నీలవేషము గలవాఁడై తనయందు మదనవికారమును దెల్పు చూపులఁ జూచుచున్న గోపికలచేత కొలువఁబడిన శ్రీకృష్ణుఁడు నమ్ము రక్షించుఁ గాక.

శ్లో. సువ్యక్తకాన్తిభరసౌరభదివ్యగాత్ర
మవ్యక్తయౌవనపరీతకిశోరభావమ్,
గవ్యానుపాలనవిధా వనుశిష్ట మవ్యా
దవ్యాజరమ్య మఖిలేశ్వరవైభవం నః. 50

టీ. సువ్యక్త...గాత్రం=మిక్కిలి స్ఫుటమైన కాంతులయొక్క అతిశయముచేతను పరిమళముచేతను సుందరమైన దేహముగలదియు, అవ్య...భావమ్ = తెలియఁబడనియౌవనముచేత ఆవరింపఁబడిన బాల్యముగలదియు, గవ్యా...విధౌ=గోవులసమూహము కాచుటయొక్క విధానమందు, అనుశిష్టం=నేర్పుగలదియు, అవ్యాజరమ్యం=నిమిత్తములేకయె రమణీయమైనదియు అగు, అఖిలేశ్వరవైభవం=సర్వేశ్వరుఁడగు శ్రీవిష్ణుదేవునియొక్క విభవము (శ్రీకృష్ణుఁడు), నః=మమ్ము, అవ్యాత్=రక్షించునుగాక.

చ. ప్రకటితకాంతిసౌరభకరంబితగాత్రము యౌవనార్భటీ
చకితకిశోరభావము నిసర్గమనోహరరూపధేయమై
సకలజగన్నియంత యగుశౌరిమహత్త్వము గొల్లపల్లెఁ బా
యక యొకయింట నావసుల నారసి మేపెనిదేమి చిత్రమో. 50

శా. మిక్కిలికాంతియు మిక్కిలివాసనయుఁ గలిగినదివ్యమంగళవిగ్రహము గలవాఁడును, కొంచెము యౌవనముతోఁ గలిసిన బాల్యముగలవాఁడును, గోవులఁగాచుటయందు నేర్పుగలవాఁడును, భూషణాది నిమిత్తములు లేకయే రమణీయమైనవాఁ

డును అగు శ్రీకృష్ణుఁడె సర్వేశ్వరుఁడగు విష్ణుమూర్తి యవతారములలో మిక్కిలి మనోహరమైనవాఁడు. అట్టి కృష్ణుఁడు మమ్ము రక్షించునుగాక.

శ్లో. అనుగత మమరీణా మమ్బరాలమ్బినీనాం
నయనమధురిమ శ్రీనర్మనిర్మాణసీమ్నామ్,
వ్రజయువతివిలాసవ్యాపృతాపాఙ్గ మవ్యా
త్త్రిభువనసుకుమారం దేవకైశోరకం నః. 51

టీ. అంబరాలంబినీనాం = ఆకాశమును ఆశ్రయించినవారును, నయన...సీమ్నాం=నేత్రసౌందర్యముయొక్క సంపదకు సంబంధించిన విలాసముయొక్క సృష్టికి మేరయైనవారును, అగు, అమరీణాం=దేవతాస్త్రీలచే, అనుగతం=అనుసరింపఁబడినదియు, వ్రజ...పాంగం = గోపికలయొక్క విలాసములయందు వ్యాపింపఁజేయఁబడిన కడకంటిచూపులుగలదియు, త్రిభు...మారం=మూఁడులోకములయందును కోమలమైనదియు అగు, దేవకైశోరకం = శ్రీకృష్ణునిబాల్యము, నః=మమ్ము, అవ్యాత్ = రక్షించుఁగాక.

శా. లోలాలోకనహావభావముల నాలోకించుచుం దేవతా
నాళీకాస్యలు మింట నంటి తిరుగ నందవ్రజాంభోరుహా
క్షీలీలార్ద్రికటాక్షవీక్ష లనురక్తిం బర్వఁ డై త్రిలోకశ్యర
మ్యాలంకారము నై చెలంగుహరిబాల్యప్రౌఢి నన్ బ్రోచుతన్. 51

తా. దేవతాస్త్రీలు ఆకాశమునందు సంచరించుచున్నవారై శ్రీకృష్ణుని దివ్య సౌందర్యమును అతిసుందరములగు తమనేత్రములవిలాసములతోఁ జూచుచు నతని విడనాడలేక వెంటనంటి తిరుగుచున్నారు గాన అట్టివాఁడును గొల్లముద్దియల కులుకులందు తనక్రేగంటిచూపుల నిగుడ్చుచున్నవాఁడును మల్లోకములందు ముద్దులుగుల్కెడు సుకుమార సౌందర్యముగలవాఁడును అగు బాలకృష్ణుఁడు మమ్ము రక్షించునుగాక.

శ్లో. ఆపాద మాచూడ మతిప్రసక్తై రాపీయమానా యమినాం మనోభిః,
గోపీజనజ్ఞాతరసాఽవతా న్నో గోపాలభూపాలకుమారమూర్తిః. 52

టీ. ఆపాదం=పాదము మొదలు, ఆచూడం = శిఖవఱకు, అతిప్రసక్తైః=మిక్కిలి యాసక్తిగలిగిన, యమినాం=మునులయొక్క, మనోభిః=మనస్సులచేత, ఆపీయమానా=మిక్కిలి పానము చేయఁబడుచున్నదియు, గోపీ...రసా=గోపికలయొక్క సమూహముచేత తెలియఁబడిన రసముగలదియు అగు, గోపా...మూర్తిః=గోపకులకు రాజైన నందునియొక్క కుమారుఁడైన కృష్ణునియొక్క దివ్యమంగళవిగ్రహము, నః=మమ్ము, అవతాత్ = రక్షించుఁగాక.

మ. విమలాపాంగవిలాసగోపమహిళావిజ్ఞాతసారస్యముం
దమితో నువ్విళు లూరుడెందములచేతం బూను లాపాడను
న్నతము నాపోవఁగ నానునట్టినుషమా సౌభాగ్యధారామనో
జ్ఞము గోపాలకబాలరూపము మహానందంబు మీకొచ్చుతన్. 52

తా. మునులు మనస్సునందు కృష్ణునిసౌందర్యమునంతయు సేవించుచున్నారు. గోపికలు ప్రత్యక్షముగా అట్టిసౌందర్యసౌకుమార్యములను అనుభవించినారు. కనుక మునులకును గోపికలకును అనుభావ్యుఁడై నందుని ముద్దుపట్టియగు కృష్ణుఁడు నన్ను రక్షించుఁగాక.

శ్లో. దిష్ట్యాబృన్దావనమృగదృశాం విప్రయోగాకులానాం
ప్రత్యాసన్నం ప్రణయచపలాపాఙ్గవీచీతరఙ్గైః,
లక్ష్మీలీలాకువలయదళశ్యామలం ధామ కామాఞ్
పుష్ణీయాన్నః పులకముకుళాభోగభూషావిశేషమ్. 53

టీ. విప్రయోగాకులానాం=(కృష్ణుఁడు తమ్ము) ఎడఁబాయుటచేత కలఁగినవారైన, బృందావనమృగదృశాం=బృందావనమందలిగోపికలకు, ప్రణయ...తరంగైః= ప్రేమచేత చంచలములైన కడకంటిచూపులయొక్క పరంపరలచేత, పులక...విశేషం=మొగ్గలవంటి గగ్గురులయొక్క పరిపూర్ణతయనెడి ఆభరణవిశేషములుగలుగునట్లుగా, దిష్ట్యా=భాగ్యవిశేషమున, ప్రత్యాసన్నం=కడుదాపునకుచేరినదియు, లక్ష్మీ...శ్యామలం=లక్ష్మీదేవియొక్క విలాసార్థమైన కలువపువ్వుయొక్క రేకులవలె నల్లనైనదియు అగు, ధామ=శ్రీకృష్ణుఁడను తేజము, నః=మాయొక్క, కామాన్ = కోర్కులను, పుష్ణీయాత్=పోషించుఁగాక.

మ. విరహోష్మం బ్రజభామినుల్ గరఁగి యువ్విళ్లూర భాగ్యంబునం
దరళాపాంగతరంగసంతతుల నేదల్ దీర్చుచుం వచ్చి ని
ర్భరరోమాంచవిశేషభూషుఁ డగు గోపాలుండు పద్మాలయా
కరనీలోత్పలనీలవర్ణుఁ డొసఁగుం గళ్యాణపారంపరిన్. 53

తా. బృందావనమందలి గోపికలను లీలార్థము ఎడఁబాసిపోవఁగా వారు కలఁతఁజెంది సలఁగుటను జూచి తన చల్లనికటాక్షములచే వారివిరహాగ్నిని జల్లార్చుచు వారి మేనులు పులకరింపఁగా వారిభాగ్యవశమున కనుపడినట్టివాఁడును, లక్ష్మీదేవి విలాసార్థము ధరించునట్టి నల్లగలువరేకులవంటి కాంతిగలవాఁడును అగు శ్రీకృష్ణుఁడు మా కోర్కులను దీర్చునుగాక.

శ్లో. జయతి గుహాశిఖీన్ద్రపిఞ్ఛమౌళి స్సురగిరిగైరికకల్పితాఙ్గరాగః,
సురయువతివికీర్ణసూనవర్షస్నపితవిభూషితకున్తలః కుమారః. 54

టీ. గుహ...మౌళిః=కుమారస్వామియొక్క శ్రేష్ఠమయిన నెమిలియొక్క పురి సిగయందుఁ గలవాఁడును, సుర...రాగః= మేరుపర్వతముయొక్క గైరికధాతువుల చేత చేయఁబడిన మైపూఁత గలవాఁడును, సురయు...కుంతలః=దేవతాస్త్రీలచేత చల్లఁబడినపుష్పములయొక్క వానచేత తడుపఁబడినదై అలంకరింపఁబడిన కురులు గలవాఁడును, అగు, కుమారః=బాలుఁడగు కృష్ణుఁడు, జయతి=సర్వోత్కృష్టుఁడై వర్తించుచున్నాఁడు.

మ. సురకన్యాకరముక్తకల్పకసుమస్తోమంబు లొయ్యారపుం
దఱుచుం బెన్నెఱిగుంపు పై నిలిపి చెంతం దాయెతుల్ సుట్టి ని
ర్జరధాత్రీధరధాతుధారఁ జెలువారం బూని సేనానివా
పురపుంబింఛపుఁదావళం బమరుదేవుం డొప్పు బాల్యోన్నతిన్. 54

తా. కుమారస్వామియొక్క నెమిలిపింఛమును సిగయందుఁ దాల్చినవాఁడును, మేరుపర్వతమునందలి గైరికము బూసికొన్నవాఁడును, దేవతాస్త్రీలు చల్లినపూవుల వానకుఁ దడిసి యొప్పుచున్నవాఁడును అగు కృష్ణుఁడు సర్వోత్కృష్టుఁడై యుండుఁగాక.

శ్లో. మధురమన్దరుచిస్మితమఞ్జులం వదనపఙ్కజ మఙ్గజవేల్లితమ్,
విజయతాం వ్రజబాలవధూజనస్తనతటీవిలుఠన్నయనం విభోః. 55

టీ. మధుర...మంజులం=సుందరమై కొంచెపాటిదై పరిశుద్ధమై చిఱునవ్వుచేత ఒప్పుచున్నదియు, అంగజవేల్లితం=మదనునిచేత చలింపఁబడినదియు, వ్రజ...యనం=వ్రేపల్లెయందలి బాలలయిన స్త్రీలయొక్క సమూహముయొక్క చనుమిట్టలయందు సంచరించునట్టి కన్నులుగలదియు, అగు, విభోః=శ్రీకృష్ణునియొక్క, వదనపంకజమ్=మోముఁదామర, విజయతాం=సర్వోత్కృష్టమగుఁగాక.

మ. మఱిపెంపుంజిఱునవ్వు నివ్వటిలు కెమ్మోవిన్ సుధాబిందువుల్
గురియుం జొక్కపుమోముఁ జిత్తజునిసొక్కుల్ నక్కఁగాఁ దీర్చున
బ్బురపుం బ్రాయము గొల్లపల్లెకులుకుంబూఁబోండ్ల షాలిండ్ల బి
త్తరపుంజన్నులఁ జూచుచూపు గలధూర్తస్వామి సెల్వొందెడిన్. 55

తా. మధురమగు మందహాసముతో నొప్పుచు మన్మథవికారముల (అనఁగాః కులుకుఁ దళుకుల) నెఱపుచు ప్రాయంపుగోపికల గుబ్బచన్నులందుఁ జూపుల నిగుడ్చుచుండుకృష్ణుని వదనారవిందము సర్వోత్కృష్టమైనది.

శ్లో. అలసవిలసన్ముగ్ధస్నిగ్ధస్మితం వ్రజసున్దరీ
మదనకదనస్విన్నం ధన్యం మహద్వదనామ్బుజమ్,

తరుణ మరుణజ్యోత్స్నా కార్త్స్న్యస్మితస్నపితాధరమ్
జయతి విజయశ్రేణీ మేణీదృశాం మదయన్మహః. 56

టీ. అలస...స్మితం=మందమై ప్రకాశించుచున్నదై సుందరమై స్నేహముగలదైనచిఱునవ్వుగలదియు, వ్రజ...స్విన్నం=గొల్లభామలతోడి మన్మథక్రీడలచేత చెమర్చినదియు, ధన్యం=స్వతస్సుందరమైనదియు, తరుణం=సుకుమారమైనదియు, అరుణ...ధరం=ఎఱ్ఱనైన వెన్నెలయొక్క సాకల్యముగల (ఎఱ్ఱని కాంతులన్నియుఁగలిగిన) చిఱునగవుచేత తడుపఁబడిన పెదవిగలదియు, మహః=మిక్కిలి తేజముగలిగి యొప్పుచున్న, మహాద్వదనాంబుజం=శ్రీకృష్ణునిపద్మమువంటి ముఖము, ఏణీదృశాం=గోపికాస్త్రీలయొక్క, విజయశ్రేణీం=కార్యసిద్ధులయొక్క పరంపరలను, మదయన్=ఉప్పొంగించుచు (అతిశయింపఁజేయుచున్నదై), జయతి=సర్వోత్కృష్టమై వర్తించుచున్నది.

మ. పొగరుంగెంపులసొంపునింపులలితంపుం దేట కెమ్మోవిపై
సొగసున్నిద్దపుఁదళ్కులేనగవుమోసుల్ మీఱ బృందావనీ
మృగనేత్రాసురతశ్రమాంబుకణికామృద్వాననాబ్జంబుతోఁ
జిగురుంబోండ్ల విరాళిఁ గొల్చురసికున్ సేవించి భావించెదన్. 56

తా. మందమై మధురమై యొప్పుచున్న చిఱునవ్వుగలిగి గొల్లచెలువలతోడి రతిక్రీడలయందు సొక్కి చిఱుచెమటచే నొప్పారుచు భూషణాదులు లేకయే స్వతస్సిద్ధముగా సౌందర్యముగలిగి సమస్తకామములు తీరి ఎఱ్ఱని కాంతులచే నొప్పు మోవిగలిగి కాంతిపుంజమో యనునట్లు ప్రకాశించెడు శ్రీకృష్ణుని వదనాంబుజము గోపికాస్త్రీలయొక్క మనోరథములను సఫలములుగా చేయుచు సర్వోత్తమమై యున్నది.

శ్లో. రాధాకేళికటాక్షవీక్షితమహావక్షఃస్థలీమణ్డనా
జీయాసుః పులకాఙ్కురాస్త్రిభువనస్వాదీయసస్తేజసః,
క్రీడాన్తప్రతిసుప్తదుగ్ధతనయాముగ్ధావబోధక్షణ
త్రాసారూఢదృఢోపగూహనమహాసామ్రాజ్యసాన్ద్రశ్రియః. 57

టీ. త్రిభువనస్వాదీయసః=మూఁడులోకములకును మిక్కిలి ఆస్వాదింపఁదగినట్టి, తేజసః=శ్రీకృష్ణుఁడను తేజముయొక్క, రాధా...మండనాః=రాధాదేవియొక్క విలాసములచేతనైన కడకంటిచూపులచేత చూడఁబడిన గొప్పదైన ఱొమ్ముప్రదేశమునకు అలంకారములైనవియు, (రాధాదేవి శ్రీకృష్ణుని ఱొమ్మునందు ఇతరస్త్రీసంభోగచిహ్నములున్నవో యేమో అని క్రేగంట చూడఁగా ఆచూపులచేత మరులుగలిగి ఆఱొమ్మునందు గగ్గురులువొడమి యొకయలంకారముగా నున్నవనిభావము.) క్రీడాన్త...శ్రియః=రతికేళియొక్క తుదను నిద్రించిన లక్ష్మీదేవియొక్క మనోహరమైన మేలుకొనుటయొక్క క్షణకాలమందలి భయముచేత కలిగిన గాఢమైన కౌఁగిలింతయనెడు

సకలభూమండలాధిపత్యప్రాప్తిచేత మిగుల దట్టమైన సంపదగలవియు, అగు, (అనఁగా: లక్ష్మీస్వరూపురాలగు రుక్మిణీదేవి రతిక్రీడాంతమందు సొలసినిద్రించి మేలుకొన్నప్పుడు రాధాదేవిని జూచి బెదరి తనంతటఁదాను కౌఁగిలించుకొనఁగా శ్రీకృష్ణునికిఁ గలిగిన యానందమునకు పరిమితిలేదనిభావము.) పులకాంకురా=గగుర్పుమొలకలు, జీయాసుః= సర్వోత్కృష్టములై వర్తించును గాక.

మ. రతికేళిం దమి దీఱఁగా సలసి నిద్రం జెంది స్వప్నంబుచే
నతిభీతిన్ రమ గౌఁగిలింప నిబిడం బై రాధికాపాంగవీ
క్షితవక్షఃస్థలనిస్తులాభరణమై చెన్నొందురోమాంచసం
తతి సామ్రాజ్యరమానుభూతిపరమానందాకృతిన్ శౌరికిన్. 57

తా. శ్రీకృష్ణుని ఱొమ్ముమీఁద రాధాదేవి చూచునపుడు పులకాంకురములు గలిగెను. అవి రుక్మిణీదేవి తనంత కౌఁగిలించికొనినపుడు మఱింత మెండై త్రిలోకము యందలి దర్శనీయములలో శ్రేష్ఠతమములై యొప్పారుచుండెను.

శ్లో. స్మితస్నుతసుధాధరామదశిఖణ్డిబర్హాఙ్కితా
విశాలనయనామ్బుజా వ్రజవిలాసినీవాసితా,
మనోజ్ఞముఖపఙ్కజా మధురవేణునాదద్రవా
జయన్తి మమ చేతస శ్చిర ముపాసితా వాసనాః. 58

టీ. స్మిత...ధరాః=చిఱునవ్వు అనెడు కాఱుచున్న అమృతముగల మోవిగల వియు (అత్యంతభోగ్యమగు చిఱునవ్వు పెదవియందుఁ దొలఁకుచున్నదియనుట). మద ...కితాః=మదముగల నెమిలియొక్క పురిచే గుఱుతిడఁబడినవియు, విశా...బుజాః =వెడలుపైన కనుదామరలు గలవియు, వ్రజ...సితాః=గొల్లపల్లెయందలి విలాసము గల స్త్రీలయందు నిలుకడగొన్నవియు,మనో...కజాః=అందమైన మోముదామర గలవి యు,మధు...ద్రవాః=తీయనైన వేణునాదమనెడి అమృతరసము గలవియు, చిరం= బహుకాలము, ఉపాసితాః=కొలువఁబడినవి అగు, మమ=నాయొక్క, వాసనాః= సంస్కారములు, జయంతి=సర్వోత్కృష్టములై యొప్పుచున్నయవి.

చ. చెలు వగుమోముతోఁ దళుకుఁజెక్కులతో మధురాధరంబుతో
సులువగునవ్వుతో సొలపుఁజూపులతో వ్రజబాలికాళితో
లలితకలాపభూషణవిలాసముతో మురళీరవంబుతోఁ
బలుసుఱు మీఱుఁ గాక మధుభంజనవానన లెల్లదిక్కులన్. 58

తా. అమృతమువలె అతిభోగ్యమగు చిఱునవ్వు మోవియందుఁ దొలుకఁగా నెమిలిపింఛము ధరించి విశాలములైన కన్నులు గలిగి గొల్లకులుకుటాండ్రను మరులు కొని ముద్దులుగుల్కు మోముగలిగి తేనెలొలుకువేణుగానము సేయుచుండునట్టి చిన్ని

కృష్ణుని యాకారము నేను ఇంతకుముందు అనుభవించియున్నాను. అట్టి సుందరరూపము సర్వోత్తమమైనది.

శ్లో. జీయా దసౌ శిఖిశిఖణ్డకృతావతంసా
సాం సిద్ధికీ సరసతా న్తిసుధానమృద్ధిః,
యద్బిన్దు లేశకణికాపరిమాణభాగ్యః
సౌభాగ్యసీమపద మఞ్చతి పఞ్చబాణః. 59

టీ. పంచబాణః=మన్మథుఁడు, యత్...భాగ్యః=దేనియొక్క బిందువుయొక్క అణువుయొక్క అతిసూక్ష్మాంశముయొక్క పరిమితిగల మహిమగలవాఁడగుచు, సౌభా...పదం=సౌందర్యముయొక్క కటపటిది అయినస్థానమును, అంచతి=పొందుచున్నాఁడో, శిఖి...తంసా=నెమిలియొక్క పురిచేత చేయఁబడిన శిరోభూషణముగలదియు, సాంసిద్ధికీ=స్వభావసిద్ధమైనదియు, అగు, సరస...వృద్ధిః=రసములోఁగూడిన కాంతియనెడు అమృతముయొక్క పెంపు, జీయాత్=సర్వోత్కృష్టమగుఁగాత.

మ. అవతంసం బగుపింఛ దామకము నెల్వొందం బ్రభానంపదు
ద్భవలీలామృతధార లెల్లదెసలఁ భాసిల్లఁ ద్రైలోక్యమో
హవిహారాస్పదరూపధేయసుకుమారాంశ ప్రభావంబులో
లవమాత్రం బొదవఁ మారుండు జగ మెల్లం గెల్చు లీలాగతిఁ. 59

తా. శ్రీకృష్ణునియొక్క దివ్యసౌందర్యమునందలి అతిసూక్ష్మాంశములోని సూక్ష్మాంశముగలిగి మన్మథుఁడు సౌందర్యముగలవారిలో మొదటివాఁడుగ ఎన్నఁబడుచున్నాఁడో, ఆసౌందర్యము శ్రీకృష్ణునికి ఆభరణాదులు ధరింపకయే స్వభావముగానె యున్నది, పింఛము మొదలగు ఆభరణములు సౌందర్యముచేత ప్రకాశించుచున్నవి. అట్టి లోకోత్తరసౌందర్యము పొగడతరముగాదు.

శ్లో. ఆయామేన దృశో ర్విశాలతరయో రతుల్య మార్ద్రస్మిత
చ్ఛాయాధర్షితశారదేన్దులలితం చాపల్యమాత్రం శిశోః,
ఆయాసా నపరా న్విధూయ రసికై రాస్వాద్యమానం ముహు
ర్జీయా దున్మదవల్లవీకుచభరాధారం కిశోరం మహః. 60

టీ. విశాలతరయోః=మిక్కిలి వెడల్పులైన, దృశోః=కన్నులయొక్క, ఆయామేన=పొడవుచేత, అతుల్యం=తగ్గింప సాధ్యముకానిదియు, ఆర్ద్ర...లలితం=సరసమైన చిఱునవ్వుయొక్క కాంతిచేత తిరస్కరింపఁబడిన శరత్కాలమందలిచంద్రునివలె సుందరమైనదియు, శిశోః=బాలునియొక్క, చాపల్యమాత్రం=చపలత్వముమట్టుకు కలదియు, (అనఁగా: పసిపిల్లిదాని చపలత్వముమట్టుకే కలదుగాని తక్కిన అజ్ఞానాదిబాల్యలక్షణములు ఏవియును లేవు అనిభావము.) రసికైః=సారస్యమును దెలిసినవారిచేత, అప

రాః=ఇతరములైన, ఆయాసాః=ప్రయాసములను, విహాయ=పోఁగొట్టి, ముహుః=మాటిమాటికిని, అస్వాద్యమానం=అనుభవింపఁబడుచున్నదియు, ఉన్మద..ధారం=మిక్కిలి మదముగల (యౌవనముచేనైన కామాతిశయముగలిగిన) గోపికలయొక్క కుచములపెంపు (ఉన్నతములగు స్తనములు), ఆధారం=ఆశ్రయముగాఁ గలదియు, కిశోరం=పసిదియు అగు (బాలరూపమగు), మహః=శ్రీకృష్ణుఁడను తేజము, జీయాత్=సర్వోత్తమముగా వర్తించునుగాక.

ఉ. క్రొన్ననబోండ్లు గబ్బిచలిగుబ్బల నానుచు గారవింపఁగా
వెన్నెల నవ్వునవ్వ లరవిందముచంపమఁ గ్రించునేయు వా
ల్గన్నులు బాల్యచాపలవిలాసము మీఱి రసజ్ఞలోక మీ
యన్నియు బుజ్జగింప హృదయంగమ మైనవెలుంగుఁ గాంచెదన్. 60

తా. విశాలములై దీర్ఘములైన కన్నులయొక్క తరుగని చక్కఁదనముగలిగి సరసమయిన చిఱునవ్వుకాంతిచేత శరత్కాలచంద్రునిఁబోలి రసికులైన మహానుభావులచే సకలశ్రమలు తీరునట్లుగా సదా అనుభవింపఁబడుచు యౌవనముచే మత్తుగొనిన గొల్లపడుచులయొక్క గుబ్బచనులమీఁద మక్కువగొని నిలకడచేయుచుండునట్టి ప్రకాశమానుఁడైన చిన్నికృష్ణుఁడె సర్వోత్తముఁడై యుండునుగాక.

శ్లో. స్కన్ధావారసదో వ్రజః కతిపయే గోపా స్సహాయాదయః
స్కన్ధాలమ్బిని వత్సదామ్ని ధనదా గోపాఙ్గనాః స్వాఙ్గనాః,
శృఙ్గారాగిరిగైరికం శివ శివ శ్రీ స్సన్తి బర్హాణి చ
శృఙ్గగ్రాహికయా తథాపి తదితం ప్రాహు స్త్రిలోకేశ్వరమ్. 61

టీ. వ్రజః=గొల్లపల్లె, స్కంధావారసదః=పాళెమందలిసభ (అనఁగాః రాజధానియందలి రాజసభగానున్నది), గోపాః=గొల్లవారు, సహాయాదయః=సహాయులు మొదలగువారు, వత్సదామ్ని=దూడపలుపు, స్కంధాలంబిని=మెడమీఁద వ్రేలుచుండఁగా, ధనదాః=ధనము నిచ్చువారు (గానుండిరి), గోపాంగనాః = గొల్లచెలువలు, స్వాంగనాః=తనయిల్లాండ్రు, శృంగారాః=అలంకారములు, గిరిగైరికం=కొండయందలిగైరికధాతువు, శ్రీమంతి=కాంతిగలిగిన, బర్హాణి చ=నెమలిపింఛములను (సొమ్ములుగానున్నవి), శివ శివ? (సంతాపాశ్చర్యద్యోతకము-మంచివిపంచము లెవ్వియు లేవనిసంతాపమును, అట్లైనను ఇంత మహిమగలవాఁడె యని యాశ్చర్యమును శివశివ అని తెల్పినాఁడు.) తథాపి=అట్లైనను, శృంగగ్రాహికయా=కొంచెముగాగ్రహించి, తత్=ప్రసిద్ధమైన, ఇదం=ఈవస్తువును (శ్రీకృష్ణుని), త్రిలోకేశ్వరం=మూఁడులోకములకు అధిపతినిగా, ప్రాహుః=(పెద్దలు) చెప్పిరి.

ఉ. బాలిశులైన గోపకులు బంధులు పాళెము గొల్లపల్లెము
త్యాలసరాలు దామెనలు దారలు గోపిక లంగరాగముల్
శైలవిటంకధాతువులు చారువిభూషలు పింఛదామముల్
పోలిన నైన విష్ణుఁ డని బుద్ధి నెఱుంగుదు రెల్ల పెద్దలుల్. 61

తా. గొల్లపల్లె రాజధాని; గొల్లవారు సహాయులు; దూడపలుపు రాజదండము; గొల్లపడుచులు ఇల్లాండ్రు; గైరికము అలంకారము; నెమిలిపురి సొమ్ము; ఇట్టి తక్కువైన సాధనసంపత్తి గలవాఁడైనను కృష్ణుఁడు త్రిలోకేశ్వరుఁడని మునులు వక్కాణించియున్నారు. ఆహా యేమి యాశ్చర్యము! ఇంత మహిమ గలవాఁడని కనిపెట్టుటకు మనకు సాధ్యుఁడు కాఁడని భావము.

శ్లో. శ్రీమద్బర్హిశిఖణ్డమణ్డనజుషే శ్యామాభిరామత్విషే
లావణ్యైకరసావసిక్తవపుషే లక్ష్మీసరఃప్రావృషే
లీలాకృష్టరసజ్ఞధర్మమనసే లీలామృతస్రోతసే
కే వా న స్పృహయన్తి హన్త మహసే గోపీజనప్రేయసే. 62

టీ. శ్రీ...జుషే=కాంతిగలిగిన నెమిలిపింఛమనెడు భూషణమును పొందినదియు, శ్యామ...త్విషే=నల్లనై యొప్పుచున్న కాంతిగలదియు, లావణ్య...వపుషే=ముత్తెపు తేటవలె నిగనిగలాడు కాంతియనెడు ఒక్కటేరసముచేత తడుపఁబడిన శరీరముగలదియు, లక్ష్మీసరఃప్రావృషే=లక్ష్మీదేవియనెడు కొలఁకునకు వర్షాకాలమైనదియు, లీలా...మనసే=విలాసముచేత ఆకర్షింపఁబడిన రసికులైనవారియొక్క ధర్మమందు ఆసక్తిగల మనస్సుగలదియు, (రసికుల మనస్సులు ఈకృష్ణునె యెల్లప్పుడు ఆశ్రయించుచున్నవి.) లీలామృతస్రోతసే=విలాసములనెడు అమృతప్రవాహముగలదియు, (అమృతప్రవాహమువలె భోగ్యములై ఎడతెగని విలాసములు గలది) గోపీజనప్రేయసే=గోపికల సమూహమునకు అత్యంతప్రియమైనదియు, అగు, మహసే=శ్రీకృష్ణుఁడను తేజమునకు, కే వా=ఎవ్వరు, న స్పృహయంతి=ఆశపడరు. హన్త=ఔరా!

శా. లావణ్యామృతసీమఁ గన్దళితలీలారాము లక్ష్మీసరః
ప్రావృడ్ధాము నితాంతసంయమితబర్హశ్రీసముద్దాము రా
గావిర్భూతవయోభిరాము విలసద్ధారాధరశ్యాముని
న్సేవింపన్ మదిఁ గోరరే రసికు లాసీమాఖిలప్రేమునిన్. 62

తా. తళతళలాడు నెమిలిపురిని శిరమున నిడుకొని నల్లని చాయగలిగి ముత్తెపు తేటవలె స్వచ్ఛమైన కాంతిగలిగి లక్ష్మీదేవికి మతెంత ఉల్లాసముగలిగించుచు ధర్మాత్ములైన విద్వాంసుల మనస్సుల కింపై యెడతెగని విలాసములుగలిగి గోపికలకు ప్రేమాతిశయ

మును గలిగించునట్టి గోపాలకృష్ణుని సేవింప నెవ్వరు కోరకుందురు. ఎంతచక్కఁదనము? ఏమివిలాసము? ఏమికాంతి? ఏమిప్రభావము? ఏమియలంకారము? సర్వమును మహైశ్వర్యము; మహానందదాయకము.

శ్లో. ఆపాటలాధర మధీరవిలోలనేత్ర
మామోదనిర్భరిత మద్భుతకాన్తిపూరమ్,
ఆవిస్మితామృత మనుస్మృతిలోభనీయ
మాముద్రితానన మహో మధురం మురారేః. 63

టీ. ఆపాటలాధరం=అంతట ఎఱ్ఱనైన మోవి గలదియు, అధీ...నేత్రం=బెదరుగలవై చంచలములైన కన్నులుగలదియు, ఆమోదనిర్భరితం=సంతోషముచేత నిబ్బరమైనదియు, అద్భుతకాంతిపూరం=ఆశ్చర్యకరమైన కాంతియొక్క ప్రవాహము గలదియు, ఆవిస్మితామృతం=ఆవిర్భవించిన అమృతమువంటి చిఱునవ్వుగలదియు, అగు, మురారేః=కృష్ణునియొక్క, మధురం=సుందరమైనదియు, అగు, ఆముద్రితాననం=కొంచెము మోడ్పఁబడిన మోము, అనుస్మృతిలోభనీయం=ఎడతెగని తలంపుచేత మిక్కిలి యాసపడఁదగినది.

మ. అతులానందరసామృతార్ణవ మపాంగాభంగరంగత్తరం
గతతిం బొంగుచుఁ గెంపుమోవి సరిదాఁకం దత్సుధాబిందువుల్
స్మితలీలన్ విలసిల్లె నంచు జనముల్ చిత్తంబులన్ మెచ్చున
ద్భుతశృంగారరసైకముద్రితముఖాంభోజున్ హరిం గొల్చెదన్. 63

తా. స్వభావముచేత ఎఱ్ఱనై గోపికల దంతక్షతములచేత మఱింత ఎఱ్ఱనైన పెదవిగలిగి స్వభావముచేత చపలములై గోపికలఁ జూచుటచేత మఱింత చంచలములైన కన్నులుగలిగి అత్యంతమైన ఆనందముగలిగి లోకోత్తరమైన కాంతివిశేషముగలిగి అమృతమువంటి చిఱునవ్వుగలిగి కడుసుందరమగు కృష్ణుని మోము తలంపఁ దలంపనాస మెండగుచున్నది. (అత్యంత భోగ్యమైనదని భావము.)

శ్లో. జాగృహి జాగృహి చేత శ్చిరాయ చరితార్థతా భవతః,
అనుభూయతా మిద మిదం పురః స్థితం పూర్ణనిర్వాణమ్. 64

టీ. చేతః=మనసా! భవతః=నీకు, చిరాయ=బహుకాలమునకు, చరితార్థతా=కృతార్థత్వము (కలిగినది.) జాగృహిజాగృహి=మేలుకొనుమేలుకొను. పురస్స్థితం=ముందున్న, ఇదమిదం=ఈయీ, పూర్ణనిర్వాణమ్=నిండినసంతోషము, అనుభూయతాం=అనుభవింపఁబడుఁగాక.

చ. వెనుకటివేళలం దను భజించినజన్మశతంబు లట్ల నే
డును భ్రమ మానపోవక గడుం జెలి వొందుము డెందమా చిరం

తనతపముల్ ఫలించి పురతఃస్థితి నున్నది కృష్ణరూప మై
యనవరతానుచింతనసుధారసవీచుల నోలలాడుమిా. 64

తా. ఓమనసా ! ఎంతకాలమునకో ఇప్పుడు నీకు మేలు గలుగుచున్నది. ఇఁక అజ్ఞానమును పెట్టుకోక ఇదిగో కృష్ణరూపముగా నెదుట వచ్చి యున్న ఆనందమును అనుభవింపుము.

శ్లో. చరణయో రరుణం కరుణార్ద్రయోః
కచభరే బహుళం విపులం దృశోః,
వపుషి మఞ్జుల మఞ్జనమేచకే
వయసి బాల మహో మధురం మహః. 65

టీ. అహో=ఓజనులారా ! చరణయోః=పాదములయందు, అరుణం=ఎఱ్ఱనైనదియు, కచభరే=సిగయందు, బహుళం=విస్తార మైనదియు, కరుణార్ద్రయోః=దయచేత తడిసినవైన, దృశోః=కన్నులయందు, విపులం=విశాల మైనదియు, అంజనమేచకే=కాటుకవలెనల్లనైన, వపుషి=దేహమందు, మంజులం=సుందర మైనదియు, వయసి=వయస్సునందు, బాలం=పసిదైనది అగు, మహః=శ్రీకృష్ణుఁడను తేజము, మధురం=అత్యంతభోగ్య మైనది.

ఉ. మేను ఘనాఘనప్రతిభ మించెను బాదపయోరుహంబు గెం
పూని విలోలమయ్యెను దయార్ద్రితమయ్యెను గన్నుదోయి తే
జోనిధి యయ్యె హృత్సరసిశోభితుఁ డయ్యెఁ బురాణుఁ డయ్యె నా
రా నెఱులందు నల్పు నెలప్రాయము గాంచుట వింత యెంతయున్.

తా. ఓజనులారా ! ఎఱ్ఱని పాదములుగలిగి దయారసమును దెల్పు విశాలములైనకన్నులు గలిగి విస్తారమైన సిగ గలిగి నల్లనై సుందరమగుమేను గలిగి బాల్యవయస్సు గలిగినశ్రీకృష్ణునిరూపము ఎంత భోగ్యమైనది. ఎన్ని విధముల నెంతకాల మనుభవించినను తనివి తీరదు.

శ్లో. మాలాబర్హమనోజ్ఞకున్తలభరాం వన్యప్రసూనోక్షితాం
శైలేయద్రవక్లృప్తచిత్రతిలకాం శశ్వన్మనోహారిణీమ్,
లీలావేణురవామృతైకరసికాం లావణ్యలక్ష్మీమయీం
బాలాం బాలతమాలనీలవపుషం వన్దే పరాం దేవతామ్. 66

టీ. మాలా...భరాం=పూలదండగానున్న నెమిలిపింఛములచేత ఒప్పుచున్న సిగగలదియు, వన్య...క్షితాం=అడవియందుఁబుట్టిన పువ్వులచేత చల్లఁబడినదియు, శైలే...తిలకాం=కొండయందుఁబుట్టిన ధాతువులయొక్క ద్రవముచేతఏర్పఱుపఁబడిన రమణీయమైన బొట్టుగలదియు, శశ్వ...రిణీం=ఎప్పుడు అందమైనదియు, లీలా...రసికాం

=విలాసార్థమైన వేణుధ్వనియనెడు అమృతమునందు ముఖ్యముగా రసమును దెలిసినది యు,లావ...మయాం=లావణ్యమనెడు కాంతిస్వరూపమయినదియు, (ముత్తెపుతేట వంటికాంతితోనే చేయఁబడినట్లున్నది.) బాలాం=బాల్యప్రాయముగలదియు,బాల... వపుషం=లేఁతయగు (అప్పుడుచూచిన) క్రొనుగపువ్వువలె నల్లనైన దేహముగలదియు, అగు, పరాందేవతాం = సర్వోత్కృష్టమగు దేవతనుగూర్చి (సర్వోత్కృష్టదైవమైన శ్రీకృష్ణునిగూర్చి), వందే=నమస్కరించుచున్నాను.

ఉ. వింతలుగాఁ గలాపములు వేనలిఁ జుట్టియు వన్యమాలికా
సంతతిఁ జుట్టి జేగురురసంబున దొంతరబొట్టు పెట్టి చె
ల్వంతయు రాశి చేసినక్రియన్ మురళీతరళీకృతామృతా
భ్యంతరసారమై పరఁగు నావిభు మేచకధాముఁ గొల్చెదన్. 66

తా. సిగను నెమిలిపురులదండను చుట్టుకొని అడవియందు పూచినపువ్వులను దురిమికొని పర్వతమందలి ద్రవమునైన ధాతువులచే తిలకము నిడుకొని అమృతము లొలుకునట్లు వేణుగానము నుల్లాసముగఁ జేయుచు లావణ్యకాంతిచే నిండి బాల్యప్రాయముగల్గిన నల్లనిరూపుచే ముద్దులుగుల్కెడు కృష్ణునికి నమస్కరించెదను.

శ్లో.గురుమృదుపదే గూఢం గుల్ఫే ఘనం జఘనస్థలే
నలిన ముదరే దీర్ఘం బాహ్వో ర్విశాల మురఃస్థలే,
మధుర మధరే ముగ్ధం వక్త్రే విలాసి విలోచనే
బహుల కచభరే వన్యం వేషే మనోజ్ఞ మహో మహః. 67

టీ. పదే=పాదమందు, గురుమృదు=మిగులకోమలమయినదియు, గుల్ఫే=గుల్ఫమందు(-చీలమండలందు), గూఢఁ=కప్పుకొని యుండునదియు, జఘనస్థలే=మొలకట్టునందు, ఘనం=గొప్పదియు, ఉదరే=కడుపునందు,నలినఁ=పద్మముఅయినదియు (నాభికమలముగలది),బాహ్వోః=భుజములందు, దీర్ఘఁ=పొడవైనదియు, ఉరఃస్థలే=వక్షస్థలమందు, విశాలం=వెడలువైనదియు,అధరే=పెదవియందు, మధురం=తీయనైనదియు, వక్త్రే=మొగమునందు,ముగ్ధం=సుందరమయినదియు; విలోచనే=కన్నులందు, విలాసి=విలాసములు గలదియు, కచభరే=సిగయందు, బహుల=విస్తారమయినదియు, వేషే=వేషమునందు, వన్యం = అడవిలోనుండునదియు, మనోజ్ఞం=మనోహరమయినదియు, అగు, మహః=శ్రీకృష్ణుఁడను తేజము, అహో=ఆశ్చర్యము.

చ. గురుపదముల్ నిగూఢతరగుల్ఫములుం బలు పొపిఱుందు వి
స్ఫురదురునాభిదీర్ఘకరముల్ పృథువక్షముఁ దావిమోవి సుం

దరవదనంబుఁ బద్మనయనంబులు నీలశిరోజములన్ మనో
హరసుకుమారవేష మొఱపై తగు తేజము నాత్మ *నెంచెదన్. 67

తా. మిగుల కోమలములైన పాదములు, గూఢముగనుండు గుల్ఫములు, విస్తారమయిన జఘనము, నాభియందు పద్మము, అజానువులగు; బాహువులు, విశాలమగు వక్షఃస్థలము, మధురమయినఅధరము, సుందరమగువదనము, విలాసములుగలకన్నులు, విస్తారమగు కచభారము, అడవియందుండువారి వేషము గలిగిన శ్రీకృష్ణుఁడు ఎంత సౌందర్యము గలిగియున్నాఁడు. అహా ఎంత అనుభవించినను తనివి తీరదు గదా.

శ్లో. జిహానం జిహానం సుజానేన మౌగ్ధ్యం
దుహానం దుహానం సుధాం వేణునాదైః,
లిహానం లిహానం సుదీర్ఘై రపాఙ్గై
ర్మహానన్దసర్వస్వ మేత న్నమస్తాత్. 68

టీ. సుజానేన=యౌవనముచేత, మౌగ్ధ్యం=సౌందర్యమును, జిహానంజిహానం=మిక్కిలి పొందుచున్నవాఁడును, వేణునాదైః=పిల్లఁగ్రోవిధ్వనులచేత, సుధాం=అమృతమును, దుహానందుహానం=మిక్కిలిగా కలిగించుచున్నవాఁడును; సుదీర్ఘైః=మిక్కిలి పొడవులైన, అపాంగైః= కడకంటి చూపులచేత, లిహానంలిహానం=గోపికలను అసగొని పలుమారుచూచుచున్నవాఁడును, మహానందసర్వస్వం=గొప్పవాఁడైన నందగోపునియొక్క సకలసంపదయగు, తం=ప్రసిద్ధుఁడైన, ఏతం = ఈకృష్ణునిగూర్చి, నమస్తాత్ = నమస్కరించుచున్నాఁడను.

ఉ. అందముఁ గోరఁగాఁ దగినయౌవనకాంతినిరూఢి నందముం
జెంది కటాక్షవీక్షణముచే వలపించుచుఁ బిల్లఁగ్రోవిచే
డెందము నల్లగా సుధఁ గడించిజడిన్ నిగిడించుచున్ మహా
నందనిధాన మై చెలఁగునందకుమారకుఁ గాంచి మ్రొక్కెదన్. 68

తా. జననమును పొందిన మాత్రమాననే అత్యంతసౌందర్యముగలిగి అమృతమువలె భోగ్యమగునట్లు వేణునాదము చేయుచు మిగుల నాసతో గొల్లపడుచుల చక్కఁదనముఁ జూచుచు నందునిపుణ్యాతిశయమువలన కొమరుఁడై యతని సకలసంపదలు తానే అయియుండిన శ్రీకృష్ణునికి వందనము చేయుచున్నాను.

శ్లో. లసద్బర్హాపీడం లలితలలితస్మేరవదనం
భ్రమత్క్రీడాపాఙ్గం ప్రణతజనతానిర్వృతిపదమ్,

* గౌర్చెదన్.

నవామ్భోదశ్యామం నిజమనుపమామోదభరితం
పరం దేవం వన్దే పరిమళితకైశోరకరసమ్. 69

టీ. లసత్...పీడం = ప్రకాశించుచున్న నెమిలిపింఛము శిరోభూషణముగాఁ గలవాఁడును, లలిత...వదనం=మిక్కిలి సుందరమైన చిఱునవ్వుగల మోముగలవాఁడును, భ్రమత్...పాంగం = చలించుచున్న విలాసములుగల కడకంటి చూపులు గలవాఁడును, ప్రణత..పదం=నమస్కరించిన జనసమూహముయొక్క అత్యంతమైనసుఖమునకు స్థానమైనవాఁడును, నవాంభోదశ్యామం=క్రొత్తదైన మేఘమువలె నల్లనైనవాఁడును, నిజ..భరితం=స్వకీయమైన సౌందర్యముయొక్క పరిమళముచేత నిండినవాఁడును, పరి...రసం=పరిమళించునట్లుగా చేయఁబడిన బాలసంబంధియగు రసముగలవాఁడును, (అనఁగా: బాల్యమందలి సౌందర్యాదులు మిక్కిలి ప్రకాశించుచున్నవని భావము.) పరం=సర్వోత్తముఁడగు, దేవం=శ్రీకృష్ణుని, వందే=నమస్కరించుచున్నాను.

మ. పటుధారాధరశోభితాంగు విలసత్ఫ్వోత్తమాంగుఁ ననుత్కటమందస్మితసుందరుఁ జలదపాంగశ్రేణికాడంబరుఁ
స్ఫుటకైశోరదలాపు మోహనకళాభోగస్వరూపుఁ విశంకటనం సేవకనిర్వృతిప్రదు శుభాకారాన్వదుం గొల్చెదన్. 69

తా. ప్రకాశించెడు నెమలిపింఛమును సిగయందుఁ దాల్చి మిక్కిలి యందమై చిఱునవ్వుగల మోముగలిగి విలాసములుగల కటాక్షములుగలిగి ఆశ్రయించినవారికి పరమానందమునుగలిగించుచు క్రొత్తమేఘమువలె నల్లనై చక్కఁదనమును వెల్లిగొల్పుచు బాల్యరూపచేష్టాదులచేత ముద్దుగుల్కుచుండెడు కృష్ణునకు వందనము.

శ్లో. సారస్యసామగ్ర్య మివాననేన మాధుర్యచాతుర్య మివ స్మితేన,
కారుణ్యతారుణ్య మివేక్షితేన చాపల్యసాఫల్య మిదం దృశోర్మే. 70

టీ. ఆననేన=ముఖముచేత, సారస్యసామగ్ర్యమివ = శృంగారరసముయొక్క పరిపూర్ణత్వమువలెను, స్మితేన=చిఱునవ్వుచేత, మాధుర్యచాతుర్యమివ=సౌందర్యముయొక్క చమత్కారమువలెను, ఈక్షితేన=చూపుచేత, కారుణ్యతారుణ్యమివ=దయయొక్క యౌవనమువలెను, ఇదం = ఈవస్తువు (కృష్ణుఁడు), మే=నాయొక్క, దృశోః = కన్నులకు, చాపల్యసాఫల్యం=పేరాసయొక్క సఫలత్వము (అగుచున్నది).

చ. మురిపెపునవ్వు గా దిది వి మోహరసాస్పద రాశి గాని బి
త్తర మగుచూపు గా దిది నితాంతదయానిధి గాని మోముఁదా
మర యిది గా దఖండరసమాధురి గాని వ్రజాలయాంగనాం
తర మిది గాదు నాదునయనంబులభాగ్యము గాని చూడఁగన్. 70

తా. నేను కృష్ణుని జూచుటకు పేరాసపడి యుండఁగా నిండు శృంగారము గలమోమును ముద్దులు మూటగట్టుచిఱునవ్వును దయారసమును దొలఁకు చూపును గలిగి నాకు పొడగట్టి నాపేరాసను సఫలముచేసెను.

శ్లో. యత్రవా తత్రవా దేవ యది విశ్వసిమ స్త్వయి,
నిర్వాణ మపి దుర్వార మర్వాచీనాని కిం పునః. 71

టీ. దేవ=స్వామీ! యత్రవాతత్రవా=ఎక్కడనో ఒకచోట ఒకజన్మమందు, త్వయి=నీయందు, విశ్వసిమో యది = నమ్మియుంటిమేని (నీవే రక్షకుఁడవని నీయందు భక్తిగలిగి యుంటిమేని), నిర్వాణమపి = మోక్షముగూడ, దుర్వారం = అడ్డగింపరానిది, (అగును.) అర్వాచీనాని=తక్కువైనపురుషార్థములు, కింపునః=ఏమిచెప్పవలెను?

మ. క్రతుహవ్యాదివిశిష్టభావనల ధారావాక్యసుజ్ఞాననం
తతి నెట్లైనను విశ్వసించి నిను నాత్మం గొల్వ మోక్షం బనా
వృతమై వర్తిలు నీకృపారసలనద్వీక్షా ప్తిచే నట్టిసు
వ్రతముం గాంచుమహాత్మకోటి కిల నర్వాచీనముల్ బ్రాఁతియే. 71

తా. కృష్ణా, నిన్ను ఎప్పుడైనను నమ్మియుంటిమేని మోక్షముగూడ అడ్డులేక దొరకును. తక్కిన పురుషార్థములు దొరకుటకు సందేహ మేమాత్రమును లేదు.

శ్లో. రాగాన్ధగోపీజనవన్దితాభ్యాం
యోగీన్ద్రభృఙ్గేన్ద్రనిషేవితాభ్యామ్,
ఆతామ్రపఙ్కేరుహవిభ్రమాభ్యాం
స్వామి న్పదాభ్యా మయ మఞ్జలి స్తే. 72

టీ. స్వామిన్=స్వామీ! రాగ...తాభ్యాం=మిక్కిలి ప్రేమచేత కన్నుగాననిగోపికలయొక్క సమూహముచేత వందనము చేయఁబడినవియు, యోగీ...తాభ్యాం= యోగీశ్వరులనెడు తుమ్మెదలచే మిక్కిలి సేవింపఁబడినవియు, ఆతా...మ్రాభ్యాం = అంతట ఎఱ్ఱనైన పద్మముయొక్క విలాసము గలవియు, అగు, తే=నీయొక్క, పదాభ్యాం=పాదములకొఱకు, అయం=ఈ, అంజలిః=చేమోడ్పు, (నాచేత చేయఁబడుచున్నది.)

మ. అరుణాంభోజవిలాస మై ప్రబలమోహావేశగోపీమన
స్సరసీశోభిత మై మునీంద్రజనచంచచ్చంచరీకవ్రజా
కర మై హంసకనాదమేదురము నై కన్పట్టు పాదాబ్జముం
గరయుగ్మంబున నంటి యుంటి తుద సోఁకన్ వీక నోలార్చెదన్. 72

తా. కృష్ణా! మిక్కిలి మక్కువగొనినగోపికలచేఁ గొలువఁబడి యోగీశ్వరులచేఁ బూజింపఁబడుచు ఎఱ్ఱదామరలవలె నందములైన నీపాదములకు మ్రొక్కుచున్నాను.

శ్లో.అర్థానులాపా న్వ్రజసున్దరీణా, మకృత్రిమాణాం చ సరస్వతీనాం,
అర్ద్రాశయేన శ్రవణాఞ్చలేన, సంభావయన్తం తరుణం గృణీమః. 73

టీ. వ్రజసుందరీణాం=గొల్లచెలువలయొక్క, అకృత్రిమాణాం=కపటము లేని, సరస్వతీనాం=వాక్కులయొక్క, అర్థానులాపాన్ = అర్థములయొక్క పలుకులను, శ్రవణాంచలేన=చెవియొక్క ప్రాంతముచేతను, ఆర్ద్రాశయేన=సరసమగు మనస్సుచేతను, సంభావయంతం=గారవించుచున్న, తరుణం=ఎలప్రాయముగలవాని (కృష్ణుని), గృణీమః=స్తోత్రముచేయుచున్నాము.

చ. చెళకితమైనచూపు లొకచోట నెఱుంగనివూవుబోండ్లమేల్
సొలపుమిటారిచూపులును జొక్కుచెలంగెడి తేటమాటలున్
వలపులు రేవఁగా విని మనంబున నువ్విళులూరుచెల్వునన్
లలితవయోవిలాసుని ననారతముం నుతియింపఁ జెల్లదే. 73

తా. గోపికలు నిష్కపటముగ నుడివినపలుకులను వినుచు వానియర్థములను మనంబునఁ దలంచుకృష్ణుని మేము స్తోత్రము చేయుచున్నాము.

శ్లో.మనసి మమ సన్నిధత్తాం, మధురముఖా మన్థరాపాఙ్గా,
కరకలితలలితవంశా, కాపి కిశోరా కృపాలహరీ. 74

టీ. మధురముఖా=అందమైనమోము గలదియు, మంథరాపాంగా=మందములైన కడకంటిచూపులు గలదియు, కర...వంశా=చేతియందు ధరింపఁబడినసుందరమైనపిల్లఁగ్రోవిగలదియు, అగు, కాపి=చెప్పనలవికాని, కృపాలహరీ=దయాప్రవాహము, అనవరతము దయగలవాఁడగు శ్రీకృష్ణుఁడు, మమ=నాయొక్క, మనసి=మనస్సునందు, సన్నిధత్తాం=సన్నిధానము సేయుఁగాత.

ఉ. అందము నొందునెమ్మొగమునందుఁ గృపామృతవృష్టి పైపయిఁ
గ్రందుకొనంగ నొప్పుకడగన్నులు సెన్నలరంగ వేణువం
దంద కరంబులం జెలఁగ నంగజమోహనమూర్తియై కరం
బుం దనరారుబాలకుఁడు పొల్చు మదీయహృదంతరంబునన్. 74

తా. అంద మగుమోము గలిగి మందములగు కడకంటిచూపులుగలిగి చేత పిల్లఁగ్రోవిని దాల్చి మిక్కిలి దయగలవాఁడగు కృష్ణుఁడు నాకు ఎల్లప్పుడు పొడకట్టును గాత.

శ్లో.రక్షన్తు న శ్శిక్షితపాశుపాల్యా, బాల్యావృతా బర్హిశిఖావతంసాః,
ప్రాణప్రియాః ప్రస్తుతవేణుగీతాః, శీతా దృశః శీతలగోపకన్యాః.75

టీ. శిక్షితపశుపాల్యాః=నేరుపఁబడిన గోరక్షణము గలవియు, బాల్యావృతాః=పసితనముచేత ఆవరింపఁబడినవియు, బర్హిశిఖావతంసాః=నెమిలిపింఛము శిరోభూషణముగాఁ గలవియు, ప్రాణప్రియాః=ప్రాణమువలె ప్రియము లైనవియు, ప్రస్తుతవేణుగీతాః=మిక్కిలి కొనియాడఁబడిన పిల్లనగ్రోవి పాటగలవియు, దృశోః=కన్నులకు, శీతాః=చల్లనైనవియు, శీతలగోపకన్యాః=కామాగ్ని చల్లఁబడునట్లుగా ఆదరింపఁబడిన గొల్లపడుచులు గలవియు అగు (శ్రీకృష్ణమూర్తులు) నః=మమ్ము, రక్షంతు=రక్షించుదురు గాత. ఇట బహువచనము పూజార్థము. పూజ్యుఁడగు కృష్ణుఁడు రక్షించుగాక యని యర్థము.

మ. పాలుపొందఁగ వ్రజబాలకుల్ గొలువ రేపుల్ గోవులన్ మేపి మా
 వులు గుంజామణిపుంజరంజితకరాంభోజంబుతోఁ బింఛభూ
 షలతోఁ జల్లనిచూపుతో మధురవంశప్రౌఢితో నచ్చి కాం
 తల లాలించుచుఁ గాఁకఁ దీర్చుహరి నిత్యంబున్ మముం బ్రోచుతన్.

తా. పశువులఁ గాచుటను జక్కఁగా నేర్చికొని ప్రాణములకన్న ప్రియుఁడై సకలజనులు పొగడునట్లుగా వేణుగానము సేయుచు చూచువారికన్నులకుఁ జంద్రునివలె చల్లఁగ ఆహ్లాదము గలిగించుచు గోపికల మక్కువదీరునట్లు రమించుచు కామాగ్నినిఁ జల్లార్చుచు నెమిలిపింఛము సిగయం దుంచుకొని బాలరూపముతో నున్నకృష్ణుఁడు మమ్ము రక్షించునుగావుత.

శ్లో. స్మిత స్తబకితాధరం శిశిరవేణునాదామృతం
 ముహు స్తరళలోచనం మదకటాక్షమాలాకులమ్,
 ఉరఃస్థలవిలీనయా కమలయా సమాలిఙ్గితం
 భువ స్తల ముపాగతం భువనదైవతం పాతు నః. 76

టీ. స్మిత...తాధరం=చిఱునవ్వుచేతగుత్తులుగలదియగు మోవిగలదియు, (అనఁగా: మోవియందు చిఱునవ్వు మెండుగాఁ దొలకుచున్నదని భావము) శిశి...మృతం=చల్లనైన పిల్లనగ్రోవిధ్వనియనెడు అమృతముగలదియు, ముహు స్తరళలోచనం=మాటిమాటికి చంచలములైన కన్నులుగలదియు, మదకటాక్ష మాలాకులం=మదించిన కడకంటిచూపులయొక్క వరుసలచేత నెఱసినదియు, ఉరఃస్థలవిలీనయా=వక్షస్స్థలమునందు నివసించియున్న; కమలయా=లక్ష్మీదేవిచేత, సమాలింగితం=మిక్కిలి కౌఁగిలింపఁబడినదియు, భువః=భూమియొక్క, తలం=ప్రదేశమును, ఉపాగతం=పొందినదియునగు, భువనదైవతం=లోకములకంతయు దైవమగు శ్రీకృష్ణపరమాత్మ, నః=మమ్ము, పాతు=రక్షించునుగాత.

చ. ఉరమున సింధురాజసుత నుంచియుఁ గౌఁగిట గారవించియున్
 ధరణికి డిగ్గి యీభువనదైవత మెవ్వత వేడి గాంచెనో

తరళమదాలసేక్షణసుధారసముఁ మధురాధరోష్ఠము
స్ఫురళిరవామృతంబు సుమనోజ్ఞదరస్మితబిందుబృందమున్. 76

తా. కెంబెదవియందు చిఱునవ్వు దొలకరించుచుఁ జల్లఁగా వేణుగానము సేయుచు మాటిమాటికి బెళుకులీను కన్నులు గలిగి కడకంటిచూడ్కులను దిక్కుల నెఱయించుచు ఎదపై నెలకొనినపంటవలంతి కౌఁగిలింప భూలోకమునకు వచ్చియున్న సర్వలోక దైవమగు కృష్ణుఁడు మమ్ము రక్షించుఁగాత.

శ్లో. నయనామ్బుజే భజత కామదుఘం
హృదయామ్బుజే కిమపి కారుణికమ్,
చరణామ్బుజే మునికులైకధనం
వదనామ్బుజే వ్రజవధూవిభవమ్. 77

టీ. నయనాంబుజే = తామరవంటి నేత్రమునందు, కామదుఘం = కోరికలను ఇచ్చునదియు, హృదయాంబుజే=హృదయకమలమునందు,కిమపి= ఇంతింతని చెప్పనలవి గాని, కారుణికం=దయగలదియు, చరణాంబుజే = పద్మమువంటిపాదమునందు, మునికులైకధనం=మునీశ్వరుల సమూహమునకు ముఖ్యమైన ధనమైనదియు, వదనాంబుజే= మోముఁ దామరయందు, వ్రజవధూవిభవం = గోపికలకు ఐశ్వర్యమైనదియు అగు (కృష్ణుని), భజత=(జనులారా) సేవింపుఁడు.

ఉ. కన్నులె చాలుఁ గోర్కులొసఁగఁ హృదయాబ్జము చాలుఁ జెల్మికిఁ
సన్నుతపాదపంకజము చాలు మునీంద్రజనానురూపసం
పన్నధనాప్తికిఁ వదనపద్మము చాలువ్రజాంగనావిలా
సోన్నతి కట్టిదివ్యవిభవోజ్జ్వలు నామది నాశ్రయించెదన్. 77

తా. కంటఁ జూచినంతనె కోర్కుల నెల్లనిచ్చునట్టివాఁడై, మనసునందు మితి లేనిదయగలవాఁడై, మునీశ్వరులచేత కులధనముగా నెన్నఁబడి సేవింపఁబడిన పాదములు గలవాఁడై, గోపికలకు అత్యంత సంతోషకారియగు మోముగల కృష్ణు సేవింపుఁడు.

శ్లో. నిర్వాసనం హన్త రసాన్తరాణాం
నిర్వాణసామ్రాజ్యమివావతీర్ణమ్,
అవ్యాజమాధుర్యమహానిధాన
మవ్యాద్వ్రజానామధిదైవతం నః. 78

టీ. రసాంతరాణాం = ఇతరరసములను, నిర్వాసనం = తిరస్కరించునదియు, అవతీర్ణం=భూమియందవతరించిన, నిర్వాణసామ్రాజ్యమివ= మోక్షముయొక్క సర్వాధిపత్యమువలెనున్నదియు, అవ్యా...నిధానం= (అధరణాది) కారణములేకయే కలిగిన

సౌందర్యమునకు గొప్పనిధియైనదియు, వ్రజానాం=గొల్లవారికి, అధిదైవతం=అభిమాన దైవమగు (శ్రీకృష్ణుఁడు), నః=మమ్ము, అవ్యాత్=రక్షించుఁగాత.

చ. ఇతరరసంబు లేమిటికి నీసవమోహనమాధురీనిధిన్
సతతముఁ గాంచినం దనివి చాలుని ముక్తిసుఖానుభూతి యా
కృతి యలరారఁగా దను పరించె ననం దగుగోపరూపనం
గత మగుదైవతం బఖిలకాంతిశ్రితముల్ జతగూర్చుఁ గావుతన్. 78

తా. లోకములో నుండు సర్వరసములను మించిన మాధుర్యము గలవాఁడును, ఆశ్రయించినవారికి మోక్షసామ్రాజ్య మిచ్చుటకు నవతరించినట్లున్నవాఁడును, కారణములేని చక్కఁదనము గలవాఁడును, గొల్లవారికి కులదైవమైనవాఁడును నగుకృష్ణుఁడు మమ్ము రక్షించునుగాత.

శ్లో. గోపీనా మభిమతగీతవేషహర్షా
దాపీనస్తనభరనిర్భరోపగూఢమ్,
కేలీనా మవతు రసై రుపాస్యమానం
కాళిన్దీపులినచరం పరం మహో నః. 79

టీ. అభిమ...హర్షాత్=ఇష్టమైన గానముచేతను వేషముచేతను కలిగిన సంతోషమువలన, గోపీనాం=గోపికలయొక్క, ఆపీన...గూఢం=అంతటబలిసినగుబ్బలపెంపుచేత గట్టిగా కౌఁగిలింపఁబడినదియు, కేళీనాం=క్రీడలయొక్క, రసైః=రసములచేత, ఉపాస్యమానం=సేవింపఁబడుచున్నదియు, కాళిందీపులినచరం=యమునానదియొక్క ఇసుకదిన్నెలందు సంచరించునదియు, పరం=సర్వోత్కృష్టమైనదియు అగు, మహః=శ్రీకృష్ణుఁడను తేజము, నః=మమ్ము, అవతు=రక్షించును గాత.

మ. నవలావణ్యవయోవిలాసమురళీనాదంబులం జొక్కి వ
ల్లవకాంతల్ యమునాధునీపులినలీలావేదికిం దార్చి గా
రవ మొప్పం గుచకుంభసంభృతపరీరంభంబులన్ సంధిబం
ధవిశేషంబులఁ దెల్ప మెచ్చుభువనాధారుండు నన్ బ్రోచుతన్. 79

తా. గోపికలకు ఇంపైన పాటలు పాడుచు వారికి సొంపైన వేషమును దాల్చి వారినిబ్బరంపు గబ్బి గుబ్బలచే గాఢంబుగఁ గౌఁగిలింపఁబడుచు ఆటలయందు వింత వింతలగు కోర్కులు గలిగి యమునానది యిసుకదిన్నెలందుఁ దిరుగునట్టికృష్ణుఁడు మమ్ము రక్షించునుగాక.

శ్లో. ఖేలతాం మనసి ఖేచరాఙ్గనా, మాననీయమృదువేణునిస్వనైః,
కాననే కిమపి నః కృతాస్పదం, కాలమేఘకలహోద్వహం మహః.

టీ. ఖేచ...నిస్వనైః=దేవతాస్త్రీలకు గొనియాడఁదగిన మృదువులైనపిల్లఁగ్రోవి యొక్క ధ్వనులతో (గూడినదై), కాననే=అడవియందు, కృతాస్పదం = చేయఁబడిన యునికిగలదియు, కాల...ద్వహం=నల్లని మేఘములోఁడి కలహమును పొందినదియు (మేఘమువలె నల్లనైనది), కిమపి = ఇట్టిదని నుడువరాని, మహః=తేజము, శ్రీకృష్ణుఁడు,నః=మాయొక్క, మనసి=మనస్సునందు, ఖేలతాం=విహరించును గాక.

మ. అమరీమానితవేణుగానమున బృందారణ్యమందారబృం
దము క్రీడించ యమునాతరంగకణికాంత ర్వేదికామధ్యదే
శమునఁ సాంద్రఘనాఘనప్రతిభటశ్యామద్యుతిం బొల్చుధా
మము నామానసవీథికం గరుణ గ్రమ్మఁ నిల్పుఁగా కెప్పుడున్. 80

తా. దేవగాంధర్వమును మించినదియగు బ్రహ్మగాంధర్వములో వేణుగానము సేయుచు దేవతాస్త్రీలచేఁ గొనియాడఁబడుచు వనములందుఁ గ్రీడించు నల్లని రూపుగల కృష్ణుఁడు మనస్సులందు విహరించుఁగాక.

శ్లో. ఏణీశాబవిలోచనాభి రలసశ్రోణీభరప్రౌఢిభి
ర్వేణీభూతరసక్రమాభి రభితః శ్రేణీకృతాభి ర్వృతః,
పాణీ ద్వౌ చ వినోదయన్ రతిపతే స్తూణీశయై స్సాయకై
ర్వాణీనా మపదం పరం వ్రజజనక్షోణీపతిః పాతు నః. 81

టీ. అలస...ప్రౌఢిభిః = మందగమనములైన గొప్ప పిఱుఁదులచేత నేర్పుగలవాఁడును, వేణీ...క్రమాభిః=అధికమైన శృంగారరసముయొక్క అతిక్రమించుట గలవారును, అభితః=చుట్టును, శ్రేణీకృతాభిః=బంతిగాఁ జేయఁబడినవారును అగు, ఏణీశాబవిలోచనాభిః=జింకపిల్లలయొక్క కన్నులవంటి కన్నులుగల స్త్రీలచేత, వృతః=చుట్టుకొనఁబడినవాఁడును,రతిపతేః=మన్మథునియొక్క,ద్వౌచపాణీ=రెండుచేతులను, తూణీశయైః=అమ్ములపొదులయందుండునట్టి, సాయకైః=బాణములచేత, వినోదయన్=క్రీడింపఁజేయుచున్నవాఁడై (మన్మథుఁడు చేతులతో పొదులందలి బాణములనుదీసి ఎక్కువగా ప్రయోగించునట్లు చేయువాఁడు అనియర్థము, అనఁగా విశేషమై మన్మథోద్రేకము కలిగించువాఁడు అనిభావము.),వాచాం=వాక్కులకు, పరం=మిక్కిలి, అపదం = విషయముకానివాఁడును, వ్రజ...పతిః=గొల్లపల్లెయందలిజనులకు రాజైనవాఁడును అగుకృష్ణుఁడు, నః=మమ్ము,పాతు=రక్షించును గాక.

మ. సొలపుంజూపులు గబ్బిగుబ్బలు ఘనశ్రోణీభరప్రౌఢిని
స్తులశృంగారరసోర్మికల్ గలుగుసంతుల్ బారులై కొల్వఁగ
న్నిలతూణీశయబాణ మంగజుఁడు పాణిం బూనఁగాఁ జేయున
చ్చెలువుఁ వాఙ్మనసాతిలంఘితుఁ బరుఁ సేవింతు నందాత్మజున్. 81

తా. నిబ్బరంపుఁ బిఱుఁదులచేత మందముగ నడచువారును ఎడతెగని శృంగార రసము గలవారును వరుసలుదీరి చుట్టుసుజేరి క్రీడించువారును మిక్కిలి బెళుకులైనక న్నులు గలవారును అగుగోపికలమధ్యమందు క్రీడించువాఁడై చెప్పనలవిగాని మహిమ గలిగి గోపకులకు రాజైన శ్రీకృష్ణుఁడు మమ్ము రక్షించుఁ గాత.

శ్లో. కాళిన్దీపులినే తమాలనిబిడచ్ఛాయే పురస్సంచర
త్తోయే తోయజపత్త్రపాత్త్రనిహితం దధ్యన్న మశ్నాతి యః,
వామే పాణితలే నిధాయ మధురం వేణుం విషాణం కటి
ప్రాన్తే గాశ్చ విలోకయన్ ప్రతికలం తం బాల మాలోకయే. 82

టీ. యః=ఏకృష్ణుఁడు, వామే=డాపలిదైన, పాణితలే=అఱచేతియందు, మధు రం=అందమైన, వేణుం=పిల్లఁగ్రోవిని, కటిప్రాంతే=మొలప్రక్కను, విషాణం=ఊఁదు వట్టికొమ్మును, నిధాయ=ఉంచి, ప్రతికలం=ప్రతిక్షణమందును, గాః=గోవులను, విలోక యన్ =చూచుచున్నవాఁడై, తమాలనిబిడచ్ఛాయే=చీఁకటిమ్రాకులయొక్క దట్టమైన నీడగలదై, పురస్సంచరత్తోయే=ఎదుటప్రవహించుచున్న ఉదకముగల, కాళిందీపులినే =యమునానదియొక్క ఇసుకదిన్నెయందు, తోయజపత్త్ర పాత్త్రనిహితం=తామరాకనె డి పాత్రమం దుంచఁబడిన, దధ్యన్నం=పెరుఁగన్నమును, అశ్నాతి=భుజించుచున్నాఁ డో, తం=అట్టి ప్రసిద్ధుఁడైన, బాలం=బాలకృష్ణుని, ఆలోకయే=చూచుచున్నాను.

ఉ. చీఁకటిమ్రానిజొంపమునఁ జెన్నగుసైకతవేది నీలపు
న్నాకజలంబులో మురళి వామకరంబునఁ బట్టి దట్టపై
దా కొనగొమ్ముఁ జెక్కుకొని తామరపాకునఁ జల్ది మెక్కుచున్
గోకులముం బ్రతిక్షణముఁ గూరిమిఁ గన్గొనుబాలుఁ గాంచెదన్. 82

తా. మొలకట్టున నూఁదెడుకొమ్మును జెక్కుకొని ఎడమచేత పిల్లఁగ్రోవిని బట్టుకొని కుడిచేతియందు తామరాకులోఁ బెరుగన్నము పెట్టుకొని దట్టమైన చీఁకటి మ్రాకుల నీడగలదై ఎదురు నీరు పారుచుండినట్టి యమునయొడ్డున ఇసుకదిన్నెయందు భోజనము సేయుచు విహరించునట్టి బాలగోపాలకృష్ణుని జూచుచున్నాను.

శ్లో. య ద్గోపీవదనేన్దుమణ్డన మభూ త్కస్తూరికాపత్త్రకం
య ల్లక్ష్మీకుచశాతకుమ్భకలశే వ్యాకోశ మిన్దీవరమ్,
య న్నిర్వాణనిధానసాధనవిధౌ సిద్ధాఞ్జనం యోగినాం
త న్న శ్శ్యామల మావిరస్తు హృదయే కృష్ణాభిధానం మహః. 83

టీ. యత్=ఏది, గోపీ...మండనం=గోపికలయొక్క చంద్రునివంటి మొగ మునకుభూషణమైన, కస్తూరికాపత్త్రకం=కస్తూరితిలకము, అభూత్=అయెనో, యత్ =ఏది, లక్ష్మీ...వ్యాకోశం=లక్ష్మీదేవియొక్క స్తనములనెడి బంగారుకుండలయందు విక

సించిన, ఇందీవరం=నల్లకలువ,అభూత్, యత్=ఏది, యోగినాం=యోగులకు,నిర్వాణ...నిధా=మోక్షమనెడినిధిని (గూఢమగు ధననిక్షేపమును) సాధించుటయొక్క విధానమునందు,సిద్ధాంజనం=సిద్ధుల కాటుక, అభూత్, శ్యామలం=నల్లనిదై, తత్=ప్రసిద్ధమైన,కృష్ణాభిధానం=కృష్ణుఁడను పేరుగల, మహః=తేజము,శ్రీకృష్ణుఁడు, మమ=నాయొక్క,హృదయే=మనస్సునందు, ఆవిరస్తు=ఆవిర్భవించుఁగాత.

ఉ. ఏహరి వల్లవీజనముఖేందులకున్ మృగనాభిచిత్రకం
బేహరి కల్మికొమ్మకుచహేమఘటంబుల నొప్పునుత్పలం
బేహరి ముక్తిసేవధి మునీంద్రులకుం గనఁ జేయునంజనం
బాహరి నీలమూర్తి హృదయంబున సన్నిధిఁ జేయుఁగావుతన్. 83

తా. గోపికలయొక్క చంద్రునివంటి మోములకు కస్తురిబొట్టువలె నందమునుగలిగించువాఁడును, లక్ష్మీదేవియొక్క కుచములయందు నందము గుల్కుచుండు వాఁడును, యోగీశ్వరులకు మోక్షమును జూపువాఁడును అగు నల్లని కాంతిగల కృష్ణుఁడు మామనంబులఁ దోచుఁగాత.

శ్లో. ఫుల్లేన్దీవరకాన్తి మిన్దువదనం బర్హావతంసప్రియం
శ్రీవత్సాఙ్క ముదారకౌస్తుభధరం పీతామ్బరం సున్దరమ్,
గోపీనాం నయనోత్పలార్చితతనుం గోగోపసఙ్ఘావృతం
గోవిన్దం కలవేణునాదనిరతం దివ్యాఙ్గభూషం భజే. 84

టీ. ఫుల్లేందీవరకాంతిం=వికసించిన నల్లఁగలువయొక్క కాంతిగలవాఁడును,ఇందువదనం=చంద్రునివంటి మోముగలవాఁడును, బర్హావతంసప్రియం=నెమలిపింఛమను శిరోభూషణమే ఇష్టమైనదిగాఁగలవాఁడును, శ్రీవత్సాంకం=శ్రీవత్సమనెడు పుట్టుమచ్చగలవాఁడును, ఉదారకౌస్తుభధరం= గొప్పదియగు కౌస్తుభమను మాణిక్యమును ధరించినవాఁడును, పీతాంబరం=పచ్చనివలువ గలవాఁడును, సుందరం=అందమైనవాఁడును, గోపీనాం=గోపికలయొక్క, నయనోత్పలార్చితతనుం=నేత్రములనెడి కలువపువ్వులచేతఁబూజింపఁబడిన దేహముకలవాఁడును, గోగోపసంఘావృతం=గోవులయొక్కయు గోపకులయొక్కయు సమూహములచేఁ జుట్టుకొనఁబడిన వాఁడును, కలవేణునాదనిరతం=అవ్యక్తమధురమైన వేణునాదమునందు ఆసక్తిగలవాఁడును,దివ్యాంగభూషం=సర్వోత్తములైన అవయవములందలి ఆభరణములు గలవాఁడును, అగు, గోవిందం=శ్రీకృష్ణుని, భజే=సేవించుచున్నాను.

శా. శ్రీవత్సాంకితు గోపికానయనరాజీవార్చితుం గోపగో
సేవాభావితుఁ గౌస్తుభోల్లసితు వంశీనాదమోదాన్వితున్

గోవిందుఁ నవపింఛయుక్తు శశివక్త్రుఁ ఫుల్లనీలోత్పలుఁ
శ్రీవిభ్రాజితు పాటలాంబరయుతుఁ సేవింతు భూషాంచితున్. 84

తా. శ్రీవత్సాంకుండును, గోపికలనయనోత్పలంబులచేతం బూజింపఁబడువాఁడును, గోగోపాలసేవితుండును, కౌస్తుభవతుండును, వేణునాదవినోదుండును, బర్హిబర్హావతంసుండును, బూర్ణచంద్రాననుండును, నీలోత్పలకాంతిశరీరుండును, హారకేయూరాద్యలంకారశోభితుండును నగు గోవిందుని సేవించుచున్నాను.

శ్లో. యన్నాభీసరసీరుహాన్తరపుటే భృఙ్గాయమాణో విధిః
యద్వక్షః కమలావిలాససదనం యచ్చక్షుషీ చేన్దినౌ,
యత్పాదాబ్జవినిస్సృతా సురనదీ శమ్భోశ్శిరోభూషణం
యన్నామస్మరణం ధునోతి దురితం పాయాత్స నః కేశవః. 85

టీ. యన్నాభీ...పుటే=ఎవ్వనియొక్క బొడ్డునందలి తామరయొక్క లోపలిభాగమును దొప్పయందు (దొప్పవలెనుండువట్టియా తామరయొక్క లోపలిభాగమందు), విధిః=బ్రహ్మ, భృంగాయమాణః=తుమ్మెదవలె సంచరించుచున్నాఁడో, యద్వక్షః=ఎవ్వనిరొమ్ము, కమలావిలాససదనం=లక్ష్మీదేవియొక్క విలాసార్థమైనగృహమో (లక్ష్మీదేవి యెవ్వనిరొమ్మునందు విలాసముగా నెలకొన్నదో), యచ్చక్షుషి=ఎవ్వనికన్నులు, ఇన్దినౌ=సూర్యచంద్రులో, యత్పాదాబ్జవినిస్సృతా=ఎవ్వని పాదమునుండి వెలువడినదైన, సురనదీ=గంగానది, శంభోః=శివునికి, శిరోభూషణం=శిరోభూషణమాయెనో, యన్నామస్మరణం=ఎవ్వనినామములను తలంచుట, దురితం=పాపమును, ధునోతి=చెదరఁగొట్టుచున్నదో, సః=అప్రసిద్ధుఁడైన, కేశవః=శ్రీకృష్ణుఁడు, నః=మమ్ము, పాయాత్=రక్షించుఁగాక.

ఉ. ఎవ్వనినాభికంజమున భృంగముభంగిఁ జెలంగుఁ బద్మజుం
డెవ్వనికన్ను లిందురవు లెవ్వనివక్షము లచ్చి కాటప
ట్టెవ్వనిపాదపద్మజల మీశుజటాటవిఁ బొల్చుభూషణం
బెవ్వనిఁ బేర్కొనం గలుష మీఁగునొ యాహరి నన్నుఁ బ్రోచుతన్.

తా. బ్రహ్మకు పుట్టినిల్లు అయిన నాభికమలము గలవాఁడును, లక్ష్మీదేవికి నివాసమైన వక్షస్థ్సలము గలవాఁడును, సూర్యచంద్రులు నేత్రములుగాఁ గలవాఁడును, శివశిరోభూషణమైన గంగకు పుట్టినిల్లైన పాదముగలవాఁడును, సకలపాపహరములయిన నామధేయములు గలవాఁడైనకృష్ణుఁడు మమ్ము రక్షించుఁగాక.

శ్లో. రక్షన్తు త్వామసితజలజైరఞ్జలిః పాదమూలే
మీనా నాభీసరసి హృదయే మారబాణా మురారేః,

హారాః కణ్ఠే హరిమణిమయా వక్త్రపద్మే ద్విరేఫాః
పిఞ్ఛాపీడా శ్చికురనిచయే ఘోషయోషిత్కటాక్షాః. 86

టీ. మురారేః=కృష్ణునియొక్క, పాదమూలే=అడుగుల మొదట, అసితజలజైః=నల్లగలువలచేతనైన, అంజలిః=దోయిలియు, నాభిసరసి=బొడ్డు అనెడు కొలఁకునందు, మీనాః=చేఁపలును, హృదయే=ఱొమ్మునందు, మారబాణాః=మన్మథుని బాణములును, కంఠే=కంఠమునందు, హరిమణిమయాః = ఇంద్రనీలరత్నవికారములైన, హారాః = హారములును, వక్త్రపద్మే=మోముదామరయందు, ద్విరేఫాః = తుమ్మెదలును, చికురనిచయే=కురుల మొత్తమునందు, పింఛాపీడాః=నెమలిపురుల నెడు శిరోభూషణములును అగు, ఘోషయోషిత్కటాక్షాః = గొల్లభామలకడకంటిచూపులు, త్వాం = నిన్ను, రక్షంతు = రక్షించుఁగాక.

చ. కమలదళాక్షునంఘ్రులకుఁ గల్వలదోయిలి నిమ్ననాభికూ
పమునకు మీలు పేరెదకు భావజువాలు శిరోధి కింద్రర
త్నములసరాలు మోముయిరిదమ్మికిఁ దుమ్మెదచాలు మౌళికిన్
విమలపుఁబీలిడాలు దగు వ్రేతలచూపులు నిన్నుఁ బ్రోచుతన్. 86

తా. గోపికల నల్లని కడకంటిచూపులు కృష్ణుని పాదములయందుఁ బొలసినపుడు నల్లగలువలదోయిలివలెను, నాభిసరస్సున మీనముల వలెను, మనస్సున మదనబాణముల వలెను, కంఠమున ఇంద్రనీలముల హారములవలెను, మోముఁదామరయందు తుమ్మెదలవలెను, కురులందు పింఛములవలెను జూపట్టుచుండెను. అట్టి కటాక్షములు మమ్ము రక్షించును గాక.

శ్లో. దధిమథననినాదై స్త్యక్తనిద్రః ప్రభాతే
నిభృతపద మగారం వల్లవీనాం ప్రవిష్టః,
ముఖకమలసమీరై రాశు నిర్వాప్య దీపాన్
కబలితనవనీతః పాతు గోపాలబాలః. 87

టీ. ప్రభాతే=ప్రాతఃకాలమునందు, దధిమథననినాదైః=పెరుఁగుచిలుకుటవలని ధ్వనులచేత, త్యక్తనిద్రః=విడువఁబడిన నిద్రగలవాఁడగుచు, నిభృతపదం=అలికిడిలేని పాదన్యాసములు గలుగునట్లుగా, వల్లవీనాం=గోపికలయొక్క, అగారం=గృహమును, ప్రవిష్టః=ప్రవేశించినవాఁడగుచు, ముఖ...మీరైః=తామరవంటి ముఖముయొక్క వాయువులచేత, దీపాన్=దీపములను, ఆశు=శీఘ్రముగా, నిర్వాప్య=ఆర్పి, కబలితనవనీతః=మ్రింగఁబడినవెన్న గలవాఁడగు, గోపాలబాలః=గొల్లపిల్లవాఁడగు శ్రీకృష్ణుఁడు, నః=మమ్ము, పాతు=రక్షించుఁగాక.

ఉ. ప్రొద్దునఁ జల్లఁ జిల్కు రవముల్ చెవి సోఁకిన యంతలోఁపలన్
నిద్దురలేచి గోపరమణీసదనంబులఁ జొచ్చి రొయ్యన
న్నద్దు మణంచి యాస్యపవనంబున నాళముఁ బూని దీపము
ల్పెద్ద రొనర్చి వెన్నఁ గబళించినగోపకుమారుఁ గాంచెదన్. 87

తా. వేఁకువజామున గొల్లభామలు పెరుఁగు చిలుకుచుండఁగా ఆధ్వని విని మేలుకొని ఎవ్వరికి తెలియకుండునట్లు తిన్నఁగా అడుగు లడుచు వారియిండ్లకుఁ బోయి అక్కడి దీపములను ఊఁది యార్పి వెన్న మ్రింగునట్టి కృష్ణుఁడు మమ్ము రక్షించును గాక.

శ్లో. ప్రాతః స్మరామి దధిఘోషవినీతనిద్రం
నిద్రావసానరమణీయముఖారవిన్దమ్,
హృద్యానవద్యవపుషం నయనాభిరామ
మున్నిద్రపద్మనయనం నవనీతచోరమ్. 88

టీ. దధిఘోషవినీతనిద్రం=పెరుఁగుచిలుకుటవలనఁ గలిగినచప్పుడుచేత అణఁపఁబడిననిద్రగలవాఁడును, నిద్రా...విందం=నిద్ర చాలించినప్పుడు ముద్దులుగుల్కు మోముదామర గలవాఁడును, హృద్యా...వపుషం = మనోజ్ఞమై దోషరహితమైన దేహము గలవాఁడును, నయనాభిరామం=కన్నులకు రమణీయమైనవాఁడును, ఉన్ని...నయనం =వికసించిన పద్మములవంటి కన్నులు గలవాఁడును అగు, నవనీతచోరం=వెన్నలు దొంగిలించునట్టి బాలకృష్ణుని, ప్రాతః=ప్రొద్దున, స్మరామి=తలఁచుచున్నాను.

చ. పెరుఁగు మథించువేళఁ గనిపెట్టుక లేచిననిద్రమబ్బుతో
నరుణిమఁ జెందుకన్నుఁగవయందముఁ జారుముఖారవిందమున్
సరసతనూవిలాసములచందముఁ జూడ్కికి వేడ్క సేయఁగా
బరఁగెడు వెన్నదొంగను బ్రభాతమునన్ నుతియింతు నామదిన్. 88

తా. పెరుఁగుచిలుకుచుండఁగా ఆచప్పుడు విని మేలుకొని, మేలుకొనినపుడు ముద్దులు మూటగట్టునట్టి మోముగలిగి చక్కఁదనమే కాని దోషము కొంచెమైనను లేని మేనుగలిగి చూచువారికి కన్నులపండువై వికసించిన తామరలవంటి కన్నులు గలిగిన చిన్నారి వెన్నదొంగను చిన్నికృష్ణుని ప్రొద్దుననే తలంచుచున్నాఁడను.

శ్లో. ఫుల్లహల్లకవతంసకోల్లస, ద్గల్ల మాగమగవీగవేషితమ్,
వల్లవీచికురవాసితాఙ్గులీ, పల్లవం కమపి వల్లవం భజే. 89

టీ. ఫుల్ల...గల్లం=వికసించిన ఎఱ్ఱదామరయనెడు కర్ణభూషణముచేతఁ బ్రకాశించుచున్న చెక్కిళ్లుగలవాఁడును, అగ...వేషితం=వేదవాక్కులచేత వెదకఁబడినవాఁడును, వల్ల...పల్లవం=గోపికలయొక్క కుంతలములచేత పరిమళింపఁజేయఁబడిన చిగుళ్ల

వంటి ప్రేష్ఠ గలవాఁడును, కమపి=ఇట్టివాఁడని నుడువ శక్యముకానివాఁడును అగు, వల్లవం=గోపాలకృష్ణుని, భజే=సేవించుచున్నాను.

ఉ. వాల్లకతల్లజశ్రుతివుటాభరణోజ్జ్వలగల్లభాగునిఁ
వల్లవకామినీచికురబంధసమోత్కరవాసితాంగులీ
పల్లవు మౌనిమాననవిభాసితు వేదగవీగవేషితుఁ
నల్లలితారుణాంబుజవిశాలవిలోచనుఁ గొల్చెదఁ మదిన్. 89

తా. వేదవాక్యములకును అందరాని మహిమ గలవాఁడైనను లీలార్థము గొల్ల వేషమును దాల్చి చెక్కిళ్లకు కాంతి గలుగునట్టుగా చెవిలోనను ఎఱ్ఱదామర పువ్వు నిడికొనిన విలాసముగలవాఁడై గొల్లపడుచుల కురులు దువ్వి కొప్పుఁబెట్టుచు వారిని మచ్చికచేసికొనువాఁడైన కృష్ణుని సేవించుచున్నాను.

శ్లో. స్తేయం హరే ర్హరతి యన్నవనీతచౌర్యం
జారత్వ మస్య గురుతల్పకృతాపరాధమ్,
హత్యాం దశాననహతి ర్మధుపానదోషం
యత్పూతనా స్తనపయ స్స పునాతు కృష్ణః. 90

టీ. యత్=ఎందువలన, హరేః=శ్రీకృష్ణునియొక్క, నవనీతచౌర్యం=వెన్న దొంగతనము, స్తేయం=బంగారు దొంగిలించుటయను మహాపాపమును, హరతి=పోఁగొట్టుచున్నదో, యత్, అస్య=ఈకృష్ణునియొక్క, జారత్వం = గోపికాజారుఁడగుట, గురుతల్పకృతాపరాధం=గురుభార్యయందుచేయఁబడిన అపరాధమును, హరతి, యత్, దశాననహతిః=రావణునిచంపుట, హత్యాం=బ్రహ్మహత్యను, హరతి, యత్, పూతనా స్తనపయః=పూతనయొక్కచన్నుబాలు గుడుచుట, మధుపానదోషం=మద్యము డ్రాగుటవలని దోషమును, హరతి, తతః=అందువలన, సః=అప్రసిద్ధుఁడైన, కృష్ణః=కృష్ణుఁడు, పునాతు=మమ్ము పవిత్రులను జేయుఁగాత.

చ. గురుసతిఁ గూడినట్టియఘకోటి చనుఁ వ్రజజారతారతిం
బొరయువు మద్యదోషములు పూతనచన్నులు చేఁపు ఔంచినం
దొరలును హత్య రావణహతిన్ వినఁ జౌర్యము వాయు వెన్నదొం
గరికము లెన్న నట్టికథ గల్గినశౌరి పవిత్రుఁ జేయుతన్. 90

తా. వెన్న దొంగిలించిన చరిత్రమును వినినయెడ స్వర్ణస్తేయమను పాపము పోవుచున్నది. గోపికాజారుఁడగు చరిత్రమును వినిన గురుతల్పగమనమువలని పాపము పోవుచున్నది. రావణుని వధించిన చరిత్రమును వినిన బ్రహ్మహత్యాదోషము నశించుచున్నది. పూతనా స్తన్యపానము చేసిన చరిత్రమును వినిన మద్యపానదోషము పోవుచున్నది.

కావున ఇట్టి మహిమాతిశయము గలిగిన శ్రీకృష్ణుఁడు సర్వవిధములచేతను మమ్ము పవిత్రులఁ జేయుఁగాక.

శ్లో. మార మావన మదీయమానసే, మాధవైకనిలయే యదృచ్ఛయా,
శ్రీరమాపతి రిహాగమే దసౌ, క స్సహేత నిజవేశ్మలఙ్ఘనమ్. 91

టీ. మార=మన్మథుఁడా, మాధవైకనిలయే=శ్రీకృష్ణునకు ఒక్కనికె నివాసమైన, మదీయమానసే=నామనస్సునందు, యదృచ్ఛయా=ఇష్టమువచ్చినట్లు, మావస=ఉండకు. అసౌ=ఈ, శ్రీరమాపతిః=లక్ష్మీనాథుఁడగు శ్రీకృష్ణుఁడు, ఇహ=ఇక్కడికి, అగమేత్=వచ్చేని, నిజవేశ్మలంఘనం = తనయింటిని అక్రమించుటను, కః=ఎవఁడు, సహేత=ఓర్చును.

చ. అనుపమదివ్యధామము మురారికి నామన మట్లు గావునన్
మనసిజ నిల్వ వద్దు చనుమా వినుమా యనుమాన మేటికిన్
వనరుహలోచనుం డిటకు వచ్చిన నేరము వచ్చు నెమ్మియిం
దనగృహసీమ నొండొకఁడు దార్కొన నెవ్వఁడు సైఁచుఁ జెప్పుమా.

తా. ఓయిమదనుఁడా! నామనంబు శ్రీనాయకుండగు శ్రీవిష్ణుదేవునకు నాలయంబు గావున నిక్కడనిల్వకుమా. శ్రీపతి వచ్చిన నీకు నేరంబు దొరఁకొనును. తన యింటఁ జొచ్చిన నెవ్వని నెవ్వండు సైఁచును? ఇంతనైన శీఘ్రముగ వెడలుము.

ప్రతీక.—శ్రీకృష్ణభగవానుని విరహముచే మన్మథపీడితయగు గోపిక మన్మథదూషణము చేయుచున్నదని భావము.

శ్లో. ఆకుఞ్చితం జాను కరంచ వామం, న్యస్య క్షితౌ దక్షిణహస్తపద్మే,
ఆలోకయన్తం నవనీతఖణ్డం, బాలం భజే కృష్ణ ముపానతాఙ్గమ్. 92

టీ. ఆకుంచితం = ముడువఁబడినట్టి, వామం=డాపలిదైన, జాను=మోఁకాలిని, కరంచ=చేతిని, క్షితౌ=భూమియందు, న్యస్య=ఉంచి, దక్షిణహస్తపద్మే=తామరవంటి కుడిచేతియందు, నవనీతఖండం = వెన్న ముద్దను, ఉపానతాంగం = వంచఁబడినదేహము గలవాఁడగుచు, ఆలోకయంతం = చూచుచున్న వాఁడును, బాలం=బాలుఁడును అగు, కృష్ణం=కృష్ణుని, భజే=సేవించుచున్నాను.

ఉ. దాపలికేలు జానువు నుదారగతిన్ ధరణీతలంబున
న్మోపి యుపానతాంగమున నూల్కొని దక్షిణహస్తపంకజ
స్థాపిత మైనవెన్నఁ బ్రమదంబునఁ జూచి చెలంగుచెల్వుని
న్గోపకుమారు దంతిగమనుణ్ సతతంబు మదిం దలంచెదన్. 92

తా. ఎడమమోఁకాలు ఎడమచేతిని వంచి భూమియందు మోఁపి కుడిచేతియందు వెన్నముద్దను నుంచుకొని వంగి చూచుచుండు బాలకృష్ణుని సేవించుచున్నాను.

శ్లో. జానుభ్యా మభిధావ న్తం పాణిభ్యా మతిసున్దరమ్,
సకుణ్డలాలకం బాలం గోపాలం చి న్తయే దుషః. 93

టీ. జానుభ్యాం=మోఁకాళ్లచేతను, పాణిభ్యామపి=చేతులచేతను, అభిధావంతం=పరువిడుచున్నవాఁడును, సుందరం=అందమైనవాఁడును, సుకుండలాలకం=మంచి కుండలములును ముంగురులును గలవాఁడును, బాలం=బాలుఁడునగు, గోపాలం=గొల్లవేషమును దాల్చినకృష్ణుని, ఉషః=వేఁకువను, చింతయేత్=ధ్యానింపవలెను.

ఉ. నిద్దపుమద్దికాయ లరనిక్కఁ బదంబున జానుయానము౯
ముద్దుమొగంబునం జెలఁగుముంగురు లందపురావిరేకయు౯
గద్దరివెళ్ళఁజూపులు జొకాటపునవ్వులుఁ గల్గుబాలకుం
బొద్దున మేలుకాంచి దినము౯ మది నెంచెద నందనందనున్. 93

తా. మోఁకాళ్లతోను అఱచేతులతోను పడివడిగా దోఁగాడుచు ముద్దులు గుల్కుచుండువాఁడై చెవుల పోఁగులును నొసట ముంగురులును మురువుచూప బాలగోపాలవేషముం దాల్చిన శ్రీకృష్ణుని ధ్యానముచేసెదను.

అవ. శ్రీకృష్ణభగవానుఁడు. లీలాశుకయోగికిఁ గలయవతారాంతర భక్తిని శోధింపఁగోరి తాను గోదండరాముఁడై యావిర్భవించి దర్శనమీయఁగా లీలాశుక యోగీంద్రుఁడు చెప్పుచున్నాఁడు.

శ్లో. విహాయ కోదణ్డశరౌ ముహూ ర్తం
గృహాణ పాణౌ మణిచారు వేణుమ్,
మాయూరబర్హంచ నిజో త్తమాఙ్గే
సీతాపతే త్వాం ప్రణమామి పశ్చాత్. 94

టీ. సీతాపతే=రామా, కోదండశరౌ=ధనుస్సును బాణమును, విహాయ=విడిచి, పాణౌ=హస్తమందు, ముహూర్తం=కొంచెముసేపు, మణిచారువేణుం=రత్నవికారమైనది గనుకనె అందమైనపిల్లఁగ్రోవిని, నిజోత్తమాంగే=సొంతశిరమునందు, మయూరబర్హంచ = నెమిలిపింఛమును, గృహాణ=పెట్టుకొనుము. పశ్చాత్=వెనుక, అహం=నేను, త్వాం=నిన్నుఁగూర్చి, ప్రణమామి=నమస్కరించుచున్నాను.

మ. శరచాపంబులు మాని మానికపువంశం బున్నతిం గేలుఁదా
ల్చి రవాణంబుగ నిల్పినట్టి మణి తగ౯ సేవించి సీతామనో
హర నామముచ్చట దీరునప్పుడుగదా యాత్మం బ్రశంసించెదన్. 94

తా. రామా! నీవు ధనుస్సును బాణములను విడిచి పిల్లఁగ్రోవిని నెమిలిపింఛమును ధరించితివేని నేను నీకు మ్రొక్కెదను. అనఁగా రాముఁడు కృష్ణుఁడు భేదము లేనివారయ్యు నాకు కృష్ణావతారమందే భక్తి యెందుగాన కృష్ణుఁడవుగానే సాక్షాత్కరింపుము. నామనోరథము ఈడేరును.

అవ. ఈశ్లోకార్థంబు గోపాలబాలవాక్యంబుగాఁ జెప్పఁబడుచున్నది.

శ్లో. అయం క్షీరామ్భోధేః పతి రితి గవాం పాలక ఇతి
శ్రితో౽స్మాభిః క్షీరోపనయనధియా గోపతనయః,
అనేన ప్రత్యూహో వ్యరచి సతతం యేన జననీ
స్తనా దప్యస్మాకం సకృదపిపయో దుర్లభ మభూత్. 95

టీ. అయం=ఈ, గోపతనయః=గొల్లపిల్లవాఁడు, క్షీరాంభోధేః=పాలసముద్రమునకు, పతిరితి=రాజనియు, గవాం=గోవులకు, పాలక ఇతి = కాపరియనియు, క్షీరో...ధియా=పాలను సంపాదించుకొనవలయు నను తలంపుచేత, అస్మాభిః = మాచేత, శ్రితః=ఆశ్రయింపఁబడెను. యేన=ఏకారణముచేత, సతతం=ఎల్లప్పుడు, అస్మాకం=మాకు, జననీ స్తనాదపి=తల్లిచంటినుండియు, సకృదపి=ఒకప్పుడైనను, పయః=పాలు, దుర్లభం=పొందనలవికానిది, అభూత్=ఆయెనో(తేన=ఆకారణముచేత), అనేన=ఈ కృష్ణునిచేత, ప్రత్యూహః=పాలుదొరకుటకు ఆటంకము, వ్యరచి=చేయఁబడినది.

చ. చెలువుఁడు గోగణాధిపతి క్షీరపయోధివిహారి యీతనిం
గొలిచినఁ బాలు గల్గు ననుకోరికతోఁ గడుభక్తి సేయఁగా
భళిభళి మాదుతల్లి చనుఁబాలకు నైతము విఘ్నకర్తయై
యలవడె నెట్టు గొల్తు మిఁక నక్కట యేఁడని నమ్మిగోపకున్. 95

తా. ఈకృష్ణుఁడు పాలసముద్రమునకు రాజనియు, గోవులను బాలించువాఁడనియు ఎంచి మనకు వలసినన్ని పాలు దొరకుననునభిలాషచేత వీనిని ఆశ్రయించితిమి. ఈతనిసేవింప మొదలిడినదిమొదలు మాతల్లిచనుఁబాలకుఁగూడ కరవయ్యెను. (మరల జన్మము రాదనుట.)

అవ. ఈశ్లోకార్థంబు ఒకగోపికయొక్క విరహవచనంబుగాఁ జెప్పఁబడుచున్నది.

శ్లో. హస్త మాక్షిప్య యాతో౽సి బలాత్కృష్ణ కి మద్భుతమ్,
హృదయా ద్యది నిర్యాసి పౌరుషం గణయామి తే. 96

టీ. కృష్ణ, బలాత్=బలవంతముగా, హస్తం=చేతిని, ఆక్షిప్య=జాడిగుంజుకొని, యాతః=పోయినవాఁడవు, అసి=అగుచున్నావు. కిం=ఏమి, అద్భుతం=ఆశ్చర్యము,

హృదయాత్=మనస్సునుండి, నిర్యాసి యని=పోయెదవేని, తే=నీయొక్క, పౌరుషం =మగతనమును, గణయామి=ఎంచుచున్నాను.

చ. వలచితి రా యటంచుఁ జెయివట్టినఁ గౌఁగిట గారవించి చే
క్కిలిఁ గొనగోట నొక్కి కరఁగింపక చిమ్ముక పోయె దీక్రియం
దలఁపున నిల్పఁ జిక్కక కదా చనఁ గల్గినఁ బౌరుషంబు నీ
కలవడె నంచుఁ బల్కు చెలి నక్కునఁ జేర్చినశౌరిఁ గాంచెదన్. 96

తా. కృష్ణా! నీవు బలవంతముగాఁ జేయి యూడఁబెఱికికొనిపోయిన నను నామన స్సున నిన్ను పోకుండునట్లు నిలిపియున్నాను. అక్కడనుండి తప్పించుకొంటివేని నీసా మర్థ్యము తెలియును. (అనఁగా: అనవరతము నిన్ను తలంచుచున్న నన్ను విడనాడుట ధర్మముకాదు అనుట.)

శ్లో. తమసి రవి రి వోద్య న్మజ్జతా మమ్బురాశౌ
ప్లవ ఇవ తృషితానాం స్వాదువర్షీవ మేఘః,
నిధిరివ విధనానాం దీర్ఘతీవ్రామయాణాం
భిషగివ కుశలం నో దాతు మాయాతు శౌరిః. 97

టీ. తమసి=చీఁకటియందు, మజ్జతాం=మునుఁగుచున్నవారికి, ఉద్యన్=ఉద యించుచున్న, రవిరివ=సూర్యునివలెను, అంబురాశౌ=సముద్రమునందు, మజ్జతాం, ప్లవఇవ=తెప్పవలెను, తృషితానాం=దప్పిఁగొన్నవారికి, స్వాదువర్షీ = తీయనిఉదక మును గురియుచున్న, మేఘఇవ=మేఘమువలెను, విధనానాం=ధనము లేనివారికి, నిధి రివ=నిక్షేపమువలెను, దీర్ఘతీవ్రామయాణాం=ఎడతెగనికష్టము లైనరోగములు గల వారికి, భిషగివ=వైద్యునివలెను, శౌరిః = శ్రీకృష్ణుఁడు, నః=మాకు, కుశలం=కుశల మును, దాతుం=ఇచ్చుటకు, ఆయాతు=వచ్చునుగాత.

మ. అడవిం జీకటిఁ బోవువాని కుదయం బైనట్టిసూర్యాకృతిఁ
జడధిం గ్రుంగఁగ నావ దగ్గఱినరోజం బేదకుఁ లిబ్బి చొ
ప్పఁకురీతిం దృష దీర్పఁగా జడిమొగుల్ పైకొన్నచందాన నొ
వ్వడరఁ మాన్పుకువైద్యునట్లు హరి డాయఁ వచ్చినఁ బ్రోచుతన్.

తా. కటికిచీఁకటిలోఁబడి దుఃఖించువానికి సూర్యుఁడుదయించినటుల, నంబు రాశింబడి మునుంగువానికి నావ సమీపించినక్రైవడి, నీరుపట్టున డయ్యువానికి జడిమొ గులు పైకొన్నవడువున, బేదకు లిబ్బియబ్బినచందమున, రోగంబులచే నొవ్వంబడినవా నిని వైద్యుండుడాయుకరణి శ్రీకృష్ణమూర్తి నన్ను డాయనేతెంచి మేలొనగూర్పుఁ గాత.

శ్లో. కోదణ్డం మసృణం సుగన్ధి విశిఖం చక్రాబ్జపాశాఙ్కుశం
హైమీం వేణులతాం కరైశ్చ దధతం సిన్దూరపుంజారుణమ్,

కన్దర్పాధికసున్దరం స్మితముఖం గోపాఙ్గనావేష్టితమ్
గోపాలం మదనాధిపం త మభజం త్రైలోక్యరక్షామణిమ్. 98

టీ. మసృణం=మృదువైన, కోదండం=ధనుస్సును, సుగంధి=పరిమళించుచున్న, విశిఖం=బాణమును, చక్రాబ్జపాశాంకుశం=చక్రమును శంఖమును పాశమును అంకుశమును, హైమీం=బంగారుదైన, వేణులతాం=పిల్లఁగ్రోవియు, కరైః=హస్తములచేత, దధతం=ధరించుచున్నవాఁడై, సిందూరపుంజారుణం=సిందూరపురాశివలె ఎఱ్ఱనైనవాఁడును, కందర్పాధికసుందరం=మన్మథునికంటె ఎక్కువగా అందమైనవాఁడును, స్మితముఖం=చిఱునవ్వుమోముగలవాఁడును, గోపాంగనావేష్టితం=గోపికలచేత చుట్టుకొనఁబడినవాఁడును, త్రైలోక్యరక్షామణిం=ముల్లోకములకు చింతామణియైనవాఁడును, మదనాధిపం=మన్మథునికి అధిదేవతయైనవాఁడును, తం=ప్రసిద్ధుఁడైనవాఁడును, అగు, గోపాలం=గోపాలకృష్ణుని, అభజం=సేవించితిని.

చ. అలరులకోరి యించువిలు నంకుశపాశరథాంగశంఖవం
శలతలు బాహులన్ వెలయఁ జక్కని గోపకుమారమన్మథున్
లలితదరస్మితాననుఁ ద్రిలోకజనావనుఁ గుంకుమారుణో
జ్జ్వలతరగాత్రు గోపజలజాతముఖీసుఖపాత్రుఁ గొల్చెదన్. 98

తా. చెఱకువిల్లును, పుష్పబాణమును, శంఖచక్రపాశాంకుశములను, పిల్లనగ్రోవిని చేతులఁ దాల్చి దేహకాంతి గలిగి మన్మథునికంటె సౌందర్యము గలిగి చిఱునవ్వుమోముగలిగి గోపికలచేత చుట్టుకొనఁబడి ముల్లోకములను రక్షించువాఁడై మన్మథునికి అధిదైవమై మన్మథువేషమును దాల్చిన శ్రీకృష్ణుని నేఁ గొల్చుచున్నాను.

శ్లో. సాయఙ్కాలే వనాన్తే కుసుమితసమయే సైకతే చన్ద్రికాయాం
త్రైలోక్యాకర్షణాఙ్గం సురనరగణికామోహనాపాఙ్గమూర్తిమ్,
సేవ్యం శృఙ్గారభావై ర్నవరసభరితై ర్గోపకన్యాసహస్రై
ర్వన్దేఽహం రాసకేలీరత మతిసుభగం వశ్యగోపాలకృష్ణమ్. 99

టీ. కుసుమితసమయే=వసంతకాలమందు, వనాంతే=రమణీయమగుతోఁటయందు, సైకతే=ఇసుకదిన్నెలయందు, సాయంకాలే=సాయంకాలమందు, చంద్రికాయాం=వెన్నెలయందు, త్రైలోక్యాకర్షణాఙ్గం=మూఁడులోకములను వశపఱచుకొనెడు అవయవములుగలవాఁడును, సుర...మూర్తిం=దేవతలయొక్కయు మనుష్యులయొక్కయు వేశ్యలకు మోహమును బుట్టించునట్టి కడకన్నులుగల దేహముగలవాఁడును, నవరసభరితైః=తొమ్మిదిరసములచే నిండిన, గోపకన్యాసహస్రైః=వేలకొలఁదిగోపకన్యకలచేత, శృంగారభావైః=శృంగారముచేతనైన భావములతోడ, సేవ్యం=సేవింపఁదగినవాఁడును, రాసకేలీరతం=రాసక్రీడయందు ఆసక్తుఁడైనవాఁడును, అతిసుభగం=మిక్కిలిసౌన్దర్యముగల

వాఁడును అగు, అందఱికిని పత్యుఁడైన గోపాలకృష్ణుని, అహం=నేను, వందే=నమస్కరించుచున్నాను.

మ. పటుశృంగారతరంగితాంగు లగుగోపాలాంగనల్ గొల్వ ను
త్కటబృందావనసైకతంబుల వసంతజ్యోత్స్నలం రోదసీ
తటవేశ్యాతతి దృగ్విలాసములచేతం జొక్క రాసక్రియా
నటనాటోపవశీకృతత్రిభువను న్సంజ్ఞ మదిం గొల్చెదన్. 99

తా. వసంతర్తువునందు సాయంకాలమున వెన్నెల గాయుచుండఁగా యమునానదియొడ్డున ఇసుకదిన్నెలపై విలాసముగల గోపకన్నియలతోఁ గూడి త్రిలోకసుందరమూర్తియై విలసిల్లు గోపాలకృష్ణునికి వందనము చేయుచున్నాను.

శ్లో. కదమ్బమూలే క్రీడన్తం బృన్దావననివేశితమ్,
పద్మాసనస్థితం వన్దే వేణుం గాయన్త మచ్యుతమ్. 100

టీ. కదంబమూలే=కడిమిచెట్టుక్రింద, క్రీడంతం=ఆడుచున్నవాఁడును, బృందావననివేశితం = బృందావనమందు ప్రవేశించినవాఁడును, పద్మాసనస్థితం = పద్మాసనమందుఁ గూర్చున్నవాఁడును, వేణుం=పిల్లఁగ్రోవిని, గాయంతం = పాడుచున్నవాఁడును అగు, అచ్యుతం=కృష్ణునిగూర్చి, వన్దే=నమస్కరించుచున్నాను.

ఉ. పావనయామునాంబుకణభావితశీతలవాతధూతబృం
దావనపాళిఁ బుష్పితకదంబకవృక్షపుమూలకేళి రా
జీవనపీనపీఠిక వసించుచు వేణువినోదనాది యా
నావనజాయతేక్షణు నహర్నిశ మెన్నెద నిష్టసిద్ధికిన్. 100

తా. బృందావనమందుఁ జేరి కడిమిచెట్టుమొదట క్రీడ సల్పుచుఁ దమ్మిగద్దియపయిఁ గూర్చుండి వేణుగానముచేయుచుండెడు శ్రీకృష్ణునింగూర్చి నమస్కరించెదను.

శ్లో. బాలం నీలామ్బుదాభం నవమణివిలసత్కిఙ్కిణీజాలబద్ధ
శ్రోణీజఙ్ఘాన్తయుగ్మం విపులరుచినఖప్రోల్లసత్కణ్ఠభూషమ్,
ఫుల్లామ్భోజాభవక్త్రం హతశకటమరుత్పూతనాద్యం ప్రసన్నం
గోవిన్దం వన్దితేన్ద్రాద్యమరవర మజం పూజయే ద్వాసరాదౌ. 101

టీ. నీలాంబుదాభం=నల్లనిమేఘమువంటి కాంతిగలవాఁడును, నవ...యుగ్మం=నవరత్నములచేత ప్రకాశించుచున్న గజ్జెలయొక్క వరుసచేత కట్టఁబడిన పిఱుఁదులయొక్కయు పిక్కల చివరలయొక్కయు జంటగలవాఁడును,విపుల...భూషం=పెద్దదియగు నల్లచాలల దుప్పియొక్కగోటిచేత ప్రకాశించుచున్న కంఠాభరణము గలవాఁడును, ఫుల్లాంభోజాభవక్త్రం=వికసించిన తామరయొక్క కాంతిగల మోముగలవాఁ

డును, హతశకటమరుత్పూతనాద్యం=చంపఁబడిన శకటాసురుఁడును తృణావర్తుఁడును పూతనయును మొదలగువారు గలవాఁడును, ప్రసన్నం=అనుగ్రహము గలవాఁడును; వంది...వరం=నమస్కరింపఁబడిన ఇంద్రుఁడు మొదలగు దేవతాశ్రేష్ఠులుగలవాఁడును, అజం=పుట్టుకలేనివాఁడును, అగు, గోవిందం=శ్రీకృష్ణుని, వాసరాదౌ=ప్రాతఃకాలమునందు, పూజయేత్=పూజింపవలెను.

ఉ. బాలుఁ బయోదనీలు సురపాలకవర్ణితశీలు ఘంటికా
లోలకటీతటీపదతలుం హతచక్రసమీరశాంబరీ
జాలుఁ బ్రఫుల్లపద్మవిలసన్ముఖు వ్యాఘ్రనఖాభిరాము గో
పాలుఁ బ్రసన్ను నచ్యుతుఁ బ్రభాతసమర్చితుఁ జేయఁగాఁ దగున్.

తా. నల్లని కాంతిగలిగి నవరత్నము దాపిన గజ్జెలు మొలను దాల్చి పాదములకు గజ్జెలు కట్టుకొని దుప్పిగోరులు గూర్చినహారమును ధరించి తామరవంటి మోము గలవాఁడై శకటాసురుఁడు మొదలగు దుష్టరాక్షసులఁ జంపి దేవతలకెల్ల శ్రేష్ఠుఁడైన శ్రీకృష్ణుని ప్రాతఃకాలమునఁ బూజింపవలయును.

శ్లో. వన్ద్యం దేవై ర్ముకున్దం వికసితకురువిన్దాభ మిన్దీవరాక్షం
గోగోపీబృన్దవీతం జితరిపునివహం కున్దమన్దారహాసమ్,
నీలగ్రీవాగ్ర్యపిఞ్ఛగ్రథనసువిలసత్కున్తలం భానుమన్తం
దేవం పీతామ్బరాఢ్యం యజ యజ దినశో మధ్యమాహ్నే రమాప్త్యై.

టీ. దేవైః=దేవతలచేత, వంద్యం=వందనముచేయఁదగినవాఁడును, వికసితకురువిందాభం=ప్రకాశించుచున్న కెంపులయొక్క కాంతిగలవాఁడును, ఇందీవరాక్షం=నల్లఁగలువలవంటికన్నులు గలవాఁడును, గోగోపీబృందవీతం=గోవులయొక్కయు గోపికలయొక్కయు సమూహములచేతఁ జుట్టుకొనఁబడినవాఁడును, జితరిపునివహం=జయింపఁబడిన శత్రువులయొక్క సమూహము గలవాఁడును, కుందమందారహాసం=మొల్లలవంటియు మందారపుఁ బువ్వులవంటియు నవ్వు గలవాఁడును, నీల...కుంతలం=నెమిలియొక్క శ్రేష్ఠమైన పురిని గూర్చుటచేత మిక్కిలి ప్రకాశించుచున్న ముంగురులు గలవాఁడును, భానుమంతం=మిక్కిలి కాంతులు గలవాఁడును, పీతాంబరాఢ్యం=పచ్చనివలువచేతఁ బూర్ణుఁడైనవాఁడును, దేవం=దేవుఁడైన, ముకుందం=శ్రీకృష్ణుని, దినశః=ప్రతిదినము, మధ్యమాహ్నే=మధ్యాహ్నకాలమందు, రమాప్త్యై=సంపదకొఱకు, యజయజ=పూజింపుము పూజింపుము.

మ. కురువిందప్రతిమానమోహనతనుం గోగోపికాసంవృతుం
సురసందోహమునీంద్రవందితు ముకుందుం గుందమందారసుం

దరహసందస్మితుఁ బింఛభూషణు రిపుధ్వంసిఁ సువర్ణాంబరున్
సరసీజాక్షుని మధ్యహ్నమునఁ బూజల్ సేసి శ్రీఁ బొందెదన్. 102

తా. దేవతలచేతను వందనము చేయఁదగినవాఁడును, కెంపులవంటి కాంతి గల వాఁడును, నెమిలిపింఛమును దాల్చిన సిగ గలవాఁడును, పీతాంబరమును దాల్చిన కృష్ణుని మధ్యాహ్నమునందుఁ బూజించినయెడ సంపద గలుగును; గాన అవశ్యము పూజింపవలెను.

శ్లో. చక్రాస్తధ్వస్తవైరివ్రజ మజిత మపాస్తావనీభార మాద్యై
రావీతం నారదాద్యై ర్మునిభి రభినుతం తత్త్వనిర్ణీతిహేతోః,
సాయాహ్నే నిర్మలాఙ్గం నిరుపమరుచిరం చిన్తయే న్నీలభాసం
మన్త్రీ విశ్వోదయస్థిత్యపహారణపదం ముక్తిదం వాసుదేవమ్. 103

టీ. మంత్రీ=కృష్ణవిషయమగు మంత్రమును జపించువాఁడును, చక్రా...వ్రజం=సుదర్శన మను చక్రముయొక్క కొనచేత నశింపఁజేయఁబడిన శత్రువులయొక్క సమూహము గలవాఁడును, అజితం=ఎవ్వరిచేతను జయింపఁబడనివాఁడును, అపా...భారం=పోఁగొట్టఁబడిన భూమియొక్క బరువు గలవాఁడును, ఆద్యైః=మొదటివారైన బ్రహ్మాదులచేత, ఆవీతం=చుట్టుకొనఁబడినవాఁడును, నారదాద్యైః=నారదుఁడు మొదలగు, మునిభిః=మునులచేత, తత్త్వనిర్ణీతిహేతోః = తత్త్వమును నిర్ణయించుటయను హేతువునుబట్టి, అభినుతం=మిక్కిలి స్తోత్రము చేయఁబడినవాఁడును, నిర్మలాంగం=స్వచ్ఛమైన యవయవములు గలవాఁడును, నిరుపమరుచిరం=సాటిలేని సౌందర్యము గలవాఁడును, నీలభాసం=నల్లనికాంతి గలవాఁడును, విశ్వో...పదం = ప్రపంచముయొక్క పుట్టుకకును నిలుకడకును లయమునకును స్థానమైనవాఁడును, ముక్తిదం=మోక్షము నిచ్చువాఁడును అగు, వాసుదేవం = శ్రీకృష్ణుని, సాయాహ్నే = సాయంకాలమునందు, చింతయేత్=ధ్యానింపవలయును.

మ. క్షితిభారాపహు నారదాదిమునిరాజీసేవ్యు విశ్వోదయ
స్థితిసంహారవిశారదున్ నిరుపమశ్రీ నిర్మలాంగున్ సము
న్నతచక్రాయుధఖండితారి నజితు న్సాయంబునం గొల్వ నం
తతవిజ్ఞానము భుక్తి ముక్తు లమరుం దన్మంత్రసంసిద్ధికిన్. 103

తా. చక్రాయుధముచేత శత్రువులఁ జంపినవాఁడును, శత్రువులచేఁ దాను జయింపఁబడనివాఁడును, దుష్టసంహారము చేసి భూభారమును దొలఁగించినవాఁడును, బ్రహ్మాదిదేవతలచేతను నారదాదిఋషులచేతను బరమాత్మ యని నుతింపఁబడిన వాఁడును, లోకముల సృష్టిస్థితిసంహారములఁ జేయువాఁడును, మోక్షము నిచ్చువాఁడును, మిక్కిలి యందము గలవాఁడును అగు శ్రీకృష్ణుని సాయంకాలమునందు ధ్యానింపవలయును.

శ్లో. కోదణ్డ మైక్షవ మఖణ్డ మిషుం చ పౌష్పం
చక్రాబ్జపాశసృణికాఞ్చనవంశనాళమ్,
బిభ్రాణ మష్టవిధబాహుభి రర్కవర్ణం
ధ్యాయే ద్ధరిం మదనగోపవిలాసవేషమ్. 104

టీ. అఖండం=తరుగులేని, ఐక్షవం=చెఱకుదైన, కోదండం=వింటిని, పౌష్పం=పువ్వుదైన, ఇషుం=బాణమును, చక్రా...నాళం = చక్రమును శంఖమును పాశమును అంకుశమును బంగారుపిల్లఁగ్రోవిని, అష్టవిధబాహుభిః=ఎనిమిదిచేతులచేత, బిభ్రాణం=ధరించుచున్నవాఁడును, అర్కవర్ణం = సూర్యునికాంతిగలవాఁడును, మదనగోపవిలాసవేషం = మదనగోపాలరూపమగు విలాసముతోఁ గూడినవేషము గలవాఁడును అగు, హరిం=శ్రీకృష్ణుని, ధ్యాయేత్=ధ్యానింపవలయును.

చ. విరులలకోరియుం జెఱకువిల్లు గుణాంకుశశంఖచక్రముల్
కరముల నాఱిటం జెలఁగఁ గాంచనవేణువు రెండుచేతులన్
మెఱయఁగఁ బట్టి సూర్యరుచి మీఱినగోపకుమారమన్మథు
న్హరి నవమోహనాంగుని మనంబున నిల్పెద నిష్టసిద్ధికిన్. 104

తా. ధనుస్సును బాణమును చక్రమును శంఖమును పాశమును అంకుశమును ఒక్కొకచేతితోఁ బట్టుకొని, వేణువును రెండుచేతులతోఁ బట్టుకొని విలాసమగు వేషముదాల్చిన మదనగోపాలకృష్ణుని ధ్యానము చేయవలెను.

అవ.— ఇక్కడ గోపికకును కృష్ణునకును చమత్కారముగా జరిగిన సంభాషణమును వర్ణించుచున్నాఁడు.

* శ్లో. అఙ్గుళ్యా కః కవాటం ప్రహరతి? కుటిలే! మాధవః, కింవసన్తో?
నో చక్రీ, కిం కులాలో? నహి ధరణిధరః, కింద్విజిహ్వః ఫణీన్ద్రః?
నాహం ఘోరాహిమర్దీ కిమసి ఖగపతి? ర్నో హరిః కిం కపీన్ద్రః?
ఇత్యేవం గోపకన్యాప్రతివచనజితః పాతు వ శ్చక్రపాణిః. 105

టీ. గోపిక— కః=ఎవ్వఁడు, అంగుళ్యా=వ్రేలిచేత, కవాటం=తలుపును, ప్రహరతి=కొట్టుచున్నాఁడు? కృష్ణుఁడు— మాధవః=మాధవుఁడను (కృష్ణుఁడను.) గో— వసంతః కిం=వసంతుఁడవా ఏమి? కృ— నో=కాదు (వసంతుఁడను కాను). చక్రీ=చక్రముగలవాఁడను. గో— కులాలః కిం=కుమ్మరివా రేమి? కృ— నహి=కాదు. (కులాలుఁడను కాను) ధరణిధరః=భూమినిధరించినవాఁడను. గో— ద్విజిహ్వః ఫణీంద్రః కిం=రెండు నాలుకలుగలసర్పరాజగు శేషుఁడవా ఏమి? కృ— అహం=నేను, న=కాదు. (శేషుఁడను కాను) ఘోరాహిమర్దీ=భయంకరమగుపామును నలిపినవాఁడను. గో— ఖగపతిః=పక్షిరాజవు

* ఇయ్యది ప్రస్తుత[illegible] వేషము.

(గరుత్మంతుఁడవు) అసికిం=అగుచున్నావా ? కృ—నో=కాదు. (గరుడుఁడనుకాను.) హరిః=హరిని. గో—కపీంద్రః కిం=వానరరాజవా ఏమి? ఇతి=ఇట్లు, గోపకన్యా ప్రతివచనజితః=గొల్లకన్నియయొక్క బదులుమాటలచేత నోడిపోయిన, చక్రపాణిః= చక్రమువా స్తమందుఁగల కృష్ణుఁడు, వః=మమ్ము, పాతు=రక్షించుఁగాత.

తా. కృష్ణుఁడు ఒక గోపికయింటికిఁ బోయి చేతితోఁ దలుపు తట్టెను. అప్పుడు గోపిక "తలుపుతట్టువాఁడెవ్వఁ" డనియడిగెను. అందుకు కృష్ణుఁడు "మాధవుఁడు" అనిచెప్పెను. దానికిఁ గోపిక "వసంతుఁడా?" యనెను. కృష్ణుఁడు "చక్రి" అని చెప్పెను. గోపిక "కులాలుఁడా యేమి?" అనెను. కృష్ణుఁడు "ధరణిధరుఁ" డని చెప్పెను. గోపిక "ఫణీంద్రుఁడా ఏమి?" అనెను. కృష్ణుఁడు "అహిమర్ది" యనెను; గోపిక "ఖగపతి యా?" యని యడిగెను. కృష్ణుఁడు "హరి" యనెను. గోపిక "కపీంద్రుఁడ వా" యనెను. దానికి బదులుచెప్పలేక కృష్ణుఁడు ఓడిపోయెను. అట్టి కృష్ణుఁడు మమ్ము రక్షించుఁగాక. (అనఁగా కృష్ణుఁడన్నమాటలకన్నిటికిని గోపిక వేళ కమును చేయఁగాఁ బదులు చెప్పచుండి కడపటచెప్పలేక వైలక్ష్యమును వహించి చూడ వేడుకగా నుండెననుట.)

శ్లో. రాధామోహనమన్దిరా దుపగత శ్చన్ద్రావళీ మూచివాన్
రాధే క్షేమ మయేఽ స్తి తస్య వచనం శ్రుత్వాఽహ చన్ద్రావళీ,
కంస క్షేమ మయే విముగ్ధహృదయే కంసః క్వ దృష్ట స్త్వయా
రాధా క్వేతి విలజ్జితో నతముఖః స్మేరో హరిః పాతు వః. 106

టీ. రాధామోహనమందిరాత్=రాధయొక్క రమణీయమైన గృహమునుండి, ఉపగతః=వచ్చినవాఁడై, చంద్రావళీం=చంద్రావళియను గోపికనుగూర్చి, ఊచివాన్ =పలికెను. అయేరాధే=ఓరాధా! క్షేమం=క్షేమము, అస్తి=కలదా? (అని కృష్ణుఁడు అడిగెను) తస్య=ఆకృష్ణునియొక్క, వచనం=మాటను, శ్రుత్వా=విని, చంద్రావళీ= చంద్రావళి, ఆహ=పలికెను. కంస=కంసుఁడా! క్షేమం=క్షేమమా? అయే విముగ్ధ హృదయే=ఓసి తెలివిలేని మనస్సు కలదానా? త్వయా=నీచేత, కంసః=కంసుఁడు, క్వ=ఎక్కడ, దృష్టః=చూడఁబడినాఁడు? రాధా=రాధ, క్వ=ఎక్కడ, దృష్టా= చూడఁబడినది? ఇతి=ఈప్రకారము (అడుగఁబడినవాఁడై), విలజ్జితః=సిగ్గుపడినవాఁ డై, నతముఖః=వంచఁబడినముఖముగలవాఁడై, స్మేరః=చిఱునవ్వుగల, హరిః=కృష్ణుఁ డు, వః=మమ్ము, పాతు=రక్షించును గాత.

తా. కృష్ణుఁడు రాధగృహమునుండి వచ్చుచు చంద్రావళియను గోపికను జూచి రాధ యని భ్రమసి "రాధా కుశలమా!" యనియడిగెను. ఆమాట విని చంద్రావళి తనను వేఱుగాఁ దలంచుచున్నాఁడని కోపపడి కృష్ణుని కంసుఁడా! యని పిలిచెను. అందుకు కృష్ణుఁడు తెలివిమాలినదానా! నేను కృష్ణుఁడనుగదా? కంసుఁ డెక్కడ

నున్నాఁడని యడిగెను. ఆమాటకు చంద్రావళి నేను చంద్రావళిని గదా, రాధయె క్కడనున్నదనెను. అప్పుడు భ్రమతీరి సిగ్గుపడి నవ్వుచుండు కృష్ణుఁడు మమ్ము రక్షించుఁగాత.

శ్లో. యా ప్రీతి ర్విదురార్పితే మురరిపో కున్త్యర్పితే యాదృశీ
యా గోవర్ధనమూర్ధ్ని యాచ పృథుకే స్తన్యే యశోదార్పితే,
భారద్వాజసమర్పితే శబరికాదత్తేఽధరే యోషితాం
యా ప్రీతి ర్మునిపత్నిభక్తిరచితేఽప్యత్రాపి తాం తాం కురు. 107

టీ. మురరిపో=కృష్ణా! విదురార్పితే=విదురునిచేత సమర్పింపఁబడిన యన్నమందు, యా ప్రీతిః=ఏప్రీతిగలదో, కుంత్యర్పితే = కుంతీదేవిచేత సమర్పింపఁబడినయన్నమందు, యాదృశీ ప్రీతిః=ఏవిధమైన ప్రేమగలదో, గోవర్ధనమూర్ధ్ని=గోవర్ధన పర్వతముయొక్క శిఖరమునందు, యా ప్రీతిః=ఏప్రీతిగలదో, పృథుకే=కుచేలుఁడు సమర్పించినఅడుకులందు, యా ప్రీతిః=ఏప్రీతిగలదో, యశోదార్పితే=యశోదచేత సమర్పింపఁబడిన, స్తన్యే=చన్నుఁబాలయందు, యాప్రీతిః, భారద్వాజసమర్పితే= భారద్వాజమునిచేత సమర్పింపఁబడిన విందునందు, యాప్రీతిః, శబరికాదత్తే=శబరిచేత ఇయ్యఁబడిన ఫలాదులందు, యాప్రీతిః, యోషితాం=గోపికాస్త్రీలయొక్క, అధరే=అధరమందు, యాప్రీతిః, మునిపత్నిభక్తిరచితే=మునిభార్యలచే భక్తితో రచింపఁబడిన అన్నమందు, యాప్రీతిః, అత్రాపి=ఈకర్ణామృతమందును, తాంతాం=ఆయా ప్రీతిని, కురు=చేయుమా!

మ. శ్రమణావన్యము రాధికాధరము భారద్వాజువిందుర్మునిప్రమదాభక్తము మాతృదత్తకుచధారల్ విప్రుఁ ముంగొంగుభక్ష్యము గోవర్ధనపూజయున్ విదురుసృష్టాన్నంబుఁ గుంతీసపర్య మదిం గైకొనునట్లు నాకవితఁ గృష్ణా ప్రీతిఁ జేకోఁగదే. 107

తా. విదురుఁడు మొదలగువారు నీకుసమర్పించిన విందునందు ఎంత ప్రీతి కలదో అంతప్రీతిని ఈకర్ణామృతమునం దుంచుము కృష్ణా!

శ్లో. కృష్ణానుస్మరణాదేవ పాపసఙ్ఘాతపఞ్జరః,
శతధా భేద మాయాతి గిరి ర్వజ్రహతో యథా. 108

ఇతి శ్రీలీలాశుకవిరచితే శ్రీకృష్ణకర్ణామృతే తృతీయశతకమ్.

టీ. పాపసంఘాతపంజరః=పాపముల సమూహమనెడి గూఁడు, కృష్ణానుస్మరణాదేవ=కృష్ణుని ఎడతెగక స్మరించుటచేతనే, వజ్రహతః=వజ్రాయుధముచేతఁ గొట్టఁబడిన, గిరిర్యథా=పర్వతమువలెను, శతధా=నూఱువిధములుగా, భేదం = చీలుటను, ఆయాతి = పొందుచున్నది.

క. వనజాక్షుఁడు కర్ణామృత
ము నుదివిన వ్రాయ వినినఁ బురుషులకును గో
ధనకనక వస్తువాహన
తనయాదిసమృద్ధి శాశ్వతంబుగ నొసఁగున్.

మాలినీవృత్తము. జలరుహదళనేత్రా సర్పరాడ్వైరిపత్రా
ఖలజనఘనవాతా కంజసంజాతతాతా
నలలితగుణభూషా సత్యనిత్యైకభాషా
విలసితసితహాసా వేంకటాహార్యవాసా.

మ. ఇది కృష్ణాశ్రయయోగిపుంగవకృపావీక్షాత్తసారస్వతా
భ్యుదయశ్రీవిభవప్రసిద్ధచిదచిద్బోధకమాశాంతిన
త్యుదయాభూషణ వెల్లపూడిమణి పెద్దామాత్య వెంగాగ్రణీ
గదితాశ్వాసము మొల్పుమూఁడవది యై కర్ణామృతశ్రీకృతిన్.

తా. గాఢముగా క్రమ్ముకొని యుండు పాపములన్నియు కృష్ణుని తలంచుచుండినయెడ వజ్రాయుధముచేత కొండలు పగిలి పోయినట్లు పోవును గాన శ్రీకృష్ణస్మరణము సకల శుభములను నిచ్చును.

శ్రీకృష్ణకర్ణామృతము సమాప్తము.

---

చెన్నపురి: 'వావిళ్ల' ప్రెస్సున ముద్రితము:—1922.

# సంస్కృత గ్రంథములు.

| | | ప్రతి 1-కి రూ. | అ. |
|---|---|---|---|
| గీతగోవిందము (అష్టపదులు), సాంధ్రటీకాతాత్పర్యవివరణము | ... | 1 | 4 |
| శ్రీకృష్ణలీలాతరఙ్గిణి, ఆంధ్రతాత్పర్యసహితము | ... | 1 | 8 |
| ధనంజయనిఘంటువు, ఆంధ్రతాత్పర్యానుక్రమణికతో | ... | 0 | 12 |
| విశ్వగుణాదర్శము, సవ్యాఖ్యానము | ... | 1 | 0 |
| శ్రీమద్రామాయణము, వ్యాఖ్యానచతుష్టయవిశిష్టము, 2 సంపుటములు. | | 15 | 0 |
| శ్రీమద్రామాయణము, ఉత్తరకాండము | ... | 1 | 4 |
| లఘుకౌముది, సటిప్పణము | ... | 0 | 12 |
| కాదంబరీ, మంచిప్రతి | ... | 1 | 8 |
| + ప్రహసనము, మంచిప్రతి | ... | 0 | 4 |
| + బ్రహ్మసూత్రములు, మూలము | ... | 0 | 8 |
| బృహస్పతిస్మృతి, సటీక | ... | 0 | 8 |
| దేవలస్మృతి ,, | ... | 0 | 8 |
| దక్షిణామూర్తిస్తోత్రము ,, | ... | 0 | 2 |
| శంకరగీతాభాష్యము | ... | 1 | 8 |
| ఆపస్తంబప్రవరకాండము, సాంధ్రటీకము | ... | 0 | 8 |
| (నాగరి) సంస్కృతబాలశిక్ష | ... | 0 | 3 |
| ,, శ్యామలాదండకము | ... | 0 | 2 |
| ,, ఆదిత్యహృదయము | ... | 0 | 1 |
| ,, శబ్దమంజరి | ... | 0 | 6 |
| ప్రతాపరుద్రీయము, సవ్యాఖ్యానము (కొత్తకూర్పు) | ... | 1 | 12 |
| శివగీత, సాంధ్రతాత్పర్యము | ... | 0 | 10 |
| సీతాసహస్రనామస్తోత్రము | ... | 0 | 4 |
| గంగా ,, | ... | 0 | 8 |
| లక్ష్మీనృసింహ ,, | ... | 0 | 4 |
| భైరవి ,, | ... | 0 | 4 |
| స్వప్నశాస్త్రము, సాంధ్రతాత్పర్యము | ... | 0 | 8 |
| శకునశాస్త్రము ,, | ... | 0 | 4 |
| సాముద్రికశాస్త్రము ,, | ... | 0 | 4 |
| గదనిగ్రహము, సాంధ్రతాత్పర్యము | ... | 2 | 8 |
| చక్రదత్త ,, | ... | 3 | 12 |
| సుశ్రుతశారీరము ,, | ... | 2 | 0 |
| శార్ఙ్గధరసంహిత ,, | ... | 3 | 0 |

వావిళ్ల రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్,
292, ఎస్ప్లనేడ్, చెన్నపురి. ఈ.

వైశ్యధర్మప్రకాశిక

చీమకుర్తి బసవయ్యగారు

గుంటూరు

సమస్త గ్రంథములు లభించు స్థలము.

వేంకటరామ్ అండ్ కో బుక్‌సెల్లర్ పబ్లిషర్సు

బెజవాడ.